## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుపు మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

అనుక్రమణ్యుపనామిక
విజ్ఞానలక్ష్మీనారాయణీయాంతర్గత
శ్రీమద్భగవద్గీతా విజ్ఞానమండలి

# ఆత్మ, బ్రహ్మ - కర్మ విజ్ఞానము

(అనుభవాంగ పరీక్షాత్మకము)



కర్త:

చల్లా కృష్ణమూర్తి శాస్త్రి

వెల: రు. 5-0-0

ఓమ్

నమః పురుషోత్తమాయ

గురవే మధుసూదనాయ

# విన్నపము

శ్రీమద్గురు మధుసూదన శ్రీకృష్ణభగవానుని దివ్యకృపాలేశ విస్తృతరూపమగు నస్మద్విరచిత తాను శ్రుత్యుపనామక విజ్ఞాన లక్ష్మీనారాయణీయమందు ప్రస్థానమీమాంసావిభాగమందలి శ్రీమద్భగవద్గీతా విజ్ఞానమందు, బహిరంగపరీక్షకు బిమ్మటిదగు నిది అంతరంగ పరీక్షయందు మొదటిసంపుటము. ఇందు గీతయందలి జ్ఞాన, బ్రహ్మకర్మలు అనువాని విజ్ఞానము వివరింపబడినది. ఇట్లే కర్మయోగవిజ్ఞానము ప్రత్యేక మొక సంపుటముగ నచ్చుపడుచున్నది. కొలది కాలముననే పాఠకుల సమ్ముఖమునకు రాగలదు. ఇంక జ్ఞాన - భక్తి - బుద్ధియోగ విజ్ఞానమును వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానమును, శ్రీ గీతాచార్య విజ్ఞానమును అచ్చుపడవలసి యున్నది. మొత్తమీ రాజర్షి విద్యోద్ధరణకార్యము క్షత్రియులు తమదిగా స్వీకరించియున్నారని బహిరంగ పరీక్షాత్మకమగు మొదటిసంపుటముననే విన్నవించుకొంటిని. కనుక నీ విషయమున నిక పునరుక్తి యక్కరలేదు. కాని, "ప్రారబ్ధముత్తమగుణానపరిత్యజన్తి" అను సూక్తి కుదాహరణభూతులై ఇప్పుడును తక్కిన గ్రంథముల ముద్రణకై యనవరతకృషి సలుపుచున్న శ్రీమన్మహారాజశ్రీ, కావ్యకళాపోషక - భూపతిరాజు రామకృష్ణంరాజుగారిని, మహారాజశ్రీ పెన్మెత్స శివరామరాజుగారిని, విజ్ఞానాయురారో

నై శ్వర్యములిచ్చి సదా కాపాడగోరి భగవంతు, శివయోశ్వ రుని, శ్రీకృష్ణభగవానుని వేడుకొనకుండ జాలను. పిమ్మటి చందాదారుల పేరులు పిమ్మటి గ్రంధమందు ప్రచురించు కొందును.

ఈ సంపుటమునకు పీఠిక యెవరిచేతను వ్రాయింపలేదు. గ్రంథ మంతయు నొకటే యగునపుడు మొదటి సంపుటము పీఠికయే దీనికి ననువర్తించునుగదా! అదే చాలు ననుకొంటిని. పీఠికలు వ్రాయించుకొను నాచార మిప్పుడు వచ్చినది. పూర్వు లెవరికీ నీయాచారము లేనట్లు తోచును. ఇంతకును నా పుస్త కమే పీఠికారూపము గదా! కొందరు పెద్దల యభిప్రాయము లనేక గ్రంధములు పంపియున్నారు. కొన్ని వచ్చియున్నవి. ఆయా విషయములెల్ల కొలదిరోజులలో వెలువడనున్న 'కర్మ యోగ విజ్ఞాన' మను సంపుటమున సువిశదముగ ప్రకటించు కొందును.

'కలౌ వేదాంతినః సర్వే' అను సూక్తిం జరితార్థము గావించు మహానుభావుల కీ గ్రంథము నవలోకించినచో శాస్త్ర విజ్ఞాన మెంత జాలిల సమస్యయో బోధపడును.

భాషావిషయమునః— గ్రంథ మంతయు మొదటి సంపుటపు తీరే. కథావిలసితమగుట నది కష్టముగ దోపదుగాని కాశీ మజిలీలందు కంటె నిందలి భాష కఠినము కాదు. పారిభాషిక విషయము లింతకంటె సులువుగ వ్రాయుట కష్టము. గ్రంథ విస్తరముగూడ, నని విజ్ఞు లెరుంగుదురు.

ప్రస్తుతము:– కలిభుజులు – దోషైకదృక్కులు నగు యథా జాతరూప పండితరాజులకు 'ప్రథమం వందే'. దోషములను గూడ గుణములుగ జేయు సహజకృపాధురగు సజ్జనులను సదా స్మరింతును.

ఈ గ్రంథము నీరూపమున ముద్రింపించి యిచ్చిన సరస్వతీ ముద్రణాలయాధికారులు, విద్యాభిలాషులు శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారికి కృతజ్ఞుడనై యుందును. వారి ముద్రణాలయమునందలి గ్రంథశోధకోద్యోగియగు బ్రహ్మశ్రీ చామర్తి గోపాలకృష్ణశర్మగారి నభినందించెదను. వారి యోర్పు లేకున్న నా యీ గ్రంథ మీమాత్రమునకైన శుద్ధరూపము ధరించియుండెడిది కాదు.

ఇందు సహజ దుర్బల దృష్టికృత గళితములైన దోషములు పెక్కు లున్నవి. వానిని ముందుగ [illegible] సవరించుకొందును. ప్రస్తుతము విజ్ఞ పాఠకులు [illegible] దిద్దుకొన వలయునని ప్రార్థించుచున్నాను.

నానాటికి బెరుగు నవ్యాజానురాగమున నా పురోఽభివృద్ధిం గోరి నన్నాదరించు బ్రహ్మశ్రీ శ్రీపాద దేవీశంకరప్రసాదరావుగారి కనేక కృతజ్ఞతా వందనములతో నీ విన్నపము ముగించుకొనుచున్నాను.

మట్లపాలెం
సర్వధారి రథసప్తమి

ఇట్లు
గ్రంథకర్త

# వి ష య సూ చి క



## ఆ త్మ వి జ్ఞా న ము


| | |
|---|---|
| విషయ ప్రవేశము ... ... ... | 1 |
| దార్శనికదృష్టి - ఆత్మపరీక్ష ... | 12 |
| దర్శన సమన్వయము ... ... | 25 |
| వైశేషికాత్మ ... ... | 69 |
| ప్రాధానికాత్మ ... ... ... | 82 |
| శారీరకాత్మ ... ... ... | 100 |
| శ్రీమద్భగవద్గీతాత్మ ... .. | 111 |
| సమష్టిరూపాత్మ పరీక్ష ... ... | 124 |
| సమన్వయము ... ... ... | 137 |
| షడ్దర్శనవాద మౌలిక రహస్యము ... | 183 |
| వైజ్ఞానికాత్మపరీక్షా - విషయప్రవేశము ... | 198 |
| నిర్గుణాత్మ ... ... ... | 201 |
| సగుణామృతాత్మ ... ... ... | 235 |
| అధియజ్ఞాత్మ ... ... ... | 285 |
| సర్వభూతాంతరాత్మ ... ... | 317 |
| జీవాత్మవ్యూహ నిరుక్తి ... ... | 334 |

# బ్రహ్మ - కర్మ విజ్ఞానము


| | |
|---|---|
| ఉపక్రమము ... ... ... | 361 |
| ద్వాదశవాద రహస్యము ... ... | 365 |
| విజ్ఞానేతివృత్త వాదము ... .. | 367 |
| సదసద్వాదము .. .. .. | 374 |
| రజోవాదము ... ... ... | 382 |
| వ్యోమవాదము ... ... ... | 384 |
| అపరవాదము ... ... ... | 386 |
| ఆవరణవాదము ... ... ... | 388 |
| అంభోవాదము ... . ... | 394 |
| అమృతమృత్యువాదము ... ... | 397 |
| అహోరాత్ర వాదము .. ... | 400 |
| దైవవాదము ... ... ... | 402 |
| సంశయవాదము ... ... ... | 405 |
| వాదచతుష్టయము .. ... ... | 410 |
| త్రిసత్యవాదము ... ... ... | 411 |
| ద్విసత్యవాదము ... ... ... | 417 |
| అసద్వాదము ... ... ... | 421 |
| సద్వాదము ... ... ... | 432 |
| సిద్ధాంతవాదము ... ... ... | 439 |
| సిద్ధాంతవాదము - గీత ... ... | 446 |

| | | | |
|---|---|---|---|
| గీతానమ్మత, బ్రహ్మ - కర్మ పరీక్షా | | ... | 452 |
| పరస్పర విరోధము | ... | ... | 457 |
| విరోధ పరిహారము | ... | ... | 460 |
| ఈశ్వరవాచక ప్రణవము | ... | ... | 463 |
| ద్వైతపరీక్షా ... | ... | ... | 464 |
| త్రిబ్రహ్మ - త్రికర్మ - నిర్వచనము | | ... | 469 |
| ద్వైతవాద సమర్థనము | ... | ... | 480 |
| శ్రుతి సమన్వయము | .. | ... | |
| సదసద్వాదాభినివేశము | ... | ... | |
| విలక్షణ సంబంధము | ... | ... | |
| తత్త్వద్వయీ నియతభావము ... | | ... | |
| వేదప్రతిపాదిత త్రిబ్రహ్మ సంస్థ ... | | ... | 492 |
| గీతా ప్రతిపాదిత త్రిబ్రహ్మ సంస్థ | | ... | 499 |
| అద్వైతవాద సమర్థనము | ... | ... | 503 |
| సనాతనయోగము | ... | ... | 519 |
| అభియుక్త సమ్మతి | ... | ... | |
| బ్రహ్మకర్మల వివిధరూపములు ... | | ... | 541 |
| ప్రకరణోపసంహారము | ... | ... | 550 |





నా 'ముద్దుల చిట్టి'
లక్ష్మీనారాయణమూర్తి.

ఓం నమః పురుషోత్తమాయ

# ఆత్మవిజ్ఞానము

## ఆత్మపరీక్షా

"ఇహాచేదవేదీదథ సత్యమస్తి నచేదిహావేదీన్మహాతీ వినష్టిః
భూతేషు భూతేషు విచింత్యధీరాః - ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవన్తి
ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతి పూరుషః
కిమిచ్ఛన్ కస్యకామాయ, శరీర మనుసంజ్వరేత్
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతి యోఽర్జున
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః"

## విషయప్రవేశము

గీతావిజ్ఞానమంతు గావలసిన బహిరంగ పరీక్షానంతరము, అంతరంగికముగ విమర్శించి యెఱుంగదగిన యాంశములు ప్రకరణములుగా విభజించి, ఆత్మ - బ్రహ్మ - కర్మ, కర్మ, జ్ఞాన, భక్తి, బుద్ధి యోగాది విషయములంగూర్చి సంక్షేపముగా నుల్లేఖింపబడినది. గీత, చరమలక్ష్యము బుద్ధియోగమయినను, అదిసిద్ధించుటకు పై జెప్పినయోగములను జక్కగా నెఱుంగు టావశ్యకము.

మానవ సమాజాంతర్జగత్కల్యాణార్థము గీతాప్రవృత్తి మొదట అవినాశి అనుచ్ఛిత్తిధర్మ, జ్ఞానకర్మమూర్తియు నగు నాత్మ స్వరూపము నెఱుంగవలయును. తత్కల్యాణమున కేకమాత్రోపాయము:— జ్ఞానలక్షణ బ్రహ్మ యొక్కయు, క్రియాలక్షణ కర్మ యొక్కయు అనుష్ఠానమే కనక నాత్మ స్వరూప జ్ఞానానంతరము బ్రహ్మకర్మ వివర్తము నెఱుంగవలయును. పిమ్మట బ్రహ్మ (జ్ఞాన) సాధన వికాసము జ్ఞానయోగ రూపమునను, కర్మసాధనవికాసము కర్మయోగరూపమునను అగును. పిదప నాయుభయ సాధనవికాసము భక్తియోగరూపముపొందగా, చిట్టచివరకు సాధనరూపమగు బుద్ధియోగరహస్య జ్ఞానముకలుగును. గీతాసార మీరహస్య జ్ఞానాధారముననే ప్రస్ఫుటిత మగును.

బ్రహ్మకర్మోభయవాదియగు భగవంతుని దృష్టియం దుభయ (అవ్యయబ్రహ్మ - అవ్యయకర్మ) లక్షణ బుద్ధియోగమే గుప్తరహస్యము. గీతయొక్క సర్వాంతర తమరహస్యము నిదే; కాని భక్తియోగమునందును, అవ్యయబ్రహ్మ - క్షరకర్మ రూప కర్మ; అను నీబ్రహ్మకర్మలు రెంటి సమన్వయమునుండుటచే నిదియు సర్వాంతరతమ కోటియందే యంతర్భావ మనుకొనవచ్చును. ఏమైనను —

కర్మప్రధాన (క్షరకర్మ) కర్మయోగము బ్రహ్మ (అవ్యక్తజ్ఞాన) ప్రధానజ్ఞానయోగము అనునీరెండును ఐకాంతిక సమత్వముచే అంశతః వంచితములై యున్నవి. కనుక నీరెండును సర్వాంతర

తములనక, అంతరంగవిషయము లందుము. కానిండు; ఈ నాల్గిటిచివరను గీతాసారము ప్రతిష్ఠితమైయున్నది. ఉపక్రమము నందాత్మ - ఆత్మయొక్క బ్రహ్మకర్మలను రెండువివరములు నున్నవి. వీని నెరుంగుటచే నంతరంగవిషయద్వయ (జ్ఞానయోగ - కర్మయోగ) జ్ఞానముకల్గును. అందువలన సర్వాంతరతమద్వయ (అవ్యయకర్మ - జ్ఞాన) పరిజ్ఞాన పరిజ్ఞానము కలుగగా, గీతాసారము సువ్యక్తమగును.

ఆ యాక్రమము ననుసరించి ప్రస్తుతము ఆత్మపరీక్షా ప్రకరణముం జూతము. గీతాశాస్త్రము, సశరీరాత్మకల్యాణమునకై ప్రవర్తిల్లెను. శరీరకల్యాణ మభ్యుదయము. ఆత్మకల్యాణము నిశ్శ్రేయసము. దీనికదిమూలము, శరీరమస్వస్థమగుచో ధర్మసాధన సాగదు గదా! 'శరీరమాంద్యంఖలు ధర్మసాధనమ్,' శరీరము పాంచభౌతికము. పంచీకృత పంచమహాభూత నిర్మితము. వస్తువేదైన తన యుపాదానముంగొనియే తన స్వరూపసత్తగాపాడుకొన జాలును. అన్నమయశరీర మన్నమువలన నిల్చును. భౌతికశరీరము ప్రతిష్ఠకు భౌతికవిశ్వపరిగ్రహణము ఆవశ్యకము. భౌతికసంపత్తిలేని యభ్యుదయమసంభవము. శరీరము స్వస్థము గానిచో ఆత్మకల్యాణ మసంభవము.

విషయాసక్తినుండి తొలగించి బుద్ధిని ప్రత్యగాత్మతో గూర్చుకొనుటబుద్ధియోగము - దీనిచే ప్రత్యగాత్మయొక్క సచ్చిదానంద శక్తులకు మన గర్మాత్మపై ననుగ్రహము కల్గును. అందువలన గర్మాత్మసబలమగును. అపుడు అది 'విషయాసక్తజనిత కర్మలేశ

బంధన) రహితమై జీవన్ముక్తమగును. ఇదే తదీయ పరాముక్తి లక్షణవిదేహముక్తి. ఇదే నిశ్శ్రేయసము. ఇది కేవలము బుద్ధి యోగముపై నాధారపడియున్నది.

బుద్ధికి హృదయస్థ (ప్రజ్ఞానమనస్సు) ప్రతిష్ఠ - బుద్ధితత్త్వ మాధ్యాత్మిక విజ్ఞానసూర్యుడు. ప్రజ్ఞానమనస్సాధ్యాత్మిక చంద్రుడు. సూర్యజ్యోతి చంద్రునందువలె మనస్సునందు బుద్ధి, ప్రతిబింబరూపమున ప్రతిష్ఠితమై యుండును. మనస్సే బుద్ధికాధారము. బుద్ధిని స్వస్వరూపమున సురక్షితము గావించుకొనవలె యుచో శాస్త్రప్రతిష్ఠారూపమును, సత్త్వగుణోపేతమును (కనుకనే) చిత్తము సహజము నున్నను సురక్షితముగావించుకోవలెను. జల పాత్ర కదలిన, జలమందలి ప్రతిబింబము చలించునుగదా! అస్థి యిటుల నెరుంగవలయును. కనుకనే "స్వస్థేచిత్తే బుద్ధయస్సంభవన్తి" అని సూక్తివెలసినది - సరే యిక నీ చిత్త (మనః) స్థిరత యెట్లు సంభవించును?

మనసు అన్ననిర్మితము. 'అన్నమయంహి సోమ్యమనః' అన్నమన నోషధి - ఒకపంటతో సమాప్తమగునవి యోషధులు 'ఓషధ్యః ఫలపాకాంతాః' యవగోధూమాదు లిందుజేరును. చాంద్రరసము వీనికి మూలప్రతిష్ఠ. కనుకనే చంద్రుడు 'ఓషధీనాంపతిః' యనబడును; చాంద్రరసము శ్రద్ధయందురు. ఇయ్యది దివ్యమగు నాదిత్యాగ్నియందు హోమముకాగా నదియే సోమ మను రూపాంతరము నొందును.

అది (సోమము) పర్జన్యాగ్నియందు హోమమై వర్షరూప

మొందును. సోమరూపాంతరము జలము, వర్ష రూపమగు నిది పార్థివాగ్నియందు దాహుతికాగా పైజెప్పిన యోషధులు జనించును, ఇవిజలరూపాంతరములు. ఇవి యాధ్యాత్మిక వైశ్వానరాగ్నియందు దాహుతములై క్రమముగ రసాసృగాది రూపము లొందిచివరకు శుక్రరూపమునొందును. ఇందువలన శుక్రమందు పార్థివస్థూల ధాతువు, అంతరిక్ష్య సూక్ష్మ ధాతువు దివ్య చాంద్రధాతువును గల వనదగును. ఎట్లన:— చంద్రునుండి వెడలి యన్నముగనగు శ్రద్ధామయ సోమమందు, మధ్యనున్న యాంతరిక్ష్యవాయువు, పార్థివ మృద్భాగమును ప్రవేశించును. ఇట్లు అన్నములేక అన్నరూప శుక్రమందు చాంద్ర శ్రద్ధామయ సోమమును, అంతరిక్ష్య వాయువును, పార్థివమృద్భాగమును అనుమూడు పదార్థము లుండునని తెలుచున్నది.

స్వాభావికము ధారావాహికమునగు విశకలన ప్రక్రియచే శుక్రమందలి పార్థివధాతువు వెడలిపోగా, నిక ఆంతరిక్ష్యవాయువు దివ్యసోమము నను ధాతుద్వయము మిగులును. దీనినే ఓజస్సు అందురు. ఇది శుక్రమున కవస్థాంతరము. మరియు, అందలి వాయుతత్త్వముకూడ నశ్లి పోయినప్పుడు మిగులునట్టి సుసూక్ష్మమగు శ్రద్ధామయ సోమరసము మనస్సు అను పేరొందును. ఇయ్యదివిీధ్రవస్తువు కనుక దీనిపై బుద్ధి ప్రతిబింబితమగును. ఇట్లా చాంద్రసోమము పైవిధముగ అన్నముద్వారా శరీరమందు ప్రవేశించి మనసుగ నగును, అన్నమే మనసు - అన్నమే మనసున కుపాదానము.

కనుక:— అన్నాహుతివలన మనః స్వరూపరక్షయగు నన వచ్చును. అన్నము భౌతికసంపత్తి. ఇదిలేకున్న మనస్సు నిలువదు. మనస్సు లేకున్నచో బుద్ధికి వికాసముండదు. అన్నమున్నంతవరకే దీని స్వస్థత. అటుగానిచో మనము తెలివింగోల్పోదుముగదా! బుద్ధిస్థిరతయున్నపుడే బుద్ధియోగము, దానిచే ప్రత్యగాత్మకు గర్మాత్మపై ననుగ్రహము - అయ్యది నిశ్శ్రేయసలక్షణాత్మకల్యాణము.

అందుకొరకు, బుద్ధిని ప్రత్యగాత్మతో యోజించవలయును. దానికి మనస్సు స్థిరముజేసికోవలయును. అందు కింద్రియముల ద్వారా అన్నభోగము కావలయును. దానికి బాంచభౌతిక శరీరము సబలముగనుండవలయును. అందుకు భౌతికసంపత్తి నాశ్రయింపవలయును. ఇట్లు ఆత్మముక్తికి, విశ్వభుక్తికి ననుగామి కాకతప్పదు. అదిలేని యభ్యుదయ నిశ్శ్రేయస ప్రాప్తి యసంభవము.

బాగున్నది, ఈవాక్యపరంపర వినుటకు బాగున్నది. కాని ఆచరణకు జాల కష్టసాధ్యము, బుద్ధియోగసంపత్తికై మనఃస్థిరత యావశ్యకమన్నది నిర్వివాదమే. అందుకు అన్నసంపత్తి - భౌతిక వైభవము అన్నంతనే నిర్ణీతపొడముచున్నది. సాంసారికాన్నపానాదులు మనస్సును స్థిరముగావింపవు సరిగదా మరింత చంచలము గావించును. ఇంద్రియ క్రీతదాసమగు మనస్సు భౌతిక విషయాసక్తమై తనస్వరూపము రక్షించుకోజాలక మీదుమిక్కిలిగ జెడగొట్టుకొనును. ఒకమారు సాంసారికవైభవమునం

దనురక్తికగ్గలైనా ! ఇక గల్యాణమెక్కడ ? "ఆవర్తన్తే ఝటితి రుదతాం సాంత్వహేతోః శిశూనాం" పుత్రమిత్ర కళత్రాన్నవస్త్ర గృహ వాహనానుచరద్రవ్యాదులం దేయొకట్టైన మనస్సుంజంచలము గావింపజాలును. స్నిగ్ధసోమమయ మనస్సు దేనిపై బడిన దాని నంటుకొనిపోయి, మరల వెంటనే నూతనత్వముంగోరుట దానిస్వాభావిక ధర్మము. కామలోలుపము, వాసనానుచరము, బహిర్ముఖము నగునది యొకచో నిలువక యిటునటు బరువు లెత్తుచుండును. ఇట్లు దీనిని రక్షించుచున్న యన్నసంపత్తియే దీనికి ఘాతకమగును. అందువలన స్థిరత వట్టిదగును. ఇక బుద్ధికి స్థిరత యెట్లు? దానికి ప్రత్యగాత్మతో యోగమెక్కడ?

ఒక్కమారుగ నింద్రియద్వారములనుబంధించి యన్నాగమనము బంధించి విషయములనుండి మనస్సుం దొలగింతుమన్నచో నన్నమయమనస్సు బ్రదుకజాలదు. పోనిండు, కొంచెమూరకున్నను కామనాకృపచే దాని చాంచల్యము క్రమముగ బెరిగి స్వరూపవినాశము దెచ్చును. ఈవిషమసమస్య తొలగు టెట్లు? అన్నసంపత్తి యుక్తమయ్యునది యాసక్తము గాకుండు నుపాయ మే మున్నది? చూతము.

(1) ఆహారశుద్ధి:— అన్నసంపద సాత్విక - రాజస - తామస భేదముచే మూడుభాగములు. చాంద్రశ్రద్ధాభాగ మేకరూపము. లేదా విరూపము, కాని, త్రివిధాన్న సంసర్గముచే నిదియు, సాత్వికీశ్రద్ధ రాజసీశ్రద్ధ తామసీశ్రద్ధ యని మూడుభాగము

లగును, తామసీశ్రద్ధ జడతకును, రాజసి చాంచల్యమునకును, సాత్త్వికి స్థిరతకును జననులు. తామసరాజసాహారములవలన నా యాగుణములు కల్గును. సాత్త్వికాహారముచే స్థిరతయేర్పడును. కనుక నది యందు కుపకారకమగును. కనుకనే భారతీయధర్మా చార్యులు ఆహారశుద్ధికి ప్రాముఖ్యమిచ్చిరి. అదిలేనినాడు మనః స్థిరత వట్టిదే.

(2) ఆచరణశుద్ధి:— ఇందువలన నాహారశుద్ధికి బలము లభిం చును. దురాచారియగువాని మనస్సు సాత్త్వికాన్నమువంకకు బోదు. అగమ్యాగమనము, అప్రాప్తకాలశయనము, నీచ సంగతి మొదలగునవి సదాచరణశత్రువులు. మొదట నాచార శుద్ధి కావలయును. ఇందులకు బ్రహ్మచర్యము - సత్యభాష ణము - అహింస - సర్వభూతహితరతి - దయ - ఇత్యాదుల ననుగ మింపవలయును. ఇందుకును:— ఈశ్వరచింతనము, సంధ్యా, తర్పణములు, బలి, వైశ్వదేవములు, పంచమహాయజ్ఞములు, వేదాధ్యయనము ఇత్యాదుల నాశ్రయింపవలయును. ఈ యన్నిటను నిష్కామభావ సామ్రాజ్యముండవలయును. అట్టిచో మనస్సుపై నన్నసంపత్తి యాక్రమణ ముండజాలదు. అందు వలన దత్ప్రవృత్తుడు బంధనమున బడడు. తత్ప్రవృత్తియున్నను శరీరాభ్యుదయమాత్ర మగును, మనస్సు నిర్లేపమగుటచే చంచ లముగాక బుద్ధియోగ నిష్ఠామూలక నిశ్శ్రేయస ప్రాప్తికి గారణమగును.

ఇదియేమియులేక యుత్పథగామియగు మందబుద్ధి అభ్య

దయ వంచితుడై ప్రత్యవాయభాగియగును. సాంసారిక సంపత్తి యందభివృద్ధి రెండువిధములు, వీనికి అభ్యుదయము ఉన్నతి యను రెండుశబ్దములు ప్రయుక్తములైనవి. అభ్యుదయ ప్రతి ద్వంద్వి ప్రత్యవాయము, ఉన్నతి ప్రతిద్వంద్వి అవనతి. కొందరు, అభ్యుదయోన్నతులు, ప్రత్యవాయావనతులు పర్యాయము లనుకొందురు! కాని, యది యనైజ్ఞానికము. ఈవిషయ మా పదముల వలననే బోధపడును.

మనల నెదురుగ పైకి గొంపోవునది అభి+ఉత్+అయ= అభ్యుదయము. అటుగాక, తిరిగి క్రిందికి గొనివచ్చునది ప్రతి+ అవ+అయ=ప్రత్యవాయము. శాస్త్రమెరింగి తదను గమనము జేయుకర్మ లభ్యుదయమునకును, అందులకు విరుద్ధకర్మలు ప్రత్యవాయమునకును హేతువులు, కేవలలౌకిక కర్మానక్తులై అర్థ సంచయలాలసత్వమున దిని త్రాగి యానందించువారి కాత్మతో బనిలేదు. లౌకికకర్మ కరణానైపుణ్యమున వారుకొంతకాలము సమృద్ధులట్లున్నను, ఆసమృద్ధి యెంతోకాలము నిలువదు. 'పెరుగుట విరుగుటకే' కదా! ఇదే ఉన్నతి శబ్దవాచ్యము. ఉత్+ నతి=ఉన్నతి. ఈవచనము జూడుడు.

'అధర్మేణైధతే పూర్వం తతో భద్రాణిపశ్యతి
తతః సపత్నాన్ జయతి సమూలంచ వినశ్యతి''

ఎదిగిక్రుంగుట దీని (ఉన్నతి) స్వభావము. దౌర్భాగ్యమున నే డందరును దీని వెంటనే పడుచున్నారు. ఇక ధర్మాధర్మశూన్య

డగుమూర్ఖుని గతి యెప్పుడు నవనతియే (క్రిందికివంగియుండుట అవ+నతి). దానిని గూర్చి వేరుగ జెప్పనక్కరలేదు.

ఇంతకు మనకల్యాణము ఆత్మసంస్థ విశ్వసంస్థ (శరీరము — కర్మాత్మ) యను రెండుభాగములని తేలును. ఈరెంటికిని ఘనిష్ఠ సంబంధము. ఇందు ఆత్మకల్యాణము పురుషార్థకర్మ. శరీర కల్యాణము క్రత్వర్థకర్మ ఇదిలేని దది యసంభవము — ఇక శరీర కల్యాణ రూపక్రత్వర్థము పురుషార్థమయ్యెనా ఉన్నతి యగును. ఇది పతనహేతువుగదా! అటుగాక క్రత్వర్థము క్రత్వర్థముగనే యున్నచో అనగా, విశ్వవైభవ మాత్మానుగామి యగుచో అభ్యుదయ మగును. ఇది కాలాంతరమున నిశ్శ్రేయసభావ కారణమగును. ఇట్టి నిశ్శ్రేయసభావ మూలక విశ్వకర్మను విజ్ఞాన (విశేషజ్ఞానము) మందురు.

ఏవిజ్ఞానమందు — విశ్వకర్మయందు - భౌతికావిష్కారము లందు - ఆత్మభావనయుండదో అట్టి విజ్ఞానము అజ్ఞానము నాశకతంత్రము. ఆర్యులు దీనిని క్షణికవిజ్ఞానమనిరి. ఇందు సర్వథాస్థిరతకభావము నేటియావిష్కారము లన్నియు నిట్టివే. ఎటను శాంతిమూలక ప్రతిష్ఠ లేదు. ఈక్షణికవిజ్ఞానవాదులు మన ఋషులదృష్టిలోనాస్తికులు. కాని,

ఏ విశ్వవిజ్ఞానమూలమందు నిత్యలక్షణ జ్ఞానమూర్తియగు నాత్మ ప్రతిష్ఠితమై యుండునో అట్టివిజ్ఞానము విశ్వవిజ్ఞాన మయ్యును, ఆత్మనిత్యతానుగ్రహముచే నిత్యవిజ్ఞానమగును. జ్ఞాన సహకృతమగు నీ నిత్యవిజ్ఞానమే బ్రహ్మమౌలిక స్వరూపము

"సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ - నిత్యంవిజ్ఞాన మానందంబ్రహ్మ" ఆత్మకల్యాణము ముఖ్యపురుషార్థము. శరీరాభ్యుదయము సాధకము. ఒకటి జ్ఞానము రెండవది విజ్ఞానమును ప్రధానముగ గలవి. రెండును ఆవశ్యకములే. కనుకనే జ్ఞానమయ విజ్ఞానాత్మకము గు గీతను పూర్ణశాస్త్ర మందుము. ఇతరశాస్త్రములందు (అనగా, ముఖ్యపురుషార్థముం బ్రతిపాదించు ఆస్తిక దర్శనములందు) జ్ఞానదృష్టితో నిశ్శ్రేయసభావమే ప్రతిపాదింపబడినది గాని అభ్యుదయభావము ఇంచు మించుగ లేదనియే చెప్ప వలయును. జ్ఞాననిరూపణ ప్రధానమగుటనే ఆత్మశాస్త్రము దర్శన మనబడును. అందువలననే దాని నపూర్ణ మందుము.

జ్ఞానము విజ్ఞానసహితముగ (నిశ్శ్రేయ సాభ్యుదయములు ఆత్మ - విశ్వసంపత్తులను) బోధించుగీతాశాస్త్రము దర్శనశాస్త్ర మందలి లోపపూరణము సేయుచు పూర్ణశాస్త్రమనిపించు కొనుచున్నది. ఆయీ విషయమున్ను గీతావిజ్ఞానమందు విపృత మైనది. ఇంతకు:— ఆత్మకు జ్ఞానవిజ్ఞానములను రెండువివర్తములు. నిరుపాధిక మగునది జ్ఞానమూర్తి 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ' విశ్వపరిగ్రహణమున నదే సోపాధికమై విజ్ఞానమూర్తియగును. "నిత్యంవిజ్ఞానమానందంబ్రహ్మ" ఇపుడు "శాస్త్రములేయాత్మ కల్యాణముజెప్పును" ఆత్మకును గల్యాణమునకును సంబంధమేమి? ఆత్మనిత్యము ఆనందరూపము అగుచో దానికిక్లేశసంబంధమెట్లు? లేనిచో ఆత్మశాస్త్రోపదేశమేల? ఈస్థితిలో శాస్త్రములు కేవలము శరీరపరకము లనవచ్చును. ఏలయన, సుఖదుఃఖాది ద్వంద్వభావ

సంబంధము శరీరముతోఁడ నేకదా!'' అనియు శంకకలుగవచ్చును: మరియు —

ఆత్మయన్న దొక జటిలసమస్య — ఒకచో దానిని వ్యాపక మనియు, వేరొకచో ప్రతిశరీరభిన్నమనియు జెప్పబడినది. ఒకచోనది పరలోకమునకు బోవుననియు, నొకచో నటుకాదు శరీరత్యాగానంతరమే రెండవ జన్మనెత్తుననియు చెప్పబడినది. ఒకచో, నాత్మశబ్దాతీతము కనుక శాస్త్రమువలన నెఱుక పడదనియు, నొకచో దానినెరుంగుటకు శాస్త్రము సాధక మనియును జెప్పబడినది. అట్లే ఆత్మ — ధర్మాధర్మ — పుణ్యా పుణ్య — కృతాకృత దూరమనియు దానికే అన్నియు గల వనియు కలదు. ఎన్ని చెప్పెదము, ఎన్నో విరుద్ధ వచనము లగపడుచున్నవి. కనుక నాయీాసర్వసందేహ నివృత్తికి మొదట నాత్మ పరీక్ష యత్యావశ్యక మగుచున్నది.

కానిండు ఇట్లు ఆత్మకెన్ని వివర్తములున్నను జ్ఞాన విజ్ఞాన భేదముచే ముఖ్యముగా నిరుపాధిక — సోపాధికములు రెండే వివర్తములు కనుక సంగ్రహముగ వీనింజూతము. ప్రస్తుతము గీతాశాస్త్రము నొకింతసేపటుంచి ఆత్మంగూర్చి దార్శనికులు గావించియున్న వివేచనలేమో చూతము. అందువలన దర్శన విరోధములంగూడ పరిహరింపగలము.

ఇది విషయ ప్రవేశము

# దార్శనిక దృష్టి - ఆత్మ పరీక్ష

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం, జ్ఞానిన స్తత్త్వదర్శినః"

## దర్శనభేదములు

దర్శనసంఖ్య విషయమున ననేక సంప్రదాయములున్నవి. అందుగొన్నిటిని మాత్రమిట జూపుచున్నాను. కొందరిదృష్టిలో దర్శనము లాస్తిక — నాస్తికభేదముచే రెండువిధములు. ఇవి ఆచార్యభేదముచే నొక్కొక్కటి ఆరుచొప్పున మొత్తము పండ్రెండుభేదములు అగును — ఎట్లన 1. లౌకాయతిక—వైభాషిక — సౌత్రాంతిక - క్షణికవైజ్ఞానిక — మాధ్యమిక — స్యాద్వాదికము లను నారును నాస్తికదర్శనము లివి లౌకికములు, — 2. న్యాయవైశేషిక సాంఖ్యయోగ పూర్వోత్తర మీమాంస లారును ఆస్తికదర్శనములు. ఇవి వైదికములు. ఈశ్వరసత్తనొప్పినవి. ఇవి యీశ్వరసత్తనుపేక్షించి నాస్తికవాదము నెదుట బెట్టుకొని దర్శనమీమాంసయందు బ్రవృత్తములైనవి.

మరికొందరి సంప్రదాయమున దర్శనము లింకొకతీరున్నవి. ఎట్లన:— పై చెప్పిన కర్మ—జ్ఞానప్రధానములగు లోక—వేదములే కాక భక్తిప్రధానమగు నాగమతత్త్వమొకటి యున్నదిగదా! విశ్వవివర్త మీమాంసపేరు దర్శనము అన్నచో విశ్వవివర్తము కర్మజ్ఞానభక్తిభేదముచే మూడుభాగములు. కర్మనిరూపకము

నాస్తికదర్శనము. జ్ఞాననిరూపక మాస్తికదర్శనము. అట్లే భక్తి ప్రతిపాదక శాస్త్రము సాంప్రదాయిక దర్శనమనవచ్చును.

భక్తికి దేవతతో సంబంధము; ఉపాసన దేవతకేగదా! అదియు: సూర్యుడు-శక్తి — విష్ణువు — గణపతి — శివుడు అని యైదుభాగములు, సమష్టిరూపమొకటి. మొత్తమారు (1)సౌర-శాక్త - వైష్ణవ - గాణాపత్య - శైవదర్శనము లైదును - సమష్టి రూప స్మార్తమొకటియును. సమష్ట్యుపాసన యుత్తరభారతదేశమున, వ్యష్ట్యుపాసన దక్షిణభారతమునను విశేష ప్రచారములో నున్నవి. ఈవిధముగ ఆగమికములారు భక్తిదర్శనములు, నైగమికములారు జ్ఞానదర్శనములు, లౌకికములారు కర్మదర్శనములు; మొత్తము పదునెనిమిది. ఇందు నైగమికాగమికములు పండ్రెండును ఆస్తికదర్శనములు. తక్కిన లౌకికదర్శనములారును నాస్తికదర్శనములు.

ఇక కొందరు దర్శనములు 36 అందురు. "దర్శనములారు: అవి ఒక్కొకదాని కారేసిచొప్పున మొత్తము 36 విభాగము లగు" నని వారందరు. ఇందును 6 నాస్తికములు; తక్కిన 30 యు ఆస్తికములు. ఎట్లన:— 1. నాస్తికదర్శనము 2. ప్రాకృతిక దర్శనము 3. ప్రపత్తిదర్శనము 4. ఉపాసనా దర్శనము 5. సంప్రదాయదర్శనము 6. తర్కదర్శనము అని దర్శనములారు. ఇందు—

1. నాస్తికదర్శనము:— వస్తుతః ఇది 1. చార్వాక 2. బౌద్ధ 3. జైనము లను మూడువిభాగములు. వీనికి వరుసగ బృహస్పతి-గౌతమబుద్ధ - జినాచార్యులు ప్రవర్తకులు. ఇందొకటి, మూడు

లకు లౌకాయతికార్వాతములనియు పేర్లుకలవు. ఇకమధ్య దగు బౌద్ధదర్శనము శిష్యసంప్రదాయ భేదమున మాధ్యమిక -యోగాచార - సౌత్రాంత్రిక - వైభాషికములను భేదములు కాగా' మొత్తము నాస్తికదర్శనములారగుచున్నవి. వీనిస్వరూప మిట సంక్షేపముగా జూపెదము. విశేషములు వలయువారు ఆయాదర్శనములందే చూడవలయును. అందు-

(1) లౌకాయతికమను చార్వాకదర్శనము:— దీనికి మూల ప్రవర్తకుడు బృహస్పతి. చార్వాకుడను గొప్పవిద్వాంసు డీమత మును విస్తరించెను. ఇతడు అనీశ్వరవాది. ఘోరనాస్తిక శిరో మణి. ఈమతము నొకప్పుడు భారతమున వ్యాప్తముగావించెను. కనుక దీనికి చార్వాకదర్శనమని పేరువచ్చెను.

ఈదర్శనముంబట్టి ఆకాశ మనునది తత్త్వముకాదు. తక్కిన ప్రత్యక్షభూతములు నాలుగే తత్త్వములు ప్రత్యక్షమే ముఖ్య ప్రమాణము. నాలుగుతత్త్వముల సమన్వయమునను శరీరమను సంస్థయుత్పన్నము కాగా నందొక క్రియావిశేషముగూడ జనిం చును. అదే:— ఆత్మ - చైతన్యము మదము మాదక ద్రవ్య మందును, శరీరమందునుగూడ లేకున్నను, రెంటి సంయోగము నను తాత్కాలికముగ జనించున ట్లిచటగూడ నూహింప వలయును.

నాల్గుభూతములును వేర్వేరుగ జడములు. వీనికంటె వేరుగ చైతన్యము - ఆత్మయను వస్తు వేదియులేదు. పైవిధముగ నిది తద్భూత సంయోగజము. అవి విడిపోగా నిదియుపోవును. అను

మానము ప్రమాణమనుటకు ప్రమాణము లేనందున నది ప్రమాణము కాదు. అందుకు సాధకము ప్రత్యక్షమే కనుక ఆత్మ ఆనుమానిక మనుట తగదు. నేటివరకెవడును దానిని శరీరముకంటె వేరుగాజూడలేదు. అట్టిచో ప్రత్యక్షానుబంధి ప్రమాణమునకు విలువయేమి? వస్తుతః ప్రత్యక్షముకంటె ప్రమాణమేలేదు.

పారలౌకిక స్వర్గసుఖమనునది యంతయుమున్నోసున్న. వేదాదులు చెప్పినది ధూర్తకల్పన. ప్రలాపమాత్రము - స్వార్థలీల - స్వర్గము నెవడుచూచి వర్ణించువాడు? స్త్రీ నిత్య భోజనాది ప్రత్యక్షానుభూత సుఖమే స్వర్గము. శరీరపీడా జరావ్యాధులే నరకము. శరీరనాశము మోక్షము. స్వవ్యవస్థా సౌకర్యమునకై తానెన్నుకొన్న వ్యవస్థాపకుడు ప్రజాతంత్రాధ్యక్షుడు, రాజే ఈశ్వరుడు ఇక వేరుగ గర్మఫల మిచ్చువాడెవడును లేడు, అదృష్ట మను పదార్థ మేదియులేదు.

"నస్వర్గో నాపవర్గోవా నైవాత్మా పారలౌకికః
నైవ వర్ణాశ్రమాదీనాం క్రియాశ్చ ఫలదాయికాః"
అగ్నిహోత్రం త్రయోవేదాస్త్రిదండం భస్మగుంఠనమ్
ప్రజ్ఞాపౌరుష హీనానాం జీవికేతి బృహస్పతిః
పశుశ్చేన్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి
స్వపితా యజమానేన తత్రకస్మాన్న హన్యతే?
మృతానామపి జంతునాం శ్రాద్ధంచే త్తృప్తికారణం
గచ్ఛతా మిహ జంతూనాం వ్యర్థం పాథేయకల్పనా"

యదిగచ్ఛే త్పరంలోకం దేహాదేష వినిర్గతః
కస్మాద్భూయో నచాయాతి బంధుస్నేహసమాకులః ?

(2) చతుర్విధ బౌద్ధదర్శనము:—

ఇందు అనుమానముగూడ ప్రమాణము. వీరికి విశ్వము క్షణికము. దుఃఖరూపము, స్వలక్షణము, శూన్యము, అర్థక్రియా కారిత్వమే సత్తు. లేదా సత్తాపదార్థము క్రియామయ విశ్వమందలి ప్రతిపదార్థమును క్షణికము. క్షణికక్రియాస్వరూప మనుబ్ధము, కనుక స్వరూప రహిత క్రియామయవిశ్వము శూన్యము. శూన్యభావమునకు తృప్తి లక్షణసుఖముతో సంబంధములేదు. కనుక విశ్వముదుఃఖము. ఇట్టి విశ్వమునకు దేనితోడను బోలిక లేదు. కారణము? పదార్థమునకు (పటాదులకు) మరొక పదార్థముతో బోలికయేమి? పరివర్తనశీల మగుక్రియకు వేరొక క్రియతో బోలికయెక్కడ? ఒకేక్షణమున ననేకక్రియలు ప్రతిష్ఠితములగుచో బోలిక యన్నది తటస్థించును. మఱి క్షణిక క్రియకు ప్రతిష్ఠయెక్కడ? కనుక క్రియామయ విశ్వమును స్వలక్షణ మందుము.

"సర్వంక్షణికం క్షణికం అతఏవ సర్వం శూన్యం శూన్యం
అతఏవసర్వం స్వలక్షణం స్వలక్షణం"

తక్కిన పంచస్కంధాది సిద్ధాంతము లాయా బౌద్ధగ్రంథము లందే అరయనగును.

(3) స్యాద్వాదదర్శనము: (6):—ఇందు ఆత్మనిత్యత ప్రవేశించినది. శరీరముకంటె నాత్మ స్థాయి. అందువలన జన్మాంతరముతో కర్మఫలసంబంధము అంగీకరింపబడినది. జీవ-అజీవములను రెండుతత్త్వములు. ఇవి బోధాబోధరూపములు. చూడుడు ఈ వచనములు.

"చిదచిద్ద్వే పరేతత్త్వే వివేకస్తద్వివేచనమ్
ఉపాదేయముపాదేయం హేయం హేయంచసర్వతః
హేయంతు కర్తృరాగాది తత్కార్యమవివేకినః
ఉపాదేయం పరంజ్యోతి రుపయోగైకలక్షణమ్"

విశ్వవాస్తవికస్థితి నెరింగినట్టియు, రాగాదిదోషవిజేత యగునట్టియు త్రైలోక్యపూజితుడు అర్హాన్ అనునతడే పరమేశ్వరుడు. ఈ మతమువారు ఆర్హతులు. జీవుడు - ఆకాశము - ధర్మము - అధర్మము - పుద్గలము అనునవి తత్త్వములైదు. అస్తికాయములందురు. అస్తికాయమన దస్తిత్వపర్యాయము.

ఇందు జీవతత్త్వము— 1. సంసారి - 2. ముక్త భేదమున రెండువిధములు. కర్మసంతానవశమున జన్మనెత్తువాడు సంసారి. ఇందును సమనస్క-అమనస్క-భేదమున రెండుతెగలు. మరల నిందును అమనస్కజీవులు 1. త్రసజీవులు 2. స్థావరజీవులు నని రెండుతెగలు. రెండింద్రియములుగల శంఖ - గండాద్యమనస్కజీవులు త్రసజీవులు. పృథివీజల తేజోవాయువనస్పతులు అయినను స్థావరజీవులు. భవాంతరసంబంధవిముక్తులు ముక్తజీవులు.

అజీవ - ధర్మాధర్మములను మూడ స్తికాయములు (తత్త్వములును అజీవవివర్తములే. స్పర్శ - రస - వర్ణ యుక్త పదార్థము పుద్గలము. ఇదియు అణుపుద్గలము సంఘ పుద్గలము నని రెండు విధములు. కొందరి మతమున:— జీవ - అజీవ - అస్రవ - బంధ - సంవర - నిర్జరా - మోక్షములన్న వియేడు తత్త్వములు. వాని వివరములు జైనదర్శనమందె అరయవలయును. ఏమైనను దీని మూలలక్ష్యము "సమ్యగ్దర్శన జ్ఞానచారిత్రాణి మోక్షమార్గః"*

ఈయూరు నాస్తికదర్శనములందు మధ్యవగు బౌద్ధదర్శనములు నాల్గింటికి వైనాశికములను పేరుగూడ కలదు. ఇది షడ్విధ నాస్తిక మత సంగ్రహము. దీని యుపాదేయతాను పాదేయతలం దరువాత చూచుకొందము.

ఇక: ఆస్తికషడ్దర్శనములు:— ఇవియన్నియు నిటవివరించుచో గ్రంథము బృహత్కాయమగును. ఇప్పుడు వైజ్ఞానిక దృష్టితో దర్శనములను సమన్వయింపవలసి యున్నది. కనుక వాని నామములు మాత్రమిట నుదహరింతుము. విశేష మరయ గోరువారు మరొకచో జూడవచ్చును.

(1) ప్రాకృతికదర్శనము :— 1. సాంఖ్య ప్రవచనము 2. శైవము 3. పాశుపతము 4. కాపాలికము 5. కారుకము 6. వైశేషికము అను నారు పేరులుగలది. ఇందు శైవాదికారుకాంతములను మాహేశ్వర దర్శనములనియు నందురు.

(2) ప్రపత్తిదర్శనము:— వీనిప్రవర్తకులను ప్రపన్నాచార్యులందురు. 1. నిర్విశేషాద్వైతము 2. విశిష్టాద్వైతము

3. ద్వైతము 4. శుద్ధాద్వైతము 5. ద్వైతాద్వైతము 6. చైతన్యాద్వైతము — ఇందు మధ్యవిన్నాల్గు భాగవత దర్శనము లనియు నందురు.

(3) భక్తిదర్శనము:— ఏతదనుయాయుల నుపాసకులందురు. 1. సౌరము 2. శాక్తము 3. శైవము 4. వైష్ణవము 5. గాణాపత్యము 6. స్మార్తము — ఇందు మధ్యవిన్నాల్గును ప్రపన్నదర్శనము లందురు.

(4) సంప్రదాయ దర్శనము :— 1. ఊర్ధ్వామ్నాయము 2. పూర్వామ్నాయము 3. దక్షిణామ్నాయము 4. పశ్చిమామ్నాయము 5. ఉత్తరామ్నాయము 6. అధరామ్నాయము — ఇందు మధ్యవిన్నాల్గు దైశికదర్శనము లనబడును.

(5) తర్కదర్శనము:— 1. శబ్దము 2. మీమాంస 3. న్యాయము 4. అలంకారము 5. పురాణము 6. ఇతిహాసము - (ఇవి దర్శనములనుటకంటె 'దర్శనాభాసములు' 'దర్శన ప్రతిచ్ఛాయ' లనుటమేలు) ఇందు మధ్యవిన్నాల్గు తార్కికము లందురు. ఇట్లు మొత్తము ముప్పదియారు దర్శనములు.

ఇట్లు ఆరేసి భాగములతో గూడిన నియ్యారుదర్శనములను కొలది పంక్తులలో స్పష్టము గావింతుము.

(1) "వేదశాస్త్రము ఏదృష్టితోడనైనను ప్రమాణముకాదు. అన్నివ్యవహారము లందును యుక్తియే సమన్వయహేతువు" ఇది నాస్తికప్రథమషట్కనిష్కర్ష.

(2) "అన్యసాధనాపేక్ష లేక ఈశ్వరుడు స్వాతంత్రేచ్ఛా

మాత్రమున నే విశ్వనిర్మాణము సేయుప్రభువు." ఇది మాహేశ్వరుల నిష్కర్ష. కనుక వీరిని స్వాతంత్రేశ్వరవాదు లందురు.

(3) "విశ్వనిర్మాణము నీశ్వరుకు స్వయముగా జేయక ప్రకృతిద్వారా కావించును. ఆప్తకాముననకు విశ్వనిర్మితి ప్రయాస మేల? అదియతని మహిమకు గళంకము" ఇది భాగవతుల సిద్ధాంతము. వీరిని ప్రకృతితంత్రేశ్వరవాదు లనియు నందురు. స్వతంత్రేశ్వరులును, ప్రకృతి తంత్రేశ్వరులును స్వసిద్ధాంత పుష్టికై వేదమును బ్రమాణీకరింతురు. కనుక నాయిరువురను నైగమికులనియు (వేదానుయాయులు) నందురు.

(4) "ఈశ్వరుడు తనవిభూతులగు సూర్యదుర్గాశివవిష్ణుగణపత్యాది దేవతలద్వారా విశ్వనిర్మాణముగావించును. కనుక ఈశ్వరు నెరుంగుటకుముందీ విభూతులనుమన ముపాసింపవలయును. అందువలన మనకన్నియు సిద్ధించును" ఇది ప్రపన్నాచార్యుల నిష్కర్ష. అనన్యోపాసనప్రపత్తి, అదికలవారు ప్రపన్నులు. వీరు వేదశాస్త్రమూలసిద్ధాంతములతో బాటుగ నుపాసనావిషయమున నాగమశాస్త్రోపాయములనుగూడ నుపయోగించుకొందురు. వీరిని నైగమాగమికులు, విభూతి తంత్రేశ్వరులు అందురు. స్వతంత్రేశ్వరులు సాక్షాత్తుగను ప్రకృతి తంత్రేశ్వరులు ప్రకృతిద్వారమునను విభూతితంత్రేశ్వరులు విభూతిద్వారమునను ఈశ్వరునుపాసింతురు. ఎట్లైన నీశ్వరోపాసన వీరి ముఖ్యోద్దేశ్యమగుటచే వీరి నుపాసకు లనియు నందుము.

(5) "ఈశ్వరవిభూతిరూప సూర్యాది దేవతల నుపాసించి,

సిద్ధులంబడసి వానిచే లోకకల్యాణ మాచరించుట పురుషార్థము" ఇది దైశిక సిద్ధాంతము. ఆగమామ్నాయ పరకవిశుద్ధాగమికులగు వీరి యభిప్రాయమేమన:—

సృష్టినిర్మాణమీశ్వరుడు స్వతంత్రముగనో ప్రకృతిద్వారముననో ప్రకృత్యవయవభూత స్వవిభూతిలక్షణ సూర్యశక్త్యాది దేవతలద్వారముననో చేయుగాక! ఏమైన నిందెవ్వరికోడను మనకు బనిలేదు. అందువలన మనము ప్రపంచ కల్యాణము గావింపజాలము. 1. కేవలేశ్వరవాదులగు విశుద్ధనైగమికులు(వేదనిష్ఠులు) స్వతంత్రేశ్వరానుగాములునగు మాహేశ్వరులును 2. ప్రకృతిమదీశ్వరవాదులు నైగమికులు (వేదనిష్ఠులు) ప్రకృతితంత్రేశ్వరానుగాములునగు భాగవతులును. 3. విభూతిమదీశ్వరవాదులు నైగమాగమికులు (వేదపురాణనిష్ఠులు) విభూతి తంత్రేశ్వరానుగాములు నగు ప్రపన్నులును. క్రమముగ నీశ్వర - ప్రకృతి - దేవతోపాసన (అవతారోపాసన) లచే నాత్మకల్యాణము గావించుకో గలిగినను వీరిముగ్వురిచే ప్రపంచమునకగు లాభ మేమియు లేదు. కనుక స్వార్థసాధకములు వ్యక్తికల్యాణపరకములు నగునీ మూడును శ్రేయోమార్గములు కావు. ప్రకృతియుక్తుడగు పురుషుడు (ఈశ్వరుడు) తన దేవవిభూతులకు సిద్ధులనొసంగి విశ్వసంచాలనము గావించి యున్నారు. అంతే గాని ఈశ్వరుడు - ప్రకృతి - తదవయవభూత సూర్యాదులు స్వతంత్రముగ నేమియు జేయజాలవు. పైనిజెప్పిన సిద్ధులే యెంతచేసినను జేయుచున్నవి, కనుక శక్తిమ దుపాసనగాక శక్తులనే - సిద్ధులనే

యుపాసింప వలయును. అదే పరమ పురుషార్థము. సూర్య చంద్రాగ్ని పవనాదు లీసిద్ధుల బలముననే విశ్వసామ్రాజ్యము సాగించుచున్నవి. మనమును సిద్ధిపరిజ్ఞానమున ప్రాణదేవతలం గనుగాని సిద్ధులనొంది వానిద్వారా దేవ విభూతులవలె లోక కల్యాణ మాచరింప వలయును.

ఆగమశాస్త్రోక్తమగు నీసిద్ధాంతమిా లోకకల్యాణమూలక సిద్ధిభావమునులోగాని తత్కాలీనమానవ సమాజమున కితర ములగు మూడుమార్గముల కంటె విశేష రుచికరముగదోచెను. కనుకనే కొంతకాల మా పూర్వోక్తోపాసకులస్థానము నీదైశిక పరంపర యాక్రమించెను. పిదప నది వేదనిష్ఠం బాడు సేయుట కనువు పడెను.

(6) తార్కికదర్శనము:— దీనిని దర్శనాభాస మంటిమి. నిజముగా నిది యేకదేశికము. కారణము? సృష్టివిద్యా ప్రతి పాదక శాస్త్రత్వమే దర్శనశబ్దమున కవచ్ఛేదకము. తత్ప్రధాన లక్ష్యము సృష్టివిద్య. ఈ దర్శనమునం దది గౌణము. ఉదా హరణము:— శాబ్దికదర్శనముం గొనుడు. దీని ముఖ్యలక్ష్యము పదవిద్య - లేక - శబ్దబ్రహ్మ. ఇది:— వర్ణాక్షర పదవాక్య స్ఫోటాది శాబ్దిక వివర్తనములను ప్రధానముగ బెట్టుకొని ప్రసంగ వశమున ఈశ్వరుని లక్ష్యము గావించును. కారణము? శబ్ద బ్రహ్మ విద్యయం దవిస్ఫోటపదార్థమే, పరబ్రహ్మ విద్యయందలి యీశ్వరపదార్థము. స్ఫోట మన్నయేశ్వరునియంశ. స్ఫోటము శాబ్దికుల ముఖ్యలక్ష్యము. ఇట్లు:— ఈశ్వరవివర్తము యొక్క

అనగా:— సృష్టివిద్యా వివ_ర్తముయొక్క యంశరూపమగు స్ఫోటమును ప్రధానలక్ష్యముగ గొన్నందున దీని 'నేకదేశ దర్శనము' 'దర్శనాభాసము' ననవచ్చును. ఇక:— పూర్వ మీమాంసాదర్శనస్థితియు నింతే. మీమాంసకులను వాక్యా న్వయవిదులందురు. వేదవాక్యములు కర్మకాండ - జ్ఞానకాండ భేదమున రెండుభాగములు. దీనియందు కర్మ — బ్రహ్మస్వరూ పము వేరు. జ్ఞాన బ్రహ్మస్వరూపము వేరు. ఈ రెంటి ప్రతి పాద్య విషయములును వేరే. వాని సమన్వయమునకే పూర్వోత్తర మీమాంసలు వెలసినవి. ఇందు పూర్వ మీ మాంసకు బ్రధాన విషయము వాక్యసమన్వయము. అందం దీశ్వర ప్రశంసయున్నను అది గౌణమే. వాక్యార్థ సిద్ధియే ముఖ్యము. వాక్యముద్వారానే యిది ఈశ్వరసిద్ధియం దగ్రేసర మగును. విశ్వప్రభవసృష్టితో నిది ఈశ్వర నిరూపణ సేయదు కనుక నిది సృష్టి విద్యా ప్రతిపాదకము గాదు. కనుక దీనిం గూడ నేకదేశదర్శనమే యందుము.

ఇంతటితో నేదోయొక విధముగ దర్శన విచారణమైనది. దర్శనమునకు దృష్టిమూలక (సిద్ధాంతమూలక) జ్ఞానముతో సంబంధము. ఇందు ప్రత్యక్ష (వ్యవహార) మూలక విజ్ఞాన మొకవిధముగ లేదనవచ్చునను విషయము ముందు తెల్లము గాగలదు. స్థూలదృష్టికి దర్శనతంత్రములందు విరోధమున్నట్లు కానవచ్చినను సూక్ష్మముగ జూచినచో "సర్వథా విభక్తము లగు తత్త్వవిశేషములను నిరూపించు దృష్టిచే భిన్నమార్గముల

నాశ్రయించినను తుదకివి యన్నియు నొకచోటికే జేరు" నని పొడకట్టును.

'నృణామేకో గమ్యః త్వమసి పయసాం అర్ణవఇవ'

ఇది దర్శనభేద నిరూపణము.

# అథ దర్శన సమన్వయః

దర్శనములు పండ్రెండును, పదునెనిమిది, ముప్పదియారు-ఎన్నియైనను కానిండు. అయ్యది విద్వాంసుల వాగ్విలాసవైభవము. అందువలన నేమైనంగావచ్చును. కాని, వాగ్విలాసము వేరు, వస్తుస్థితి వేరు. వస్తుస్థితి కాలంబనము వృద్ధవ్యవహారము. సామాన్యముగ దర్శనము లెన్ని? యన్నచో షడ్దర్శన శబ్దమే విన బడుచున్నది. శక్తిగ్రాహక శిరోమణియగు నీవృద్ధవ్యవహారముం బట్టి ఆస్తికములైనను నాస్తికములైనను, (మొత్తము) దర్శనము లారే. వైజ్ఞానికముగగూడ నీపక్షమే యుచితమని తెలియనగును. ఎట్లన:—

"యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని నో ఇతరాణి" "యుక్తియుక్తవచో గ్రాహ్యం బాలాదపి శుకాదపి" అన్నట్లు ఉపాదేయవస్తువు (విషయము) ఎందున్నను గ్రహింపవచ్చును. నాస్తికదర్శన మొక యాస్తికుని దృష్టియందు విలువ లేనిదగుగాక! అందలి యుపాదేయవిషయములను గ్రహించుట తప్పుగాదు, అందుకు లజ్జింపనుగూడదు, ఇప్పుడు విజ్ఞాన

దృష్టితో మనము తెలిసికొననున్న దర్శనపరిజ్ఞానమునకై నాస్తిక దర్శనమునే యాశ్రయింపవలయును.

జైనదర్శనము. ముక్తికి "సమ్యగ్దర్శన - జ్ఞాన - చారిత్రాణి మోక్షమార్గః" అని మూడు మార్గములను జెప్పెను. ఈసూత్రమునకు వారి *వ్యాఖ్యాత లేమిచెప్పినను వాస్తవికముగ దీనియర్థము వేరుగనున్నది:—

విశ్వస్వరూపమేమి? ఇది ఎప్పుడు? ఎందుకు? ఎట్లు? నిర్మితమయ్యెను? ఇందలి మనుజునికర్తవ్యమేమి? ఏకర్మలవలన సుఖ-దుఃఖములుకల్గుచున్నవి? ఇత్యాదులు విశ్వవిద్యకు జెందిన ప్రశ్నలు. ఈవిద్య 1. సమ్యగ్దర్శనము 2. సమ్యక్ జ్ఞానము 3. సమ్యక్ చారిత్రము అని మూడుభాగములు.

విశ్వస్వరూపము నెరింగిన చూసినవిద్వాంసులు వారుచూచిన తెరంగు శబ్దములతో మనయెదుట సిద్ధాంతరూపముగ నుంచిరి. అవగ్రహాత్మకమగు నిదియే దర్శనము. ఇందువలన సాధారణ జ్ఞానమేకల్గును. కనుక దార్శనికజ్ఞానమునవగ్రహజ్ఞాన మందుము. 'ఘటమహంజానామి - ఇత్యపిజానామి' అను నీ నిశ్చయాత్మక జ్ఞానమును జైనదర్శన మవగమమునియెను. ఇందుకు సంస్కృత సాహిత్యమందు అవగతశబ్దము ప్రయుక్తమయినది. దీనినే తార్కికులు ప్రాతిష్ఠి జ్ఞానమందురు. — అవగమాత్మక (నిశ్చ

* (1) జీవకల్యాణార్థము అర్హాన్ చెప్పినదానియందు శ్రద్ధ (2) జీవుడు తన ప్రాతిస్వికస్వభావము విడవక సంయమ మోహారహితావబోధ కల్గియుండుట (3) పాపకర్మలనువీడుట _ ఇందు దర్శనమున జ్ఞానము - అందువలన చారిత్ర్యము కలుగగా జీవరకు నిర్వాణ ప్రాప్తియగును.

యాత్మక) మగు నీ పారిష్ఠిజ్ఞానోదయమునకు జైనులు అవగ్రహము, ఈహా, ధారణ యను మరిమూడు వ్యాపారములను కారణములుగ నెంచియున్నారు. దీనికిని అవాంతరభేదము లనేకము లున్నవి. ఇంచుమించు 15 - 16 - వ్యాపారముల యనంతరము పూర్వోక్తావగమజ్ఞాన ముదయించును. ఘటముతో రూపగ్రాహియగు చక్షురింద్రియమునకు సంబంధము కలుగగా ఆఘటరూపము (ఆకార - వర్ణ రూపము) చక్షుః పటలప్రతిబింబితమగును. ఇదే ఘట జ్ఞానమునకు ప్రథమపర్వము, (ద్వాదశప్రాణ సమిష్టి సూర్యుడు, సూర్యాగతేంద్రప్రాణము వర్ణరూపమునకును, త్వష్టాప్రాణము ఆకారరూపమునకును, గ్రాహకము ప్రవర్తకము నగును. సూర్యునుండియే చక్షురింద్రియోత్పత్తియు గనుక కార్యరూప చక్షువునందు నారెండు ప్రాణములు నుండును. అందువలన చక్షువు పురోఽవస్థితవస్త్వాకార వర్ణగ్రహణ సమర్థమగుచున్నది) ఇది:— ఇంద్రియమునకు విషయముతో - లేదా - విషయమున కింద్రియముతో నగు నొక విధమగు స్పర్శమాత్రము* దీనిపేరే అవగ్రహము - ఇదే

---

* దార్శనికులు చక్షువుగాక తక్కిన యింద్రియము లన్నియు నప్రాప్యకారులు అందురు. అనగా వానిపైకి విషయములు వచ్చి చేరును. చక్షువు విషయములపైబడును కనుక నిది ప్రాప్యకారి యందురు—అందువలన "ఇంద్రియమునకు విషయముతో" అని జెప్పితిమి కాని "సర్వాణీంద్రియాణి అతీంద్రియాణి" అను విజ్ఞానసిద్ధాంతముంబట్టి అన్నిటివలె చక్షువు నప్రాప్యకారియే కనుక 'లేదా విషయమున కింద్రియముతో' అనియు నంటిమి.

మొదటి జ్ఞానము. అనగా:— ఐంద్రియిక జ్ఞానముపేరే అవగ్రహము అని భావము.

ప్రజ్ఞానమనస్సునకు, చక్షురింద్రియముతో సంబంధముండును. అదిలేనిచో, గన్ను రూపజ్ఞానము నొందజాలదు. మనస్సన్యాయత్త మగుచో కన్నియు జూడజాలదు. ప్రజ్ఞాని మనో వికాస మన్ని యింద్రియము లందుకంటె చక్షురింద్రియమం దే అధికముగ నుండును. మనః స్వాభావికవృత్తి మనీష. అది కల వాడు మనిషి. మనస్సున కన్ని యింద్రియములతోడను సంబంధ ముండును. మనస్సులేనిచో శబ్దాదులం దేవిషయము నను భవమునకు రాజాలదు గాని, దీనివికాసము ప్రధానముగా చక్షువునం దుండును గనుక చక్షుఃపటలమును మనీషి యందురు.

చక్షు వాధ్యాత్మికసూర్యుడు. మనస్సుసోమము సూర్యగతేంద్రసంబద్ధసోమము ప్రదీప్తమగును. కనుక చక్షుగతమనస్సు చక్షురింద్రియమందు పూర్ణవికాసము నొందును. అందువలన మనస్సు చక్షురింద్రియ ద్వారమున (ఇతరేంద్రియములచే కంటె) నెక్కువ వ్యయ మగుచుండును. చక్షుః పటల మవరుద్ధ మగుచో అంధుడు — సూరదాసు, ధృతరాష్ట్రుడు మొదలగువారు) ప్రజ్ఞాచక్షు వందురు. అట్టివానికి మనోవ్యయ ముండదు కనుక స్మరణశక్తి యధికమగును.

కానిండు: ప్రస్తుతము:— ఇంద్రియములద్వారా వచ్చు విష

యము మనస్సుపైకి వచ్చును. మనస్సుతో బుద్ధి సంబద్ధమై యుండును. అందువలన మనః ప్రతిబింబిత విషయములు బుద్ధి యందుబడును. బుద్ధికాత్మతో సంబంధమున్నది 'ఆత్మా బుద్ధ్యా సమేత్య' (పాణి) అందువలన నావిషయము లాత్మతో సంబంధ పడును ఇట్లు:- ఇంద్రియార్థములను మనోబుద్ధులద్వారా యాత్మను జేర్చుటకు ఇంద్రియ మనోబుద్ధుల ప్రయాస - చేష్ట - అంతర్వ్యాపారము (ప్రాణపుబని) ఊహ యందురు. ఇది యవగమాంతరపుపని.

ఇందువలన నింద్రియస్థ విషయము మనోబుద్ధులద్వారా ఆత్మయందు 'ఇదమిత్థం' రూపమున ప్రతిష్ఠిత మగును. బుద్ధి 'దీనిని నేనెఱింగితి' ననుకొనును. ఇదే అవగమము (నిశ్చయాత్మక జ్ఞానము) దీనిచే మనోబుద్ధి యుక్తమగు నాత్మయందు, తత్తద్విషయ సంస్కార మేర్పడును. ఇదే ధారణ, దీనినే ఆస్తికదర్శనము వాసనాసంస్కార మనును. దీని బలముననే పిమ్మటి వ్యవహారములు సాగును. ఇదే ప్రాతిజ్ఞానము — ఈ విషయమును సామాన్యముగా నిట్లనుకొనవచ్చును:- "మొదట విషయముతో నింద్రియసంబంధము కలుగగా మనోబుద్ధుల యూహారూపవ్యాపారముచే 'నేను ఘటము నెఱింగితి' ననుజ్ఞానముకల్గును. పిదప 'నేను ఘటము నెఱింగితిననియు నెఱింగితి' నను ప్రాతిజ్ఞానము కల్గును. ఇదే అవగమాత్మకధారణ. ఇదే జ్ఞానమున కంతిమ పర్వము. ఇదే విషయసాక్షాత్కారము." ఇట్లు జైనదర్శనాను

సారము ప్రత్యక్షజ్ఞానమునందు అవగ్రహము ఈహా అవాయ (అవగమ)ము, ధారణ - అను నాల్గుపర్వము లుండును.

ఈ నాల్గు పర్వము లందును మనదర్శనశబ్దము ఇంద్రియ సంబంధియగు నవగ్రహమను ప్రాథమికజ్ఞానమునే అభినయించుచున్నది. దర్శన జ్ఞాన మవగ్రహజ్ఞానము కంటె గొప్పది కాదు. ఒకడు చూచిన దానిని మనము విన్నప్పుడు మనకు గల్గిన జ్ఞానము ఈహావాయ ధారణారహితము. విషయస్పర్శరూపము ఇంద్రియమువలన నగునది. ఇది సామాన్యజ్ఞానము. దృష్టిరూపము విషయదర్శన మాత్రమున నీయవగ్రహాత్మక జ్ఞానమును కల్గును. దర్శన శాస్త్రమున గల్గునదియు నిదే. కనుకనే దీనిని దర్శన మందురు. దర్శన జ్ఞానమునందు వినుటకంటె చేయవలసిన దేమియు లేదు. చూచినవాడు చెప్పినది వినుటకంటె మనకు గర్తవ్య మేమున్నది?

చూడుడు:— పౌరాణికుడు ఖగోళవిషయములు వినిపించుచు "శింశుమారచక్రమం దది యక్కడ నిది యిక్కడ నున్నదని స్వరపాతలములచే సూర్యగ్రహణము, సింహిచే చంద్రగ్రహణము కల్గును. అపాంవత్సనక్షత్రము వృష్టికధిష్ఠాత. శింశుమారచక్ర దర్శనము పుణ్యప్రదము" అనుటచే వినువారికి సామాన్య జ్ఞానము కల్గును. ఫలము? 'శ్రుతం హరతి పాపాని'

దర్శనముల యవస్థయు నింతే. విశ్వస్వరూపము సామాన్యముగ నెరుంగుటయే సమ్యగ్దర్శనము. చాలమంది దర్శనభక్తులే. విషయము నంతస్తల ప్రవేశము సేయు యోగ్యతలేదు. అది

యావశ్యకమనియు నా రనుకొనరు. సామాన్యస్వరూపజ్ఞాన మాత్రముననే సంతుష్టు లగుదురు. ఇట్టివారు ప్రతివిషయమును గూర్చియు తమ మంతవ్యమును దత్ క్షణమే ప్రకటించివైతురు. "శ్రాద్ధ మెందుకు జేయవలెను?" అన్నచో వీరు దార్శనిక దృష్ట్యభినివేశముచే "ఊరక. యెవడు నితరులకు కీడు సేయడు గదా! పరోపకారము మంచిది. కనుక, ఈ ధర్మ మను వంకతో నిటు సేయుమని పెద్దల యాదేశము" అందురు. వీరి నిర్ణయములెల్ల బాహ్య (ఇంద్రియ) ప్రత్యక్షమునకు జెందుచుండును. ఇదే విశ్వవిద్యకు, అవగ్రహస్థానీయమగు మొదటిమెట్టు.

ఇట్లు:— దర్శనజ్ఞానమందు, అవగ్రహ - ఈహా - అవగమ - ధారణ-లను నాల్గుజ్ఞానపర్వములందును, కేవల మొక యవగ్రహ జ్ఞానసత్తయే కలదు. అవగమాత్మక పూర్ణజ్ఞానము (పరీక్షాత్మక జ్ఞానము) నిందు లేదు, సంస్కారరూపమగు నభినివేశాత్మక ధారణయు లేదు, కారణము? అభినివేశాత్మకమగు నవగమ ధారణలు విషయసంస్కారమునకే పేరులు. గవాదిప్రత్యక్షము కలుగనంతవరకు నభినివేశలక్షణ జ్ఞాన ముదయింపదు. దర్శన మందు కేవలము ద్రష్టయొక్క దృష్టిని వినుట మాత్రమే యున్నది. అందు వస్తు ప్రత్యక్షమేది? కనుక దృష్టి జ్ఞాన సమ కక్షగల యవగ్రహముతోడనే దర్శనజ్ఞానసీమ సమాప్తమగును. భగవంతుడు గౌతముడు కూడ జ్ఞానము, నభినివేశమువలననే విషయములకు బూర్ణసిద్ధి (పూర్ణప్రత్యక్షము - పూర్ణజ్ఞానము) కలుగు నని యంగీకరించెను. జ్ఞానమవగమము. అభినివేశము

ధారణ. ఇందువలన:— అర్థసిద్ధి వలయుచో జ్ఞానాభినివేశ ముల నాశ్రయింపవలయునని తేలుచున్నది. ప్రత్యక్ష పరీక్ష లేకున్నచో నీ జ్ఞానాభినివేశ మసంభవము. కనుక నందుకై దర్శనమువలన సామాన్యముగ దెలిసికొన్న యర్థములను బ్రత్యక్షము గావించుకొనుటకు బ్రయాస పడవలయును. అందు వలన సమ్యగ్దర్శనము సమ్యక్ జ్ఞాన రూపమున బరిణతినొందును. తద్ద్వారా, సమ్యక్చారిత్ర్యముంజేరి లక్ష్యమగు బురుషార్థసిద్ధి నొందగలము.

మనజ్ఞానీయధరాతలము సర్వధానిమ్నమగుచో మనము శ్రుతి మాత్రముననే విశ్రాంతింగొందుము. గాని ముందుకుసాగ బ్రయత్నింపము. మనబుద్ధి పరమార్జితమై జ్ఞానము పరిష్కృత మగుచో నట్లు తృప్తినొందక శ్రుతివిషయముం బరీక్షానికషణ మున వైచి సాక్షాత్కారము గావించుకొన బ్రయత్నింతుము. ఇట్లు శ్రుతజ్ఞానము పరీక్షా రూప కర్మ అనునట్టి జ్ఞానకర్మల సమన్వయముచే కాలాంతరమున నాశ్రుతిరూపావగ్రహజ్ఞానము ప్రత్యక్షాత్మకా వగమరూపజ్ఞానము ధారణాత్మకాభినివేశ రూప కర్మస్వరూపమున బరిణతమగును. ఇదే విశ్వవిద్యకు రెండవపర్వము. కర్మాత్మకమగు నీరెండవ జ్ఞానపర్వమును విజ్ఞానమందురు. సిద్ధాంతమాత్రముగ నెరుంగుట దర్శనము - దానిని పరీక్షించి సాక్షాత్కరించు కొనుట విజ్ఞానము:

దర్శనమునకు శ్రుతితో, విజ్ఞానమునకు బుద్ధితో సంబంధ ములు విని నమ్ముట దర్శనము. చూచినమ్ముట విజ్ఞానము. అది

మనస్సంతుష్టికారణము. ఇది బుద్ధికనుయాయి. అది లౌకిక సామాన్యదృష్టి. ఇది యలౌకిక విశేషదృష్టి. దర్శనమందనేక (6) ధారణలు. విజ్ఞానమొకేసత్యమందు ప్రతిష్ఠితము. దర్శనము ఋతానుగామియైనయనృతము. విజ్ఞానము దీనిని లోఁగొన్న సత్యము. అనృతవిశ్వోపకారకమగు దర్శనమనృతమూర్తి. విశ్వ విశ్వాతీతోపకారకమగు నన్నృతగర్భితవిజ్ఞానము సత్యమూర్తి.

దర్శనము - సామాన్యజ్ఞానము - అవగ్రహము, విజ్ఞానము నకు - విశేషజ్ఞానమునకు - అవగమాభినివేశోదయమునకు గారణము, మూలము అన్నదినిజమే; కాని యీదర్శనము యొక్క యకృత్స్నత - ను అపూర్ణత ను దూరముసేయునది విజ్ఞానశాస్త్రమే. (జ్ఞానం విజ్ఞానసహితం) ఇది పరీక్షాత్మకమగు టచే నిర్భ్రాంతము గదా! కనుక దర్శనము కంటె విజ్ఞానము గొప్పతనము గలదందుము. దీనికథకారులు చాలకొలది మంది యుందురు. (మనుష్యాణాంసహస్రేషు) విన్నవిషయములంగొని నిర్ణయించు విరిసామ్రాజ్య మాధికముగ నున్నది. సత్సంపత్తి యున్నది నిజముగా కశ్చిద్భ్యాపమునకు జెందినదే. కానిందు:—

విశ్వవిద్యకు:— దర్శనము మొదటి పర్వము. విజ్ఞానము రెండవ పర్వము. ఒకటి సమ్యగ్దర్శనము. రెండవది సమ్యగ్ జ్ఞానము - ఒకటి యుపాంశుత సామాన్య లౌకికుల విశ్రాంతి భూమి - (సామాన్యజ్ఞానము) రెండవది (విశేషజ్ఞానము) సంస్కృత శాస్త్రసృష్టి విద్వత్రి-దాభూమి. ఇందు విజ్ఞాన శాస్త్రోసన మున్నతము అని తెలుచున్నది:— కాని,

సామాన్యమో విశేషమో ఈరెండునుజ్ఞానములే కనుక నివి కర్మనికషణము నెక్కకున్నంతవరకు నిరర్థకములే. కర్మలేని వట్టిసిద్ధాంతజ్ఞానముకంటె అజ్ఞానమే మేలు. దానిని శరణు గొన్నవారికి "కర్మ చేయకున్ననేమి?" యను ప్రశ్న రాక యుండదు కనుక పశ్చాత్తాపమే కలుగదు. అన్నియు నెరింగిన వారికన్ననో అంతర్వేదన మెండు. ఆత్మపతనభయ మధికము. అజ్ఞాని కర్మయేమో తెలియక యేస్థితియందున్న నాస్థితినే సరియనుకొనుచుండును. కర్మశూన్యమగు నీజ్ఞానఫలముంజెప్పు నీయుపనిషద్వాక్యమునరసి విశేషములా యుపనిషద్వివరణము నందే అరయవలయును.

"అంధః తమః ప్రవిశన్తి యేఽవిద్యాముపాసతే
తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః"

అనుగమ భావమునకు జెందిన యీమంత్రమున కనేక భావము లను చెప్పవచ్చును.

జ్ఞానము స్థితి:— కర్మ గతి. ఈరెంటును విరుద్ధములా? యని తోచునుగాని. విజ్ఞానదృష్టికీ రెంటికి తాదాత్మ్య సంబంధ మున్నది. స్థితి - జ్ఞానము, గతి - కర్మ, ఇవి యొకదాని కొకటి ప్రతిష్ఠలు, ఒకటి రెండవదాని రూపమున బరిణ మించును, స్థితిం దొలగించిన గతికిని, గతిందొలగించిన స్థితి కిని, స్వరూపవినాశము సంభవించును (ఈ విషయమన్యత్ర విస్పష్టము). పరస్పరము మేళవింపని జ్ఞానకర్మ లనుపయుక్త

ములు. భ్రష్టములుఅగును. బ్రహ్మకివి రెండును రెండుఅర్థములు (భాగములు) తత్స్వరూపములు. వీని సమన్వయము లేదా? లక్ష్యసిద్ధి నట్టిదే.

శక్తిలాభము ఆచరణ (చారిత్ర - కర్మ) వలననే యగును, శక్తివలననే పురుషార్థసిద్ధి నొందగలము. అందుకు చూచి యోగించిన - విషయములను ప్రయోగించు టావశ్యకము. ఇదే దర్శన - విజ్ఞానముల సఫలత. అటుగానిచో నారెండు నుండియు నిరర్థకములే. కనుక దర్శనానుసారము స్వరూపము నెరింగి తదనుసారముగ బరీక్ష సేయవలయును. ఆచరణానుగామియై పూర్ణేశ్వర పూర్ణవిభూతి ద్వారా పూర్ణుడు కావలయును. ఇదే సమ్యక్చారిత్ర్యము. విశ్వవిద్యకు చరమపర్వము. ఈమూటి సమన్వయము సిద్ధి - పృథక్త్వము, పతనహేతువు.

ఈమూటి సమన్వయమే బ్రహ్మజిజ్ఞాసాపూర్తికి హేతువు. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా, జన్మాద్యస్యయతః, తత్తుసమన్వయాత్'' ఇత్యాది దార్శనిక సిద్ధాంత విషయము స్పష్టము గావించును. కనుకనే 'సమ్యగ్దర్శన - జ్ఞాన - చారిత్రాణి మోక్షమార్గః'' అని సూత్రము వెలసినది.

"విని, యెరింగి, చేయుము'' అని లోకులందురు. ఇందు దర్శనజ్ఞాన చరిత్రలే సూచితము లగుచున్నవి. కొంచెము సేపు ఇందు జ్ఞాన - చరిత్రల నటుంచి దర్శనమును విమర్శింతుము —

ఇది కేవల సిద్ధాంత జ్ఞానమేకాని పరీక్షకు జెందినవస్తువు కాదంటిమి. మరియు, దర్శనము విశ్వవిద్యకొక పర్వమనియు,

సామాన్యరూపమున విశ్వవిచారము సేయుననియు జెప్పియుంటిమి. ఇచట "దర్శనశాస్త్రముచే నిరూపింపబడు విశ్వస్వరూపమేమి?" యని యొక ప్రశ్న పుట్టవచ్చును. ప్రశ్న చిన్నదే — కాని, సమాధానమో? సంపూర్ణార్య సాహిత్యము. కనుక విస్తరింపజాలక ప్రకరణసంగతికై యించుకంత ముచ్చటింతును. "అధ్యాత్మాధి భూతాధి దైవతమునుండి నిష్పన్నమైన స్వరూప ప్రపంచవిశేషమే విశ్వము. అనగా ఆత్మ — భూత — దేవతా సమష్టి విశ్వము." ఈవిశ్వమునే దర్శనశాస్త్రము విచారణసేయును.

జీవప్రపంచ మాధ్యాత్మిక విశ్వము, పార్థివప్రపంచ మాధిభౌతికవిశ్వము, సౌరప్రపంచ మాధిదైవికవిశ్వము. మొదటిది జ్ఞానము, రెండవది అర్థము, మూడవది క్రియ ప్రధానములుగ గలవి. జ్ఞానక్రియార్థ సమష్టియే విశ్వము. ఈమూటిచే విశ్వము వెలసినది. 1. అర్థక్రియా గర్భిత జీవప్రపంచము విశ్వమున నాధ్యాత్మిక పర్వము. 2 జ్ఞానక్రియా గర్భితార్థ ప్రధాన పార్థివ ప్రపంచము విశ్వమున నాధిభౌతికపర్వము. 3. అర్థ జ్ఞానగర్భిత క్రియాప్రధాన సౌరప్రపంచ మాధిదైవికపర్వము. ఇందువలన ప్రతిపర్వమందును జ్ఞానక్రియార్థములు మూడు నున్నవని నెఱుంగవలయును.

ఈ మూడు పర్వములను నిర్మించునది అసీమ - అమిత పరాత్పరుని ససీముని (మితిగలవాని)గ - (పరిమితునిగ) జేసి వైచు నావిశ్వమాయ నాగమశాస్త్రమందు 'త్రిపురసుందరి

యని చెప్పిరి. తదీయత్రిత్వ దిగ్దర్శనముం జేయుచు నభియుక్తులిట్లు చెప్పుచున్నారు:—

1 2 3 4
"దేవానాం త్రితయం త్రయీహుతభుజాం శక్తిత్రయం త్రిస్వరాః
5 6 7 8 9
త్రైలోక్యం త్రిపదీ త్రిపుష్కరమథో త్రిబ్రహ్మ వర్ణాస్త్రయః
యత్కించిజ్జగతి త్రిధానియమితం వస్తు త్రివర్గాదికం
తత్సర్వం త్రిపురేతినామ భగవత్యన్వేతి తే తత్త్వతః"

(వరివస్యా రహస్యము)

1. అగ్ని - వాయు - రవులు 2. గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు. 3. జ్ఞాన క్రియార్థశక్తులు 4. అకారోకారమకారములు లేదా ఉదాత్తానుదాత్త స్వరితములు 5. పృథివ్యంతరిక్ష ద్యులోకములు 6. త్రివృత్పంచదశైక వింశములు 7. హృదయ భూ నాకములు 8. ఋగ్యజు స్సామములు 9. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు.

ఈ త్రిత్వములంబట్టి ప్రతియొక విశ్వపదార్థమును మూడు భాగములగును కనుక దర్శనశాస్త్రమును మూడుభాగములే యగును. నిరూపకాచార్యభేదముచే మూడుశాస్త్రము లన బరగుచున్నది. ఈమూడవయవముల విశ్వశాస్త్రము ఒక్కొక యవయవముతో క్రమముగ అధిభూత - అధ్యాత్మ - అధిదైవతప్రపంచములను నిరూపించును.

అధిభూతముపై నధ్యాత్మము ప్రతిష్ఠితము. ఈరెంటికి నధి

దైవతము ప్రతిష్ఠ. పార్థివప్రపంచ మధిభూత మంటిమి. ఇదే మొదటి విశ్వసంస్థ.

దీనిపై నస్మదాది ప్రాణివర్గమను నధ్యాత్మసంస్థ ప్రతిష్ఠిత మై యున్నది. సౌరసంస్థ యాధిదైవిక సంస్థ. స్థావరాధిభూతసంస్థకు (పార్థివము) ను, జంగ మాధ్యాత్మిక సంస్థ (జీవసంస్థ) కును ప్రతిష్ఠ యిదే. "నూనం జనాః సూర్యేణ ప్రసూతాః" "ప్రాణః ప్రజానాముదయ త్యేషసూర్యః" "సూర్యఆత్మా జగతస్తస్థుషశ్చ" అని శ్రుతియు జెప్పును. ఈ ప్రాకృతిపక్రమముం బట్టియే భారతీయ దార్శనికులును మూడు సంస్థలను నిరూపించిరి.

1. మొదట నధిభూతముం గొనుడు. దీనిని వైశేషికదర్శనము నిరూపించును. కర్త కణాదమహర్షి. 2. అధ్యాత్మసంస్థ:— నిరూపకము ప్రాధానిక (సాంఖ్య) దర్శనము. ప్రణేత కపిలదేవుడు. 3. అధిదైవికము:— నిరూపకము శారీరకదర్శనము. రచయిత వ్యాసమహాముని. ఆస్తిక్యమూలకములగు ఆస్తికదర్శనములీమూడే. వీనిని ఆస్తికదర్శనములని యేల చెప్పిరో ప్రసంగవశమున నగికూడ నించుక యెరుంగుట యిట నుచితమే.

అస్తి యనస సత్తాతత్త్వము. ఇది త్రికాలాబాధితము. వస్తువుయొక్క నామరూప కర్మలు మారుంగాని యిది మారదు. ధారావాహిక బలముయొక్క కృపచే పదార్థ నామ రూప కర్మలు సురక్షితములుగ నున్నంతవరకు నిది పదార్థముతోను తదభావమున నభావముతోడను ఉండును. సత్తాశ్రితపదార్థములకే భావాభావములు - భావమస్తి. అభావము అస్తియే. అది

నామరూపాద్యస్తిత్వము. ఇయ్యది నకారాస్తిత్వమును చెప్పును. అస్తిమాత్రమొకటే ఏకరసము. మార్పులేనిది. నామరూపకర్మలస్తికుపాధులు. అవియున్నను లేకున్నను అస్తికి లోపములేదు. అది బ్రహ్మ ఉపాధిభేదశూన్యమగు నీ సామాన్యజ్ఞానముం గూర్చి శ్రీవిద్యారణ్యవచనము జూడుడు —

"ప్రత్యస్తాశేషభేదం యత్ సత్తామాత్ర మగోచరం
వచసా మాత్మసంవేద్యం తద్జ్ఞానం బ్రహ్మ సంజ్ఞితం"

లోకు లనుకొనునట్లు బ్రహ్మ పరోక్షముగాదు. ప్రత్యక్షమే. అస్తి నెవరెఱుగరు. మనము నామరూప కర్మాత్మక పదార్థములలో నున్న అస్తిని జూచి యా పదార్థమును అస్తి యనుకొనుచున్నాము. భేదకములగు నామరూపాదులం దొలగించి విశుద్ధాస్తి దర్శనము సేయబోవుచో అదే బ్రహ్మదర్శనము. కనుక నే కఠమహర్షి:—

"నైవ వాచా నమనసా ప్రాప్తుం శక్యో నచక్షుషా
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం త దుపలభ్యతే?
అస్తీత్యేవోపలబ్ధవ్యః తత్త్వభావేన చోభయోః
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి"

అస్తికి నామరూపకర్మ లాశ్రితధర్మములు. నామమునకు వాక్కుతో, రూపమునకు మనస్సుతో, కర్మకు చక్షువు (విజ్ఞానము) తో సంబంధములు. అస్తి యీమూటికంటె వేరైనది.

వీనివలన నది ప్రాప్తింపజాలదు. అస్తియే పొందదగినది అదే. నిత్యతత్త్వభావము. దానివలననే ఆత్మప్రసాదము.

నామరూపకర్మలకు వేరైన ఆయ_స్తితత్త్వ మేమి? ఆత్మ. "సవాఏష ఆత్మా వాఙ్మయః ప్రాణమయో మనోమయః" అని తల్లక్షణము. మనః ప్రాణ వాక్సమష్టియే ఆత్మ. అదే అస్తితత్త్వము. "అర్థంహావై ప్రజాపతే రాత్మనో మర్త్య మాసీ దర్థమమృతమ్" అన్నట్లు ఆత్మయొక్క అర్థభాగ మమృతము._ అర్థభాగము మర్త్యము. ఇందమృతము మర్త్యమునకు ప్రతిష్ఠ. మనః ప్రాణ వాక్కులను మూడుభాగములు నమృతములు, నామ రూప కర్మ లనునవి మూడును మర్త్యములు - మనస్సునుండి రూపము - ప్రాణమునుండి కర్మ - వాక్కునుండి నామము వికసిల్లును. రూపములకు మనస్సు - కర్మలకు ప్రాణము - నామములకు వాక్కు ఆత్మలు.

"యస్య యదుక్థం సత్ - బ్రహ్మ సత్ సామస్యాత్ సతస్యాత్మా" ఏది దేనికి ఉక్థబ్రహ్మ - సామ-లుగ నగునో అది దానికి ఆత్మ. ప్రభవముక్థము - ప్రతిష్ఠబ్రహ్మ - పరాయణము సామ అందురు. ఏ పదార్థము దేనినుండి పుట్టి దేని యాధారమున నుండునో ఆమూలమునుండి పుట్టు యావత్పదార్థములకును ఏమూలము సమానమో ఆమూలము ఈతూలమునకు ఉక్థ బ్రహ్మసామమై ఆత్మయగును. ఉదాహరణము:- ఘటము, ఇది మట్టినుండి పుట్టి - మట్టి యాధారముననే యుండును. మట్టిపాత్రలన్నిటను మట్టిసమానము కనుక ఘటమున కుక్థ

బ్రహ్మ - సామలగు మట్టి ఆత్మ.

ఇట్లే రూపము లన్నిటికి ప్రభవము, ప్రతిష్ఠయు మనస్సు అన్ని రూపములందు నిది సమానమగుటచే వానికి సామయు నైయున్నందున, ఉక్థ బ్రహ్మ సామలక్షణ మనస్సు రూపముల కాత్మయందుము. ఇట్లే కర్మలకు ప్రభవ - ప్రతిష్ఠాపరాయణము ప్రాణము కనుక నిది కర్మ లన్నిటికి నాత్మ - నామము లన్నిటికి ఉక్థ బ్రహ్మ సామ యగు వాక్కు ఆత్మ అందుము.

ఒకే ఆత్మ సృష్టి కాలమందు మనః ప్రాణ వాక్కు లను నీ మూడురూపములు ధరించి క్రమముగ రూప కర్మ నామ వికాసము జేయుచు విశ్వసృష్టి ప్రవర్తకమై యున్నది. తరువాత ప్రతి సంచరకాలమందు ఈమూడు నొకేరూపము నొందుచున్నవి. "ఆత్మా ఉ ఏకః స న్నేతత్త్రియం" "త్రయం స దేకమయ మాత్మా" ఇంతకు మనః ప్రాణ వాక్సంఘాత మస్తి యని ఫలితార్థము. నామరూప కర్మ లను మర్త్యభాగము లీ యస్తి గర్భమం దున్నవి. ఇవి తదీయ సోపాధికరూపములు.

మనోమయాత్మ ఆధిదైవిక సంస్థకును, ప్రాణమయాత్మ ఆధ్యాత్మిక సంస్థకును, వాఙ్మయాత్మ ఆధిభౌతికసంస్థకును ఆలంబనములు. ప్రధానతా ప్రధానతలందే తారతమ్యముగాని మూటియందు మూడునున్నవి. ఈ తారతమ్యముం బట్టియే ఆత్మలక్షణమగు అస్తితత్వము విశ్వమందు మూడుసంస్థలుగ బరిణత మగుచున్నది 1. వైశేషికశాస్త్రము వాక్ప్రధానాస్తి సంస్థకును 2. ప్రాధానికశాస్త్రము ప్రాణప్రధానాస్తి సంస్థ

కును 3. శారీరకశాస్త్రము మనః ప్రధానాస్తిసంస్థకును నిరూపకములు. ఇట్లీమూడును మనః ప్రాణ వాఙ్మయాస్తి తత్త్వ నిరూపకము లగుటచే నివి యాస్తికదర్శనములు.

ఇందువలన వీనియందు అనగా అస్తితత్త్వోపాసకములగు నీ యాస్తికదర్శనములందు మృత్యుప్రధాన విశ్వముయొక్క అనగా:— నాస్తిభావముయొక్క నిరూపణ సేయబడలేదని యెంచరాదు. వైశేషికము అస్తియొక్క వాక్యతతో బాటుగ గౌణముగ ద్రవ్యాత్మక నాస్తిభావమునుగూడ నిరూపించెను. ఈదృష్టితో కేవలాస్తికదర్శనములందును అమృతమృత్యువుల రెంటి నిరూపణయు గతార్థ మగుచున్నది.

ఇట్లు దర్శనమర్యాద త్రిత్వమర్యాదపై సమాప్త మగుచున్నది. విశ్వపద్య దర్శనము, విశ్వపర్వములు మూడే కనుక నిజముగా దర్శనములును మూడే. కొందరు పాతంజల - న్యాయ మీమాంసలు దర్శనములనుచున్నారు గాని యవి దర్శనాభాసములే గాని దర్శనము లనజాలము. ఈ విషయము ముందు తెలియగలదు.

మూడుశాస్త్రములును క్రమముగ భూత - ఆత్మ - దేవ తత్త్వములను ప్రధానలక్ష్యములుగా నుంచికొని నిరూపించిన వంటివి. ఉదాహరణము:— ప్రాధానిక మాత్మసంబంధముగల యాధ్యాత్మిక ప్రపంచమును నిరూపించును. ఈ యాధ్యాత్మిక సంస్థయందు స్థూల - సూక్ష్మ - కారణభేదమున మూడు సంస్థలున్నవి. అవి వరుసగ:— వాక్ప్రాణ మనోమయములు.

ఇవి భూత - ప్రాణ - ప్రజ్ఞామాత్రలు. భూత - దైవ - ఆత్మ గ్రామములు, భూతదేవ బీజచితులు, శరీర (వికృతి) ప్రకృతి పురుష విభాగములు. ఇట్లే అనేక పేరులం బిలువనగును. ఈ పరిలేఖ నరయుడు:—

అధ్యాత్మసంస్థ (ప్రాధానికశాస్త్రము) ఆత్మ

(ఇందు మూటసమావేశము గలదు.)

| | | |
|---|---|---|
| మనః | ప్రాణః | వాక్ |
| కారణశరీరమ్ | సూక్ష్మశరీరమ్ | స్థూలశరీరమ్ |
| ప్రజ్ఞామాత్రా | ప్రాణమాత్రా | భూతమాత్రా |
| ఆత్మగ్రామః | దైవతగ్రామః | భూతగ్రామః |
| బీజచితిః | దేవచితిః | భూతచితిః |
| ఆత్మా | ప్రాణః | శరీరమ్ |
| పురుషః | ప్రకృతిః | వికృతిః |
| పశుపతిః | పాశః | పశుః |
| జ్ఞానము | క్రియా | అర్థః |
| అధిదైవతమ్ | అధ్యాత్మమ్ | అధిభూతమ్ |
| శారీరక | ప్రాధానిక | వైశేషిక |
| శాస్త్ర | శాస్త్ర | శాస్త్ర |
| విషయః | విషయః | విషయః |

ఇట్లే:— ఆధిదైవిక నిరూపకమగు శారీరశాస్త్రము అధ్యాత్మాధి భూతములను ఆధిభౌతిక నిరూపకమగు వైశేషికము

అధ్యాత్మాధిదైవతములను స్పృశించినది. ఈమూటికి సమ న్వయ మిట్లుండుటవలననే వీనిని స్వతంత్రములనక యొకే దర్శన శాస్త్ర మంటిమి. ఇవిభిన్నములనుట కాచార్యభేద మే కారణము.

ప్రకారాంతరముగ:— ఈవిషయమునే విచారింతము:— విశి ష్టాద్వైత సంప్రదాయానుసారము విశ్వము లేక విశ్వవిద్య 'ఈశ్వర - జీవ - జగ ద్భేదమున మూడుభాగములు, వరుసగ నివి ఆధిదైవి కాధ్యాత్మి కాధిభౌతిక సంస్థలకు ప్రతిష్ఠలును, బ్రహ్మ - దేవతా - భూత - సంబంధము గలవియు నైయు న్నవి 1. భూతము నిత్యనియత భావయుక్తము, అనియత భావమే ధర్మము. అది జగత్ప్రతిష్ఠ "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" 2. జీవప్రపంచము, నిత్యము త్రివిధ దుఃఖాక్రాంతము. 3. ఇకనీశ్వరుడు కేవలము విజిజ్ఞాస్యుడు 1. బ్రహ్మసంబంధము గల ఆధిదైవిక సంస్థాప్రతిష్ఠ యగు నీశ్వరుని శారీరకము నిరూ పించును కనుక తదారంభము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" 2. ఆధ్యాత్మికసంస్థకు ప్రతిష్ఠయగు జీవనిరూపకము ప్రాధానికము, దీనిముఖ్యోద్దేశ్యము జీవుని త్రివిధ దుఃఖాత్యంతనివృత్తి కనుక తదారంభము 'అథత్రివిధ దుఃఖాత్యంత నివృత్తి రత్యంత పురు షార్థః'. 3. భూత ధర్మసంబధముగల (అధిభౌతిక సంస్థాప్రతిష్ఠ యగు) జగన్నిరూపక వైశేషిక శాస్త్రారంభము "అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః". ఈశాస్త్రము భౌతికపదార్థనియత ధర్మాధారముననే అభ్యుదయ - నిశ్శ్రేయసోదయము జెప్పును. కనుక నిది యాధిభౌతిక శాస్త్ర మనవచ్చును. "యతోఽభ్యు

దయ నిశ్శ్రేయస సిద్ధిః సధర్మః" "ధర్మవిశేష ప్రసూతాద్ ద్రవ్యగుణకర్మ సామాన్య విశేషసమవాయానాం పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిశ్శ్రేయసమ్" .

ఈవిధముగను దర్శనశాస్త్రములు మూడేయని సిద్ధమగుచున్నది. ఇట్టిచో న్యాయ - పాతంజాల మీమాంసలు దర్శనములనుట యసమీచీనము, ఆత్మదర్శనమే దర్శనము. ఆత్మకు, ఈశ్వర - జీవ - జగత్తులని మూడువివర్తములు. అయ్యవి వ్యాస కపిల కణాద దర్శనములతో గతార్థములై యుండ నికేమి కలదు?

కొందరింకొక విధముగ మూడుదర్శనములను చెప్పెదరు. అదికూడ చూతము. దర్శనశాస్త్ర మాత్మకల్యాణార్థము. అందుకుపాయ మంశాంశిసంశమగు జీవాత్మసంబంధము కల్గించుకొనుట. అంశియాగు బ్రహ్మ 1. జ్ఞాన 2. క్రి 3. యార్థమయము గదా! జ్ఞానమవ్యయునకు, క్రియ అక్షరునకు, అర్థము క్షరునకు చెందినవి.

మనోమయుడు అనగనే జ్ఞానప్రధానుడగు అవ్యయుడు జ్ఞానాత్మ. విశ్వాతీతము నిర్గుణాత్మ యందురు. ఇదే బ్రహ్మ. అర్థరూపము, కర్మమయము అనగనే కర్మప్రధానమగు క్షరము కర్మాత్మ - విశ్వమూర్తి - వైకారికాత్మ. ఇదే విశ్వము. ఇక మధ్యనున్న జ్ఞానకర్మోభయమూర్తి ప్రాణమయాక్షరము - జ్ఞానకర్మమయాత్మ - ఇదే విశ్వాత్మ, సగుణ ప్రజాపతి.

ఇట్లు మనః ప్రాణ వాఙ్మయ జ్ఞానక్రియార్థ మూర్తి త్రిపుర

షాత్మ కాంశయే క్రమముగ బ్రహ్మ - ఈశ్వర - విశ్వము లను ముత్తెరగు లగును. అధ్యాత్మ సంస్థానమందలి బ్రహ్మాంశ మవ్యయ ప్రధాన ప్రత్యగాత్మ. 1. ఈశ్వరాంశ. 2. అక్షర ప్రధాన శారీరకాత్మ. 3. విశ్వాంశము క్షరప్రధానశరీరము.

1. బ్రహ్మ - ఈశ్వర - విశ్వసమష్టి అదః. 2. ప్రత్యగాత్మ - శారీరకాత్మ - శరీరముల సమష్టి ఇదమ్. ఇదమ్ కు అదఃతో సంబంధము కుదుర్చుట దర్శనశాస్త్రము ముఖ్యోద్దేశ్యము.

ఈసంబంధమును మూడు తెరగులె. యెట్లన — శరీరమునకు విశ్వముతో, శారీరకాత్మ కీశ్వరునితో, ప్రత్యగాత్మకు బ్రహ్మతో సంబంధ మగును. 1. విశ్వము, శరీరమును కర్మాత్మలే. శారీర కర్మతో విశ్వకర్మకు సంబంధము కూర్చుటయే కర్మకాండ. వేదమందలి విధినామక బ్రాహ్మణభాగము దీనిని నిరూపించును. 2. ఈశ్వరుడు సుశారీరకాత్మయు జ్ఞానకర్మమయాత్మలే. దీనికి దానితో సంబంధము కూర్చుటయే పరానురక్తి లక్షణమగు నుపాసనాకాండ. ఆరణ్యక మీవిషయమును స్పష్టీకరించును. 3. బ్రహ్మయు ప్రత్యగాత్మయు విశుద్ధజ్ఞానాత్మలే. దీనికిదానితో సంబంధముం గూర్చుటయే జ్ఞానకాండ. ఉపనిషద్భాగమే తన్నిరూపకము. కాగా - బ్రహ్మయొక్క జ్ఞానము, ఈశ్వరుని యుపాసన, విశ్వకర్మయు నగును. అనగా-కర్మ విశ్వముతోడను ఉపాసన యీశ్వరునితోడను, జ్ఞానము బ్రహ్మతోడను సంబంధ పడుననిభావము.

ఈమూటిఫలములును భిన్నభిన్నములే. కర్మకు సంసారము

(విశ్వము)తోడనే సంబంధము కనుక, కర్మకాండ సాంసారిక స్వర్గాది సుఖములకు జనకము. ఉపాసనచే — సాలోక్య — సామీప్య - సారూప్య - సాయుజ్య భేదములుగల అపరాముక్తి లభించును. ఇక జ్ఞానముచే పరాముక్తియగును. ముక్తి బ్రహ్మ జ్ఞానఫలము, అనురక్తి యీశ్వరోపాసనకు మూలము, భుక్తి విశ్వకర్మకు దర్కము. ఈ ముక్తి - అనురక్తి - భుక్తులు మూటికిని నిర్గుణబ్రహ్మ[1] సగుణవిశ్వాత్మ[2] సాంజన విశ్వము అను నీమూటితో సంబంధము.

నిర్గుణబ్రహ్మ పరిచాయకోపనిషత్సిద్ధాంతవచనసమన్వయమునకై శారీరకశాస్త్ర మావిర్భవించెను. ఉపనిషత్తు వేదాంతిమ భాగమగుటచే నావచనములను విచారించు శాస్త్రము వేదాంత మందురు. కర్మమయ విశ్వము కంటె జ్ఞానమయ బ్రహ్మయుత్తరమగుటచే తన్నిరూపకమగు దీని నుత్తర మీమాంసయనియు నందురు. ఇదే జ్ఞానమీమాంస యనవచ్చును. ఈదర్శనము బ్రహ్మ (నిర్గుణాత్మ) ప్రధానము - ఇదే మొదటిదియు ముఖ్యమునగు దర్శనశిరోమణి వ్యాసదర్శనము.

సగుణ విశ్వాత్మ పరిచాయకారణ్యక సైద్ధాంతిక వచన సమన్వయార్థము భక్తిశాస్త్ర మావిర్భవించెను. దీనికావైపున జ్ఞానము ఈవైపునకర్మయు (అటుపనిషత్తు ఇటు బ్రాహ్మణము) నున్నవి కనుక నిది జ్ఞాన - కర్మోభయ భాగాత్మక మగుటచే భక్తిశాస్త్రమందురు. ఇది మధ్యస్థమగు విశ్వాత్మమీమాంసనే చేయును కనుక మధ్యమీమాంస యనవచ్చును. ఇందీశ్వరాను

రక్తికి ప్రాధాన్యము. దీనికి ప్రవర్తకుడు శాండిల్యమహర్షి యగు టచే శాండిల్య దర్శనమనియు నందురు.

సాంజనవిశ్వమూర్తి పరిచాయక బ్రాహ్మణభాగ సైద్ధాంతిక వచనసమన్వయార్థము మీమాంసాశాస్త్ర మావిర్భవించెను. ఇది (కర్మవిశ్వ) ప్రతిపాదక పూర్వభాగమును నిరూపించుటచే నేమి అయ్యాదియుత్తరలక్షణ బ్రహ్మకు బూర్వమగుటచే నేమి పూర్వమీమాంస కర్మమీమాంస యనబడును. దీని ప్రధాన లక్ష్యము ధర్మము. ప్రవర్తకుడు జైమినియగుటచే దీనిని జైమినిదర్శనమనియు నందురు.

బ్రహ్మకుపాసన వీలుపడదు. ఏలయన: —అది కర్మప్రయోగ మున కధికారికాదు. అయ్యాది కేవలము జిజ్ఞాస్యమాత్రమే. కనుక నే తదారంభక శాస్త్రము 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అనియెను. ఉపాసన యీశ్వర సంబంధము కలగి. శారీర కాప రాత్మకు పరుడగు నీశ్వరునందనురక్తి కల్గించునది యుపాసన. కనుక నే తత్ప్రతిపాదక శాస్త్రము 'సాపరానురక్తిరీశ్వరే' అని యారంభమయ్యెను. కర్మకు విశ్వముతో సంబంధము. అదే విశ్వధర్మము కనుక తదారంభక శాస్త్రము 'అథాతో ధర్మ జిజ్ఞాసా' అని మొదలిడెను. ఈదృష్టితో శారీరక - శాండిల్య మీమాంసలు మూడే ఆస్తికదర్శనములు.

శారీరక శాస్త్రమునకు విధేయము నిర్గుణాత్మ - ఉద్దేశ్యము - శారీరకాత్మయని గీతావిజ్ఞానమునం జెప్పితిమి. ఉద్దేశ్యమగు శారీరకాత్మయందు స్థూల సూక్ష్మ కారణ శరీరములను మూడు

తంత్రము లున్నవి. ఈమూటి యుద్దేశ్యముల భేదములచే నీ మొదటి యాత్మశాస్త్రము శారీరక - ప్రాధానిక - వైశేషిక భేదమున మూడు భాగములయ్యెను. ఈవిధముగ ప్రాధానిక వైశేషికములు శారీరకాంతర్భూతము లనవచ్చును. యోగము ప్రాధానిక పూర్వాంగమగుటచే నది యం దంతర్భూతమన దగును. ఇక మిగిలిన న్యాయశాస్త్ర మేవిధముగను దర్శన మన జాలము. ఇది కేవలము కథాశాస్త్రమే.

ఇట్లు శారీరకము, యోగర్భిత ప్రాధానికము, వైశేషికము అను నీమూడు నొకవిభాగము. మొదటిది శారీరక దర్శనము, రెండవది శాండిల్య దర్శనము, మూడవది మీమాంసాదర్శనము అనుట దర్శనశాస్త్రముల లెక్కయందిది రెండవదృష్టి. సత్య లక్షణ ధర్మ మీమాంసా సంబంధముననే యీదృష్టికి ప్రాధాన్యము.

ప్రకృతమం దాత్మశాస్త్రముఁబట్టి పూర్వోక్త శారీరక - ప్రాధానిక - వైశేషికములను మూడు దర్శనములకే ప్రాధాన్యమని గుఱుతింపవలయును. ఆపక్షమందన్ననో ఏదో యొక విధముగ పూర్వమీమాంసకు శారీరకమునందును, యోగమునకు సాంఖ్యమునందును అంతర్భావ మనుకొనవచ్చును. కాని వస్తుతః శారీరక ప్రాధానిక వైశేషికములే తప్ప తక్కిన శాండిల్య, యోగ, న్యాయ, పూర్వమీమాంసలు నాల్గును దర్శనశాస్త్ర మర్యాదకు వెలియైనవనియే యనుకొనవలయును.

పైమూడు శాస్త్రములును వేరువేరు సంస్థలను నిరూపించు

నని చెప్పియుంటిమి. వస్తుతః, ఇవి అధ్యాత్మసంస్థనే ప్రతిపాదించును. కారణము? శాస్త్రోపదేశమునకు ముఖ్యలక్ష్యము జీవాత్మ. ఈశ్వరునకు గాని, విశ్వమునకుగాని యుపదేశావశ్యకతయే లేదు. విశ్వము, జడము, భౌతికము, ఇంద్రియాభావముచే దానికుపదేశ గ్రహణయోగ్యత లేదు. విశ్వాత్మయగు నీశ్వరుడో స్వయముగ సర్వజ్ఞుడు, సర్వశక్తి, సర్వవేత్త. ఆయన జ్ఞానశక్తిలో లేశమాత్రము నుపదేశక మున్నచో నాయన జ్ఞాన మాహాత్మ్యము జెప్పనలవియగునా? చివరకు శాస్త్రోపదేశమునకు నాధిదైవికసంస్థ (ఈశ్వరుని) తో సంబంధము లేదు. ఇక మిగులునది అధ్యాత్మ సంస్థాధ్యక్షుడు జీవాత్మ.

జీవవర్గము అసంజ్ఞ - అంతస్సంజ్ఞ - ససంజ్ఞ భేదమున మూడు విధములు. 1. ధాతుజీవులు అసంజ్ఞలు, జడములు. 2. వృక్షాదులు అంతస్సంజ్ఞజీవులు. వీనియందు త్వగింద్రియమాత్రమునకే వికాసముకనుక వీరెండుతెగలు నుపదేశమర్యాదకు వెలియైనవి. కాగా ఇక మిగిలిన ససంజ్ఞజీవులయందును కృమి కీట పక్షి పశుమనుష్యులను పంచవిధములు. ప్రాధానికులు వీనిని. 'రజోవిశాలతిర్యక్సర్గ' మందురు. ఇందు నాల్గు మానస జ్ఞానప్రధానములు. మిగిలిన మనుష్యసర్గము మానసజ్ఞానముతోబాటుగ బుద్ధినికూడ ననుగమించును. మానస జ్ఞానమీమ 'ఆహార నిద్రాభయమైథునము' లను నాల్గుధర్మముల సంచాలనముతో సమాప్తము. ధర్మనామక బౌద్ధపదార్థము

నకు మానసజ్ఞానము ప్రధానముగాగల నాల్గు విధముల ససంజ్ఞ జీవులతో సంబంధములేదు కనుక నా నాలుగును ఉపదేశ మర్యాదకు వెలియైనవే. ఇక మిగిలిన మనుష్యవర్గ మొకటే. ఆధ్యాత్మిక జీవసర్గమందు స్వబుద్ధిచే కాసబలమున శాస్త్రోప దేశశ్రవణము - తదనుసారమగు విజ్ఞానము - చారిత్ర్యము అను వాని కధికారమున్నది కాగలదు. స్థావరజంగమ యోను లన్నిటను మనుష్యయోని యొకటే ఈశ్వరునితో తుల్యత సంపాదింప నడుముగట్ట జాలినది.

ఇందును ఐంద్ర - వారుణ భేదమున రెండు తెగలు. ఆయీ విషయము గీతావిజ్ఞానము మొదటి ప్రకరణమున వివరించితిమి. వేదత్రయీ ప్రతిమూర్తియగు కృష్ణమృగము స్వేచ్ఛగ సంచ రించు దేశము (భారతదేశము) పూర్వదేశము. ఇట సూర్యా త్మానుగామి యింద్ర ప్రాణమునకు ప్రాధాన్యము - ఇచటి వారైంద్ర మనుష్యులు. వీరాత్మధర్మానుగాములు. ఇటనే ఆత్మ శాస్త్రము ప్రకటమయ్యెను. అది ఐంద్రుల - ఆర్యుల ప్రాతిస్విక సంపత్తి. 'యస్మిన్ దేశే మృగః కృష్ణః తస్మిన్ ధర్మం నిబోధత' అని స్మృతియు వచించెను. పశ్చిమదేశము వరుణ ప్రధానము కనుక అచటివా రాత్మ ధర్మవంచితులు. వారి ప్రధానలక్ష్యము వరుణ (అప్) ప్రధానమగు స్థూలశరీరము - ఇచటివారి కాత్మ - వ్యాస - కపిల - కణాదు లాధ్యాత్మిక తత్త్వవేత్త లిటనే జనించి తమ భవిష్యదైంద్ర సంతతి కల్యాణార్థము, శారీరక ప్రాధానిక, వైశేషిక శాస్త్రనిర్మితి గావించి వీరి కౌన్నత్య మిప్పించిరి.

ప్రాకృతిక ప్రాణదేవతల సన్నివేశస్థితి తారతమ్యముచే నీదృశ్యేంద్ర మనుష్యులందును బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులను నాల్గు విభాగములున్నవి. ప్రాకృతిక యోగ్యతా ప్రభావముచే నిందును శూద్రవర్ణమాత్రోపదేశానధికారి. క్రమముగ తక్కినవా రుత్తమ - మధ్యమ - ప్రథమాధికారులు. కానిందు ఆ యావిషయము మరొకచో జూచుకొందుము.- ప్రస్తుతము:— ఆధ్యాత్మిక జీవవర్గమందు కేవలము మనుష్యనామక 'సంజ్ఞా' ధ్యాత్మికజీవులే శాస్త్రోపదేశ శ్రవణాధికారులు అనియే చెప్పదలచినది.

ఆధ్యాత్మిక సంస్థయందు స్థూల - సూక్ష్మ కారణము లను మూడు సంస్థలున్నవి. ఈమూటికి బ్రాకృతికములగు మూటితోడను సంబంధముకలదు. కనుక నాధ్యాత్మిక సంస్థల నిరూపణాశోభాటుగ గౌణముగ వానినిగూడ నిరూపింపవలసి యుండుచుండును 1. ప్రాకృతి కాధిదైవిక సంస్థనుండి యాధ్యాత్మికాధిదైవిక (కారణ శరీర) సంస్థయొక్కయు 2. ఆధిభౌతికము నుండి యాధ్యాత్మిక భౌతికము యొక్కయు (స్థూలశరీరము యొక్కయు) 3. ప్రాకృతికప్రకృతి తంత్రమునుండి ఆధ్యాత్మిక సంస్థయందలి యాధ్యాత్మిక (సూక్ష్మశరీర) సంస్థయు నిర్మాణము జరిగెను. కనుక నీమూడాధ్యాత్మిక సంస్థలనే మూడు దర్శనములును నిరూపించెను.

1. శారీరకము — ఆధ్యాత్మికాధి దైవిక సంస్థను 2. ప్రాధానిక మాధ్యాత్మి కాధ్యాత్మిక సంస్థను. 3. వైశేషికము -

ఆధ్యాత్మికాధిభౌతిక సంస్థను నిరూపించును. ఈమూడు సవినా భూతములు కనుకనే ఒకదానిని ముఖ్యముగాగొని తక్కిన రెంటిని గౌణములుగ వివరింపవలసి వచ్చుచుండును.

ఎట్లన — 1 వికృతి (స్థూలశరీర) తంత్ర నిరూపకము వైశేషికము. ప్రాధానిక తంత్ర సమ్మత ప్రకృతితంత్రమును, శారీరక సమ్మత పురుషతంత్రమును, 2. ప్రకృతి (సూక్ష్మశరీర) తంత్ర నిరూపకప్రాధానికము — వైశేషిక సమ్మత వికృతి తంత్రమును, శారీరక పురుషతంత్రమును, 3. పురుష (కారణశరీర) తంత్ర నిరూపకశారీరకము — వైశేషిక వికృతి తంత్రమును ప్రాధానిక పురుషతంత్రమును కూడ గౌణముగ నిరూపింపవలయును. ఎట్లయినను ఆధిదైవిక - ప్రాకృతిక - ఆధిభౌతికములను నీమూడు ప్రాకృతిక సంస్థలను ముఖ్యోద్దేశ్యములుగ నెంచి మూడుగానైన మన దర్శన శాస్త్రమీ తంత్రత్రయ కృతనిరూపాధ్యాత్మిక సంస్థనే నిరూపించును. కనుక దర్శనమును 'ఆధ్యాత్మికశాస్త్రమే' అందుము. చూడుడు గీతావిజ్ఞానమునందలి (పేజీ 170) ఈపరిలేఖ నవలోకింపుడు —

ఆధిదైవికసంస్థా (ఈశ్వరః) ఆధిభౌతికసంస్థా (విశ్వమ్)

ప్రాకృతికసంస్థా

సంబంధసూత్రమ్

ఆధ్యాత్మిక సంస్థావికాసః

1. కారణశరీరమ్ — ప్రజ్ఞామాత్రా - అధిదైవతమ్
   ఆధ్యాత్మికమ్. శారీరకశాస్త్రమ్

2. సూక్ష్మశరీరమ్ — ప్రాణమాత్రా - అధ్యాత్మమ్
ఆధ్యాత్మికమ్ — ప్రాధానికమ్.

3. స్థూలశరీరమ్ — భూతమాత్రా - అధిభూతమ్
ఆధ్యాత్మికమ్ — వైశేషికమ్.
తదిత్థం ఆధ్యాత్మిక పర్వత్రయనిరూపణ పరమాధ్యాత్మిక శాస్త్రమేవేదం త్రిధా విభక్తం దర్శనశాస్త్ర మితి పరామర్శో విదుషామ్.

గీతా, వేద, విజ్ఞానములం దుపనిషచ్ఛబ్ద నిర్వచనావసరమున ప్రతిశబ్దమునకు నేదోయొక యవచ్ఛేదక(భేదక) ముండితీరవలయు నంటిమి. తదాధారముననే యేశబ్దమైనను నియతార్థవాచక మగును. దర్శన విషయమునను ఇంతే. దర్శనశబ్దమున కవచ్ఛేదకము అధ్యాత్మవిద్యాత్వమేయగును. పంకజశబ్దము బురదయందు బుట్టియెద్దాని కేని వాచకము గావచ్చునైనను కమలమునందే రూఢ మయినట్లు - దర్శనశబ్దమును 'దర్శ్యంతే - విజ్ఞాప్యంతేరహస్య భావాయేన' అను నిర్వచనముంబట్టి వ్యాకరణ నిరుక్త న్యాయాదులను గూడ వచింపవచ్చును. అయినను అది అధ్యాత్మ విద్యయందే నిరూఢమయినది. అధ్యాత్మ విద్యాప్రతిపాదక శాస్త్రమే దర్శన మనబడును.

ఆధ్యాత్మిక సంస్థయందలి స్థూలములగు, అస్థిమాంస రుధిర కఫ లాలాది సామాన్యజ్ఞాన మందరకునున్నను, వీని వైజ్ఞానిక స్వరూపముల నందరు నెరుంగరు. ఈ స్థూలధాతు స్వరూపమన్నాహుతిచే నేవిధముగ నిట్లు సంపన్న మగుచున్నది?

ఎందెందెట్టియెట్టి కీటాణువులు, పరస్పర విరోధ పరోధములు కలిగియున్నవి? అన్నవి సాధారణులకు పరోక్ష విషయములు. మరియు, ప్రాణాది పంచవాయువులు, మనోవాగింద్రియ బుద్ధ్యాదులు, ఎన్నో నిగూఢ భావము లున్నవి. అట్టివాని సామాన్యజ్ఞానమైన నందరకు లేదు.

అధ్యాత్మశాస్త్ర మధ్యాత్మసంస్థయందలి యీగూఢతత్త్వములను, తన పరీక్షాదృష్టితో మనకు జూపును. కనుక అది దర్శనమనబడును. దర్శనమన చూచుట కాదు. చూపుట అని యిటనర్థముగ నెరుంగవలయును. పరీక్షించి యెఱిగిన విషయములను శబ్దరూప సామ్యజ్ఞానముద్వారా, చూపు శాస్త్రము 'దర్శ్యంతే జ్ఞాయన్తే నిగూఢాః సుసూక్ష్మాః ఆత్మధర్మా యేన' అనునిర్వచనముంబట్టి దర్శనమనబడును.

ఇట్టి దర్శన మీ యాధ్యాత్మిక నిగూఢ భావములను మూడుభాగములుగ మన యెదుట నుంచునని, మున్ను వివరించితిమి. – స్థూలసూక్ష్మ కారణశరీరము లను నీ మూడుప్రకరణముల విభాగములంబట్టి మూటియందలి నిగూఢ ధర్మవిశేషములను విభజించి చెప్పుటకు అధ్యాత్మ ధర్మప్రతిపాదన సేయునొకే దర్శనశాస్త్రము మూడు విభాగములుగ బరిణమించుచున్నది. ఆస్తికదర్శనము లారనుకొనుట నిర్మూలము. అట్లే శారీరక - ప్రాధానిక - వైశేషికములను మూటిని శాస్త్రశబ్దమర్యాదం బట్టి వేరువేరు శాస్త్రము లనుకొనుటయు నొకవిధముగ నసంగతమే. అధ్యాత్మ విద్యాశాసనమే, దర్శన

శాస్త్రసామాన్య లక్షణము. ఈదృష్టిచే మూడు నొకే శాస్త్రము. గ్రంథములు మూడైనను, ఉద్దేశ్య సమానతచే నొక శాస్త్రమనియే గణనము. ఆచార్యభేదముచే, మూడు పుస్తకములుగనున్న యొక శాస్త్రమునే మూడు శాస్త్రము లనుకొన్నచో వేదమునం దెన్ని శాఖలు, ఎందరు ఋషులు, ఎన్ని విషయములు? అగుగాక! వేద మొకటియే కదా! వేదత్వ మన్నిటను సమానముగదా! ఆచార్యభేదముచే వ్యాకరణము నకు, చాంద్ర - ముగ్ధ - సారస్వత - పాణిన్యాదికము లెనిమిది భేదములున్నవి. వానియం దొక్కొక్కటి కవాంతరభేదము లనే కములు, కాని వ్యాకరణశాస్త్ర మొకటేకదా?

పూర్వపక్షము:— "సమాన విషయకము లగుచో నెన్ని గ్రంథముల నెందరు రచించినను ఒకశాస్త్రమనుకోవచ్చును. కాని ఈమూడుశాస్త్రములందలి విషయములం దహోరాత్ర ములకున్నంత భేదములున్న వే. ఎట్లన:- ప్రధాన విషయములు. వైశేషికమునకు:— స్థూలశరీరము లేదా, ఆధిభౌతిక ప్రపం చము, ప్రాధానికమునకు:— సూక్ష్మశరీరము - లేదా, ఆధ్యా త్మిక ప్రపంచము, శారీరకమునకు:— కారణశరీరము లేదా - ఆధిదైవిక ప్రపంచము, ఇట్టిచో నివి యొకటే యనదగునా? యనుచో, — దీనికి:—

సమాధానము: వేదశాస్త్రము నెదుటబెట్టుకొంటిమి గదా? అందు:— బ్రాహ్మణములందు కర్మ, ఆరణ్యకములం దుపాసన, ఉపనిషత్తులందు జ్ఞానము, సంహితయందు పరస్పర సర్వథా

విభిన్నములగు విజ్ఞాన - స్తుతీ — తిహాసములు నిరూపిత ములు. అయినను వేదమొకటేగాని ఆరు కావుగదా? వేదవిష యము సర్వము, 'సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి' అని మనువచనము. కర్మజ్ఞానోపాసనలు, విజ్ఞానస్తుతీ తిహాసములు అను నీమూడు విష యములకు నావలనేమియులేదు. కనుక వీని నన్నిటినిరూపించు వేదము స్వశాస్త్రము, వేదమున కవచ్ఛేదకము సర్వవిషయ త్వము, ఈసర్వదృష్టిచే, భిన్నవిషయ నిరూపకమయ్యు వేద మొక్కటే శాస్త్రముగ నెన్నబడినది. అట్లే దర్శనశాస్త్రము నకును స్థూలసూక్ష్మకారణ శరీరప్రతిపాదకత్వము కాక, అధ్యాత్మప్రతిపాదకత్వమే అవచ్ఛేదకము, దర్శనశబ్ద మధ్యాత్మ విద్యయందే నిరూఢము, గాని అందలి యొకభాగమునందు కాదు. ఈదృష్టితో దర్శనైక్యత సిద్ధమగుచున్నది.

సర్వ ప్రతిపాదకమగు నొకే వేదశాస్త్రమున కవాంతర విషయభేదముచే సంహితా - బ్రాహ్మణ - ఆరణ్యక - ఉపని షత్తులను నాల్గు తంత్రములున్నట్లే, అధ్యాత్మధర్మ ప్రతిపాదక మగు నొకే దర్శనశాస్త్రమున కవాంతర విషయభేదముచే మూడు తంత్రములు వేరువేరుగ నుండుగాక! అయినను వైజ్ఞా నిక దృష్టిచే గూడ నిదే నిష్కర్ష. యెట్లన:— దర్శనశాస్త్రము నిరూపింపనున్న ఆత్మధర్మముకూడ మనఃప్రాణ వాగ్భేదముచే త్రితత్వము, అందలి మనస్తంత్రము శారీరకము, ప్రాణతంత్రము ప్రాధానికము - వాక్తంత్రము వైశేషికమును నిరూపించును. అస్తిలక్షణమగు నొకేయాత్మ త్రితంత్రమైనవుడు తత్ప్రతిపాదక

మగు నొక్కే దర్శనశాస్త్రమును తంత్రత్రయ యుక్తమగుట యావశ్యకము. మరల నిటనొక పూర్వపక్షము:— 'కానిండు. పైనిజెప్పినట్లు మూడు శాస్త్రములును స్థూలసూక్ష్మకారణ ధర్మములం దొక్కొకదానిని ప్రధానముగను తక్కినవానిని గౌణములుగను గాని నిరూపించుచున్నప్పుడు, మూటికి నేక శాస్త్రత సిద్ధము కావచ్చునుగాని యట్లును అగపడకున్నది. అన్ని విషయములందును వర్ణనశైలియందు మూటను భేద మపారముగా నున్నది. ఇంతయేల మొదట నాత్మ విషయము గైకొనుడు:— సాంఖ్య, మాత్మ ప్రతిశరీరభిన్నమనును. శారీరకము అభిన్నమనును. వైశేషికము - ఆత్మకారుగుణములనును. శారీరకము - అటుగాదని నిర్గుణమనును. మరియు నీమూడు శాస్త్రముల యుపక్రమోపసంహారములు వేరువేరుగా నున్నవి. ఇట్లనేక విషయములందు భేదము చూపవచ్చును. అట్టిచో నీమూడు నేకమనుటెట్లు?

సమాధానము:— ఆంశికముగ నిది నిజమే. కనుక నే మూడును భిన్నదర్శనములను నామం కల్గుట కవకాశము కల్గినది. కాని విజ్ఞానదృష్టికి విరోధమంత లెక్కలోనిది కాదు. ఆత్మధర్మముల దార్శనిక స్వరూపమునొకింత తడవటించి తదీయ వైజ్ఞానిక స్వరూపమువంక జూచుచో నివిరోధములు వానియంతట నవియే విలీనములై పోవును. ఎట్లన:— స్థూల సూక్ష్మకారణభేదముచే నాత్మధర్మము మూడు భాగములు. అయిన ఈత్రిపుటి పరస్పరమవినాభూతము. 'త్రయమేత

త్రిదండవత్' అను భైషజ్య సిద్ధాంతానుసారము వాతపిత్తకఫములను మూడు శారీరధాతువులు పరస్పర మవినాభూతము లైనట్లే యిచటను ఎంచవలెను. అందువలననే దర్శనమందలి మూడు తంత్రములందును ప్రతియొక తంత్రమును తన ప్రధానోద్దేశ్యనిరూపణతో కూడ తక్కిన రెండాత్మధర్మములనుగూడ గౌణరూపములుగ నిరూపణ జేయవలసిన యావశ్యకము కలుగును.

పురాణ ప్రతిపాద్య దేవతావాదమును విచారింపుము— 'సర్వదయాందలి గుణ్యన్నియు శంకరుతే' యన్నట్లు శివవిష్ణు దుర్గాకార్త్రమతాన్యది దేవతలన్నియు, నాయొకే బ్రహ్మ తత్త్వ సమానతంత్రములు—

"అహం బ్రహ్మా చ శర్వశ్చ జగతః కారణం పరమ్
ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయం దృగవిశేషణః
తస్మిన్ బ్రహ్మణ్యద్వితీయే, కేవలే పరమాత్మని
బ్రహ్మరుద్రౌ చ భూతాని భేదేనాజ్ఞోఽనుపశ్యతి
త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతిమధిగచ్ఛతి॥"

ఇందొకరికి గొప్పతనము మరొకరికి కొంచెతనము లేదు, ఈ దేవతల సందర్భం ప్రతిపాదించు పురాణోప పురాణతంత్రములు, వేరు ను, ఒకటే పురాణశాస్త్రము. శివపురాణమందు శివునకు, విష్ణుపురాణమున విష్ణువునకు, దేవీభాగవతమున జగన్మాతకు ప్రాధాన్యము, తక్కినవారికి గౌణభావము. ఈ

గౌణ ముఖ్యభావము మరచినచో నుపాసనాకాండకు జెందిన దేవతావాదము ఎన్నడును సురక్షితము గాజాలదు.

మనః స్థిరతకొరకు దేవతయం దనన్యత సంపాదింపవలయును. తనకువచ్చినది, సర్వోత్కృష్టమనుకొనుట మనోధర్మము. అన్ని విభూతులు నందరకు నచ్చవు. అన్నిటి నందరు నుపాసింప జాలరు గదా! ఉత్కృష్టముగ భావించినదానివంకకు వంగుట చిత్తస్వభావము. అట్టిచో పురాణశాస్త్రము గౌణముఖ్య భావముగొనిగాని లోకసంగ్రహ మాచరింప వలనుగాదు. పురాణములందలి దేవతాప్రాధాన్య విరోధము మనకుగల్యాణ కారణమేకాని మరొండుకాదు. ఈవిరోధము నాధారముగ గొనియే మనము లక్ష్యముం జేరనేర్తుము. ఇట్లు— ఆయా దేవతాభక్తుల కాయా దేవతామాహాత్మ్యములను ప్రాధాన్య ములుగను తక్కినవాని మహిమలు గౌణములుగను జూపి వర్ణిం చుట యావశ్యకమే.

ఉపాసకులు తమతమ యుపాస్యదేవతలం దనన్యభావ ముంచుకొని యాయా దేవతల యశోగానము జేసికొన్నంత వరకు వారుసరియైన మార్గమందున్నవారే యగుదురు. కాని, మూర్ఖతచే నితరులయుపాస్య దేవతానింద సేయుట ప్రాయ శ్చిత్తభాగు లగుటకే. ఇట్టి నరరాక్షస ప్రక్షిప్తములే పురా ణములందలి దేవతానిందలకు జెందిన వచనములని యెరుంగ వలయును. సంప్రదాయాభినివిష్టతయే పిమ్మట వారిచే నింత పని చేయించినదికావలయు ననుకొందుము. కానిండు, పర

మార్థతః పురాణములందు గౌణముఖ్యదృష్టిం బట్టి విరోధము లేనట్లే దర్శనములందును విరోధములులేవనియే చెప్పదలచినది. దార్శనిక దృష్టికి విరోధముతోచిన దోచుగాక! మరియు— ఇంకొకవిధముగ నీవిషయమునే చూతము:

శుక్ల - రక్త - కృష్ణ వర్ణములుగల మూడద్దములంగొని కంటియొద్ద తెల్లని యద్దముంచికొని తక్కిన రెంటిని జూచి నపుడు తక్కిన రెంటి రూపములు నున్న వున్నట్లుగనే తోచును. ఇది మొదటిదగు శారీరకదృష్టి యనుకొనుడు ఇక:— ఎఱ్ఱయద్ద మునుండి చూచుచో కడమ రెండును (అందు ముఖ్యముగ తెల్లది) ఎఱ్ఱగనగపడును. ఇది రెండవదగు ప్రాధానికదృష్టి. పిదప:— నల్లయద్దమునుండి చూచిన కడమ రెండును నల్లగనే యగపడును. ఇదిమూడవదగు వైశేషికదృష్టి.

సత్త్వము తెలుపు - రజస్సు ఎఱుపు - తమస్సునలుపు. కారణాత్మధర్మములు సత్త్వప్రధానములై శుక్లమునకు; సూక్ష్మ శరీరమునకు జెందిన యాత్మధర్మములు రజఃప్రధానములై రక్తవర్ణమునకు; స్థూలశరీరమునకు జెందిన యాత్మధర్మములు తమఃప్రధానములై కృష్ణవర్ణమునకు స్థానీయములై యీ మూడును సోపాధికములై యున్నవి.

విశుద్ధాత్మయన్ననో గుణాతీతము. సత్త్వాది గుణములు మూడును గుణమయ ప్రకృతికి జెందినవి 'త్రిభిః గుణమయైః భావైః' 'అజామేకాం లోహిత శుక్లకృష్ణాం' అన్నట్లు ఆయజ యీశుక్ల లోహిత కృష్ణభావాత్మికయు త్రిగుణయు నగు ప్రకృతియు కన్యై

తాను త్రిమూర్తియగు చున్నది. ఈమూడు గుణములం దును సత్త్వగుణము నిర్గుణాత్మకు సమీపతమము. ఇదే శారీరక ముఖ్యప్రతిపాద్యము. తద్దృష్టి శుక్లసత్త్వముపై నున్నది. కనుక నది శుద్ధాత్మనిర్గుణమని చెప్పెను. రజోగుణము సగుణ (విశ్వ) ఆత్మకు చెందినది. ఈదేహాభేదము దేహాభిమాని యగు చున్నది. ప్రాతిభాసిక ముఖ్య లక్ష్యమిదే. ఇక మాయా చక్షుః పటలము ద్వారా శుక్లకృష్ణములపై దృష్టి నిగుడించును కనుక దీనిచే నాత్మతత్త్వము సగుణభావమే యెక్కువ కనబడును. ఇక:- తమోగుణము ప్రత్యగవచ్ఛిన్నాత్మకు చెందినది. ఇది వైశేషిక ముఖ్యలక్ష్యము. ఈదృష్టితోడనే ఇది యాత్మను ద్రవ్యమన్నది. అదియథార్థముగదా! ఇట్లు ఆయాదర్శనము తన తన ముఖ్యాత్మలక్షణములను వచించుట సర్వథాయథార్థమే యగుచున్నది. అందువలననే ఈమూడును వేర్వేరు తంత్రములా? అని తోచుచున్నది. కాని ఆత్మత్వముంబట్టి ఈమూటి ధరాతలమును సమానమే యనవచ్చును. ఈమూడు నొకేయాత్మకు గుణాత్మక రూపములు. మొత్తముపై నీమూడు నాత్మతంత్రములు. తత్ప్రతిపాదితాత్మ ధర్మములందు విలక్షణతయు భేదము నుండగాక! ఆచార్యభేదముండుగాక! అందు వలన వర్ణనశైలియందు భేదముండుగాక! విజ్ఞానదృష్టికివి యభిన్నములే.

ఇక "మూడాత్మధర్మములును వేరు వేరుగ దోచుచుండగ - ఆత్మత్వముచే మూటికి నేకత్వమెట్లు? ఒకే ఆత్మకు స్థూలసూక్ష్మ కారణ భేదములనే మూడు ధర్మము లెట్లు ఘటిల్లె?" నన్నచో-

సమాధానమునకు:— విజ్ఞానదృష్టినే శరణము గొనవలయును దార్శనిక సంప్రదాయమందు ఆత్మ యనబడు తత్త్వమునకు విజ్ఞానసంప్రదాయమందు మూడు వివర్తములు. ప్రకారాంతరమున నాత్మలుమూడనియు జెప్పవచ్చును. అవి క్రమముగ:— పురుషాత్మ - ప్రాకృతాత్మ వికృతాత్మ యనబడును. 1. అవ్యయాత్మ (యను పురుషాత్మ) - 2. అక్షరాత్మ (యను ప్రాకృతాత్మ 3. క్షరాత్మ (యను వికృతాత్మ. ఈమూడాత్మతత్త్వములే యుపనిషత్తులందు క్రమముగ 1. భూతేశః 2. భూతభావనః 3. భూతయోని యను పేరులం బరగినవి. అందు:

1. భూతయోని క్షరాత్మ - వికృతాత్మ —

విశ్వము వైకారికము, దీని కుపాదానము క్షరము లేక ఆత్మ క్షరము. స్వాత్మవిశ్వదృష్టింబట్టి యీ క్షరమవ్యక్తము నూతన వికారోత్పత్తి జేయుచున్నదే దీనినుండి వికారములు క్షరితలగుటచేనిది క్షరమనబడును. మృత్తునుండి ఘటశరీరాదులు లోహమునుండి త్రుప్పు సువర్ణమునుండి కటక కుండలాదులు దుగ్ధమునుండి మీగడ దూదినుండినూలు వలె నిచ్చుటను క్షర - వైకారిక విశ్వమునకు కార్య - కారణభావములు నెంచవలయును. కాని మృదాదికార్య కారణభావములు నశ్వరములని జ్ఞప్తియందుంచుకొనవలయును. ఎట్లన — కార్యనిర్మితివలన నిట కారణలోపము కలుగును. కాని క్షరమునుండి యెన్నివికారములు కల్గినను అదియెప్పటి యట్లేయుండును. కనుకనే బ్రహ్మశబ్దవాచ్యమగు నీక్షరముం

గూర్చి "ఏష నిత్యోమహిమా బ్రహ్మణో నకర్మణా వర్ధతే నో కనీయాన్" అని చెప్పబడినది. ఈయవికృత పరిణామవాదముం బట్టి ఈ క్షరము పరిణామియయ్యు నాత్మక్షరమని చెప్పబడినది. ఆత్మ నిత్యము. వికారోత్పాదనము గావించినను అవికృతముగ నుండును. ఇదే దీని యాత్మత్వము. కారణమే (ఉపాదానకారణమే) కార్యమునకు బ్రతిష్ఠ. విశ్వోపాదానముక్షరము ఉత్పన్న విశ్వము ఆక్షరమే ప్రతిష్ఠగానుండును. లేదా దానిస్వరూపమే యుండజాలదు. ఈయవినాభావకారణ కారణముననే భూతములనుగూడ క్షరమనివ్యవహరించిరి. 'క్షరః సర్వాణిభూతాని' వ్యక్తవిశ్వ మవ్యక్తక్షరముతో నిత్యసంబద్ధము కనుకనీదృష్టితో విశ్వముంబట్టి యవ్యక్త క్షరమును వ్యక్తమనియునందురు.

నిష్కర్ష — కృతినామక కార్యమునకు బ్రథమావస్థయే ప్రకృతి. భూత - భౌతిక విశ్వమునకు బ్రకృతిరూపమును పరిణామియునగు నవ్యక్తతత్త్వవిశేషమే మొదటిదగుక్షరాత్మ - వికార సంశ్లిష్టమగుటచే దీనినే వికృతాత్మయందురు. భూతములకు గారణము కనుక నిది భూతయోని. చర్మచక్షువులతో భౌతిక విశ్వమునే చూడగలము గాని తదాలంబన మగు నీ యాత్మక్షరము నరయజాలము కనుక దీని నవశ్య మవ్యక్త మందుము.

## 2. అక్షరాత్మ - ప్రాకృతాత్మ - భూతభావనః —

ఘటాదినిర్మాణములం దుపాదానకారణమగు మృదాదుల చేతనే పనిజరుగదు. కుంభకారాద్యసమవాయి కారణములు

గూడ నుండవలయును. అనమవాయి కారణమునే నిమిత్తకారణ మందురు. ఇదే నిర్మాత. నిర్మాత తనబొద్ధ జగత్తునందు మొదట భౌతికవస్తువును భావించి తదాధారమున తదుపాదాన (కారణ) ముంగొని యా వస్తునిర్మాణముం గావించును. భూతభావనా కారణముచే నిర్మాత భూతభావనుడనదగును. ఈపని యక్షరునిది. విశ్వనిమిత్త కారణమతడే. ఆదాన విసర్గ ప్రతిష్ఠామూర్తి కనుకనే త్ర్యక్షరమూర్తియను నతడే తనభావనచే క్షరముద్వారా నైకాంక విశ్వనిర్మితిం గావించును. మట్టి ఘటముతో బద్ధమై యుండునట్లు క్షరమే విశ్వసంబద్ధమై యుండును. నిమిత్తకారణమగు నిర్మాత విశ్వబద్ధుడుగాక యసంగుడుగనే యుండును. ఘటనిర్మాతయు ఘటమునెడ నంతేగదా! క్షరమువలె నక్షరమును ఇంద్రియముల కగోచరమగుటచే నవ్యక్తమనియే యందుము. క్షరకూటమునం దేకరూపమున బ్రతిష్ఠనొంది యుండుటచె కూటస్థుడనియు జెప్పబడును "కూటస్థో౽క్షర ఉచ్యతే".

ఘటనిర్మాణ ప్రక్రియయందు కుంభకారుడు మృత్తికయునే గాక మరి రెండు విధముల ధరాతలము లుండవలయును. 1. ఆలంబనరూప సుస్థిర ధరాతల మొకటి - 2. దానిపై స్థిర కీలమునం దరుగు చక్రరూపచలిత ధరాతల మొకటి. మొదటిదగు స్థిరధరాతలము నిమిత్తకారణమగు కుంభకారునకు, ఉపాదాన కారణమగు మృత్తికకు, చలిత ధరాతలమునకు మృణ్మయపాత్రకు వేయేల అన్ని కారణకార్య భావములకును

ప్రతిష్ఠయై యున్నది. కనుక నిది సర్వాలంబనము, శ్రేష్ఠాలంబ నము అందుము. చలిత ధరాతలము ఘటనిర్మాణ ప్రక్రియకే ఆలంబనము. ఆలంబనత్వము మట్టి రెండును ఘటనిర్మాణ ప్రక్రియయందొకేతరగతికి జెందినట్లున్న నుండుగాక! ఘటము భూతము, మట్టి భూతయోని, కుంభకారుడు భూతభావనుడు. ఆయీ భూతప్రపంచమున కంతటికి ఈశ నుసదగిన యాలంబన మదే. కనుక దానిని భూతేశు డనవచ్చును.

విశ్వసృష్టి ప్రక్రియయందు నిదే వరుస. 1. కార్యమగు భౌతికవిశ్వము ఉపాదాన కారణమగు భూతయోని క్షరము. నిమిత్తకారణమగు భూతభావ నాక్షరము ఈమూటికి నతీతము కనుకనే కార్యకారణాతీతమగు నవ్యయము. అందు నిందు అవ్యయమే ఆలంబనము. దీనికి ముక్తిసాక్షి - సృష్టిసాక్షి యను రెండురూపములు. అనంతవిజ్ఞాన మనోమయ విద్యా మూర్తియగు నవ్యయము ముక్తిసాక్షి. ఇయ్యది సుస్థిరమగు నాలంబనము. మనఃప్రాణ వాఙ్మయ కర్మమూర్తియగు నవ్య యము సృష్టిసాక్షి. ఇయ్యది చలిత ధరాతలము, విద్యజ్ఞానము. అదిస్థితి. కర్మగతి. స్థితిరూపావ్యయము సర్వమునకు, గతి రూపావ్యయము విశ్వమునకు ఆలంబనములు.

గతిరూపావ్యయునకు మనః ప్రాణవాక్కులను మూడవ యవములుగదా! వీనినుండి క్రమముగ జ్ఞానక్రియార్థములను మూడుశక్తులు వికసిల్లును. ఇందు జ్ఞాన మవ్యయునందు, క్రియ అక్షరునందు, అర్థము క్షరునందును ప్రధానములు. ఇట్లు

అవ్యయుని వాక్శక్తిం గొని క్షరమర్థశక్తి కుపాదాన మగుచున్నది. అవ్యయుని క్రియాశక్తిం గొని యక్షరుడా యర్థశక్తిని సంచాలనము చేయుచున్నాడు. స్వయముగా నవ్యయుడు తన జ్ఞానభావముచే నన్నిటికి బ్రభువై యున్నాడు. ఇట్లు ఈ యుభయవిధ ధరాతల రూపభూతేశ నామక మగునది మూడవదగు నాత్మ వివర్తము.

ఈవిధముగ త్రిగుణభావమయ మహామాయానుగ్రహమున నొకే నిర్గుణ పరాత్పరాత్మ సత్త్వరజస్తమో భేదమున గ్రమముగ ఆలంబన నిమిత్తోపాదాన రూపమున బరిణమించి యవ్యయాక్షర క్షరరూపములం బరిణతి నందుచున్నాడు. అవ్యయుడు మనోమయుడు, అక్షరుడు ప్రాణమయుడు, క్షరుడు వాఙ్మయుడు. మూడు స్వతంత్రతంత్రములు. మూవురు తంత్రాయులు. మూవురి మొత్త మొకయాత్మ - అదే జ్ఞానతంత్రముం బట్టి నిర్గుణమై విశ్వాతీతమగును. కర్మతంత్రముంబట్టి సగుణమై విశ్వాత్మయగును. అర్థతంత్రముంబట్టి సాంజనము సావరణమునై విశ్వమూర్తి యగును.

నిర్గుణ భావముంబట్టి యాత్మ:— కర్తకాదు, కార్యము కాదు, కారణముకాదు అనవచ్చును. సగుణభావముంబట్టి:— కర్త, కారణము, అసంగము అనవచ్చును. సాంజనభావముంబట్టి:— విశ్వము అనవచ్చును. విశ్వాతీతమునదే - విశ్వాత్మయునదే - విశ్వమునదే - మూటి స్వరూపములు నెంతో విలక్షణములు! ఒకేదాని వివర్తములు! ఆహా! 'సవిశ్వమూర్తే రవ

ధార్యతేవపుః'

ఇట్టిచో నొక వివర్తముం బ్రధానముగాఁగొని చెప్పు తంత్రములు భిన్నములెందుకుకావు? మూఁడు తంత్రముల ప్రతివాద్యములును వేరువేరాయెఁ, గదా! ఎట్లన:— శారీరకము:— జ్ఞాన ప్రధానమగు నవ్యయ తంత్రమును, ప్రాధానికము:-కర్మప్రధానమగు అక్షరతంత్రమును, వైశేషికము:— అర్థప్రధానమగు క్షర తంత్రమును, లేదా, శారీరకము:— ఆధ్యాత్మికమందలి యాధిదైవికప్రపంచమగు నవ్యయాత్మను, ప్రాధానికము:-ఆధ్యాత్మికమందలి యాధ్యాత్మిక ప్రపంచమగు నక్షరాత్మను, వైశేషికము:- ఆధ్యాత్మికమందలి ఆదిభౌతిక ప్రపంచమగు క్షరాత్మను నిరూపించును. కనుకనే మూఁడు నొకే దర్శనశాస్త్రము, లేదా, ఒకేఆత్మశాస్త్రమునకు మూఁడు వివర్తములు, అందము. ఇట్లన్నివిధముల నీమూఁడు నొకటేయనుట యత్యుత్కృష్ణము.

ఇక:— నీమూఁడు వివర్తములను మూఁడు తంత్రములందు నిరూపించిన పద్ధతులను దార్శనికదృష్టితోఁగాక వైజ్ఞానిక దృష్టితోఁడనే చూతము. కారణము? దార్శనిక దృష్టిగల వ్యాఖ్యాతల విఫలప్రయత్నములు, ఖండన మండనములంబెంచి సత్యమార్గమును మరుగుపరచినవి. కనుక వానివలన వివాదములేగాని వాస్తవికపరిస్థితి గోచరింపదు. ప్రస్తుతము, స్థూలారుంధతీ న్యాయముంబట్టి వైశేషికముం జూతము. ఈదృష్టితోఁజూచుట వలన దార్శనికుల యాత్మ స్వరూపముగూడ చక్కఁగా బోధపడును:—

# వైశేషికాత్మ

క్షరతత్త్వప్రతిపాదనపూర్వకముగ భూతప్రపంచము (పదార్థవిద్య - మెటీరియల్ సైన్సు)ను జెప్పుట వైశేషిక ప్రదానపు బనియని మున్ను చెప్పియుంటిమి. ఉద్దేశ్య విధేయము లన్నవి ఈతంత్రమునకేగాక మూడుతంత్రములకును జెందియుండును. ఈ వైశేషికమునకుద్దేశ్యము వైకారికవిశ్వము, విధేయము:— పరిణామియగుక్షరముతో గూడిన అపరిణామియక్షరము, క్షరముచే వికారము, వికారముచే విశ్వసృష్టి, దానిచే పంచజనము - దానిచే పురంజనము - దానిచేస్వాయంభూ - పరమేష్ఠి - సూర్య - చంద్ర - పృథువులను పంచ భౌతికపురములు నుత్పన్నములగును. ఈ పంచకముల మొత్తము విశ్వము. వీని కన్నిటికి మూలమాత్మక్షరము- కనుక దీనికి విశ్వముతో సంబంధము గలదనవలయును.

ఈ దృష్టితో 'క్షర - వికార - విశ్వసృట్ - పంచజన - పురంజన - పురము లను నారు క్షరవివర్తములొక స్వతంత్ర విభాగము. పరిణామి యగునది క్షరమే కనుక నివి క్షరవికారములే. అయినను యీ క్షరపరిణామవాద మవికృతపరిణామ వాదమే. ఎన్నివికారము లుత్పన్నములైనను నిది యేకరసముగనేయుండి యక్షరశ్రేణి సమావిష్టమైయున్నది కనుక నీ క్షరమక్షరశ్రేణ్యాంతర్భూతమనియు నెంచబడును. ఇందువలన నక్షర క్షరములొక స్వతంత్ర విభాగమగును. అక్షరుడటు, 6 భాగములగు వికార ప్రపంచమిటు, - మధ్యక్షరము, (ఆత్మక్షరము)

దేహళీ దీపన్యాయమున దీని కారెంటిసంబంధము నంగీకరింప వచ్చును. ఇందువలన క్షరము — విశ్వోత్పత్తి క్షణముం బట్టి విశ్వానుగతమై విశ్వమూర్తి యగును. వికారరాహిత్య క్షణముంబట్టి విశ్వబహిర్భూతము నగును.

అక్షరము విశ్వమునకు నిమిత్తకారణము. కారణత్వముచే క్షరాక్షరము లొకశ్రేణివే యనుకొనవచ్చునైనను విశ్వకార్యో పాదాన భూతక్షరము విశ్వబద్ధమగును. కనుక దానిని విశ్వ మర్యాదా బహిర్భూతము గావింపజాలము. ఏమి? అక్షర యుక్తక్షరము కారణము. విశ్వముకార్యము. ఇక కారణమే కార్యమున కాత్మయగును కనుక అక్షరక్షరు నాత్మయనియు విశ్వముదీని కాయతనమనియు ననవచ్చును. 'తత్సృష్ట్వా తదే వానుప్రావిశత్' అన్నట్లు అక్షరక్షరము కార్యవిశ్వమును త్పా దించి యందు ప్రవిష్టమగును. ఈయాత్మ - విశ్వము నను రెండును, బిమ్మట సామాన్య విశేషభావములచే రెండేసిభాగములు నగును.

భౌతికవిశ్వము వలన ప్రాణుల స్థూలశరీరము నిష్పన్న మయ్యెను. ఇది విశేషవిశ్వము. ఇందుండు నాత్మయు విశేషమే. అది జీవాత్మయనబడును దీని విశేషవిశ్వమును శరీరమందురు. ఇట్లే సంపూర్ణవిశ్వము సామాన్యాత్మకు శరీరము. ఆసామా న్యాత్మ ఈశ్వరుడు - ఈవిధముగ ఈశ్వర - విశ్వములు సామాన్య భావములు. జీవ - శరీరములు విశేషభావములు. ఈరెండు జంట లందును ఈశ్వర జీవులు సమానులు ఇదియాత్మవర్గము. విశ్వ - శరీరములు సమానములు. ఇది భూతవర్గము. జీవుడా సామా

న్యాత్మయంశము. శరీరమా సామాన్య భూతప్రపంచ విశ్వాంశము. ఈవిశేషభావమే అధ్యాత్మ సంస్థకు దుఃఖకారణము. జీవుడు తనయొక్కయు - తనశరీరముయొక్కయు వాస్తవిక స్వరూపము నెరుంగుచో నతనిదృష్టి యా సామాన్య పరమాత్మ భావమునకు సాగుటయు, దుఃఖము నివృత్తమగును. ఈ*తంత్రోద్దేశ్యము విశేషభావము కనుక దీనిని వైశేషికమని వ్యవహరించిరి.

జీవుడు - స్థూలశరీరము ఉద్దేశ్యకోటిలోనివి. ఈశ్వరుడు విశ్వము - విధేయ కోటిలోనివి. లేదా ఉద్దేశ్యము భూతప్రపంచము విధేయమాత్మ అనియు ననవచ్చును. శరీరస్వరూపముం జెప్పితత్సంబంధమున భౌతిక విశ్వముయొక్క సాధర్మ్యవైధర్మ్యలందెలిపి మహద్వ్యాప్త మా యక్షరమూర్తి యగు నాత్మవంకకు ద్రిప్పుట యీతంత్రపుపోక. విశేషమును లక్ష్యముగాజేసి సామాన్యమువంకకు గొనిపోవుట, విశేషము నుద్దేశ్యముగ నెంచి యచట సామాన్యమును విధించుట, స్థూలశరీరము నుద్దేశ్యముగా జేసి ఆత్మను విధేయముగా గణించుట ఈతంత్రనిష్కర్ష.

ఇది సామాన్యము వంకకు బోవుచున్నది. కాని విశ్వము నుద్దేశ్యముగా బెట్టుకొని, కారణము? వైశేషికాత్మచివరకు క్షరమందే విశ్రాంతి గాంచెను. ఈవిషయ మిపుడే విశద మగును. అన్నిటికిముందీతంత్రము నుద్దేశ్యమును బరీక్షించెను. భూతప్రపంచ

---

* ఈ తంత్రమున ఒక జీవునకు బుద్ధి - ప్రయత్న - సుఖదుఃఖ - ఇచ్ఛా - ద్వేష - ధర్మ - అధర్మములు - అను 8 గుణములున్నవి.

ముద్దేశ్యము, పరీక్ష తత్తద్ధర్మములకు జెందినది. పదార్థము ధర్మి-ధర్మమే పదార్థ పదార్థత్వము. అగ్ని యొక పదార్థము. తాపము దానిధర్మము. అదియుండునంతవరకే దానియునికి. జగత్తునందలి ప్రతిపదార్థమును ధర్మమర్యాద్రాక్రాంతము. పదార్థ స్వరూప జ్ఞానమునకు దానివిశేష ధర్మముల నెరుంగుట యావశ్యకము. ధర్మ పరీక్షయే పదార్థపరీక్ష. అంతకంటె పదార్థమందు అనగా ధర్మియం దెరుంగదగినవిషయ మేముండును? ఇట్టిచో నీతంత్రము గూడ ధర్మమునే మొదట బరీక్షింపవలయును కనుక నే మొదట "అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః" అనియెను. ధర్మమన నేమన "యతోఽభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిః సధర్మః" అని సూత్రము వెలియించెను. అభిప్రాయ మేమనః:-

మనుష్యులం దెవ్వడును, నిత్యము ధర్మాక్రాంతుడే. ఏవిష యమైనగాని నిర్ధర్మక మగునది లేదు. విషయగత ధర్మసహ యోగ ముండియు ప్రాణి అభ్యుదయ నిశ్శ్రేయస వంచితముగ నున్నది. అందువలన మనము ధర్మ మనుకొనునది ప్రాతిస్వక మగు నాత్మధర్మ విరుద్ధమై అధర్మమై యున్న దనుకొనవలసి వచ్చుచున్నది. ఇందుకు గారణము? పదార్థ ధర్మ వివేకాభా వము. ఏధర్మమునకు - ఏపదార్థమునకు ఎట్టి ఎట్టి సంబంధము లున్నవి? ఎట్టి ఎట్టి వైషమ్యము లున్నవి? మన కేది యుప కారము? ఏది నాశకము? అను వివేకము లేక మనయాత్మ ధర్మ ములను బాధసేయు కర్మలను - విషయములను ధర్మభ్రాంతిచే స్వీకరించుచున్నాము. ఇట్టి పదార్థధర్మము లెన్నడును ధర్మ

ములు గాజాలవు. కారణము? "ధర్మిణాధృతః సన్ ధర్మిణం స్వస్వరూపే స్థాపయతి సధర్మః" అన్నట్లు ధర్మమనః— ధర్మిచే ధృతమై దానిస్వస్వరూపమున నుంచునదే. అటుగాని దధర్మమే యందుము. ఆగంతుకమగు నియ్యధర్మము అభ్యుదయ నిశ్శ్రే యసములకు బదులు - ప్రత్యవాయ - అవనతులకు గారణ మగును. కనుక నిజమగు ధర్మము నెరుంగుటకు పదార్థ సాధర్మ్య వైధర్మ్యములను బరీక్షింపవలయును. ఏధర్మము శ్రేయము? ప్రేయ మేది? యని యన్వేషింపవలయును. అందు కేమి కర్తవ్యము?

'ధర్మవిశేషప్రసూతాద్ ద్రవ్య - గుణ - కర్మ - సామాన్య - విశేష సమవాయానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిఃశ్శ్రేయసమ్' ఈ తంత్రోద్దేశ్యము విశేష భావముం దెలియ జేయుటగదా 'ధర్మవిశేష ప్రసూతాత్' అని దానినే సమర్థించు చున్నది. అక్షరయుక్త పురాత్మయొక్క కొన్ని విశేషధర్మ ములే యీభూతప్రపంచకారణములగును. ఆత్మయన అస్తిలక్షణ మంటిమి గదా! అస్తిభావము సామాన్య విశేషభేదముచే రెండువిధములు. విశేషోపాధి రహిత విశుద్ధసత్తా బ్రహ్మసామా న్యము "అన్యత్రధర్మా దన్యత్రాధర్మాత్, అన్యత్రాస్మాత్కృ తాకృతాత్ అన్యత్ర భూతాద్ భవ్యాచ్చ" అన్నట్లు సామా న్యము, వ్యాపకము, ఏకరూపము నగునిరుపాధిక సత్తాలక్ష ణముగల యాత్మ ధర్మా - ధర్మకృతాకృత భూత భవిష్యత్ - కార్యకారణాది సర్వద్వంద్వములకు నతీతము. దీనినుండి

ద్రవ్యగుణాదిరూప భౌతికప్రపంచ ప్రసూతియెన్నడు గలుగ జాలదు. ప్రసూతియనసృష్టి - దానికి బీజము కామము - ఇచ్ఛ. అది మనో వ్యాపారము, మనస్సు హృదయ ప్రతిష్ఠితము. హృదయభావము సీమాభావమునకు జెందినది - సీమ మహా మాయకు జెందినది. అదియే సామాన్యము, వ్యాపకమునగు బ్రహ్మను విశేషభావమున (పరిచ్ఛిన్నభావమున) బరిణతి నొందించును. ఈపరిచ్ఛిన్నాత్మధర్మము నుండియే (అక్షరయుక్తక్షరధర్మమునుండియే) ద్రవ్యాదులు ప్రసూతములైనవి.

ప్రకారాంతరముగ:— ఈ తంత్ర పరిభాషానుసార మణువునే విశేషమందురు. ఇదే పదార్థములం దన్యోన్య విశేషము నుత్పాదించును కనుక నదివిశేషము. అణువునకు మూలమక్షర యుక్తక్షరమే. కనుక నదే విశేషధర్మము. అదే పూర్వోక్త విధముగ ద్రవ్యాద్యుపాదాన కారణము. ఈధర్మవిశేషము (అక్షరయుక్తక్షరము లేదా, అక్షరయుక్తక్షరాత్మ కాణువు) నుండి యుత్పన్నములగు ద్రవ్యాది షట్పదార్థముల సాధర్మ్య వైధర్మ్య పరిజ్ఞానము వలననే మన మాత్మకల్యాణాను గాములము కాగలము అని సూత్రతాత్పర్యము.

అందువలన సావధానుల మగుదుము. కనుక ఈవిషయము ఈ కర్మ ఆసక్తివలన బంధనకారణము వేరా అభ్యుత్థాన కార ణము అగు నను బోధకల్గును. అందువలన శ్రేయ (హితకర) ప్రేయ (రుచికరము, హానికరము) భేదమున రెండువిధము లగు పదార్థములందు అభ్యుదయ నిశ్శ్రేయసములను గోరు

వాడు శ్రేయముం గ్రహించి ప్రేయముం ద్యజించును. ఈ శ్రుతివచనముం జూడుడు:— "అన్యచ్ఛ్రేయోఽన్య దుతైవ ప్రేయ స్తే ఉభేనానార్థే పురుషంసినీతః (వృణీతే) తయోః శ్రేయ ఆదదానస్యసాధు భవతి. హీయతేఽర్థాద్య ఉ ప్రేయో, "శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః, "శ్రేయోహిధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయోమందో యోగక్షేమాద్వృణీతే"

ఈతంత్రమూల మీసూత్రము. ఉద్దేశ్య విధేయములిందే స్పష్టీకృతములు. అందలి యారుపదార్థములును భౌతికములు, క్షరరూపములు. ఇవి యుద్దేశ్యములు, వీని పరిజ్ఞానమువలన నిశ్శ్రేయసభావము గల్గించునది విధేయము లేదా:— పదార్థ జ్ఞానానంతరము జీవాత్మకు లభించునదే విధేయము.

ఈమూడు సూత్రముల వలనను ఈతంత్ర నిర్మాణశైలి విషయముం గూర్చి ఒకనిశ్చయముం జేయవచ్చును. ఎట్లన:- 1 ఆత్మేతరోత్పన్న ద్రవ్యగుణాది షట్పదార్థ నిరూపణము మొదటి పని. 2. భూతవర్గానుస్యూతాక్షర విశిష్టపురుషు నాత్మయని చెప్పుట రెండవది. 3. ఆత్మను జీవ-పరమాత్మ భేదమున రెండుభాగములుగ నెంచుట మూడవది. ఇట్లు వైశేషికదృష్టి యందు క్షరాక్షర విశేషతత్త్వమే ఆత్మ. క్షరాక్షరాతీతావ్యయ పురుషునిపై దీనికి దృష్టిలేదు. [illegible] ప్రకరణమునందలి యాత్మలక్షణము వలననే తెల్లమగును. [illegible]ణ్యాము శరీరభిన్నత - సిద్ధముచేయు నీకణాదసూత్రము గనుడు.

"ప్రాణాపాన నిమేషోన్మేష జీవన మనోగతీంద్రియాంతర
వికారాః, సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నాశ్చాత్మనోలింగాని"

ఇవి యాత్మధర్మములట! వాస్తవముగ-నివియన్నియు నక్షర విశిష్టక్షర ధర్మములు. గీతాసిద్ధాంతానుసార మీ క్షరాక్షరములు ఆత్మకంతరంగప్రకృతులు. అవ్యయాత్మకు ఈధర్మములతో నేమియు సంబంధములేదు. కనక అక్షరవిశిష్టక్షరమే వైశేషికాత్మయగును. కొంచెముసేపు క్షరము విశ్రాంత ర్యాత మనుకొన్నను అప్పుడు గాఢనిద్రలోనైనగా నక్షర ప్రకృతియేమన నెదుటమిగులును. ఏస్థితియందును అక్షరమే యీతంత్రమునకు విశ్రాంతిభూమి.

దీనిసృష్టిలో అవ్యయునిధర్మములు గూడ సంక్రమించి విశిష్టాక్షరమునందే అంతర్భావములు "పదార్థజ్ఞానమున దీని (ఆత్మను) నెరుంగువాడు మృత్యుపాశవిముక్తుడగు" నని యుండి 'సర్వం ఖల్విదంబ్రహ్మ' 'బ్రహ్మైవేదంసర్వం' ఇత్యాదులందలి యవ్యయ పరబ్రహ్మ శబ్దముచే గూడ కాణాదులు జగత్ప్రకృతిభూతాత్మక్షర విశిష్టాక్షరమునే గ్రహింతురు. అదియే సర్వాధిష్ఠాన మనుకొనుటతో గృతార్థులగుదురు. కారణము? వీరిలక్ష్యము విశుద్ధాక్షరము కాదు. మరేమి? క్షరవిశిష్టాక్షరము కనుక వీరి శాస్త్రమును క్షరాత్మతంత్రమే యగును. 'వైకారిక విశేషరూపజ్ఞానముద్వారా అక్షరప్రతిచ్ఛాయతో గూడిన క్షరాత్మ గ్రహింపజేర్చుటయే ఈతంత్రార్థము. ఈవిషయము ముందు స్పష్టమగును.

ఈసిద్ధాంతమున కందు స్పష్టోల్లేఖనము లేకున్నను వారు చెప్పిన యాత్మస్వరూప లక్షణములంబట్టి అట్లు 'క్షరవిశిష్టాక్షర మాత్మ' అని నిశ్చయింప వలసి వచ్చుచున్నది. ఉదాహరణము: షట్పదార్థములను జెప్పి అందు ద్రవ్యగణనాసందర్భమున ద్రవ్యము లెన్ని భాగములు? అనుదాని స్పష్టీకరణము సూత్రకారు డిట్లు కావించెను — "పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలోదిగాత్మా మనఇతిద్రవ్యాణి" ఇందాత్మకూడ ద్రవ్యమేకదా! 'గుణకూటో ద్రవ్యమ్' అను దర్శనాంతరసిద్ధాంతాను సారము గుణ సమష్టి పేరే ద్రవ్యము. గుణతత్త్వము క్రియాసమష్టి.

"గుణభూతైరవయవైః సమూహః క్రమజన్మనాం
బుద్ధ్యా ప్రకల్పితాభేదః – క్రియేతివ్యపదిశ్యతే" (వాక్యపది)

క్రియ క్షరపదార్థము. సాంఖ్యమతానుసారము గుణతత్త్వము, తన్మాత్రలు దీనికి మూలము. క్షరతత్త్వమే యని సాంఖ్యతంత్రమున నిరూపింతుము. ఆత్మను ద్రవ్యమన్నందున ద్రవ్యత్వపర్యవసానభూమి క్షరమేయగుటవలన నీ తంత్రము క్షరాత్మ ప్రతిపాదకమందుము.

ఇందు ఈశ్వరుడు విశ్వనియంతయట! ఈధర్మమక్షరునిదే. "తస్యవా ఏతస్యాక్షరస్య ప్రశాసనే గార్గి! సూర్యాచంద్ర" ఇత్యాదు లక్షరునే శాస్త – నియంత - అంతర్యామి యని చాటొనుచున్నవి. బ్రహ్మవిష్ణ్వింద్ర సమష్టిరూపుడు త్ర్యక్షర

మూర్తి - సర్వజ్ఞుడు - అక్షరుడే నియంత - ఈశ్వరుడు. వైశేషికు లాత్మను నిత్యమున్నదిగను వారిదృష్టిలో పరమాణువులో గూడ నక్షరుడు నున్నాడని యంగీకరించరని నమ్ముచున్నారు; కాని వారు క్షరాక్షర విభాగమునకు - ప్రత్యేకత మాహన ఆ యిరు వురను ఉన్నప్రధానమున నాత్మయనుచున్నారు. వీరికి క్షరాక్ష రులు పృథక్తత్త్వములు కాకపోయినను ప్రతిపాదన శైలింబట్టి వీరియభిమతాత్మ క్షరాక్షర విశిష్టుని యనుక బడుచున్నది.

నైశిష్ట్యము కొరకిట్లనుకొనవచ్చును:— ఏమన:— ఈశ్వరాత్మ క్షర గర్భితాక్షరమూర్తి - ఇతడే నియంత - ఈశ్వర విశ్వ మునకొకడయాత్మ. 'సుఖదుఃఖ విజ్ఞాననిష్పత్త్యవిశేషా దైకా త్మ్యమ్' జీవాత్మ అక్షరగర్భిత క్షరమూర్తి. ఈ భేదవ్యవహార ముంబట్టియే నైనొకచో 'అక్షరవిశిష్ట క్షరాత్మ' యనియు నొకచో 'క్షర విశిష్టాక్షరాత్మ' యనియు వాడియుంటిమి. మొదటి వాక్యము జీవాత్మ సాపేక్షము, రెండవ వాక్యము ఈశ్వరాత్మ సాపేక్షము. ఎట్లయినను 'ఆత్మ', 'క్షరాక్షర విశిష్ట' మనుట సిద్ధవిషయము.

మరియు.— ఈశాంత్రము సృష్టికీశ్వరునితో సంబంధముం జెప్పక ఈశ్వరేచ్ఛచే సృష్టిప్రవృత్తి నంగీకరించినది. అణువాదము దీనికి ప్రియము. పరమాణువులు నిత్యమనును. వాని విభాజన మంగీకరింపదు. ఆకాశాది పంచీకృత పంచమహాభూత నిర్మి తాస్మదాది ప్రాణిశరీరముల నిది భౌతిక శబ్దమున బిలుచును. ఏదోయొకనాడు భౌతిక జగద్వినాశము తప్పదుగదా! ఏల

యున:— సంయోగ జనిత మెన్నడును నిత్యము స్థిరముగా జాలునా? 'సంయోగాః విప్రయోగాంతాః' - ఏపదార్థమునైన బ్రతిపంచర ప్రక్రియచే పరీక్షించుచో జివరకది పంచమహాభూత పరిణతమైపోవును. ఈతత్త్వము పంచభూతములందొక్కొక్కటియు పంచీకృతము. ప్రతిదానియందు నైదైదుగలవు; (సగము పృథివ్యాది, సగము తక్కిననాల్గు) ఈ బహుత్వకారణముననే వీనిని భూతములనక పంచమహాభూతములని పిలుతురు. వానినిగూడ బరీక్షించుచో రేణుభూతములు చరమస్థితిగా నేర్పడును. న్యాయశాస్త్రానుసార మివియే పరమాణువులు. వైశేషిక మింతకంటె నొకయడుగు ముందుకువైచినది.

వైశేషికాభిప్రాయ మేమన:— అనేక పరమాణువులొక రేణుభూతమగు నను. ప్రతి రేణువునందును ఎక్కువలో ఎక్కువ 30. తక్కువలో తక్కువ మూడుపరమాణువు లుండును. విజాతీయ పరమాణు సంఘము పేరే రేణువు. కాని రేణువు పరమాణువుకాదు. రేణువును విభజించినచో ముప్పదికెక్కువ కాకుండ, మూడిటికి దక్కువ కాకుండ బరమాణువులుండును.

రేణుస్వరూప సమర్పకమగు నీ పరమాణువు పేరు అణువు. నైయాయికులు పరమాణువు లనుకొనునది రేణువు. వైశేషిక మణువనునదే వాస్తమున బరమాణువు. ఈదృష్టితో నైయాయికులు రేణువాదులు. వైశేషికులు పరమాణు వాదులు, అనజెల్లును, వైశేషికముంబట్టి అణువను పరమాణువే సృష్టికి జరమావస్థ - విశ్వచరమమూలము. ఇట్టిపరమాణు సంయోగ

వైచిత్రివలననే విచిత్రవిశ్వనిర్మితి యైనది. సర్వజ్ఞ యగు నీశ్వరుని (అక్షరుని) యిచ్ఛచే ఈనిత్యములగు అణుపరమాణువులందు వికారములుత్పన్నములగును. అందువలన విజాతీయ పరమాణు గ్రంథిబంధన మేర్పడును. ఆగ్రంథులే రేణువు లనబడును. రేణు రేణుగ్రంథిబంధనమున (పంచీకరణమున) పృధివ్యాది పంచమహాభూతము లుత్పన్నము లగును. ఇట్లు ఈశ్వరేచ్ఛచే అణుపరమాణువులే విశ్వమున కుపాదానములై సర్వభౌతిక సర్గస్వరూప కారణము లగును. సృష్టియుక్రమాపసంహారము లీపరమాణువులే. ప్రాధానికము ప్రకృతిని (అవ్యక్తాక్షరమును) జగత్కారణమనుచో, వైశేషికము వ్యక్తపరమాణువులను జగదుపాదానమనుచున్నది. పదార్థములందగపడు విశేషత – భేదము – ఈ పరమాణుకృపాఫలమే, విశేషజాతికి జెందిన పరమాణు సంఘమే, పదార్థవైశిష్ట్యమునకు గారణమగును కనుక, పరమాణువు విశేషము. దీనిని సమర్థించునది వైశేషికము. ఈకారణతావాదమును వ్యక్తముజేయుచు కణాదమహర్షి "సదకారణవన్నిత్యత్వమ్" అని సూత్రించెను. కనుకనే చాలవరకు వైశేషికముతో బోలికగల కథాశాస్త్రము (న్యాయము) "వ్యక్తాద్వ్యక్తానాం (నిష్పత్తిః) ప్రత్యక్షప్రామాణ్యాత్" "నఘటాద్ఘట నిష్పత్తేః" (ఇదముప ప్రత్యక్షం – నఖలు వ్యక్తాద్ఘటాత్ వ్యక్తోఘట ఉత్పద్యమానోదృశ్యతే, ఇతివ్యక్తాద్ వక్తస్యానుత్పత్తి దర్శనా న్నవ్యక్తం కారణమితి") (వాత్స్యాయన భాష్య) సావయవ పదార్థములు సావయవ విశ్వకారణములు

కాజాలవు. త్రసరేణువులు సావయవములు, కనుక నివి జగ త్కారణము లనజాలము - నిరవయవ పరమాణువులే జగ త్కారణములు. ఇట్లు వ్యక్తములు, కనుకనే మూర్తములగు పర మాణువులనే సృష్టికి మూల కారణము లని యెంచు వైశేషిక మీశ్వరుని జగత్కర్తగ నెంచదు. దానిదృష్టిలో నాత్మ నిర్వి కారము. తదిచ్ఛామాత్రమే సృష్టికి నిమిత్తకారణ మగు చున్నది.

వైజ్ఞానికదృష్టిచే నీశ్వరస్థానీయుడగు నక్షరుడు నిమిత్తకార ణము. ఆత్మక్షర ముపాదాన కారణము. కాని, వైశేషిక మట్లు కాదనుచు ఉపాదాన రూపావ్యక్తక్షరమును ఆత్మకోటిలోనికి గొంపోవుచు ఈశ్వరకోటియందే చేర్పగోరుచున్నది. మిగిలిన వ్యక్త వికారక్షరరూప పరమాణువులనే కారణముగ నెంచు చున్నది.

ఇంతకు: "పరమాణువులు సృష్టిమూలము. పరమాణు ప్రపం చముకంటె బరమయిన ప్రకృతిరూప క్షరాక్షరము లాత్మ - అవ్యయనామకమగు స్వతంత్రతత్త్వ మేదియులేదు. 'నతస్య కార్యం కరణంచవిద్యతే' అనునీమొదలగు నవ్యయ ధర్మము లచే అక్షరమే అభిప్రేతము. అక్షరప్రతిచ్ఛాయతో గూడిన క్షరాత్మయే ముఖ్యాత్మ - ఇదేవిధేయము" మని యీతంత్రము నకు నిష్కర్ష!

ఇది వైశేషికాత్మనిరుక్తి.

# ప్రాధానికాత్త్వ

గీతాశాస్త్రము, సాంఖ్యమన్నదీ ప్రాధానిక తంత్రమా, మరొకటా? యోగ మన్నదీ ప్రాధానిక పూర్వాంగ భూత పాతంజలయోగమా, కాక వేరా? అన్న దొక జటిల సమస్య. దానిని మరొకచో జూచుకొనవచ్చును. ప్రస్తుతము —

క్రమ ప్రాప్తమగు సుప్రసిద్ధ సాంఖ్య నామక ప్రాధానిక తంత్ర స్వరూపమునే చూతము. మొదట నామనిర్వచనము జూతము:— సాంఖ్యమన జ్ఞానము – సంఖ్యయన లెక్క – కనుక తత్సంబంధమున నిది సాంఖ్యమనియు దోచును.

అవును:— ఈతంత్రోద్దేశ్యము చతుర్వింశతి. వైశేషికము ద్రవ్య గుణాది షట్పదార్థముల నుద్దేశించి, క్షర విశిష్టాక్షరము లేక అక్షర విశిష్టక్షరమును, ఆత్మ విధేయ మన్నట్లు — ఈ తంత్రము 24 తత్త్వముల నుద్దేశ్యముగా బెట్టుకొని 25 వ వాడగు పురుషుని వంకకు మనదృష్టి నాకర్షించుచున్నది. పురుషుడు జ్ఞానస్వరూపి, తత్సిద్ధి. యిది సంఖ్యా పరిగణనవలన నగునని యెంచెను కనుకనే 'సంఖ్యాతః సిద్ధం జ్ఞానం సాంఖ్యమ్' అన్నట్లు - ఈతంత్రము సాంఖ్యమన బడినది. పురుషునిబట్టి యిది సాంఖ్యము అని తాత్పర్యము. ఈవచనముల నరయుడు.

'అవ్యక్తం క్షేత్రమిత్యుక్తం తథాసత్వం తథేశ్వరః
అనీశ్వరమతత్త్వంచ తత్త్వంతత్ పంచవింశకమ్
సాంఖ్యదర్శనమేతావత్ పరిసంఖ్యానుదర్శనమ్
సమ్యగ్దర్శనమేతావత్ భాషితంతవ తత్త్వతః'' (భారత)

ఇక రెండవ నిర్వచనము ప్రకృతి భావమునకు జెందినది. ప్రకృతిని ప్రధానమందురు. ఇంతేకాక నియతి, కారణము, నిమిత్తము, అంతర్యామి, అక్షరము, కూటస్థము అను మొదలగు నిర్వచనము లనేకము లింకను గలవు. వానివాని నిర్వచనములు మరొకచో జూచుకొందము.

ప్రస్తుతము:— ఇట్లు పురుషాపేక్షచే సాంఖ్యము ప్రధానము (ప్రకృతి) నపేక్షించి ప్రాధానికము నని ఈతంత్రమునకు పేరులు కర్త కపిలమహాముని. వైశేషిక సమ్మత పరమాణువాద మీయనకు నచ్చలేదు. పరమాణువులు పరిచ్ఛిన్నములు. తాను పరిచ్ఛిన్నమై పరిచ్ఛిన్న జగత్తునకు కారణము కాగలఁ డేది? పరిచ్ఛిన్నమగు తంతువు పటమునకే, స్వర్ణము కటకాదులకే, మృత్తిక ఘటశరావాదులకే కాని యన్యోత్పత్తికి సమర్థములగునా? అట్టిచో పరిచ్ఛిన్న పరమాణావు విచిత్రభావోపేతమగు జగత్తునకు గారణమను టెన్నడు బొసగదు. 'పరిచ్ఛిన్నం న సర్వోపాదానం' చివరకు పరమాణువులుగాక, మరొక యపరిచ్ఛిన్నతత్త్వ ముపాదాన కారణముగా నొప్పికొవలెను.

కార్యస్వరూపముంబట్టి దాని మూలకారణము ననుమానింపవలయును 'కారణగుణాః కార్యగుణానారభన్తే'' అనిగదా సిద్ధాంతము. అట్టిచో విశ్వమను కార్యమూలము నెరుంగవలయునేని మొదట నాకార్యగుణములను బరీక్షింపవలయును. దానిచే తత్తుల్యమగు కారణపు జాడ తెలియగలదు.

మనము విశ్వమం దేపదార్థము గన్న నందు సత్త్వరజ

స్తమస్సులనుమూడుగుణముల సామ్రాజ్యమగపడును గాని వేరొండేదియు గానరాదు. కనుక త్రైగుణ్య పదార్థమేదో దీనికి గారణమై యుండవలయును. దానినే అవ్యక్త ప్రకృతి యందురు. ఇదే విశ్వభాగ్య విధాత్రియైయున్నది.

ఇట్లు — ఏయాత్మాక్షరమును వైశేషికము ఆత్మకోటిలో నికి గొంపోవుచున్నదో దానిని ప్రాధానికము విశ్వమువంకకు నెట్టివైచి ఆత్మాక్షరమును 'భూతానిభావయతి ఉత్పాదయతి' అని భూతభావనముగ నెంచినది. దీని నాతంత్రము కర్త - అవ్యక్తమనగా, నీతంత్రము వ్యక్తము- భూతాదిజనక మనుచున్నది. దాని కాత్మాక్షర మాత్మ దీని కక్షర మాత్మ - ఇదే అవ్యక్తము - అక్షరము - ప్రధానము - ప్రకృతికారణము అను మొదలగు నామములజెల్లును. దీనివ్యక్తావస్థమహత్తు - ఈయవ్యక్తమగు నక్షరము బీజమువలె సూక్ష్మము. మహత్తు వృక్షమువలె వ్యక్తము. ప్రకృతి (అక్షర) మహద్రూపమునే క్షరమందురు. అవ్యక్తావస్థయం దాయక్షరమే ప్రకృతి. క్షరమువ్యక్తము, అక్షర మవ్యక్తము అనగా ఇవి స్వతంత్రములుగ రెండు కావను కోరాదు. ఒకతత్త్వమునకే రెండవస్థ లనుకొనవలయును. బీజావస్థ - అవ్యక్తావస్థ, మూలావస్థ, అక్షరము, విశ్వావస్థ - వ్యక్తావస్థ - తూలావస్థ, క్షరము.

సత్త్వరజస్తమస్సు లనుమూడు గుణములయందును సమ విషమభేదముచే రెండేసి యవస్థలుండును. ఇట నొకచమత్కార మేమనః— శరీరమునందలి వాతపిత్తకఫములను ధాతుత్రయము

షమముగ నుండునంతవరకు శరీరము స్వస్థముగ నుండును. ధాతుసామ్యము చెడి విషమతయేర్పడుచో ఘోరసన్నిపాత రూప పరిణతములై యీధాతువులే మృత్యుకారణములగును. అనగా:- అధ్యాత్మమందు ధాతుసామ్యము రక్షకము. వైష మ్యము భక్షకము నగుననిభావము. కాని ప్రకృతి తంత్రమం దిది విపరీతము. సత్వరజస్తమస్సులే తదీయధాతువులు. అందు విష మత విశ్వరూపరక్షకము సమత; అవ్యక్తరూప పరిణతిచివరకు:- గుణవైషమ్యము సృష్టికిని, సామ్యము ప్రళయమునకును ప్రవర్త కములని తేలుచున్నది.

ప్రకృతి తనసామ్యమున నుండుచో విశ్వరచన యసంభవము. అది వైషమ్యరూపము దాల్చునే సృష్టి. సమీక్రియ పూర్ణ శాంతి. అం దేక్షోభయు లేదు. అప్పుడు గుణములు సృష్టి బహిర్భూతములుగ నెన్నదగును. సృష్టిక్షోభమూలము. గుణ మూర్తి, అవ్యక్తము, సామ్యావస్థనుండి వైషమ్య స్థితి నొందునపుడు మహత్తు అనబడును. సామ్యావస్థ ప్రకృతి. విష మావస్థమహత్తు. ఒకటి మొగ్గ- రెండవది పుష్పము. ఈవ్యక్త మహత్తే సాంఖ్యుల మహత్తత్త్వము.

ఆయవ్యక్త - మహత్తులే వేదవిజ్ఞానసిద్ధ అక్షర-క్షరములు. ఈమహత్తత్త్వము (వ్యక్తాత్మక్షరము) నుండి అహంకారము జనించునట! ఎట్లు? అన్నచో నీతంత్రమేమియు సమాధాన మీయజాలదు. ఈప్రశ్నకు వైదికవిజ్ఞానమే సమాధాన మీయవలయును. ఎట్లన:-

ఆత్మాక్షరరూప మహత్తత్త్వమును మొదటనే మహత్తత్త్వమనరు. పారమేష్ఠ్యభృగు సంబంధముచేతనే యది మహత్తగును. సోమతత్త్వముపేరే భృగువు. దీనికి ఘన - తరళ - విరళ - భేదముచే మూడవస్థలు. ఇవే వరుసగ జల - వాయు సోమములు. వీని మొత్తము భృగువు. 'మహాతత్త్వతో సేమో మహిమశ్చరాకార' అన్నట్లు, ఈ యవస్థాత్రయయుక్తసోమమే మహత్తు. ఇదే 'అహం' యోని.

ఆత్మాక్షరమునుండి వరుసగ నొకదానినుండి యొకటిచొప్పున వికారక్షర - విశ్వసృట్పంచ జన పురంజనులును, పురంజనులనుండి స్వాయంభూ, పరమేష్ఠి, సూర్య - చంద్ర - పృథువులును పంచపురములును పుట్టును. ఇట్లు ఆత్మాక్షరుడు మొదలుగ నారవధార యందలి పురములందలి రెండవ పురమందున్న పరమేష్ఠిపురమే భృగునామక మనోతాయుక్తము. దీని సంబంధము చేతనే యావ్యక్తాక్షరము మహత్తుగనై యహంకారమునకు జనకమగును.

ఈవిజ్ఞానదృష్టితో జూచినచో వైశేషిక ప్రాధానికములకు విరోధముండదు. పరమేష్ఠి వికసింపనంతవరకు ఆత్మాక్షరము మహత్తుగాదు. కనుక నంతవరకు అవ్యక్తముగనే యుండి యది యాత్మకోటిం జేరియుండును. అందువలన:— "ఆత్మాక్షరమవ్యక్తము - ఆత్మయునై యున్నది. సృష్టిమూలకారణము, పరమాణువులు" అని వైశేషికులనుట న్యాయసంగతమే యగును. పరమేష్ఠి రూపమహత్తు పరమాణురూపము. దీని

సంబంధముచే అవ్యక్తాత్మక్షరము తన అవ్యక్తభావచ్యుతమై, వ్యక్తమై విశ్వమూల మగును. మహదవచ్ఛిన్నాత్మక్షరము వ్యక్తమే. ఈదృష్టిచే ప్రాధానికము "క్షరము వ్యక్తము. ఇది మహత్తు - ఇదే సృష్టిమూల" మనుటయు సత్యమే.

మహత్తును సోమమంటిమి గదా! దీనికి మూడవస్థలును చెప్పి యుంటిమి. క్షరమూర్తియు త్రిమూర్తియు నగు నీ మహత్తు చిదంశగ్రాహకము, త్రివిధాహంభావజనకము. ఆపోవాయు సోమములు మూడును స్ఫటికమణి తుల్యములు (వీ(ధవ..ు). స్ఫటికమందు జపాకుసుమమువలె చిత్తు ఇందు ప్రతిబింబించును. ఈచిదాభాసుడే జీవుడు. ఇదే అహంకారము. దీని త్రిమూర్తి యగు మహత్తు యోని. అహంవికాసము మూడుధరాతల ములం దగుగనుకనే జీవసృష్టియు ఆప్య - వాయవ్య - సౌమ్య - భేదమున ముత్తెఱగులు. క్షరావచ్ఛిన్న మహత్తే అహం భావమునకు యోని. ఇందే చిదాత్మయంశరూపమున గర్భ ధారణ సేయును. భగవంతు డిట్లుచెప్పెను.

"మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం
సంభవః సర్వభూతానాం తతోభవతి భారత!
సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవన్తి యాః
తాసాంబ్రహ్మమహద్యోని రహం బీజప్రదః పితా!"

మహ దాధారమున భోక్తయగు 'నహం' వికసిల్లినపుడు ఈభోక్త స్వరూపరక్షకు భోగ్యపదార్థము గావలయును.

అందుకొరకు ఈ అహంయొక్క యిచ్ఛచే తదవ్యవహితోత్తర కాలమందే శబ్దస్పర్శరూప రసగంధములను పంచతన్మాత్ర లుదయించును. అహంకారమే పంచతన్మాత్రా ప్రవర్తకము. ఈ తన్మాత్రలే విజ్ఞానదృష్టికి గుణభూతములు. ఆయీవిషయము పూర్వతంత్రమున జెప్పబడినది.

ఇంకొక విశేషము — పూర్వ తంత్రమునజెప్పిన అణుభూత ములందే యీగుణభూతములుండును. అవియునివియు సవినా భూతములు. ఒకేవిధముగ అణుభూతము సూక్ష్మమనుకొన్నచో గుణభూతములు. దానికి అర్కలనవచ్చును. ఇట్లు ఉత్కార్కరూప పంచతన్మాత్ర లొకవిభాగము - అహంకారమొక విభాగము - మహత్తు ఒకవిభాగము - అవ్యక్త ప్రకృతియొకవిభాగము కాగా: అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు నని నాల్గు స్వతంత్రవిభాగములేర్పడును. ఇందవ్యక్తమవ్యక్తమే. ఇక మిగిలినమూడును వ్యక్తములు. ఈవ్యక్తత్వ సాధర్మ్యముచే మహదహంకార పంచతన్మాత్ర లొకశ్రేణి యనవచ్చును. పక్షాంత రమున తన్మాత్రలయవాంతర సంఖ్యలనుబట్టి మహదహంకార శబ్ద స్పర్శ, రూప రస గంధములని ఏడువ్యక్తతత్త్వము లగును. వీని సమష్టియే క్షరప్రపంచము. ఇదే భూతభావనము.

ఇందు, భోక్తయగు అహంకారము నుండి భోగ్యములగు తన్మాత్రలు పుట్టినవంటిమిగదా! భోగ్యములేనిచో భోక్త యుండ జాలదు. మరియు భోగ్యమున్నంతనే భోక్తకు దృష్టి కార ణము కాజాలదు. భోగముకావలయును. భోక్త యున్నచోట

నుండికదలదు. జడమగు భోగ్యము తనంత భోక్తం జేరజాలదు. ఇట్టిచో భోగసాధన ముండవలయును. అందుకు భోక్తయగు నహంకారము ఏకాదశేంద్రియ జనకమగును. వాక్పాణిపాద పాయూపస్థలను కర్మేంద్రియములైదు. త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియములైదు. ఉభయాత్మకమగు మనస్సొకటి. ఇవి యేకాదశేంద్రియములు భోగసాధనములు. ఏది దేనికి కారణమో అది యాకార్యమునకు బ్రకృతి యనబడును. కనుక ఇంద్రియ వర్గకారణమగు నహంకారము వానికిని పంచతన్మాత్రలకును జనకమగుటచే వానికిని గూడ బ్రకృతియందుము. మహత్తునుండి యీయహంకారము జనించి నందున అదిదీనికి బ్రకృతి యనవచ్చును. పంచతన్మాత్రలనుండి ఆకాశాది పంచభూతములు పుట్టును కనుక నవి వీనికి బ్రకృతు లనవచ్చును. ఏకాదశేంద్రియములు పంచభూతములు. మొత్తము పదునారును వికృతులు. మహదహంకార పంచ తన్మాత్ర లను నేడును బ్రకృతివికృతులు. అవ్యక్తమూలప్రకృతిం బట్టి ఈయేడును వికృతులనబడుచో అహంకారముంబట్టి మహత్తును, ఇంద్రియములను తన్మాత్రలనుబట్టి యహంకార మును, పంచభూతములనుబట్టి పంచన్మాత్రలనుగూడ ప్రకృతు లనుకోవచ్చును.

అవ్యక్తము (అక్షరము) ఈ ఏడిటికి లేదా అన్నిటికి పరం పరగ జనకము. తాను అజన్మయు నైయున్నది. కనుకనే 'అజ న్మత్వేసతి జనకత్వం మూలప్రకృతిత్వం' అన్నట్లు సామాన్యా

వస్థయందుండు నీయవ్యక్త ప్రకృతిని మూలప్రకృతి యనవచ్చును. వైజ్ఞానికముగ, అక్షరమే సాంఖ్యులమూల ప్రకృతి. ఆత్మాక్షరమే ప్రకృతి వికృతి. వికారక్షరమే వికృతి. మూలప్రకృతి1, ప్రకృతి వికృతులు 7, వికృతులు 16, మొత్తమీ తంత్రమున 24 తత్త్వములు వైశేషికుల పదార్థమర్యాద యీరీతితో సమాప్తము. అధ్యాత్మవాదియగునీ ప్రాధానికమున 24 పదార్థములు.

అధిదైవత - అధ్యాత్మ - అధిభూత భేదములుగల విశ్వ విద్యను వరుసగ శారీరక - ప్రాధానిక వైశేషికములు నిరూపించుననియు నీమూడుసంస్థలకు మూలప్రతిష్ఠలు ఈశ్వర - జీవ - జగత్తులనియు మొదట ననుకొంటిమి. ఆదృష్టితో జూచి నచో వైశేషిక ప్రాధానికములకు విరోధ ముండదు. వైశేషికము తనలక్ష్యమగు అధిభూత ప్రపంచముంబట్టి పదార్థము లారన్నది. ఈయారిటికి ఆధిభౌతిక జగత్తుతోడనే సంబంధము. వైశేషికము చెప్పదలచినదియు నంతే. కనుకనే ఈయారింటికి తిన్నగా (సరాసరిగ) అక్షర రూపాత్మ (పరమాత్మ) తోడనే సంబంధము నంగీకరించినది. ఈభూతోత్పత్తి కారణత కంటె జీవుని వేరుగా నుంచినది.

ఇక ప్రాధానికోద్దేశ్యము — ఆధ్యాత్మిక సంస్థ. దానిని లక్ష్యము సేసి యది అక్షర — క్షరరూప మహాత్మున కవ్యవహితోత్తరకాలమందే అహంకారరూప జీవుని కారణరూపమున సమావిష్టుంజేసి తద్ద్వారా పంచతన్మాత్రలు ఇంద్రియములు

భూతవర్గాదులు వీనియుత్పత్తిం జెప్పియున్నది. ఇంద్రియ సంబంధము జీవునకే గలదు. కనుక నాప్రకరణ మందలి మాత్రలను భూతములను అధ్యాత్మ సంస్థకు జెందినవే యనవలయును. ఈఆధ్యాత్మికదృష్టిచే ఇంద్రియాది సమావేశము జెప్పుట యావశ్యకము కనుక 6కు బదులు తత్త్వములు 24 అనుట న్యాయసంగత మగుచున్నది.

ఇంతేగాక ప్రాధానికము పురుషుడను వేరేతత్వము (ప్రకృతివికృతులకంటె వేరుతత్త్వము - అవ్యయసత్త) నంగీకరించినది. (పూర్వము నైశేషికమవ్యయు నెరుంగదంటిమి. అనగా దాని ముఖ్యోద్దేశము అధిభూతమేయని అభిప్రాయము. దాని పర్యవసానము క్షరాక్షరములు. కనుక నది యవ్యయ ప్రతిపాదనమావశ్యక మనుకోలేదు. ఇకనీ సాంఖ్యమో జీవనిరూపకము. అత డక్షరాత్మకుడు. ఈతని కవ్యయుడు సన్నిహితుడు. కనుక ప్రకృతితోగూడ నిది పురుషచర్చకూడ జేయవలసివచ్చెను.) ఇందువలన దత్త్వములు 25 అగును. ఇందు 24 ద్వారానే జ్ఞానమూర్తి పురుషుడు సిద్ధుడయ్యెను. కనుక పురుషునిసాంఖ్యుడనిరి. తాచ్ఛబ్ద్యన్యాయమున దత్ప్రతిపాదకమగు నీ తంత్రమును సాంఖ్యమందురు. ఈసూత్రము సరయుడు: "సత్వరజస్తమసాం సామ్యావస్థాప్రకృతిః, ప్రకృతేర్మహాన్, మహతోఽహంకారః, అహంకారాత్పంచతన్మాత్రాణి, ఉభయమింద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని, పురుష ఇతిపంచవింశతిర్గణః" (1. 61)

ఇందు అవ్యయపురుషునకు సృష్టితో నేసంబంధమును లేదు.

అతడు నిర్లేపుడు. అతడు ప్రకృతియు వికృతియుగూడ నన జాలము. ఆయన యొకదానినుండి పుట్టలేదు. దేనిని పుట్టింపడు. కారణరూప ప్రకృతికి కార్యరూప వికృతికి నతీతుడు, తటస్థుడు. సృష్టిమర్యాదా దృష్టిబట్టి యతడున్నవాడన్నను లేనివాడన్నను సమానమే. ఈయీశ్వరకృష్ణవచన మరయుడు:

"మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త
షోడశకస్తువికారో నప్రకృతి ర్నవికృతిః పురుషః"

మూలప్రకృతినుండి కల్గిన వికారములందు మొదటిది మహత్తు. రెండవదియు జివరిదియు నహంకారము. తక్కిన వన్నియు దీని వికారములే కనుక అహంకారమును మూల ప్రకృతికి జరమ వికారముగా జెప్పబడినది. "చరమోఽహంకారః" ఇందువలన నీ తంత్రముఖ్యలక్ష్యము అధ్యాత్మ ప్రపంచమే (జీవసంస్థయే) అని తేలుచున్నది. తక్కిన వికారమూల మీయహంకారమే. పాలు ఒకటే పెరుగు - నీరు అను రెండు రూపము లొందునట్లు అహంకార మొకటే ఇంద్రియ - పంచతన్మాత్ర లను రెండువిరుద్ధభావములకు జనకమగును. తరువాతి కార్యము లన్నిటింగావించునది యీచరమవికారమగు నహంకారమే. ఎట్లు? సంచిత సంస్కారముం బట్టియే యింద్రియములు తదనుకూల భోగ్యములు (తన్మాత్రలు) ను లభించుచున్నవి. ఇట్లు తన సంస్థకు మూలము (సంస్కారముద్వారా) ఈయహంకార రూపజీవాత్మయే యగుచున్నది. 'తత్కార్యత్వ

ము త్త రేషాం' అయినను పరంపరగ మూలప్రకృతి మూలప్రకృతి యనుటకు బాధలేదు.

అహంకారము నుండి పంచతన్మాత్రాదుల యుత్పత్తి యంగీకరించిన పిదప నీతంత్రముపై వైశేషికులు "మాత్రేంద్రియ మూల మహంకారమన్నచో నిక నవ్యక్తము సర్వమూలకారణ మననేల, అది సర్వకారణము కాదుగదా!" అని యాక్షేపింతురు. అందుకువీరు "నిజమే, జగత్తుంగూర్చి సాక్షాత్తుగ ప్రకృతికి గారణత లేకపోయినను పరంపరగ నున్నది గనుక చివరకు యేస్థితిలోనైన దానిని, మూల కారణమనుకొనక తప్పదు." అని "మీకుమాత్ర మిట్టి వ్యాఘాతములేదా? మీర ణువు మూలకారణ మందురు. అది రేణువునకే గదా! రేణువో జగన్మూల కారణము. అట్టిచో అణుకారణతకు మీరేమి చెప్పెదురో ఇట మాప్రత్యుత్తరము నంతే" అందురు. "ఆద్య హేతునా తద్వారా పారంపర్యేఽప్యణుత్వమ్."

ఇక ప్రసంగోపాత్తముగ, తారతమ్యముంగూడ జూతము: అహంకారమునుండి పుట్టిన పంచతన్మాత్రలవలన పంచభూతములును కల్గెను. ఇందు, శబ్దతన్మాత్రవలన నాకాశముకల్గెను. దానికి గుణము. శబ్దము శబ్దతన్మాత్రాగర్భిత స్పర్శతన్మాత్రచే వాయు వుత్పన్నమయ్యెను. దీనికారంభకములు శబ్ద - స్పర్శములు కనుక సింధా రెండుగుణములును గలవు. ఈ రెంటిచే గర్భితమగు రూపతన్మాత్రచే నగ్ని - ఇందు శబ్దస్పర్శ రూపములు మూడు గుణములున్నవి. ఆమూడుతన్మాత్రలచే గర్భిత

మగు, రసతన్మాత్రచే జలము, ఇందు నాల్గుగుణములు - ఈ నాల్గుతన్మాత్రలచే గర్భితమగు గంధతన్మాత్రచే పృథివికల్గెను. ఇందు 5 గుణములున్నవి. కనుకనే 'ఏషావై భూతానాం పృథివీ రసః' అని శ్రుతియు పృథివిని సర్వభూతరసమన్నది. అయినట్లైదుగుణములు ప్రధానములు, తక్కినవి తారతమ్య భేదమున నుండును.

"వియదేకం గుణం ప్రోక్తం, ద్వ్యాగుణౌ మాతరిశ్వనః
త్రయస్తేజసి, చత్వారః సలిలే, పంచభూమిగాః"

భూతములు తన్మాత్రలనుండిపుట్టెనుగనుక తన్మాత్రలనుగూడ భూతనామములతో పిలుతురు. ఈ చతుర్వింశతి తత్త్వములందు మహాత్త్తు సోమమంటిమి గదా! ఇదే సత్త్వమనస్సు. ఇదే చిత్తమనియు వ్యవహారము. ఏకాదశేంద్రియము లందలి యింద్రియమనస్సు అహంకారమునుండి పుట్టినది. సత్త్వమనస్సు అవ్యక్తమునకు వ్యక్తరూపము. ఈరెంటికి జాలభేదముకలదు. 1. సత్త్వమనస్సు అహంద్వారా సర్వేంద్రియా ధిష్ఠాత్రమై, సర్వేంద్రియమనస్సు, అతీంద్రయమనస్సు, అనింద్రియమనస్సు అనబడును. రెండవమనస్సు సంకల్ప వికల్పాత్మక నియతభావ యుక్తమై యింద్రియ మగుచున్నది. సత్త్వమనస్సు విజ్ఞానమునకును, ఇంద్రియమనస్సు ఐంద్రియకవిషయములకును ప్రతిష్ఠలు. "మహాత్స్వరూపసత్త్వమనస్సుకంటె నింద్రియమనస్సు సర్వదా పృథక్తత్త్వము" అనిఫలితార్థము, "మహదాఖ్య మాద్యం

కార్యం తన్మనః" (1–71) అనగా ప్రకృతియొక్క మొదటి పరిణామము కార్యము; మహత్తు; అదే మనస్సు; అని సూత్ర తాత్పర్యము.

మహన్మనస్సు విజ్ఞానరూప బుద్ధికి బ్రతిష్ఠ యంటిమిగదా! విజ్ఞానప్రజ్ఞాన (మనస్సు) లు రెండును సంపరిష్వక్తములు కనుక ప్రజ్ఞానమనస్సు తోడనే విజ్ఞానబుద్ధియు జెప్పినట్లే యగుటవలన సాంఖ్యమందు బుద్ధిని వేరుగా గణింపవలయునని యెంచబడ లేదు. 'సత్త్వరజస్తమసా' మనుసూత్రముచే మహద్ద్వారా అహంకారోత్పత్తిచెప్పి పిదప 'తేనాంతఃకరణస్య' అని అహం కారము బుద్ధిజన్యమనిచెప్పి అంతఃకరణశబ్దము బుద్ధివాచకముగా వాడబడినది.

ఇక:— పిదపనో, 'తతఃప్రకృతే' ఇత్యాదిరూపమున నంతః కరణ రూపబుద్ధిద్వారా ప్రకృతి (అవ్యక్తాక్షరము) అనుమా నింపబడినది. కాని, అటుగాక 'ప్రకృతేర్మహాన్ మహతోఽ హంకారః' అను పూర్వ సూత్ర సిద్ధక్రమము ననుసరించి అహంకారమునుండి తజ్జనిత మహత్తును మహత్తుచేత తజ్జనక మగు నవ్యక్తప్రకృతిని అనుమానింప వలసియున్నది.

ఇట్లు సూత్రములందు వచ్చుచున్న పూర్వాపర విరోధము, అంతఃకరణ రూపబుద్ధిని మహత్తునం దంతర్భూతముగ నెంచు కొన్నచో దొలగిపోవును. మహత్తుచే మహత్తు (మనస్సు) బుద్ధియు గ్రహింపబడుచో, అహంచే మహత్తును, మహత్తుచే ప్రకృతిని లేదా, అహంచేబుద్ధిని, బుద్ధిచే ప్రకృతిని అనుమా

నించుట సంగతమగును. ఈదృష్టితో ప్రకృతి వికృతు లేడనుటకు బదులు మనస్సు - బుద్ధి - అహంకారము - భూమి - ఆపస్సు - అనలము - వాయువు ఆకాశము నని యెనిమిది కాగలవు. విజ్ఞాన ప్రధానమగు గీతాశాస్త్రము విశదముగ దెలియుటకై ప్రకృతి వికృతు లెనిమిదని యంగీకరించినది. వీని మొత్తమునే అపరాప్రకృతి యన్నది. ఇదే ఆత్మాక్షరము.

సాంఖ్యమూల ప్రకృతి విజ్ఞానమునం దక్షరమనియు గీతయం దపరా ప్రకృతి యనియు బ్రసిద్ధినొందినది. గుణత్రయయుక్తము అవ్యక్తాక్షరాత్మకమునగు దీనికి మూలములేదు. అన్నిటికి నిదే మూలము. "ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి" అన్నట్లు అవ్యయపురుషునట్లు ఆతని యక్షర రూపపరా ప్రకృతియు మరొకమూలము లేనిదగుటచే నిత్యము. 'సామాన్యే సామాన్యాభావః' అన్నట్లు మూలమందు మూలముండదు గదా! కనుక దీని నమూల మనవచ్చును. సర్వమూల మగుటచే మూలమనియు ననవచ్చును. 'మూలే మూలాభావా దమూలం మూలమ్' ఈ రెండువిధముల ప్రకృతుల రూపములను భగవంతు డిట్లుచెప్పెను.

1 'భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా,
అపరేయమ్; 2, ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మేపరాం
జీవభూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్"

1. అవ్యయః[1] - పురుషః - పురుషః - (ఆనంద విజ్ఞానమనః

(ప్రాణవాఙ్మయః) సనాతనః

2. అక్షరః[1] పరాప్రకృతిః - మూలప్రకృతిః - (బ్రహ్మేంద్ర విష్ణ్వగ్ని సోమమయః) అవ్యక్తః
3. ఆత్మాక్షరః[7] అపరాప్రకృతిః - ప్రకృతివికృతిః - (ప్రాణాపోవాగన్నాన్నాదమయః) వ్యక్తః
4. వికారక్షరః[16] - జగత్ - వికారః - (పంచీకృత ప్రాణాదిమయః) వ్యక్తతమః

సాంఖ్యముల సిద్ధాంతము ప్రకారము ప్రకృతియే మూల కారణము. చేయునదంతయు ప్రకృతియే. పురుషుడు (అవ్యయుడు) పుష్కరపలాశము (తామరాకు) వలె నిర్లేపుడు కాని జగత్తంత్రసంచాలిక ప్రకృతి జడము. జ్ఞానమూర్తియగు పురుషుని సహయోగము లేకుండ నదియేమియు జేయజాలదు. ఆసహయోగ మైచ్ఛికముగాదు స్వాభావికము కనుక పురుషుడు నిర్లేపుడందుము. వెలుతురు లేకున్న మన మేపనియు సేయజాలము. వెలుతురిచ్చు సూర్యునకు మనపనులందుగాని మనచే బనులు సేయింపవలయుననిగాని యిచ్ఛలేదు. వెలుతురిచ్చుట యతని

ప్రాధానికాత్మ 97

(ప్రాణవాఙ్మయః) సనాతనః

2. అక్షరః[1] పరాప్రకృతిః - మూలప్రకృతిః - (బ్రహ్మేంద్ర విష్ణ్వగ్ని సోమమయః) అవ్యక్తః
3. ఆత్మాక్షరః[7] అపరాప్రకృతిః - ప్రకృతివికృతిః - (ప్రాణాపోవాగన్నాన్నాదమయః) వ్యక్తః
4. వికారక్షరః[16] - జగత్ - వికారః - (పంచీకృత ప్రాణాదిమయః) వ్యక్తతమః

సాంఖ్యముల సిద్ధాంతము ప్రకారము ప్రకృతియే మూల కారణము. చేయునదంతయు ప్రకృతియే. పురుషుడు (అవ్య

సాంఖ్యదర్శన మేతావత్ పరిసంఖ్యానుదర్శనమ్,
సమ్యగ్దర్శన మేతావత్ భాషితం తవతత్త్వతః॥
ఏతత్సమ్యగ్జ్ఞాత్వా కృతకృత్యః స్యాత్
నపునః త్రివిధేన దుఃఖేనానుభూయతే॥

1. (అవ్యయః) పురుషః నిర్లేపః (1)

- అక్షరః మూల (పరా) ప్రకృతిః (1)
  - ఆత్మాక్షరః ప్రకృతివికృతయః. (7)
    - వికారక్షరః వికారాః (16)

పంచమహాభూతాః గీ. 1-61

1 సత్వమనస్సు — మహాన్ 1
2 బుద్ధి
3 అహంకారము — అహంకారః 1

| | | |
|---|---|---|
| ఖం | శబ్ద | |
| వాయు | స్పర్శ | |
| అనల | రూప | పంచతన్మాత్రాః 5 |
| ఆపః | రస | |
| భూమి | గంధ | |
| (8) | | (7) |

పంచకర్మేంద్రియములు:
1 వాక్
2 పాణి
3 పాద
4 పాయు
5 ఉపస్థ

బుద్ధీంద్రియాణి / పంచజ్ఞానేంద్రియములు:
1 త్వక్
2 చక్షుః
3 శ్రోత్రః
4 జిహ్వ
5 ఘ్రాణ

1 మనః — ఉభయాత్మకం మనః

పంచభూతములు:
1 ఆకాశః
2 వాయు
3 తేజః
4 జలమ్
5 పృథివీ

(16)

అంతయు బ్రకృతిదే. అది యతని ప్రకాశోదరమందు గూరు చున్నది. కనుకనే "ప్రకృతిః కర్త్రీ పురుషస్తు పుష్కర పలాశవ న్నిర్లేపః కింతుచేతనః" అని ప్రాధానిక సిద్ధాంతము.

ప్రకృతి మూలకమగు నీయభినివేశ మింతటితో నాగక, "నిత్య సంబంధము లేనందున అవ్యాయు పురుషనామకుడగు నీశ్వరు నుపాసింపబనియేమి? ప్రకృతినాశ్రయించినచో నేకోదక త్వము (కర్తుమకర్తు మన్యథాకర్తుమ్) సమర్థము కాగలదు. ప్రకృతి స్వతంత్రమందతని నంగీకరించినను లేకున్నను సమానమే" అని 'ఈశ్వరాసిద్ధేః' అను సూత్రమువరకు బోయినది.

ఇందువలన సాంఖ్యమునీశ్వరవాదికాదు. అట్లగుచో నది యాస్తికదర్శన మనరు. అదియవ్యయేశ్వరు నొప్పికొన్నది. 24 తత్త్వములకంటె బురుషుడు వేరన్నది. కాని, అతనికి నిగ్రహాను గ్రహములు లేవన్నది. ఒక ముక్తమనుష్యునకే ప్రపంచసంబంధము లేదన్నచో నిత్యశుద్ధబుద్ధ ముక్తుడగు పురుషుడు గుణత్రయమూలక సృష్టిపై నిగ్రహానుగ్రహములు జూపు నన వచ్చునా? 'ఈశ్వరుడసిద్ధు' డనగా:— సృష్టిరచనాదృష్టితో జూచిన నతడు సర్వథా వేరనియే తాత్పర్యము. కానిండు: ఈ సిద్ధాంతమెంతవరకు మాన్యము? అన్నది ముందు చూచుకొందము.

ప్రస్తుతము:— 'భూతం భవిష్యత్ప్రస్తౌమి మహద్బ్రహ్మైక మక్షరమ్, బహుబ్రహ్మైకమక్షరం" అన్నట్లు మహదక్షరమే ఈతంత్రమునకు ముఖ్యాత్మ. పురుషుడు కేవలము భోక్త-

ఉద్దేశ్యము, తత్త్వసమష్టి. విధేయ మక్షరాత్మ - ఇదే యీ తంత్రనిష్కర్ష అనియే చెప్పదలచినది.

# శారీరకాత్ర

అధిభూత ప్రపంచమునకు జెందినవై శేషికము "ఈశ్వరు డిచ్ఛామాత్రము గావించును గాని స్వయముగ సృష్టింజేయడు. రాజునిచ్ఛచే అనుచరులట్లు ఈశ్వరేచ్ఛాప్రేరణచే నిత్యనిరవయవ వ్యక్త పరమాణువులే సృష్టికర్మసంచాలకములగును. ఈశ్వరుడు కర్తయు భోక్తయుగాడు. నియంతమాత్రమే అనుచున్నది.

దాని ధరాతలముంబట్టి యదిసుసంగతమే. అది క్షరవిశిష్ట మగు అక్షరము నీశ్వరునిగ నెంచి దానిని నియంత యనుచున్నది. శ్రుతియు నక్షరునే నియంతయనుచున్నది. ఇక వివాదము పరమాణువాదమునకు జెందినది. అవియే మూలకారణములుగావు. ఉపాదాన దృష్టింజూచినచో ఆత్మాక్షరమును మూలకారణ మనవచ్చును. అట్లనక పరమాణవు లనుటకు హేతువు వైశేషిక ముఖ్యోద్దేశ్యము భౌతికప్రపంచము, సామాన్యదృష్టితో భూతప్రపంచపర్యవసానము పరమాణువుల తోడనే యగును కనుక దానినేమియు ననజాలము. కాని పరమాణువులు మూలములైనను జడములు. 'జ్ఞానజన్యా భవేదిచ్ఛా' అన్నట్లు ఇచ్ఛకు మూలము జ్ఞానము. ఇక నియంత ఈశ్వరుడు. అక్షరుడు అవ్యయుని జ్ఞానముచే సర్వజ్ఞుడగుచున్నాడు. అతడే క్షరసంబంధముచే 'సోఽకామయత' అన్నట్లు

సృష్టియిచ్ఛ సేయును. అందువలన జడపరమాణువులు సృష్టి యందు బ్రవర్తించును. కర్తలు భోక్తలు పరమాణువులే - ఇచ్ఛమాత్ర మీశ్వరుడగు నక్షరునిదే. ఈదృష్టితో "ఈశ్వరేచ్ఛచే సృష్టిసంచాలన" మన్నది యీతంత్రమం దాక్షేపము నుండి తప్పించుకొనుచున్నది.

ఇక — ప్రాధానికము — దీనిమతమున నైశేషికేశ్వరుడు (అక్షరుడు) ప్రకృతియే గాని యీశ్వరుడు (పురుషుడు) గాడు. ప్రకృతి తనయిచ్ఛచే దాను జగన్నిర్మాణార్థము వ్యక్తరూపము నొందును. ఈశ్వరుడవ్యయుడు. అతనికి యిచ్ఛతో సంబంధము లేదు. ప్రకృతి జడమేయను నాటంకము పురుషుని స్వాభావిక సహయోగముచే తొలగిపోవును. ఈవిషయము పూర్వతంత్రము నుపసంహారమున జెప్పబడినది. వారి ధరాతలముం బట్టి సాంఖ్యుల యీవాదము గూడ దోషరహితమే. ఎట్లన - ప్రకృతి చేయునది యనుట యొప్పే. యేమన — అదేనిమిత్తకారణము, నియంతయు నగును. దానియిచ్ఛ ఆయవ్యయ పురుషుని స్వాభావిక సహయోగము! అదియు నవ్యక్తరూపముతోగాక వ్యక్తరూపముతో విశ్వమును నిర్మించును. ఈవ్యక్తరూపము పరమాణు వాదతుల్యము. ఈదృష్టితో నిరూపణ శైలియందే కాని ఈతంత్రమందును యేమియు భేదములేదు. దాని నియంత దీనికి ప్రకృతి; దాని పరమాణువు - దీని వ్యక్తరూపము; దాని యీశ్వరేచ్ఛ - దీని ప్రాకృతేచ్ఛ.

ఇక — శారీరక తంత్రముం జూతము. ఇది యీరెంటి

కంటె ముందుకు సాగినది. వైశేషిక - ప్రాధానిక సమ్మత క్షరాక్షర మాత్రముననే సృష్టిప్రక్రియయం దియ్యది కృతకృత్యత నంగీకరింపలేదు. దీనిదృష్టిలో ప్రకృతియే అంతయుగాదు - అక్షరముకంటె నుత్కృష్టము - పరము నగు నవ్యయమను నాత్మయొకటియున్నది. అదే విశ్వమున కాత్మయైయున్నది.

విశ్వమంద స్తి (ఉన్నది) యనబడున దెల్ల నవ్యయవివర్తమే. అవ్యయుడులేనిచో ప్రకృతి గడ్డిపరకనుగూడ వంచనైనజాలదు. 'సర్వంఖల్విదంబ్రహ్మ, బ్రహ్మైవేదంసర్వమ్' ఇత్యాదులందలి బ్రహ్మశబ్ద మీమతమున నవ్యయ వాచకము, సర్వతకధిష్ఠాత యతడే. ఈ బ్రహ్మశబ్దము క్షరాక్షర పరక మన్నచో నవ్యాప్తి దోషమువచ్చును. కారణము? అక్షరక్షరులం దేపని గ్రహించినను అవ్యయ గ్రహణముకాదు. అవ్యయుంగ్రహించిన నన్నియు గృహీతములే యగును. ఎల్లవివర్తములును అవ్యయ గర్భమం దిమిడి యున్నవి. లోకత్రయాలంబనమతడే - అతడే సర్వేశ్వరుడు. అవ్యయ శాస్త్రమునందలి యీయవ్యయ వచనము లగయుడు —

"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరః సర్వాణిభూతాని కూటస్థోఽక్షరఉచ్యతే
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపి చోత్తమః
అతోఽస్మిలోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః."

వైశేషికము — "విశ్వము పరమాణూత్పన్నము; క్షరవిశి

ష్టాక్షరమే ఈశ్వరుడు జగన్నియంత" యనును. ప్రాధానికము- "జగత్తు ప్రకృతి (అక్షరయుక్తక్షరము) నుండి పుట్టినది; పురుషుడుభోక్తమాత్రము" అనును. శారీరకము - విశ్వకర్త - భర్త- ధర్త - భాగ్యవిధాత అవ్యయుడే. సంచరమున నాతడే అంతయునగును. విశ్వము ఐతదాత్మ్యము, ఏతత్సత్తచే నంతయు నన్నియు సత్తులగును; ప్రతి సంచరమున నతడే స్వస్వరూపమున మిగులును; అన్నియు నంతయు నతడే. 'సర్వం ఖల్విదంబ్రహ్మ' 'బ్రహ్మైవేదంసర్వమ్' అతడే అంతయు నన్నియును అక్షర - క్షర - జీవ - విశ్వము లన్నియు నతడే. అట్టిచో బ్రహ్మ-జగత్తు అనుద్వైతమెట్లు? కనుక: బ్రహ్మయే జగత్తనవలయును. ప్రవివిక్తుడగు నతడే సృష్టరూప పరిణతి గాంచి విశ్వమనబడును. ప్రవిష్టరూపమున విశ్వేశ్వరుడు; ప్రవివిక్త రూపమున విశ్వాతీతుడు నతడే. (విశ్వము - విశ్వాత్మ - విశ్వాతీతుడు.) సాలెపురుగు అన్యసహాయము లేకుండనే తనవలకు దానే అన్నియునైనట్లుగ నిట నెంచవలయును. - 'ఐతదాత్మ్యమిదంసర్వమ్' అనుచున్నది.

నిజముకూడ నిదే: ఏమన – విశ్వమూలమగు ప్రాధానిక ప్రకృతి పురుషుడు లేకున్న నేమియు సేయజాలదు. (పంగువు) అదియు పురుషగర్భమునుండి పుట్టినదే. కనుక అవ్యయుడే విశ్వమూల మనవలయును.

విశ్వమననేమి? అన్నచో – ప్రాధానికము – సత్త్వాదిగుణవిషమావస్థ యనును. ఈగుణత్రయాభిమానముచే సాంఖ్యులు

ప్రకృతినే విశ్వమూలమనియు నందురుగాక! సత్త్వాదులకు స్వరూపమేమి? యన్నచో వారు తప్పనిసరిగా: 'అవి వరుసగ జ్ఞాన - క్రియా - ర్థమూర్తు' లనవలయును. అట్లయినచో అనగా: విశ్వము జ్ఞాన క్రియార్థ శక్తుల విజృంభణమే యగుచో బ్రకృతిని ఈగుణవాదులు జడమనుచున్నారు గదా! అది స్వవచనవ్యాఘాతము కాదా?

"ప్రకృతి సత్త్వగుణోపేత సత్త్వము జ్ఞానమూర్తి" యనుచో ప్రకృతి జడత్వసిద్ధాంతము నిలుచునా? కనుక వారు గతిలేక 'ప్రకృతియుక్క- జ్ఞానక్రియార్థ మూర్తులగు సత్త్వరజస్తమస్సు లనుమూడు గుణములును తప్పక మరొక రిచ్చినవే యను నిశ్చయమునకు వచ్చి తీరవలయును. ఎటనుండి యీ గుణమయ ప్రకృతి పుట్టినదో ఎచ్చోట నుండి జ్ఞాక్రియార్థములనది కైకొని, వానిచేత తనగుణ స్వరూపరక్ష గావించు కొనుచు జగన్నిర్మాణా భిమానముం బూనుచున్నదో ఆస్థాన మీశారీరకుల యవ్యయ పురుషుడే. 'తస్యైవమాత్రా ముపాదాయ' అన్నట్లు ఆయన వలననే అన్నిటికి జీవన యాత్రా నిర్వాహము జరుగుచున్నది.

దీనినే మరొక విధముగ నూతము:— విశ్వపదార్థములందు బ్రతిపదార్థమును నైదుభాగము లనుకొనవచ్చును. 1. భౌతిక వర్గము (అన్నము) ఇంద్రియ గమ్యస్థూల పదార్థములు 2. ప్రతి భౌతిక పదార్థమును అందలి భూతసంఘము నేకసూత్ర బద్ధము గావించి స్వస్వరూపమున సురక్షితముగనుంచు నొక

శక్తి యుండును. వైజ్ఞానికులు దానిని 'విధర్త' యందురు. అదిలేనిచో వస్తుస్వరూపము చెడును. వస్తువునందలి భూత పదార్థమును (Matter), విధర్తను (Force) అందురు. ప్రతి వస్తువునకును ఈరెండును వేర్వేరుగనుండును. ఇందు విధర్తయే క్రియాతత్త్వము (ప్రాణము) అందురు. ఇది రెండవది 3. విజ్ఞాన దృష్టికి జడచేతనము లెల్లనుప్రాణులే. అన్నిటను సామాన్య జ్ఞానమును జ్ఞానశక్తి యొకటి యుండును. ఈసామాన్య జ్ఞానముచే పశుపక్ష్యాది ప్రతిసేంద్రియ ప్రాణియు వస్తుసామాన్య జ్ఞానము నొందగలదు. ఇదే మూడవదగు మానస జ్ఞానము 4. ఇది కాక విజ్ఞానమనునది మరొకభాగము. ఇదే విశేషజ్ఞానము. ఇదియు జడచేతనములన్నిట నుండును గాని విశేష పదార్థము లందే యువికసించుచుండును. కనుక నిది విశేషజ్ఞానమందురు. పక్షులందు, పశువులందు, గొన్ని యెంతెంతో తెలివి తేటలు గలవై యుండును. ఇదే వాని విశేషజ్ఞానము లేక విజ్ఞానము. అది వానిమంచితనమునకు మాహాత్మ్యమునకు గారణమగుచుండును. ప్రాణులెల్ల సమానములయ్యు కొన్ని పక్షులందు కొన్ని పశువు లందు కొందరు మనుష్యులందు పరస్పరము ఎంతో విశేషత యుండును. ఒకచిలుక రాజభవనమున సుఖించును; వేరొకటి యన్నములేక మాడుచుండును. ఒకడుధనవంతుడు; ఒకడు పేద వాడు. ఒకనికి జ్ఞానమధికము; మరొకడు పరమమూర్ఖుడు. ఇట్టి విజ్ఞానాత్మక జ్ఞానమందలి తారతమ్యములు; సామాన్య జ్ఞానము. మనస్సునకు-నిది బుద్ధికి జెందినదగుట- నిది బౌద్ధజ్ఞాన

(విజ్ఞాన) మందురు. 5. ఆనందము:—అందరకు ననుభూతమే. ఇట్లు:— విశ్వమననేమి? అన్నచో 1. భూతప్రపంచము (అన్నము) 2. క్రియాప్రపంచము (ప్రాణము) 3. జ్ఞానప్రపంచము (మనస్సు) 4. విజ్ఞానప్రపంచము - (విజ్ఞానము - బుద్ధి) 5. ఆనంద ప్రపంచము అను పంచపదార్థములు తోచును.

త్రిగుణాభిమానులీద్వైదిటిలో భూత - క్రియా - జ్ఞానములను తమ సత్వ - రజ - స్తమనస్సులచే నెట్లట్లో సమాధానపరచెదరుగాక! విజ్ఞానానందముల నెచట వెదకెదరు? ఇది యొక విచారణీయ ప్రశ్న. వస్తుతః ఈద్వైదుకు వారికి చిక్కు ప్రశ్నలే. ఇక: అన్యాయానుగాములగు శారీరకుల కన్ననో ఈసమస్య ఒకలెక్కలోనిదే కాదు. అవ్యయుని ఆనంద - విజ్ఞాన మనః ప్రాణవాఙ్మయకోశములు తేటతెల్లములే (చూడుము తైత్తిరీయమును). అవ్యయుని అన్నమయ కోశమునుండి భూతవర్గము, ప్రాణామయ కోశమునుండి క్రియా ప్రపంచము, మనోమయ కోశమునుండి మానస జ్ఞానము, విజ్ఞానమయ కోశమునుండి బౌద్ధజ్ఞానము ఆనందమయ కోశమును శీఆమోద-ప్రమోద - హర్ష - ఉల్లాస - సుఖాది భేదములుగల సాంసారిక సమృద్ధానంద ప్రపంచమును వికసిల్లెను. ఇందానందమయ కోశము సర్వప్రధానమని 'ఆనంద మయోఽభ్యాసాత్' అను వీరి సిద్ధాంత సూత్రము స్పష్టపరచును కనుక నీరెండవ దృష్టిచేతను అవ్యయుడే సర్వమన్నది యంగీకరింపవలయును.

మరియు ముందుకు బోదము:— సృష్టి - ముక్తుల కవ్యయు

డధిష్ఠాత యంటిమి. సాంఖ్యము సామ్య - విషమావస్థలను జెప్పి సృష్టి - ముక్తులకు సమాధాన మీయజూచెను. కాని ఈసమతా - విషమతలకు మూల మేమో యది చెప్పదయ్యెను. ఆమూల మీయవ్యయపురుషుడే. అతడు పంచకోశాత్మకుడంటిమిగదా! ఇందు ఆనంద విజ్ఞానము లోకవిభాగము - ప్రాణవాక్కు-లోక విభాగము - మధ్యనున్న మనస్సు రెంటికి జెందదు. ఇట్లు ఆనంద విజ్ఞాన మనసులోకటి - మనః ప్రాణ వాక్కు- లోకటియునగును. అందు మొదటిది ముక్తికి, రెండవది సృష్టికి ప్రవర్తకములు. మొదటిది విద్యామూర్తి - రెండవది కర్మమూర్తి. కొంతతడవు మొదటిదాని నటుంచి రెండవదగు సృష్టిప్రవర్తకమనః ప్రాణవాఙ్మూర్తి కర్మావ్యయమును జూతము.

తన స్వాభావికసృష్టికా మనోదయ మవ్యయమనోభాగమందగును. ఇచ్ఛానంతరము ప్రాణవ్యాపారము జరుగును. తరువాత వాగ్వ్యాపారము, మానస వ్యాపారము, కామము, ప్రాణవ్యాపారము, తపస్సు. వాగ్వ్యాపారము శ్రమ ఇవి సృష్టికి సామాన్యానుబంధములు. ఏసృష్టికైన నివితప్పక యుండవలయును. వైదికులీ మూటిని కామ క్రతు దక్ష నామములం బిల్తురు. నైయాయికులు ఇచ్ఛా - కృతి - కర్మ లందురు. ఇవి మూడు నవ్యయ ప్రజాపతి వ్యాపారములు కనుక నే సృష్టిప్రతిపాదక శ్రుతులందు పదే పదే "సోకామయత-సతపోఽతప్యత - సోఽశ్రామ్యత్" అని కన్పట్టుచుండును 'సః' ప్రజాపతి వాచకము. ప్రకృతియే ఈ సర్వవ్యాపారములకు నధిష్ఠాత్రి యగుచో 'సః'కు బదులు 'సా'

యుండును. ఈ కారణము లన్నిటివలనను కేవలమవ్యయునే 'సర్వ' మందుము. ప్రాధానికులో అవ్యయపురుషునకు సృష్టితో సంబంధములేదందురు. సర్వమాన్యమగు గీతాశాస్త్రముకూడ గతి-భర్త - ప్రభవ - ప్రళయభర్త - భోక్త-ద్రష్ట-అనుమంత- అన్నియు నవ్యయుడే యనుచున్నది. చూడుడు:

"గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానమ్ నిధానం బీజ మవ్యయమ్
ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతిచాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః"

విద్యాత్మకమగు నాయవ్యయ మనస్సే ముక్తిసాక్షి. కర్మాత్మకమగు నాయవ్యయ మనస్సే సృష్టిసాక్షి "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" ఇచ్ఛ మనోధర్మము. ఆయన తన యిచ్ఛాతపశ్శ్రమలను తనయంశమగు ప్రకృతి కిచ్చి వేయును. అందువలన నది యాయవ్యయుని మనస్సుచే జ్ఞానమూర్తియగు సత్వభావమును, ప్రాణముచే క్రియామూర్తియగు రజోభావమును, వాక్కుచే అర్థమూర్తియగు తమోభావమును గలదై (సత్త్వరజస్తమోమయియై) అంతయు అన్నియు జేయజాలుచున్నది. ప్రాధానికులు:- సృష్టియం దిచ్ఛకూడ తావు లేదందురు. శారీరకులో "ప్రకృతికి సొంత మేమియు లేదు. దాని గుణ విభూతియంతయు నవ్యయుడిచ్చినదే 'మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్' అన్నట్లాయన

ముక్నక్షేత్రమున ఆయన సంపత్తింగానియే అది విశ్వమును [illegible] పజాఁబును. అట్టిచో తేనెపట్టునుండి రాజు యీఁగనువలె అన్యాయము [illegible]వేయుటా?" అందురు.

ప్రాధానికులు: — "అన్యాయుడా ప్తకాముడు-నిష్కాముడు - అతని కిచ్ఛతో బనియేమి! జ్ఞానసహాయోగముమాట యటుండనిమ్ము. అది ఆయన యిచ్ఛతో బనిలేకుండనే ప్రకృతి పొందునది" అన్నచో అస్మదీయ వాదులు — "అతడు నిష్కాముడన్నను కర్మయతని స్వరూప ధర్మము. నిష్కామభావమున గర్మ సేయుచున్నను నతడకర్త, నిర్లేపుడు అనబడును "నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి" స్వాభావిక ప్రకాశసహాయోగ మాట గనుమాట. స్వభావముమాత్రమే యొకవిధమగు నిచ్ఛకాదా? ఎవని యిచ్ఛ స్వభావతః నిగ్రహానుగ్రహములొనరింపవలయునని యుండునో వాని యిచ్ఛ వానిస్వభావమునందంతర్భూతమేకదా! "నాస్వాభావిక జ్ఞానక్రియార్థశక్తులచే ప్రకృతి విశ్వనిర్మాణము సేయుగాక" యని యాయన యిచ్ఛగల్గియున్నాడు. మీసూర్యదృష్టాంత మిందువలన సమాప్తమగుచున్నది. "నావలన ప్రాణులు తమతమ కర్మ సంచాలనము గావించు కొందురుగాక" యని ఆయనస్వాభావికేచ్ఛ యనుకోరాదా?" అందురు.

మరియు "ఈకర్మయందాయన యిచ్ఛయున్నచో నాయన కర్మఫలభోక్త గావలసివచ్చు" నందురా? "మీరాయన

యిచ్ఛలేకుండగనే ఆయనను భోక్తయని యంగీకరించిరిగదా! ఇక మాదృష్టితోడనే ఆయన యిచ్ఛయున్నను ఉత్థితాకాంక్షారూప నిష్కామ భావముచే స్వాంతుడై భోగలేపరహితుడై యుండును. గుణభావ ప్రవర్తిమగు గుణభావయుక్తుడయ్యు నిర్గుణుడుగనేయుండును. ఈవచనము జూడుడు —

"అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోఽపి కౌన్తేయ! నకరోతి నలిప్యతే" అందురు.

అవ్యయుడన్నియు నన్నియు చేయును కాని; నిష్కామభావముతో అతడు కర్తయేయయ్యు నకర్త. "తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయమ్" అనువచన రహస్యమిదియే కనుక సృష్టి పర్యవసానమవ్యయుడే యనవలయును. ఈస్థితిలో అవ్యక్తవాదులు "సృష్టిఅవ్యక్తసారము; సంచరమున నవ్యక్తము నుండి యేకల్గును; ప్రతి సంచరముననందే లీనమగును. ఉపక్రమోపసంహారములు అవ్యక్తమే. పురుషునకు సృష్టితో సంబంధము లేదు" అనుట పాటిసేయ దగినమాట గాదు. వస్తుతః పరుడనబడు నవ్యయుడే సృష్టికుపక్రమోపసంహారములు. ఈశ్రుతి వచనము నరయుడు —

"గతాఃకలాః పంచదశ ప్రతిష్ఠాం దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు
కర్మాణివిజ్ఞాన మయశ్చ ఆత్మా పరే ఽవ్యయే సర్వఏకీభవన్తి"
(ముండక)

మన శరీరసంస్థయందు ప్రత్యగాత్మ, శారీరాభిమానియగు శారీరకాత్మ యను రెండాత్మ వివర్తములున్నవి. ఇందు మొదటిది పురుషాత్మ (అవ్యయాత్మ); ఇదే పరమాత్మ - ఇదే అద్వైతభావమునకు మూలప్రతిష్ఠ. రెండవది ప్రాకృతాత్మ (అక్షరాత్మ); ఇదేజీవాత్మ. వస్తుతః, జీవాత్మయు నామొదటిదే కాని, అవిద్యాది ప్రతిబంధకధర్మ సంపర్కమున తనవ్యాపకమగు నవ్యయభావము మఱచి దుఃఖమూలకమగు ద్వైతభావమునకనుగామి యగుచున్నది. ప్రస్తుతతంత్రము (శారీరకము) ఈ శారీరకాత్మ నుద్దేశ్యముగ బెట్టుకొని దీని కావ్యాపకబోధను గల్గించును. ఇదే ఈ శారీరక తంత్రమునకు విధేయము కనుకనే దీనికి శారీరకనామధేయము వెలసినది. ఇది వేదాంత (ఉపనిషత్) సమ్మత వ్యాపకోపనిషద పురుష (అవ్యయ) ప్రాప్తికుపాయము జెప్పున దగుటచే వేదాంతదర్శన మనియు బిలువబడును. మూడు దర్శనతంత్రములందును గర్జించునది వేదాంతకేసరియే. ఇదే దీని సంక్షేపము.

'తావద్గర్జన్తి శాస్త్రాణి జంబుకావిపినేయథా
నగర్జతి మహాశక్తి ర్యావద్వేదాంతకేసరీ'

శ్రీమద్భగవద్గీతాత్మ:— శారీరక తంత్రవిధేయ మగు నవ్యయపురుషుడే గీతాతంత్రమునకు విధేయము. సామాన్యదృష్టికిది దర్శనశాస్త్రమనియు, శారీరకాంతవ్యాఖ్యతమనియు దోచును గాని స్వతంత్రశాస్త్రముగ పొడకట్టదు. కాని వాస్త

వమున కట్లుగాదు. ఇది దర్శనముగాదు. [illegible]తార్థమును గాదు. ఒక స్వతంత్రశాస్త్రము.

“ఇదేమి! శారీరకమునకును దీనికిని విధేయ మొకటియైనపుడు తత్సమానవిషయ నిరూపణము గల యిది వేరనుట యెట్లు?” అన్నచో ప్రకరణసంగతి కొరకించుక సమాధానము. విస్తృతముగ మరొకచో విమర్శించుకొందము.

దర్శనశాస్త్ర సంబంధము వాచికభావములతో నగుచో విజ్ఞానశాస్త్ర సంబంధము వ్యావహారికభావములతో నుండును. “బ్రహ్మ అట్టిది - ఇట్టిది - నిర్వికారము - నిర్గుణము - నిష్క్రియము - నిరంజనము - తద్జ్ఞానముచే బరాముక్తి కల్గును.” అనునీ మొదలగు శబ్దప్రపంచైకసార మగు వాచికభావమును దర్శనమందురు. ఇక: “బ్రహ్మప్రాప్తి కిది యుపాయము. తద్వైజ్ఞానిక స్వరూపమిది; సంసారమున నుండియు, తత్కర్మానుష్ఠానము జేయుచున్నను, ఈ యీ యుపాయములచే బ్రహ్మవిభూతి నందగలము.” అనునీ మొదలగు వ్యావహారిక భావములం జూపుట విజ్ఞానము. ఇట్లు దర్శనవిజ్ఞానములకు అహోరాత్రముల కున్నంత భేదమున్నది.

స్వరూపమును వర్ణించునది దర్శనము. తత్ప్రాప్తికి వ్యావహారికోపాయము జెప్పునది విజ్ఞానము, దృష్టిదర్శనము, విత్తి విజ్ఞానము, బ్రహ్మదర్శనము, యజ్ఞము, విజ్ఞానము. ఈపరిలేఖ నవలోకించినచో భేదము తెలియనగును.

| దర్శనము | విజ్ఞానము |
| --- | --- |
| ఫిజిక్సు | కెమిస్ట్రీ |
| ఋక్ | యజుస్సు |
| థియోరెటికల్ నాలెడ్జి | ప్రాక్టికల్ నాలెడ్జి |
| ఫిలాసఫీ | సైన్సు |
| సిద్ధాంతమాత్రము | ఆచరణమార్గము |
| తటస్థము | వ్యావహారికము |

గీత వాచికభావముతో వ్యావహారిక స్వరూపముంగూడ దెలుపుచున్నది. అవ్యయమోక్షలబ్ధికి బుద్ధియోగము నాశ్రయింపు మనుచున్నది. బుద్ధియందలి వైరాగ్యజ్ఞానైశ్వర్య ధర్మములను స్వాభావికగుణములకు ప్రతిద్వంద్వులయిన యాసక్తి - మోహా అస్మితా - భినివేశములను నవిద్యాభావాక్రమణమున దిరోభావ మేర్పడుచున్నది. ఆత్మ - విద్యాబుద్ధికి మధ్య నివి చొచ్చి, బుద్ధియోగ సంపద్వంచనము నేయుచున్నవి. అందుచే స్వాభావికము నిత్యమునగు నాయాత్మానంద ప్రాప్తిలేమి, క్లేశవత్త్వము, దుఃఖముకల్గుచున్నందున, ఆత్మకో విద్యాబుద్ధియోగముగల్గించుటకు జతుర్విధములగు బుద్ధియోగములందు దేనినైన నొకదాని నాశ్రయించుచో సఫలుల మగుదుము; జీవన్ముక్తుల మగుదుము.

ఈ చతుర్విధ బుద్ధియోగ నిరూపణజేయు వ్యావహారిక శాస్త్రమగుటచే గీత విజ్ఞానశాస్త్రము. బుద్ధియోగములేనన్న అవ్యయసాక్షాత్కారములేదు. అభ్యాసముచేయుటదప్ప సతతము

లందెందును లేనేలేదు, కనుక నిది యపూర్వ ప్రతిపాదక శాస్త్రము. (గీతావిజ్ఞానముం జూడుడు)

మరియు, శారీరకము నిజముగ నవ్యయ స్వరూప నిరూపణమున నున్మగ్ధభావము నాశ్రయించినదనుటకు సంశయింపబని లేదు. అది దర్శనదృష్టితో అవ్యయము ననుమానముచే నిరూపించినది. అందు విస్పష్టముగా నవ్యయస్వరూపము ధ్వనితము కాలేదు అనగా:-

వైశేషికము:- క్షరముద్వారా అక్షరముపై; ప్రాధానికము:- అక్షరముద్వారా అవ్యయముపై సాధారణదృష్టి యుంచినట్లే, శారీరకమును, అక్షరద్వారముననే, మనోదృష్టి నవ్యయుని వంక నాకర్షించుచున్నది. ఇందుపాధికావ్యయ నిరూపణయే జరిగినది. బుద్ధియోగముతోడి విశుద్ధావ్యయ స్పష్టీకరణమిందు చాలవరకు లేదనవచ్చును; కనుకనే గీతావిజ్ఞానమునందిది అక్షర నిరూపకతంత్రమంటిమి. దీని నిరూపణశైలింబట్టి ఇది యక్షర ద్వారమున నవ్యయుంజేరునని యనియో, అవ్యయరూపమునకే వస్తువుగ నెంచినదనియో తోచును. "అక్షర ధియాం త్వవరోధః సామాన్య తద్భావాభ్యామౌపసదవ త్తదుక్తమ్." అను సూత్ర మీశైలిని సూచించుచున్నది. ఈయక్షర దృష్టితో జూచిన శారీరకమునుమించి గీతయే ముందుకుసాగినదనవచ్చును. అవ్యయ దర్శన - విజ్ఞాన - బుద్ధియోగములకు శాస్త్రమనుట గీతకే తగును. అవ్యయునకు పర స్పష్టీకరణముచే విశుద్ధావ్యయుని, తత్ప్రాప్త్యుపాయ భూతబుద్ధియోగమును, ఇది నిరూ

పించనట్లెందును లేదనగలము. అవ్యక్తవాదులను గీత యణాగ ద్రొక్కినట్లు ఏశాస్త్రము నంతపని సేయలేదు. తన యీ విశుద్ధాన్వయ విజ్ఞానబలమున గీత యవ్యక్త వాదులను నిరసించు నీవచనముతీరు గమనింపదగినది:—

'అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరంభావ మజానన్తో మమావ్యయ మనుత్తమం'

"బుద్ధిహీనులు (ప్రాధానికులు) అవ్యక్తము (ప్రకృతి) నే వ్యక్తి (దేహ) రూప పరిణతినొందినట్లెంతురు. అనగా, నాపరా ప్రకృతి యనబడు, అనగా నాయొక్క వ్యక్తి ప్రకృతియే యీ రూపము వ్యక్తమయ్యెనని కొందురు. ఈ భ్రాంతికి కారణ మేమనగా:— సర్వోత్తమము అవ్యయము నగు నా పరభావమును నాఱెఱుంగమి."

ఇందలి 'అబుద్ధయః' అను పద మెంతో చమత్కారము గలది. ప్రాధానికులతత్త్వములు 24. ఇందు బుద్ధిచేరలేదు. మహా న్మనస్సు నాకిలక్ష్యము. తరువాతి వ్యాఖ్యాతలు అంతఃకరణ శబ్దముచే బుద్ధిని గ్రహించి దానిని మహత్తునం దంతర్భావము జేయుటకు యత్నించిరి. కాని సూత్రకారుడు మహన్మనస్సు కంటె వేరుగ నెంచును బుద్ధితత్త్వము నుల్లేఖింపలేదు. వస్తుతః అంతఃకరణమన మనస్సునకే పేరు. ఇంద్రియములు బాహ్యకర ణములు. తత్సంచాలక మగుమనస్సు అంతఃకరణము. ఇది బుద్ధి యనదగదు. అంతగా బట్టువట్టిన మనోమయ బుద్ధి సంతః

కరణ మనవచ్చును. అపుడు మనస్సునకే గాని బుద్ధికి ప్రాధాన్య ముండదు. ఇందు బుద్ధి మనస్సుననుగమించును. దానికి స్వాతంత్ర వ్యక్తిత్వము నశించును. ఇట్టిబుద్ధిని బుద్ధియనుట యసంగతము.

మానసజ్ఞానము జీవస్వరూప సమర్పకమగు అక్షరముపై పర్యవసించును. అటు "యోబుద్ధేః పరతస్తుసః" అన్నట్లు అవ్యయుడన్ననో బుద్ధి ద్వారముననే గమ్యుడు. ప్రాధానికుల కడ నాత్మయోగ (అవ్యయయోగ) మున కనుగామి యగుబుద్ధి యోగమేది? వారితత్త్వవాదమందు మనస్సునకు - లేదా మనోమయబుద్ధికిమాత్రమే స్థానమున్నది. కనుక వారి దృష్టి మానసజ్ఞానమునకు జెందిన అక్షరునివరకే సీమితమగును. ఈరహస్యమును గురించియే 'అబుద్ధయః' అని చెప్పబడినది. సాంఖ్య తత్త్వ వాదమును సమాలోచనా పూర్వకముగ మీమాంస సేయుట కింత కంటె మంచి పదములేదు.

ఇట్లే అవ్యయజ్ఞానాభావము నొక రెండవ కారణముగా జెప్పుచు భగవంతుడు "నాహం ప్రకాశః సర్వస్య యోగ మాయాసమావృతః మూఢోఽయం నాభిజానాతిలోకో మా మజ మవ్యయం" అనియెను.

"యోగమాయావృతుడ నగుటచే (యోగమాయాను గాములగు) సర్వసాధారణు లందరకు నే నెఱుకపడను. ఈమూఢలోకము విశ్వ - క్షరా - క్షరుల కంటె బరుడనగు నన్నునవ్యయు నెరుంగదు"

ఇందలి 'యోగమాయా సమావృతః' అన్నదే అవ్యయజ్ఞా

నాభావప్రధానహేతువు. మహామాయ, యోగమాయ యని మాయ రెండు తెరంగులు. సంపూర్ణవిశ్వమందవిభక్తరూపమున వ్యాప్తుడైయున్న యవ్యయుని స్వరూపమును సంపాదించునది మహామాయ. విశుద్ధాద్వైతులు దీనిని 'చిచ్ఛక్తి' అందురు. ఇది యాచిదాత్మ కభిన్నము. దీనివలన ద్వైతమునకు బాధలేదు. వాల్లభుల శుద్ధాద్వైతమిదే. ఇదే భగవన్మాయ. 'మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే'' అన్నట్లీ మహామాయ, ఈయాద్యచిచ్ఛక్తి, యాచిదాత్మప్రాప్తి కన్యతమ ద్వారము. అవ్యయునట్లిది విశుద్ధ సత్వస్వరూపము.

రెండవది యోగమాయ — ఇది మహామాయా గర్భమున దానితోడనే యుండి జీవసృష్టిసంచాలన సేయును. త్రిదేవభేద మున త్రిగుణస్వరూపమై విశ్వసంచాలన సేయుచున్నది యిదే. మహామాయ కవ్యయునితోడను. దీనిక క్షరునితోడను సంబంధము. అక్షరునకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మూడువివర్తములు. వరుసగా జ్ఞానక్రియార్థ మూర్తులగువీరు సత్త్వరజస్తమోగుణములకధిష్ఠాతలు. "తనశక్తి తన కుపయోగింప నయితిగా'' దని విజ్ఞానసిద్ధాంతము. మహేశు డర్థపతి. విష్ణువు క్రియాపతి. బ్రహ్మ చిత్పతి. బ్రహ్మసత్వజ్ఞానవిభూతిని శివుడుపయోగించును. ఆజ్ఞానముచే నతడు ముక్తి కధిష్ఠాతయగును. శివుని యర్థశక్తిచే బ్రహ్మ సృష్టింపసమర్థుడగును. ఇకమధ్యగత విష్ణువాయుభయుల యుభయ శక్తులతో తన క్రియాశక్తిని మేళవించి విశ్వముం బాలించును. ఇట్లు వీరు సృష్టిస్థితిలయ కారకు లగుచున్నారు.

ఈమూపురి సమష్టి యక్షరము. ప్రాధానికుల యవ్యక్తమిదే. దీనిశక్తి యోగమాయ. ఇది త్రిగుణమయి. అక్షరభేదమున దీనికి బ్రహ్మమాయ విష్ణుమాయ శివమాయ యని మూడు వివర్తములు.

విష్ణువుసోమవంశి - సోమము సంకోచధర్మి - ఇది వికాస ప్రతిద్వంద్వి-అగ్ని వికాసమూర్తి. దీనికి బ్రభవము సూర్యుడు. సంకోచమూర్తి యగు సోమమునకు బ్రభవము చంద్రుడు. వికాసభావాత్మక సౌరాగ్ని బుద్ధికిబ్రతిష్ఠ. సంకోచ భావాత్మక చాంద్రసోమము మనస్సునకు బ్రతిష్ఠ. మనః ప్రాబల్యముచే బుద్ధిస్వాభావికవికాస మణగును. బుద్ధి వికసనములేమి మోహము. ఇదే సంమోహము. దీనికి బ్రవర్తకుడు సోమవంశి. విష్ణుసహచారిణి యోగమాయ. "తదస్యహరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి" అన్నట్లది ప్రజ్ఞస్థిరతను హరించును కనుక నది హరిమాయ యనబడును. "యోగ మాయాసమావృతః తయా సమ్మోహ్యతే జగత్"

ఇంతకు త్రిగుణభావ మీయోగమాయకు జెందినదనియే చెప్పదగినది. ఇదే అక్షరము ద్వారా జీవునకు, క్షరము ద్వారా జగత్తునకు నధిష్ఠాత్రియగును. "ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" ఇది దురత్యయ. "దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" జీవజగత్తులు నానాత్వయుక్తములు. ఇందుకు మూల మీ యోగమాయ. తన గుణభావముచే నిది

యసంఖ్య రూపములను ధరించును. మహామాయ, ఈశ్వరు డను నవ్యయ సంబంధముచే నొకటే గాని యోగమాయ, అక్షరజీవ క్షరజగన్నానాత్వమున అనేకము. ఈ యసంఖ్య యోగమాయల త్రిగుణభావము విశుద్ధ సత్త్వమూర్తి యగు నా మహామాయి యవ్యయుఁడు తిరోహితు డగునంతగా బెరిగినది. మనదృష్టి గుణభావ మయియగు యోగమాయపై నున్నంతవరకు క్షరాక్షరులే గాని తదతీతుడగు నవ్యయు డగ పడడు. అవ్యయస్వరూపము యోగమాయా సమావృతమై యున్నదనియే భగవంతుని యభిప్రాయము.

ఇక:— ప్రాధానికుల ముఖ్యలక్ష్య మీ గుణ ప్రకృతియే. కనుక వారు మూర్ఖులు. అవ్యయుందర్శింపజాలరు. 'అబుద్ధయః' అనుటచే వారు బుద్ధియోగ వంచితు లనియు 'మూఢోఽయం' అనుటచే మనశ్చక్ర బద్ధులై యున్నారనియు భగవంతుడు సూచించు చున్నాడు. దీనిచే స్పష్టీకరించు నీ భగవద్వచన మును గమనింపుడు.

''త్రిభి గ్గుణమయైర్భావైః ఏభిః సర్వమిదం తతమ్
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయం''

''త్రిగుణయగు నవ్యక్తప్రకృతిచే దృశ్యప్రపంచము వితతమై నది. చివరకు దానిచే నవ్యయుడును ముగ్ధభావము నొందెను. ఈవిశ్వమం దవ్యయు డెట్టివాడు? అక్షరుడెట్టివాడు! క్షరుడెట్టి వాడు? అనియెరుంగుట కఠినమై పోయినది. అందరును గుణ

భావ రంజితులై యున్నారు; కనుకనే ప్రాధానికు లీగుణాతీతుని, పరుని అవ్యయుని గురుతింప జాలకున్నారు" గుణత్రయచంక్ర మణమునం దిరుగాడు వారు అవ్యయ దర్శనము నొందలే కున్నారు. అని తాత్పర్యము. మఱి, అవ్యయదర్శన మెపుడు? అనగా జెప్పుచున్నాడు.

"దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా
మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే"

"ఈదైవియు, గుణమయియునగు నామాయ దుస్తర. నాయందు అనన్య భావమున బ్రపత్తిలక్షణాత్మ సమర్పణము సేయువారు దీనిందరింపజాలుదురు"

అవ్యయ తత్త్వము బ్రహ్మ - అక్షరతత్త్వము దేవత, క్షర తత్త్వము భూతము, దేవతా వికాస మక్షరునుండికల్గినది. గుణ భావమయి యగుయోగమాయ అక్షరమాయ; కనుక దీనిని 'దైవి'అనెను. మహామాయయో అవ్యయునిది. బ్రాహ్మీమాయ అతని యక్షరునిది. యోగమాయ దైవీమాయ. దీనికి మానస ప్రపంచముతో సంబంధము. ఆసక్తికి మూలప్రతిష్ఠ మానస భావము. ఆసక్తినిరాకరణము సులువైనదనిగాదు;కనుక తన్మూ లమగు దైవీమాయ దురత్యయయనిచెప్పబడినది. దీనిందాటుట కుపాయమొకటే. అవ్యయానన్యనిష్ఠ, శరణాగతి, ఇదే ప్రపత్తి. బుద్ధియోగము ననుగమించుచు నవ్యయునంతటను భావించుచో శారీరకాత్మ ప్రత్యగాత్మలక్షణ హృదయ స్థావ్యయునివంకకు

ప్రపన్నమగును. అట్లగుకొలదియుమాయాశైథిల్యము.అవ్యయు నందు పూర్ణప్రపత్తి కలుగగా ఆమాయ దానియంత నదే నివృత్తినొందును. సర్వధర్మ (క్షరాక్షరధర్మ) పరిత్యాగ పూర్వ కానన్యయోగాశ్రయము గొనకున్నంతవరకు అవ్యయుబో ధయు ప్రపత్తియు కలుగదు. అంతవరకు ప్రకృతినుండి విముక్తి యునులేదు "ప్రకృతిందప్ప నవ్యయుడన నేమోయెరుంగని మీ రాతని నెల్లు గుర్తింతురు" అని యొకవిధముగా భగవంతుడు ప్రాధానికులను కటాక్షరూపమున నాక్షేపించుచున్నారు.

"మీప్రధానలక్ష్యము తత్త్వవాదము. అది యవ్యక్తముతో అంతమగును ఇకనంతకంటె పరమందేమైన నున్నదా? లేదా? యని యెరుంగవలసిన యవసరము మీకెట్లుకల్గును? అవ్యక్త మొక తంత్రాయిచే తంత్రాయితమై విశ్వరచనా సమర్థ మగు చున్నదను విచారణ మీకెట్లుకల్గును? అందువలన నీసూక్ష్మ మీమాంసలేని మీరా యవ్యక్తాతీతుని, సనాతనుని, అవ్య యుని చేరజాలరు" అను నీ యభిప్రాయముతో ఆయవ్య యేశ్వరుడు పల్కుచున్నాడు:—

"అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రై వావ్యక్త సంజ్ఞకే ॥
అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥
పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి॥"

"అవ్యక్తశబ్దము మీకంత ప్రీతికరమగుచో మీరనుకొను దాని (అక్షరుని) కంటె నొక గొప్పయవ్యక్త (అవ్యయ) మున్నది. దానిం బ్రేమింపరాదా?" అనియు నాక్షేపించు చున్నారు.

"పరాగతి (ఉత్తమగతి) నిచ్చువాడుగనుక అక్షరు డారాధ్యుడు" అని మీరు మోహపడుచో నేనొక శ్రేష్ఠమార్గము జెప్పెదవిను డనుచున్నాడు.

"అవ్యక్తో ఽక్షర ఇత్యాహుః తమాహుః పరమాంగతిం,
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమంమమ"

తాత్పర్యము:— క్షయునకు సంసారగతి తోడను, అక్షరునకు స్వర్గగతితోడను సంబంధము. ఇదే పారలౌకికగతి. కాని, 'క్షీణేపుణ్యే మర్త్య లోకం విశన్తి' అన్నట్లు పుణ్యాతిశయ సమాప్తి కాగానే మరల సంసారాగమనము తప్పదు. అవ్యయయుక్తాక్షరగతి యందైనచో పునరావర్తన ముండదు గాని సాంఖ్యాభిమత క్షరవిశిష్టాక్షరగతి పునరావర్తన కారణమే యగును. ఇక అవ్యయధామమో! అటజేరినవో పునరాగమన ప్రశంసయే యెన్నటికి వినబడదు. ఇట్టిచో పరాగతి లుబ్ధులగు ప్రాధాను లవ్యయు నారాధించుట మేలు.

అయినచో, అవ్యయప్రాప్తి కుపాయమేమి? అన్నచో 'మామేవయే' అనుశ్లోకము ద్వారా సమాధాన మీయబడినను స్పష్టతకొరకు, భగవంతుడనుచున్నాడు:—

"పురుషః సపరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా,
యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదంతతమ్"

సకామ - నిష్కామ భేదముచే భక్తికాండకు రెండు వివర్తములు. మొదటిదానియందు అవ్యయుడు - ఫలాశయు నున్నందున నది యనన్య భావవంచితము. భగవంతుడు ఈ భక్తికి పరమవిరోధి. (ఈవిషయము మరొకచో) కామనకు మనస్సుతో సంబంధము - మానస భావము బుద్ధియోగవిరోధి - అనన్యమూలయగు నిష్కామ భక్తియండే బుద్ధియోగ ముద యించును. బుద్ధియోగరూపయగు నీయనన్యభక్తియే తదీయ ప్రాప్తికి ముఖ్యోపాయము. - సరి:— యిట్లు శ్లోక పూర్వార్థమున, భగవంతుడు మనధ్యానమును బుద్ధియోగము వంకకు ద్రిప్పి "సృష్టివిషయమున మావలెనేమీరును, జన్మస్థితి భంగము లకు కారణముగా, 'అవ్యక్తాద్వ్యక్తయః' 'అవ్యక్తాదీని' ఇత్యాదు లంటు అంగీకరించియున్నారు గదా!" యని ప్రాధానికు లందు రనియెంచి వారి భ్రమ యామూలచూడముగ ఖండింప నెంచి శ్లోకము నుత్తరార్థము నెదుట బెట్టుచున్నాడు. "నిజమే, అవ్యక్తము జగత్కారణమే, కాని యదే మూలకారణ మను కొనుట సర్వధా భ్రాంతి. సామాన్య కారణతం జెప్పనెంచియే 'అవ్యక్తాద్వ్యక్తయః' ఇత్యాదిగా జెప్పితిమి. వస్తుతః మూల కారణ మవ్యయుడే, భూతములన్నియు తదీయగర్భ ప్రతిష్ఠిత ములు. అతని చేతనే భూతవితానము జరిగిన" దని భగవంతుని తాత్పర్యము.

ఆయన సాంఖ్యుల ప్రకృతిమూలకారణత నంగీకరించినచో 'అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతేమా మబుద్ధయః' యని వారిందిరస్కరింపడు. 'అవ్యక్తమునునిమిత్తముగ జేసి నేనే యన్నిటిని నిర్మించుచున్నాను' అను నీవిషయము 'మయాతత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా' అని స్పష్టము చేసియున్నాడు. ఇట్లు గీత సాంఖ్యమును ఖండించి యితరతంత్రము లెరుంగని అవ్యయుని, తత్ప్రాప్త్యుపాయ భూతములగు అపూర్వచతుర్విధ బుద్ధియోగ, వ్యావహారిక స్వరూపమును మనయెదుట బెట్టి తన విజ్ఞానశాస్త్రత్వమును కృతార్థత నొందించుకొనుచున్నది. ఇదియే యీశాస్త్ర సంక్షేపము.

## సమష్టిరూపాత్మపరీక్ష

ఇంతటితో నాత్మపరీక్ష సమాప్తి చేయవలసినదే కాని యింకను ఈదర్శన ప్రకరణమున కావశ్యకములగు కొన్ని ప్రశ్నలు మిగిలిపోయినవి. అందుకే శీర్షిక క్రింద నట్టివానిం జూచుటకు పాఠకులు విసుగుకొనక కుందురుగాక! ఇప్పుడు మొదటి యట్లుగాక గీతతో మొదలువెట్టి తక్కినతంత్రములను మధ్య మధ్య సమాలోచన దృష్టితో నాల్గింటిని సమన్విత రూపములుగ జూతము:— ఇందు మొదట గీతనే తీసికొందము.

గీత ప్రధానముగ నవ్యయాత్మ ప్రతిపాదకమగుటచే అవ్యయ శాస్త్రమనిచెప్పి, "అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా

మబుద్ధయః। పరంభావ మజానంతో మమావ్యయమనుత్తమం”
అను మొదలగు శ్లోకములుద్ధరించి యందలి 'మమ' శబ్దముచే
నవ్యయు గ్రహణము గావించి యీవాదము సిద్ధము గావింప
బడినది. కాని ఇటః— 'మమ పరంభావ' మన్నదివిచారణీయము.

'మమ' యన అవ్యయుడు గదా, అవ్యయునికంటె బరు
డందుమా, తాను తనకుబరుడగు టెట్లు? అవ్యయుడు 'అవ్యక్తా
త్పురుషఃపరః' అన్నట్లు పరుడేకావచ్చును. మరి యిద్దరు
పరులుండుచో? 'అవ్యయుడనగు నాకు పరమగుభావము'
ననవచ్చును. అట్లున్నదా? 1. భూతము:— ఇచటి 'మమ'
అవ్యయ వాచకము కాదన్నచో అవ్యక్తాక్షర వాచకము
మాత్రము కాజాలదని 'అవ్యక్తంవ్యక్తిమాపన్నం' అని దానిని
మొదటనే వేరుగనుంచెను గదా! ఇక క్షరవాచకమును
గాజాలదు. ఏమన:— క్షరునికంటె బరభావమక్షరమగు గాని
అవ్యయుడు కాదుగదా! కనుక వేరుగతిలేక అవ్యయుడే యన
వలయును. భాషాదోషముమాట యటుంచుడు. భాషావిజ్ఞా
నముంబట్టి యిదిసహ్యామే.

ఒకడు తనలోతాను 'మనమీపని చేయుదుమా? చేయుటా?
చేయగలమా? అనుకొనును. అట రెండవవ్యక్తి లేదుగదా! మరి
యీసంభాషణ యెట్లుఘటిల్లును? ఈవిధముగనే యిచటను
అస్మచ్ఛబ్ద (మమ) నిరుక్తి జరిగినది. స్వయముగ నవ్యయుడు
తన పరభావముం బ్రకటించు కొనుచున్నాడు. 'నా పరభావ
మవ్యయము' అని, అనగా 'నేను పరుడ' ననుటయే కదా! ఇది

యొక సమాధానము.

2. విశ్వము తనుపాదానమగు నాత్మాక్షరము; నిమిత్తకారణ మగునక్షరము. అన్వయపురుషుని విశేషభావముతే యని మున్ను చెప్పితిమి. సృష్టిసాక్షియగు నతని యవరమగు వాగ్భాగమునుండి యవరాక్షరము (అపరాప్రకృతి), పరావరమగు ప్రాణ భాగమునుండి పరావరాక్షరము (పరాప్రకృతి) పుట్టినవి. 'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి' 'అహం సర్వస్య ప్రభవః' 'మత్తః సర్వం ప్రవర్తతే' అను సిద్ధాంతముల చూడుడు. మనః ప్రాణవాఙ్మయాత్ముడగు నాత్మ సాన్వయుడగు టొకటే, మనశ్ఛేదమున బరాన్వయభావముగ - ప్రాణాచ్ఛేదమున పరావరాక్షర భావముగ వాగచ్ఛేదమున అపరక్షర భాగమున [illegible]తుడగు చున్నాడు.

అస్మచ్ఛబ్ద (అహంశబ్ద) మాత్మబోధకము "స వా ఏష ఆత్మా వాఙ్మయః ప్రాణమయో మనోమయః" అన్నట్లది త్రిభావా పన్నము. ఈయొకే 'మమ' (అన్వయుని) యొక్క క్షరాక్షరా వ్యయములచే క్రమముగ అవర పరావర పరభావములు మూడును మమ భావము. దీనిపరభావ మవ్యయుడే. "మూఢులు నాయవ రక్షర - పరావరాక్షర భావములందే విశ్రాంతి గొందురు. వారు నాయనుత్తమ పరాన్వయభావము నెరుంగరు" అని భగవదభి ప్రాయము. ఈదృష్టిచే 'పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్' అను నీవాక్యమున బూర్వోక్త దోషము నుండదు. 'అవ్యక్తమే అంతయు నన్నియు' నను ప్రాధానికసిద్ధాంతమును

ఖండితమగును. "ప్రాధానికులు అవ్యయునికంటె వేరనుకొను అవ్యక్తమా యవ్యయుని ప్రాణమూర్తి యగుపరావర భావ" మని భగవంతుడు చెప్పుచున్నాడు. "తప్పెందున్నదనగా:- వారు నాపరాపరభావము నెఱుంగుదురు. గాని పరభావము నెరుంగరు. గాని నెఱుంగుచో ప్రకృతియే మూలమనుటకు సాహసింపరు" ఇదియొక సమాధానము.

3. తుష్యద్దుర్జన న్యాయమున గొంత తడవు భాషావిజ్ఞానము నుపేక్షించి "అవ్యయుడు తనకంటెవేరు బరుడు కాజాలడు. కనుక ప్రకృతితో నచ్చు నవ్యయుడు వాచకమునజాలము. అక్షర క్షరములకును వాచకమగును. "ఇక గీత యవ్యయప్రతిపాదక మనుట కాధారముగ నీ 'మమ' కు ఏమియర్థము?" అను పూర్వోక్తపూర్వపక్షమునే యుద్ధరించుకొందము ఇందుకు:-

సమాధానముగ:- ప్రజ్ఞానాత్మ నాశ్రయింతము. ఆధ్యాత్మిక దృష్టిచే నదే 'అహంపదార్థ' మనుకొన వచ్చును. 'అహమస్మి' యను నభిమానము దేహాభిమానియగు నాత్మకే 'నాచేయి, నాముఖము' ఇత్యాదిగా అహంవ్యాప్తి దేహమువరకు నగపడు చున్నది. చివరకు 'అహం' శబ్దవాచ్యము దేహాభిమానియగు నాత్మయే యనుకోవచ్చును కనుకనే 'దేహి' యనబడు నీ యాత్మకు:- వైశ్వానర - తైజస - ప్రాజ్ఞ - ప్రజ్ఞానములను నాల్గు పర్వములున్నవి. ఇందు మొదటిమూడును కర్మాత్మ - ప్రజ్ఞాన మనస్సు ఇంద్రియముల ద్వారా కర్మ సంచాలకమయి యున్నది. సేంద్రియ ప్రజ్ఞానము కర్మాత్మ అనుపేని సమష్టియే

భోక్తాత్మ. శ్రుతియు "ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః' అనిచెప్పెను. ఇట్లు నాల్గుపాదములు గలభోక్తాత్మను శారీరకాత్మ (జీవాత్మ) యందురు. దీనియందే అహంత్వాభిమానము. ప్రకృతశ్లోకమందలి 'మమ' చే గొంత తడవు దీనిం గ్రహింతము.

ఇటనొకప్రశ్న:— ఈయాత్మయొక్క ఆత్మత్వమునకు మూల మేమి? ఏతత్త్వసంబంధమున నిదియాత్మయనబడును! అనగా:— నా (శారీరకాత్మయొక్క) పరభావము (ఆత్మభావము - అంతిమభావము) ఏది? - అన్నచో:—

సమాధానముగ:— ప్రాధానికు లవ్యక్తప్రకృతిని (అక్షరమును) ఎదుటబెట్టుదురు. కారణము? శారీరకమగు నాత్మ క్షర ప్రధానము. దీని (యంతిమ ప్రతిష్ఠారూప) పరభావము అక్షరమే కాగలదు. శ్లోకపూర్వార్ధము నందు భగవంతుడు సాంఖ్యాభిమత పరభావమునే సూచించి 'మూఢులు నన్ను (శారీరకాత్మ) యొక్క అవ్యక్త (అక్షర) వ్యక్త రూపమనియే యెంచుచున్నారు." అనగా 'మామ్' (శారీరకాత్మ) తత్త్వము యొక్క అహంత్వమవ్యక్తాక్షరము పైననే విశ్రాంతము" అను కొనుచున్నారు. వారు 'అహంవికాసము మహత్తునుండి' యని యంగీకరించిరి. మహన్మూల మవ్యక్తమనిరి. ఈదృష్టితో 'మామ్' అనగా నాయవ్యక్తముయొక్క వ్యక్తీభావమనియే సిద్ధ మగుచున్నది." అనియెను.

దీనిపై నాయన (భగవానుడు) ఇట్లు చెప్పవలసివచ్చెను:—

"ప్రాధానికులు నా (శారీరకాత్మ) యొక్క పరభావ మొకటే అనుత్తమము అవ్యయము నని యెరుంగరు. మహత్తు అహం యోనియనుటయు, అవ్యక్తమునుండి మహత్తుజనించె ననుటయు సరియేకాని, ఇంతటితోనే అవ్యక్తమునకు 'మమ' కంటె పరభావము సిద్ధింపదు. అవ్యక్తాక్షరము ప్రకృతి. అది సాంఖ్య మతముచే జడము. అట్టి జడప్రకృతి అహంలక్షణచే తదన్యమున కంటె బరమనుట పొసగునా? కనక ఈవిధముగ 'మమ' యను దానికి 'శారీరకాత్మ' యని యర్థమునుకొన్నను "పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమం" అను వాక్యము సమన్వితమగును. ఇదియొక సమాధానము.

వస్తుతః:— గీతయందలి యస్మచ్ఛబ్దము అంతటను కేవలము అవ్యయునే వచించును. (అహం - మమ - మయి - మత్తః - మయా ఇత్యాదులందు అంతట నిదే యర్థము.)

ఈ పరభావంబట్టి యీశ్లోకమందు నిదేయర్థమునుకొన్నను సాంఖ్యోక్తభావాదోషమును నిరాకరింప వచ్చును. సాంఖ్యుడు మున్ను "అవ్యయు లిద్దరున్నచో 'అవ్యయునికంటె పరుడగు నవ్యయు' డన్న వాక్యము సమీచీనమగు" ననియెను. అందు కొప్పక మరొకవిధముగా దానిని నిరాకరించి యుంటిమి. కాని యిప్పుడా వాదమునే స్వీకరింతుము. అవ్యయు లిరువురుగారు, మువ్వురు. దీనితో 'అవ్యయునికంటె బరుడగు నవ్యయు' డను కథనము అన్నివిధములచే సమీచీనమై చెల్లబడును. వినుడు—

మొదట నిరువురవ్యయు లందము. పూర్వము జెప్పబడిన శారీరకాత్మకు బరమగు నాత్మకు అవ్యయుడే విశ్రమస్థానము. స్వయముగ శారీరకాత్మ క్షరపదార్థము. దీని కాలంబన మక్షరము; సర్వాలంబన మవ్యయుడు. ఈయవ్యయుని యోగాత్మక సంబంధముచే (అంతర్యామ సంబంధముచే) శారీరక తత్త్వ 'మహం' అగుచున్నది. అహంభావము కేవల మవ్యయునిపై నాధారపడి యున్నది. 'శారీరకాత్మ' యన శరీరము యొక్క ఆత్మ. ఇందు వైశ్వానర - తైజస - ప్రాజ్ఞ - ప్రజ్ఞాన - పాంచభౌతిక ప్రపంచము లనునీ వైదిటికి శరీరమునం దంతర్భావము. కారణము? ఈవైదును క్షరమూలకములే. వీనికి విధర్త అక్షరము. ఇక మిగిలినది ఆత్మ. అదే అవ్యయుడు. జ్ఞానమూర్తి యగు నీయవ్యయాత్మ కృపవలననే శారీరకాత్మ 'అహంకరోమి - అహంజానామి' యన జాలుచున్నది. ఈయవ్యయాత్మయే మహత్ప్రతిబింబితమై చిదాభాసు డనబరగుచున్నది.

ఇట్లు ప్రతిస్థితియందును, శారీరకాత్మయాత్మత్వము లేక అహంత్వము, కేవల మవ్యయపురుష సహయోగముపైననే నిర్భరమై యున్నది. ఈ శరీరము రెండు తెఱగులు. ఒకటి క్షుద్రశరీరము. ఒకటి మహాశరీరము. విశ్వమంతయు నొకమహాశరీరము. అస్థిమాంసాది సప్తధాతుమయ ప్రపంచ మొక క్షుద్రశరీరము. అవ్యయుడు శరీరాభిమాని. శరీరములు రెండు. కనుక నొక యవ్యయునకే మహామాయ - యోగమాయయను భేదములచే రెండురూపములను ధరించును. మనకగపడు మహా

విశాలవిశ్వాభిమానియై విశ్వేశ్వర, విశ్వాత్మాది వివిధనామ ప్రసిద్ధిగల మహావ్యయుడు, పరమావ్యయుడు ననబడును. ఈతని శరీరమీమహావిశ్వము; ఇదే మొదటిదగు నవ్యయసంస్థ. దీనికి మహామాయయే స్వరూపసమర్పక.

పాంచభౌతిక ప్రాణిశరీరాభిమానియై శారీరక-దేహీ త్యాది నామప్రసిద్ధినొందు నవ్యయుడు జీవావ్యయుడు; ఇతడే యీ యవ్యయుని రెండవసంస్థ. పరమార్థమున నీయిరువురు నొకటే; ఉపాధిభేదమున నిరువురును వేరై యున్నారు. జీవావ్యయుడు యోగమాయావచ్ఛిన్నుడు. యోగమాయ అక్షరమునకు చెందినది. దీని భ్రమలోపడియే ప్రాధానికులు ఈనన్ను (మాం) (జీవావ్యయుని) అవ్యక్తము (అక్షరము) యొక్క వ్యక్తి భావమనుకొన్నారు. జీవసంస్థయం దక్షర ప్రధానత యుండుటయు నిజమే. గీతయు 'జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతేజగత్' అని చెప్పియున్నది. అయినను:—

జీవపరభావ విచారణసేయుచు పరావ్యయునందే విశ్రాంతి నొందవలసివచ్చును. యోగమాయాత్వముచే అక్షరమును పరభావమేయనవచ్చునుగాని అహంత్వముంబట్టి పరత్వమవ్యయునికే దక్కును. కారణము? జీవసంస్థయందలి 'అహం' కేవల మవ్యయుడే. ఈజీవావ్యయునకు పరభావ మేదశయందైన నీశ్వరావ్యయుడే కాగలడు. కాని ప్రకృతికాదు గదా! ఇక ప్రాధానికులో, గుణమయియగు యోగమాయం దాటుటయే పాపమనుకొందురు. అట్టిచో వారు తిరిగితిరిగిఅవ్యక్తము

(అక్షరము)నే చూచుచుందురు. దీనినే ఖండించుచు భగవంతుడు "వారు నా (శారీరకాత్మయగు) పరము, అనుత్తమము నగు నవ్యయభావమును (ఈశ్వరాత్మయును) యెఱుంగరు; కనుకనే నన్ను (నాం - శారీరకాత్మను) అవ్యక్త (అక్షర) వ్యక్తి భావము నొందుచున్నారు" అని చెప్పెను. జీవాత్మయునికి పరభావమీశ్వరాత్మయునే. ఈసిద్ధాంతమునే 'పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి' అని స్పష్టీకరించెను. ఇది మూడవ సమాధానము.

ఇక:, అవ్యయములు మూడుగను మాత్రము:- విజ్ఞానశాస్త్రమున, వారు చిదాత్మ - ప్రత్యగాత్మ - శారీరకాత్మ యనబడుదురు. ఈమువ్వుర విస్తరీయ పరిజ్ఞానమునకై సూర్యసంస్థం జూతుము. ఒక స్ఫటిక శిలయందు సూర్య ప్రతిబింబమున్నది. మహాసూర్యుడు స్ఫటిక పరిచ్ఛేదముచే ప్రతిబింబరూప పరిణతి గాంచును. స్ఫటిక మొక శరీరము. ఇందు ప్రతిబింబము యోగసంబంధమున నుండును. ఇట్టి యోగసంబంధావచ్ఛిన్న ప్రతిబింబమే మొదటిదగు శారీరకాత్మ. ప్రతిబింబముతో గూడ నాప్రతిబింబముపై సూర్యప్రకాశముగూడ సంబంధపడుచుండును. స్ఫటిక శిలావచ్ఛిన్నమగు నీప్రకాశమునకును, స్ఫటికమునకును విభూతి సంబంధమున్నది. ఇదే రెండవదగు ప్రత్యగాత్మ. ఈ రెంటికి నతిరిక్తముగ మూడవదగు త్రైలోక్య వ్యాపకము స్వయముగా సూర్యప్రకాశమున్నది. ఈ వ్యాపకమునకు పరిచ్ఛిన్నముతో విభూతి సంబంధములేదు. యోగ

సంబంధమునులేదు. ఇదే మూడవదగు చిదాత్మ. సరిగా దీన్నే అవ్యయవిషయమునను ఊహింపవలయును.

కర్మాత్మయుక్తప్రజ్ఞానాత్మయొక స్ఫటికశిల. ఇందలిసోమము మహాత్మ. ఇందు సూర్యస్థానీయ చిదాత్మయొంక యేది యోగ సంబంధమున ప్రతిబింబించుచున్నదో అదే చిదాభాస లక్షణ ముగల మొదటిదగు శారీరకాత్మ. ఏ యంశము విభూతిసంబంధ ముచే ఈహృదయస్థానమందుండుచున్నదో అది రెండవదగు ప్రత్యగాత్మ శారీరకాత్మయన్నది ఆధ్యాత్మిక సంస్థయందే యుండు జీవాత్మ. ప్రత్యగాత్మయు నీసంస్థయందే యుండు విశ్వే రాత్మ. ఈ రెండును సయుక్సుపర్ణములు: ఒకటిసాక్షి; రెండవది భోక్త. ఒకటి గుణభావాభావాంశము; రెండవది నిర్గుణము. ఇక పరిచ్ఛిన్నాధ్యాత్మికముతో విభూతి - యోగములందే సంబం ధములేని వ్యాపకమగు విశ్వాత్మ మూడవది. దేహాభిమాని దేహియునగు నవ్యయాత్మ శారీరకాత్మ. ఇదే దేహాభిమాని యగు పరము (అవ్యయము). దీనిగూర్చి గీత చెప్పుచున్నది:-

1. భోక్తా - అవ్యయః (చిదాభాసః) శారీరకః

"ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః"

దేహమందుండియు తన విభూతిసంబంధ ప్రభావముచే దేహాభిమాన రహితుడై హృదయస్థుడై యుండు పరమాత్మ (ఈశ్వరుడు) ప్రత్యగాత్మాన్వయము - ఈవిషయమున గీత

యిట్లనుచున్నది.

2. సాక్షీ - అవ్యయః - (చిదంశః) ప్రత్యగాత్మా

"అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరామాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌంతేయ! నకరోతి నలిప్యతే ॥
ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥"

మూడవ వ్యాపకేశ్వరావ్యయుడు వ్యష్టిసంబంధములేకనే సమష్టి సంచాలకు డగును. పై యిరువురు (శారీరక - ప్రత్యగాత్మలు) తమతము వ్యష్టిసంచాలకులు. ఈవ్యాపక చిదాత్మయో సంపూర్ణ వ్యష్టిసమష్టిరూప విశ్వసంచార స్థానము (గతి). భరణ పోషణ సేయునది (భర్తా). నియంత (ప్రభువు). ద్రష్ట (సాక్షీ) ఆధారము (ఒకచోనాధారరూప నివాసము). ఆశ్రయదాత (శరణము). సన్మార్గ ప్రదర్శకము (సుహృత్). మూలోత్పత్తి స్థానము (ప్రభవము). సంహారకము (ప్రళయము) ప్రతిష్ఠాభూమి (స్థానము). ఆవాసము (సర్వతః ఆధారరూప నిధానము). మూల కారణము (బీజము). ఈ 12 ధర్మములచే వ్యాపక చిదాత్మ సర్వము నగుచున్నాడు. దీనింగూర్చి గీత యిట్లుచెప్పుచున్నది.

(3) విశ్వావ్యయః. (చిదాత్మా)

"గతి ర్భర్తాప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయం"

ఇట్లు ఒకే 'అహం లేక మమ' మూడుసంస్థలుగ నగుచున్నది. మనప్రాచీనక మహర్షోదయులు ఆధ్యాత్మిక సంస్థయందు

ఎక్కుడుపక్షపాతము గలవారు. ఈ సంస్థకు స్థూలకారణము ప్రకృతి. ఆధ్యాత్మికమగు 'మమ' కు పరభావమేమి? యనియడిగచో వారు వెంటనే అవ్యక్త ప్రకృతిని ఎదుట బెట్టుచుందురు. దానిపై భగవంతుడు "విభూతి సంబంధా వచ్ఛిన్న ప్రత్యగాత్మ లక్షణ ఈశ్వరావ్యయునితో నిత్యసంబద్ధుడగు యోగమాయా వచ్ఛిన్న శారీరకాత్మ లక్షణ శారీరకావ్యయునకు ('మమ')కు పరభావము — వస్తుతః ద్వాదశలక్షణావచ్ఛిన్నమువ్యాపకము-అనుత్తమము నగు పరావ్యయమే (చిదాత్మయే)" అనియెను. ఇది నాలవసమాధానము.

గీతాశాస్త్ర మీయపూర్వాన్వయ స్వరూపమును, తత్ప్రాప్త్యుపాయమగు బుద్ధియోగమును మనకుదెల్పుచు దర్శనమాత్రముగ గాక ఒక స్వతంత్రము - అపూర్వమునగు విజ్ఞాన శాస్త్రమని పేరు బొందుచున్నది.

పూర్వోక్తము లగు నవ్యయ సంస్థలందలి చిదాత్మ కాధిదైవిక సంస్థతోడను, తక్కిన రెంటికి నాధ్యాత్మిక సంస్థతోడను సంబంధము. ఈ రెంటి స్వరూపములును యోగమాయా వృతములు. యోగమాయ అక్షర సంబద్ధము కనుక నక్షరమునం దివి యోతప్రోతములై పోయినవి. వీనిని నేర్పరచుట యసంభవము కాకపోయినను ఎంతో కఠినమని యొప్పికొనక తప్పదు. "మమ మాయా దురత్యయా" గదా!

అధ్యాత్మ సంస్థారూపమగు నొకే ధరాతలమున బాలలోని పంచదారవలె గలసి యేకరూపముగ నైపోయిన వీనిని దర్శన

జ్ఞానమునగాక అనుభూతిరూప విజ్ఞానమునసే యెఱుంగ బ్రయ త్నింపవలయును. సాంఖ్యమన్నది దర్శనమంటిమి. దర్శనమన్నది వాచికభావముపై విశ్రమించును గదా! సాంఖ్య మక్షరాను స్యూతాన్వయ సాక్షాత్కారము సేయజాలదన్నచో పాపము! దాని తప్పేమియు లేదు. ఆవిషయము దాని యూహకు లొంగ నిది. కనుకనే సర్వప్రపంచ పరభావమక్షరమే యనుకొన్నది. కాని "అక్షరమునకు గూడ నాలంబనము అత్యంత నిగూఢము నగునన్వయుడే ఈ 'మను' (శారీరకాత్మ)కు పర్యవసానభూమి" యని గీత మన కాదేశించుచున్నది. అదియే ఆ విజ్ఞానశాస్త్రమే బుద్ధియోగము ద్వారా మన కన్వయుని సాక్షాత్కరింపజేసినది. ఇక దాని అపూర్వశాస్త్రతకు విజ్ఞాన శాస్త్రతకు సందియ మేమికలదు?

"కిమన్యైః శాస్త్రవిస్తరైః" ఇది సమష్టి రూపాత్మ పరీక్ష. దార్శనికాత్మ పరిజ్ఞానమన్వయము:—

ఇంతవరకైన మూడుదర్శన తంత్రముల నిరూపణంజూచి "వీని కాత్మయొక్క వాస్తవికత బోధపడలే" దని భ్రాంతి కల్గును.

వైశేషికులు:— "జగన్మూలము పరమాణువులు. ఈశ్వరుని యిచ్ఛామాత్రమునకే సృష్టియందు సమావేశము. ఆయాత్మ క్షరాక్షరవిశిష్టము. క్షరవిశిష్టాక్షరాత్మ యీశ్వరుడు. అక్షర విశిష్టక్షరాత్మ జీవుడు. ఈశ్వరుడొకడు; జీవులనేకులు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'నిత్యం విజ్ఞానమానందం బ్రహ్మ' 'సత్యం జ్ఞాన

మనంతం బ్రహ్మ' ఇత్యాది శ్రుతులందలి బ్రహ్మశబ్దము క్షర విశిష్టాక్షరాత్మనే వచించును" అందురు.

ప్రాధానికులు:— "వైశేషికుల యీశ్వరుని వ్యక్తక్షర భాగము జగదుపాదాన మగుటచే జగత్తునం బడిపోయినది. మిగిలిన యక్షరము అని ప్రకృతిగాని ఈశ్వరుడు గాదు. ఆ మూల ప్రకృతినుండియే విశ్వ ముత్పన్నమయినది. మంచిది! పరిచ్ఛిన్న వ్యక్తపరమాణువులును ఒక చో విచిత్రభావోపేతమగు జగత్తునకు గారణములైయున్నవి" అని తమ తత్త్వవాదము ప్రకృతితో సమాప్తము జేయుదురు. వీరు పురుషుని (అవ్యయు) నెరుంగరు. ఎట్లో ఎరుంగుదురనుకొన్నను, అతనికి సృష్టితో జోక్యమేమియు లేదందురు. అతని యిచ్ఛానుకూడ వీరు దూరమునుండి నమస్కరింతురు.

శారీరకులు:— వీరు ప్రకృతివాదమును ఖండించి బ్రహ్మవాదమునుగొని "బ్రహ్మసాయములేక జడ ప్రకృతి యేమియు జేయజాలదు. వస్తుతః బ్రహ్మ - ప్రకృతి - వికృతి - విశ్వము అను భేదవాదములకు విలువయేమియులేదు. అంతటను కేవల మవ్యయ బ్రహ్మసామ్రాజ్యమే. ఈబ్రహ్మయే అవ్యయాత్మ" అందురు.

ఇందువలన: ఈమూడు తంత్రముల యుద్దేశ్య విధేయములు వేర్వేరని యెరుకపడును. మూటి యుపక్రమోపసంహారములును భిన్నములు. వైశేషికులకు:— స్థూల జగత్తుద్దేశ్యము; క్షరాత్మవిధేయము. ప్రాధానికులకు:— క్షరప్రపంచ ముద్దే

శ్యము; అక్షరాత్మవిధేయము. శారీరకులకు:— అక్షరవివర్త ముద్దేశ్యము; తత్సంబద్ధాన్వయము విధేయము.

ఈభేదవాదములచే ఖండనమండనములు పెరిగి మతములై సంశయ నివృత్తికి బదులు సంశయోత్తేజనకు గారణములైనవి. 'ఏకస్మిన్ ధర్మిణి విరుద్ధనానా కోట్యవగాహిజ్ఞానమ్ సంశయః' ఇందువలన నిజముగ జిజ్ఞాసువు సత్యజ్ఞానవంచితుడగుచున్నాడు. ఈదర్శనకర్తలగు కణాద - కపిల - వ్యాసులు మనకు సమాన పూజ్యులు. ఎవరి సిద్ధాంత మొప్పు? ఎవరిసిద్ధాంతము తప్పు? సత్యముం జేరుట అసంభవమా?

ఈ వైషమ్యములను జూచిన కల్పనారసికులు, పాశ్చాత్య విద్వాంసులు, తదనుయాయులు భారతీయ విద్వాంసులును, సాహసించి సమాలోచనచేసి "భారతీయ దర్శనములొక నిశ్చితము సత్యమునగు సిద్ధాంతము సేయజాలవు. అవి ఎందుకు బనికిరానివి త్యాజ్యములు" అందురు. స్థూలదృష్టితో మనము నప్పుకొందము. కాని, వైజ్ఞానిక దృష్టితో నవలోకించుచో నిది భ్రాంతియని యెరుంగగలము. ఈ తంత్రముల భేదవాదము లన్నియు విలీనములైపోవును. ఒకవిధముగ నీభేదవాద ముప యోగకరమే యనియుదోచును.

ఆత్మధర్మము 'స్థూల సూక్ష్మకారణ భేదమున మూడు విధము' లని ఆరంభముననే యనుకొంటిమి. స్థూలమునకు క్షరముతో సూక్ష్మమున కక్షరునితో కారణమున కవ్యయునితో సంబంధము; ఇం దవ్యయతత్త్వము ప్రధానము - ఇదే

ముఖ్యాత్మ. దాని నెరుంగుటయే ఆత్మపరిజ్ఞానము; భారతీయ దర్శనశాస్త్ర చరమలక్ష్యము. 'స్థూలసూక్ష్మకారణములకంటె బరమగు నిత్యాసంగావ్యయాత్మతత్త్వము నెరిగించుటయే, అనగా:- నాత్మపరిజ్ఞానము గల్గించుటయే, దర్శన ముఖ్యోద్దేశ్యము.

దర్శనశాస్త్ర మెరింగింపదలచిన యవ్యయాత్మకు నిరుపాధిక సోపాధిక భేదముచే రెండు వివర్తములు; ఒకటి పరిగ్రహశూన్యము; రెండవది సపరిగ్రహము. లక్ష్యము, నిర్గుణము నిరాకారము నగు మొదటిది. కాని, సోపాధిక రూపముల నుద్దేశ్యములుగా బెట్టుకొనకున్నంతవర కది సిద్ధింపదు. కారణము? ఆత్మబోధ కావలసిన జీవాత్మ సోపాధికము. శరీరాయతన మందుండి శరీరాభిమాని యగు నిది జ్ఞాత; ఆ నిరుపాధికము జ్ఞేయము; ఇ దనిరాకారాకారము; అసీమము. అది సాకారము; ససీమము. ఈ రెంటికి సంబంధ మసంభవము. పరిచ్ఛిన్న మపరిచ్ఛిన్నసంగ్రాహకము కాజాలదు.

జ్ఞాతయగు జీవాత్మకడ జ్ఞానప్రాప్తికి మనోబుద్ధులు రెండు సాధనము లున్నవి. మనస్సు ప్రజ్ఞానము - దీనిపై బుద్ధి ప్రతిష్ఠితమై యున్నది. మనస్సు భౌతికము; ససీమము. జ్ఞేయము కూడ నట్టిదే యగుచో జ్ఞానప్రాప్తి సులభమే. కాని యట్లు లేదు. సాకారమనస్సుతో నిరాకార వ్యాపకతత్త్వధ్యానము కుదురదు. ఉపాసనాధ్యానములు సగుణ, సాకార తత్త్వమునే గ్రహింపగలవు. ఇక నిరుపాధిక జ్ఞేయముం జేరు నుపాయము

దర్శనము చూపవలయుచో సాధనరూపమున, ఉపాస్యముగా, నా నిరుపాధికబ్రహ్మయొక్క మాయామయ - సోపాధిక - సగుణ రూపము నాలంబనముగా గొనవలయును. ఆ నిరుపాధిక సోపాధికముల నడుమ సోపాధికాత్మరూపము నుంచుకొననిచో నిరుపాధికము నందుకొనజాలము. ఆ నిరుపాధికము యొక్క సోపాధికరూపమునకు గూడ నధ్యాత్మసంస్థకువలెనే క్రమముగ స్థూల - సూక్ష్మ - కారణములను మూడు భేదములు కలవు.

ఆ యుపాధిభేదముచే నది యొకడయ్యు, ముక్తిసాక్షి - సృష్టిసాక్షి యను రెండుభేదముల నొందును. ఆనంద విజ్ఞాన మనోమయ మగునది నిరుపాధికాత్మ. మనఃప్రాణ వాఙ్మయ మగునది సోపాధికాత్మ. దీని కది ప్రతిష్ఠ. ఈ సోపాధికాత్మ తన జ్ఞానశక్తిఘనమనస్సుచే సోపాధికావ్యయాత్మగ, క్రియా శక్తిఘనప్రాణముచే అక్షరాత్మగ, అర్థశక్తిమయ వాక్తత్త్వ ముచే క్షరాత్మగ నయ్యెను. ఇట్లు అవ్యయాక్షర క్షరములు, మనఃప్రాణ వాఙ్మూపాన్వయ సోపాధికరూపములు. తన క్షర రూపముచే పిండోత్పత్తి గావించి యాయనయే విశ్వ మగు చున్నాడు. ఇట్లు మనఃప్రాణ వాఙ్మూర్తి యగు సోపాధికా వ్యయాత్మయే, ఆనందవిజ్ఞాన మనోమూర్తి యగు నిరుపాధికా వ్యయాత్మపై బ్రతిష్ఠితుడై అవ్యయ - అక్షర - క్షర - విశ్వము లను నాల్గురూపము లొందుచున్నాడు. ఈ సోపాధికరూపము లందు మొదటి మూడు నొక స్వతంత్రవిభాగము, విశ్వ మొక స్వతంత్రవిభాగము.

ఈ విశ్వము ఆధిదైవికాధ్యాత్మికాధిభౌతిక భేదముచే మూడు భాగములు. కనుకనే అవ్యయాక్షరాత్మక్షరమూర్తి యగు సోపాధికాత్మకును మూడు రూపము లుండును. స్వయంభ్వాది పంచపర్వములు గలది ఆధిదైవికవిశ్వము. ఇందు ప్రవిష్టమైన త్రిమూర్తి యగు సోపాధికాత్మ యందు అవ్యయప్రధానతయు, అక్షరక్షరగౌణతయు నుండుటచే (నీ విశ్వాత్మను) ఈశ్వరు డనవచ్చును. 'భిభర్త్యవ్యయ ఈశ్వరః' అన్నట్లు అవ్యయు డీశ్వరుడని చెప్పబడినదికదా!

పంచమహాభూతాత్మక (శరీర) విశ్వమునకు ఏడుపర్వములు. అవిక్రమముగ రసాసృఙ్మాంస మేదోఽస్థిమజ్జాశుక్రములు. ఆధ్యాత్మిక విశ్వమిదే. త్రిమూర్తియగు సోపాధకాత్మ యిందు ప్రవేశించెను; ఇది అక్షరప్రధానము. అవ్యయక్షరము లిందు గౌణములు. అక్షరుడు జీవుడు. 'జీవభూతాం మహాబాహో'. కనుక నీ యాధ్యాత్మిక విశ్వాత్మను జీవు డనవచ్చును.

పంచభూతాత్మక జడవిశ్వమునకు (భౌతికపదార్థములకు) పంచపర్వములు. ఇవి గుహా - ఆప - జ్యోతి - అమృత - రసము లనబడును. ఇవియే ఆకాశాదులు - ఇదే యాధిభౌతికవిశ్వము. ఇందా సోపాధక త్రిమూర్తియగు నాత్మ ప్రతిష్ఠితమైయున్నది. ఇది క్షరప్రధానము. అవ్యయాక్షరు లిందు గౌణములు; 'క్షరఃసర్వాణి భూతాని' ఈ యాధిభౌతిక విశ్వాత్మను జగత్తనవచ్చును.

ఇకనొకటి గుర్తుంచుకొనవలయును. ఏమన:— ఈజగత్సంస్థ

ఆ మహావిశ్వముకంటె సర్వధా భిన్నము; అది యేకము. ఇది అనేకము. ప్రతి యొక భౌతిక (జడ) పదార్థము నొక్కొక స్వతంత్రజగత్తు. మహావిశ్వగర్భమునం దనంతములగు నధ్యాత్మ సంస్థలు (చేతనపదార్థములు) ఉన్నవి. అసంఖ్యములగు నాధిభౌతిక సంస్థలు (జడపదార్థములు) నున్నవి. ఈ రెంటికి మూలాధారము ప్రజాపతి (మహావిశ్వవిశిష్టేశ్వరుడు).

ఇట్లు విశ్వత్రయీభేదముచే సోపాధికాత్మకు మూడుసంస్థలు వెలయును; ప్రతియొకదానియందును ఆత్మ - విశ్వము అను రెండేసిపర్వము లుండును. అంతటను ఆత్మ త్రికలము - విశ్వము పంచకలము. ఇట్లు ఈశ్వరుడు మనకు 'మూడైదు' చేసియుంచెను. అవును! మూడైదు చేయు సామర్థ్య మింకెవరికి గలదు? ('యాని పంచధాత్రీణి త్రీణి') ఈ మూడైదు మొత్తము అష్టాక్షరా గాయత్రి - గాయత్రియే సర్వమ్. ద్విజాతి కియ్యది సర్వోత్కృష్టమగు నుపాస్యదేవత.

ఇంతవరకైన సంస్థావివేచనవలన:— త్రిమూర్తియగునాత్మ యొక్క అవ్యయభాగ మాధిదైవికసంస్థయందు, అక్షరభాగ మాధ్యాత్మిక సంస్థయందు క్షరభాగ మాధిభౌతికసంస్థయందు ప్రధానములు. ప్రతిసంస్థయందును గౌణముఖ్యరూపమున అవ్యయాక్షర క్షరములు మూడునుండుటచే దేవ - ఆత్మ - భూత - భోగములు నుండుచుండును, ఇట్లు మూటియందును మూడు నుండుటచే మొత్తము నవాక్షరవిరాట్టు సంపన్నమగును,( ఈవిషయము గీతావిజ్ఞానమునందు, నామరహస్యమున జెప్పబడినది)

అయినను మూటియందును బ్రధానతంబట్టి మూటికిని, అధిదైవాధ్యాత్మ అధిభూతములని వ్యవహరింపవలసియున్నను, ఏకనామముననే వ్యవహరించిరి" అనియు బోధపడ గలదు. ఇకనిందు:—

ఆధిదైవికసంస్థను సూతము:— మహావిశ్వమునకు స్వాయంభ్వాది పంచపర్వము లనుకొంటిమి. ఇదే ఆధిదైవికవిశ్వము, ఇందవ్యయ ప్రధాన సోపాధికాత్మ ప్రవిష్టము. ఈమహావిశ్వ పంచపర్వము లందును 1. అమృత 2. అమృతమృత్యు 3. మృత్యుభేదమున మూడు విభాగములుండును 1. స్వాయంభూపరమేష్ఠుల సమష్టి యమృతసంస్థ. ఇందు అవ్యయునకు వికాసము 2. 'నివేశయన్నమృతం మర్త్యంచ' అనుటచే సూర్యుడమృత మృత్యుసంస్థ. ఇందక్షరుని సామ్రాజ్యము. 3. 'యద్యత్కించి దర్వాచీన మాదిత్యాత్ సర్వంమృత్యునాప్తం' అనుటచే సూర్యునకు గ్రిందనున్న పృథివీచంద్ర సమష్టి మృత్యుసంస్థ. ఇందు క్షరునకు బ్రాధాన్యము.

అమృతసంస్థ యాధిదైవికము. దీనికిసాక్షి అవ్యయరూప కారణశరీరము. అమృతమృత్యుసంస్థ యాధ్యాత్మికము. దీనికి నిమిత్తమక్షరరూప సూక్ష్మశరీరము. మృత్యుసంస్థ యాధిభౌతికము.దీని కుపాదానము క్షరరూప స్థూల శరీరము. ఇట్లు పంచపర్వాత్మికయగు కేవలాధిదైవిక సంస్థయందే మూడుసంస్థలు నున్నట్లు సిద్ధమగుచున్నది. ఈమాటను ప్రధానత అవ్యయునిదగుటచే ఈమొత్తమీశ్వర సంస్థయనుట న్యాయ్యమే.

అధ్యాత్మ-అధి భూతసంబంధముగల మూడు-సంస్థలకును మూల ప్రతిష్ఠ యీ యీశ్వర సంస్థయే. ఈపరిలేఖ నవలోకింపుడు.

1. అధిదైవికసంస్థ (అవ్యయప్రధాన) ఈశ్వరః

1. స్వయంభూ } అమృతసంస్థ - సామ్యాయు - అధిదైవతం -
2. పరమేష్ఠీ } కారణశరీరమ్.

|

3. సూర్యః - అమృతమృత్యుసంస్థ - సాక్షర - అధ్యాత్మం - సూక్ష్మశరీరమ్.
4. చంద్రమాః - } మృత్యుసంస్థ - సక్షర - అధిభూతం -
5. పృథివీ } స్థూలశరీరమ్.

2 రెండవది అక్షరప్రధానంబగుల యాధ్యాత్మికసంస్థ. పూర్వ సంస్థ యందలి మూడుసంస్థలే యిందునుండును. భేదమేమన:— అందవ్యయుడు నిండకుండు ప్రధానులు. 1. సప్తధాతుమాయ పాంచభౌతిక శరీరము మృత్యుసంస్థ. ఇందు క్షరప్రధానము. 2. సేంద్రియ. విజ్ఞానగర్భిత, ప్రజ్ఞానయుక్త, వైశ్వానర; తైజస ప్రాజ్ఞమూర్తి, శారీరకకర్మాత్మ, అమృత మృత్యుసంస్థ. ఇందు అక్షరప్రభుత్వము. 3. అవ్యక్త మహద్వ్యక్త ప్రత్యగాత్మ అమృతసంస్థ. ఇందవ్యయసామ్రాజ్యము. ఇవివరుసగ నాధిభౌతికాధ్యాత్మికాధిదైవికములు. వీనికి వరుసగ ప్రతిష్ఠలా యీశ్వరసంస్థయందలి యీమూడు సంస్థలే. ఇందలి యుపాధియే క్రమముగ స్థూలసూక్ష్మ కారణశరీరములు. ఇట్లీ యాధ్యాత్మికమునందును మూడుసంస్థలు సిద్ధించును. వీనికిమూలము

యోగమాయ; అదియక్షరునిది: అతడు జీవు డనబడును. కనుక, నీసర్వత్ర యోపేతమగు నాధ్యాత్మిక ప్రపంచమును 'జీవు' డనుట న్యాయ్యమే. ఈపరిలేఖ నవలోకింపుడు.

| ఆధ్యాత్మికసంస్థ (జీవః) | అధ్యాత్మమ్, అక్షరః, సూక్ష్మశరీరమ్ | |
|---|---|---|
| 1. ప్రత్యగాత్మ — ఈశ్వరావ్యయః<br>అవ్యక్తాత్మ — స్వాయంభువః<br>మహానాత్మ — పారమేష్ఠ్యః | అవ్యక్తమహద్గర్భితప్రత్యగాత్మ | అమృతసంస్థ సావ్యయ, అధిదైవతమ్. కారణశరీరమ్. |
| 2. విజ్ఞానాత్మ-సౌరః —<br>ప్రజ్ఞానాత్మ, ఇంద్రియాణి } చాంద్రః } భోగసాధనాని<br>ప్రాజ్ఞః — ఐంద్రః, ఏకవింశః<br>తైజసః — వాయుః — పంచదశః<br>వైశ్వానరః — ఆగ్నేయః — త్రివృత్ } పార్థివః \| భోక్తా కర్మాత్మ | విజ్ఞాన ప్రజ్ఞానేంద్రియ గర్భిత శారీరకాత్మ | అమృత మృత్యుసంస్థ సాక్షర అధ్యాత్మం, సూక్ష్మశరీరమ్ |
| 3. చిత్యాగ్నిమయో భూతపిండః { భౌమః { భోగాయతనమ్ | పాంచభౌతిక శరీరము { మృత్యుసంస్థ సక్షర | ఆధిభూతం స్థూలశరీరమ్ |

3. మూడవది క్షరప్రధానాధిభౌతికసంస్థ. దీనికి, అసంజ్ఞ-అంతస్సంజ్ఞ భేదములన, రెండు వివర్తములు. 1. స్వస్థానము నుండి బ్రహ్మవర్ధనుగు భౌతికవర్గము అంతఃసంజ్ఞవర్గము; లతాగుల్మ వనస్పత్యాదు లిందుజేరును. ఇందాంతరిక రూపమున ప్రజ్ఞాన విజ్ఞానములుండును. ఇంద్రియములందలి త్వక్కునకు మాత్రమే యిందు వికాసముండును. వీని కర్మాత్మ వైశ్వానర తైజసాత్మకము. ప్రాజ్ఞుని కిందు స్వస్థానస్థ. దృశ్యమగు స్థూల భాగము పాంచభౌతిక భూపిండము. ప్రత్యగాత్మసంస్థ సమాన రూపమున నిందు ప్రతిష్ఠితమై యుండును. "ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేऽర్జున తిష్ఠతి" 'ఈశావాస్య మిదంసర్వం' జీవవిద్యా పరిభాషయందీ యాధిభౌతిక ప్రపంచమును వైశ్వానర తైజససంబంధముచే ద్రవ్యాత్మకజీవులని చెప్పబడినది. 2. రెండవది అసంజ్ఞభూతవర్గము. ఇది ఎప్పుడును ఏకరూపమున నుండును. ఇందు - ప్రజ్ఞాన విజ్ఞాన - ఇంద్రియానులకు వికాసము లేదు. అర్థశక్తిఘన కేవలవైశ్వానరుడే వీనియాత్మ. వీనిని ఏకాత్మక జీవులందురు. సాంఖ్యులు ఈ రెండువర్గములను తమోవిశాల వర్గమందురు. రెంటను తమఃప్రాధాన్యము.

ప్రథమవర్గమందు:- ప్రత్యగాత్మ యమృతము. వైశ్వానర తైజసమూర్తి కర్మాత్మ అమృతమృత్యువు. భూతపిండము మృత్యువు. —

ద్వితీయవర్గమందు:- ప్రత్యగాత్మ అమృతము వైశ్వానర మూర్తి కర్మాత్మ అమృతమృత్యువు. భూతపిండము మృత్యువు.

మూడును క్రమముగ అవ్యయాక్షర క్షర భావాపన్నములు. మూటను క్షరప్రాధాన్యము. కనుక 'క్షరః సర్వాణి భూతాని' యన్నట్లే విభాగమును జగత్తనుట న్యాయ్యమే. ఈ రెంటు విభాగముల నీపరిలేఖలం గమనింపుడు:

1. క్షరప్రధానాధిభౌతిక సంస్థ (సూక్ష్మ శరీరమ్), అధి భూతమ్. జగత్, అంతఃసంజ్ఞజీవవర్గః.

1. ప్రత్యగాత్మా - అమృతసంస్థా - సావ్యయా-అధిదైవతం కారణశరీరమ్.

2. వై । తై । కర్మాత్మా-అమృత మృత్యుసంస్థ-సాక్షరా, అధ్యాత్మం - సూక్ష్మశరీరమ్.

3. దృశ్యపిండః - మృత్యుసంస్థ - సక్షర-అధిభూతం - స్థూల [శరీరమ్.

2. క్షర ప్రధానాధిభౌతిక సంస్థ (స్థూలశరీరమ్)

అధిభూతమ్. జగత్ - అసంజ్ఞవర్గః

1. ప్రత్యగాత్మ- అమృత - సావ్యయ - అధిదైవతం-కారణ [శరీరమ్.

2. వైశ్వా ॥ కర్మాత్మా - అమృత మృత్యు - సాక్షర - అధ్యాత్మం—సూక్ష్మశరీరం.

3. దృశ్యపిండః - మృత్యుః - సక్షర - అధిభూతం - స్థూల [శరీరమ్.

### సమష్ట్యాత్మక సంస్థాపరిలేఖః

1. అవ్యయః - కారణశరీరమ్:—

   1. అవ్యయాత్మ - అమృతం - అధిదైవతమ్
   2. అక్షరాత్మ - అమృతమృత్యూ - అధ్యాత్మమ్

3. క్షరాత్మ - మృత్యుః-అధిభూతమ్.
(1. ఆధిదైవికసంస్థ అవ్యయప్రధానా, 'ఈశ్వరః')

2. అక్షరాత్మ - సూక్ష్మశరీరమ్:-
ప్రత్యగాత్మ - అమృతమ్. - అధిదైవతమ్ - ఈశ్వరః
శారీరకాత్మ - అమృతమృత్యూ - అధ్యాత్మమ్ - జీవః
శారీరమ్ - మృత్యుః - అధిభూతమ్ - జగత్
(2. అధ్యాత్మసంస్థ అక్షరప్రధాన, 'జీవః')

3. క్షరాత్మ - స్థూలశరీరమ్:-
ప్రత్యగాత్మ - అమృతమ్ . అధిదైవతమ్ - ఈశ్వరః
కర్మాత్మ - అమృతమృత్యూ - అధ్యాత్మమ్ - జీవః
దృశ్యపిండః - మృత్యుః - అధిభూతమ్ - జగత్
(3. అధిభౌతికసంస్థ క్షరప్రధానః 'జగత్')

దర్శన ప్రకరణారంభమున (50-51 పేజీ) శబ్దశాస్త్రోపదేశమాధ్యాత్మికసంస్థకే, అందును భారతీయద్విజాతికే, అని చెప్పియుంటిమి. చివరకు:- అది పై పరిలేఖలందు మధ్యగత జీవసంస్థయను నధ్యాత్మసంస్థ కని సిద్ధించును. దానింగూర్చి దర్శనమిట్లుపదేశించును "మీలక్ష్యము కేవలము నిరూపాధికము; ఆనందవిజ్ఞాన మనోమూర్తి - నిర్గుణావ్యయాత్మయే, సగుణములేకున్నచో నిర్గుణప్రాప్తి యసంభవము." కనుకనే అది ఆధ్యాత్మమునకు జెందిన మూడు సగుణాత్మసంస్థలను బ్రతిపాదింప వలయును. సగుణాత్మధర్మములుమూడు. కనుక సులు

వుగా దెలియుటకై మూటిని మూడుతంత్రములుగా విభజింప వలయును.

అవియే వైశేషిక - ప్రాధానిక - శారీరకములు. (i) అధ్యాత్మమునకు జెందిన:— అవ్యయప్రధాన అధిదైవతమును శారీరకము, (ii) అక్షరప్రధానాధ్యాత్మమును ప్రాధానికము, (iii) క్షరప్రధానాధిభూతమును వైశేషికము, నిరూపించెను. ఇట్లు మూడు తెఱగులుగ విభజించి క్రమముగ జీవాత్మను పైకి గొంపోయి లక్ష్యమగు నిరుపాధికముం జేర్చివేయును. ఈ విషయము ఈ క్రింది వ్రాతయందు దెల్లమగును.

భౌతికవిశ్వ మధ్యాత్మసంస్థ కెదురుగ నిలచి, పలువిధములుగ లోభపెట్టుచున్నది. కర్తవ్యమేమి? ఈ భౌతికప్రపంచము నందగ గొని క్షరపరిజ్ఞానము నొంది తద్ద్వారా, అక్షరుంజేరి, తద్ద్వారా సోపాధికావ్యయుంగలసికొని తదభిన్నసిరుపాధికానంద ఘనావ్యయపురుష ప్రాప్తింగాంచి తన పురుషార్థమును పురుషనామమును సార్థకము గావించుకొనవలయును. ఇట్టిచో: అందుకుమారుగ:— విషయాసక్తింబడి కేవలము బహిరంగములగు భౌతికవిషయముల కనుయాయియై, నిరుపాధికముమాట యేమోగాని తన (ఆత్మయొక్క) మూడు సోపాధికరూపములం గూడ మరచి, చివరకు శాంతిగానక సంత్రస్తభావమున బయటబడు జిజ్ఞాసువునకు మొదట బరమకృపాళువు, భగవంతుడు కణాదమహర్షి యెదురుగ వచ్చును.

ఆయన తలచినచో నొక్కమారుగ వానిని నిరుపాధికముం

జేర్చివేయగలడు. అట్లిందరినో అదృష్ట వంతులగు జిజ్ఞాసువుల నాయన యట్లు చేసియుండును గూడను. కాని, శబ్దశాస్త్ర మునం దాయన యీ క్రమము నుల్లంఘింపజాలడు. ఏమన:- అధికారి యోగ్యతా తారతమ్యమునకు జెందిన క్రమపద్ధతియే వారి వారికి గళ్యాణప్రదము కాగలదని యా మహానుభావు డెరుంగును.

వాస్తవము:- యోగబలమున నొక మహనీయు డాకాశ గమనము సేయవచ్చును గాని, సాధారణవ్యక్తి మేడ యెక్కుటకు మెట్లుండవలయును. వానిం గ్రమమున నెక్కవలయును గాని మూర్ఖతమెయి నెగిరినను. దిగుటకు మారుగ నురికినను స్వరూప మగపడదుగదా!

ఇచటను చేరవలసినది నిరుపాధి కావ్యయుని. అందుల కీ పూర్వోక్తములగు నంతరములం గ్రమపద్ధతితో దాటవలయును. అందును మనమిపుడెటనుంటిమి? వైకారికవిశ్వమునగదా! మం చిది. వికారక్షరముం దాటించి యాత్మక్షరముం జేర్చుటకే వైశే షికతంత్రాచార్యు డాయనకు, మొదట నెదురుగ దయచేసెను.

వారి తంత్రము:- స్థూలశరీరమునకు జెందిన భూతములను వ్యాజముగా బెట్టుకొని సాంసారికపదార్థ సాధర్మ్య వైధర్మ్య ములను నిరూపించెను। పదార్థ విమర్శనముంజెప్పి క్రమముగ గేణుభూతములను జూపి పరమాణువుం జేర్చెను. స్థూలభూత ములం దప్పించి సూక్ష్మభూతములను జేర్చెను. స్థూలబుద్ధి వా స్థూలభూతములద్వారా సూక్ష్మభూతములందు నిలువబెట్టి

మనలను సూక్ష్మదర్శులం గావించెను.

అందువలన మనము సూక్ష్మజగత్తును దర్శింపజాలుదుము. పరమాణువులు సూక్ష్మములు. భౌతికజగత్తు స్థూలము. అవి దీని కుపక్రమోపసంహారములు; కనుకనే వారు (వైశేషికులు) పరమాణువాదముతో తమ స్థూలకారణతావాదమును ముగించిరి. పరమాణువులకంటె బరమగు సర్వప్రపంచమును, క్షరమునందును అది యక్షరమందును బ్రతిష్ఠితమైయున్నది. ఈరెంటిని వేరుసేయక రెంటి ఉన్ముగ్ధభావమును ఈశ్వరుడని చెప్పివైచిరి. ఆత్మాక్షరమే వారిదృష్టియందు పరమాణువాదాది విశ్వాంత ప్రపంచనియంత. ఇట్లు స్థూలమునుండి సూక్ష్మపరమాణువునకు గొంపోయి వారు ప్రథమసోపానమగు నాత్మాక్షరముంజేర్చి కృతకృత్యులైరి. మొదటిమెట్టుం దాటించుటే వారి పరమార్థము.

"అవ్యయుడే అంతయునగుచో వారు, ఆత్మాక్షరమును లేదా అక్షరాత్మాక్షరమునే అంతయుగా నేయాధారమును గొని చెప్పిరి?" అనుచో ఒకవిధముగా వారాత్మాక్షరమునే విశ్వేశ్వరుగా జెప్పుట యుచితమే; వారట్లే చెప్పవలయును. ఇందుకొక యుదాహరణముం జూతము:—

బాలునకు ఇది 'క' ఇది 'చ' అని వ్రాసి చూపి వానిచేనట్లభ్యాసము సేయింతుము. అవియే యక్షరము లనుకొని వాడును గ్రమముగ నేర్చుకొనును. వాస్తవమేమి! వర్ణమునకు, అక్షరమునకు లిపితో నేమియు సంబంధములేదు. అది శ్రోత్ర

గ్రాహ్యాము; నిరాకారము. పలకపై వ్రాసినవి కల్పితములు. ఇవి చెఱిపిన బోవును. శ్రోత్రగ్రాహ్యాములన్ననో నిత్యములు. ఈ సత్య మెరింగిన మనము బాలునకు ఆవిధముననే జెప్పిన నేమగును. ఒకజన్మలో కాదు. సహస్రజన్మలకైన వాని కక్షరము బోధింపగలమా? సత్యస్థితి నటుంచి లిపిమయవర్ణముల నక్షరములని బోధించుట యేల? యని యడుగవచ్చునా? ఉపాయము మిథ్యయైనను కాలాంతరమున నది సత్యతత్త్వముం జేర్పగలదు. ప్రతిమాపూజనమందలి రహస్యముగూడ నిదియే. ఈ యభియుక్తవచనము లరయుడు:–

"అచింత్యస్యాప్రమేయస్య నిర్గుణస్యగుణాత్మనః
ఉపాసకానాంసిద్ధ్యర్థం బ్రహ్మణోరూపకల్పనా,
ఉపాయాఃశిక్షమాణానాం బాలానాంఉపలాలనాః
అసత్యేవర్త్మనిస్థిత్వా తతఃసత్యంసమీహతే"

స్థూలాసక్తిని వదల్చి, ప్రథమసోపానరూపమగు, ఆత్మాక్షరముం జేర్చుట కణాదుని లక్ష్యము. అందువలన నుపలాలన భావము నాయన యట్లుచెప్పెను. అటుగాక, అవ్యయాక్షరతత్త్వ రాది సర్వాత్మప్రపంచగాథ నేకరువుపెట్ట మొదలిడుచో, జిజ్ఞాసువు కలతనొందును; తనకర్తవ్యమును నెంచేరదు.

శబ్దమాత్రముగవిన్న అవ్యయాక్షర శబ్దములంబట్టి జిజ్ఞాసువు "ఆర్య! అవ్యయాక్షరములననేమి? 'సర్వంఖల్విదం బ్రహ్మ' 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' ఇత్యాదులందలి బ్రహ్మశబ్ద మేమి పదార్థము?" అన్నచో వాస్తవస్థితినటుంచి యాజిజ్ఞా

సువు సామాన్యయోగ్యతంబట్టి ఆయన "అవ్యయ - అక్షర - బ్రహ్మ' ఇవన్నియుక్షరమే, అన్నియు దానికే పేరులు! క్షరమే అంతయు, అన్నియు, బ్రహ్మ, ఈశ్వరుడు ఆత్మ అదే" అని చెప్పును. అటుగాక, అవ్యయాక్షరచర్చ నారంభించెనా, 'ఇతో భ్రష్టః తతో భ్రష్టః" అనునాభాణకమునట్లు, ఏసిద్ధాంతముం జేయజాలకపోవును. కనుక 'నొకదానినమ్మిపోయిన నన్నియు సమకూడు' ననున్యాయమున శ్రుతియు "ఏకేనవిజ్ఞాతేన సర్వ మిదం విజ్ఞాతంభవతి' అనిచెప్పుటచే ఆయన యట్లుచెప్పెను. ఇంతేగాక: - క్షరప్రతిపాదనసేయు కణాదునికడకొక అక్షర - అవ్యయవాది వచ్చి, యేమేని యడిగినచో తనలక్ష్య సిద్ధికొఱ కాయన యతనివాదముంగూడ లౌకిక భూతానయాయులకు సాధారణాధికారులు కల్యాణార్థముఖండించివైచును. కనుక తన ధరాతలమున, సోపాధికములగు మూడాత్మ వివర్తములందుండి, క్షరాత్మను ప్రతిపాదించుచు, నాయనయేమిచెప్పె నదియెల్ల యథార్థము, నుపాదేయము, లోకకల్యాణప్రదము, ననియే యందుము.

ఇక, నాబోధవలన విశ్రాంతినొందిన జిజ్ఞాసువుదగ్గరకు మహర్షికపిలుడు దయచేసి "ఓయీ, జాగ్రత! నీకింకను దెలియ వలసినదున్నది. క్షరమేసర్వము గాదు, ఈసర్వమూలముక్షర మను నవ్యక్తప్రకృతి. జీవమూలమునదే." అని క్షరవాదము నంతయు ఖండింపనెంచును. ఏమి?— లిపినేర్చి యక్షరముల నెరింగితిననుకొనువాని కక్షరబోధ కలిగినదా? అక్షరము నెరింగిన

క్షరవాది తనక్షరాభిమానమును విడచివేయవలెను. ఈలక్ష్య సిద్ధికై కపిలుడు క్షరవాదమును, అణువాదమును, నోర్థార ఖండించివైచును. అదిన్యాయసంగతమే. అట్లు వైశేషికాను గ్రహమున స్థూలజగత్తుందప్పించుకొని సూక్ష్మజగత్తున బడిన యధికారి యిట్లుప్రాధానిక తంత్రానుగ్రహమున క్షరముం దాటి సుసూక్ష్మాక్షరనామక ద్వితీయసోపానముంజేరును. ఆ పిమ్మట శారీకతంత్రాచార్యుడాతనింజేరి:—

"నాయనా! నీపనియింకను తీరలేదు, నీవెరింగినది, వికృతి రూపక్షరము. ప్రకృతిరూపమగు నక్షరముమాత్రమే. నీయో గ్యతంబట్టి నీకు బ్రహ్మయొక్క అపరాప్రకృతి మాత్రమేచెప్ప బడినది. బ్రహ్మప్రాకృతికవివర్తముల నెరింగిన నీవు ఇంతటితో నుత్తమాధికారివైతివి. ఇకనీయెరింగిన ప్రకృతివాదమునకు బర మందున్న బ్రహ్మ (అవ్యయము) నెరుంగవలయును. 'ప్రకృ తియే విశ్వ, జన్మస్థితిలయకారణ" మను నుపలాలనమును విడచి విజిజ్ఞాస్యావ్యయబ్రహ్మయే జన్మస్థితిభంగకారణ మని యెరుంగ వలయును. స్వాయముగ నిరుపాధికబ్రహ్మ (అవ్యయము) సృష్టి నిర్మాణమును జేయగోరదనుట సరియే. అందుకది తన యీ కార్యమందు ప్రకృతిసమన్వయముంగోరును; పురుషప్రకృతి సమన్వయమే విశ్వవితానము. సాక్షాత్తుగా గాకపోయినను, పరంపరగ బ్రహ్మయే సర్వమూలకారణము" అని చెప్పును. భగవంతుడగు వ్యాసుడు తనతంత్రారంభమందే తనబ్రహ్మ ప్రతిపాదకతను సిద్ధముగావించెను.

1. అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా 2. జన్మాద్యస్యయతః 3. శాస్త్రయోనిత్వాత్ 4. తత్తుసమన్వయాత్.

అధికారియోగ్యతంబట్టి తమసిద్ధాంతములను సువ్యవస్థితములు గావించుకొనుటకు ప్రాధానికవైశేషికులట్లు వ్యాసుడును, తంత్రాంతరములను ఖండించెను. అందాయన ముఖ్యలక్ష్యము ప్రాధానికతంత్రమే. కారణము? అదిశారీరకమునకు సమీపమందున్నదియు, అవ్యయలక్షణబ్రహ్మవాద ప్రబలవిరోధియు గనుక, దానినే అధికముగ ఖండించెను. ఇంతకును:- "ఈ తంత్రము, సోపాధికావ్యయముంజేర్చుటకే వచ్చినది. తన ధరాతలముంబట్టి యిదిచెప్పునదియు, సంపూర్ణముగ సత్యమే" అనియే చెప్పదలచినది.

ఇట్లు స్థూలారుంధతీన్యాయమున దర్శనశాస్త్రము మూడు భాగము లైనది. స్థూలక్షరము, సూక్ష్మాక్షరము, సర్వసూక్ష్మావ్యయము ననఁగ వీని ప్రధానలక్ష్యములు. బోధసౌకర్యార్థము వైకారికజగత్తుతో నారంభించి క్షరపర్యంతము వైశేషికము విశ్రమించును. అటనుండి యక్షరపర్యంతము ప్రాధానిక సామ్రాజ్యము. అటనుండి అవ్యయపర్యంతము శారీరక ప్రతిపాద్యము. ఇందువలన మూడాత్మధర్మముల సమ్యగవగ్రహము కలుగగా లక్ష్యమందు దృష్టి యేర్పడును.

వైశేషికము క్షరబ్రహ్మ స్రష్ట యనును. ప్రాధానిక మక్షరబ్రహ్మ స్రష్ట యనును. శారీరక మవ్యయమే అంతయు ననును. వీనియందలి సామాన్యధర్మములను గ్రహించి, వైషమ్యములను

ద్యజించవలయును. "వైకారికజగత్తున కాత్మ, యాత్మకక్షరము" అను వైశేషికసిద్ధాంతము మూడు తంత్రములకు గ్రాహ్యమే. కాని, క్షరమే సర్వముననుట తక్కిన రెంటికి సమ్మతముకాదు. ఈ వైషమ్యమహోపాధికము - ఇది క్షరోపాధివలన బుట్టినది. క్షరుని విడచి ముందుకుబోయినచో ఈ వైషమ్యము దాని యంతనదే అంతరించును. ఇట్లే యితరతంత్రములందు నని యూహింపవలయును.

ఇంతకు:— వైశేషికనిరూపిత క్షరబ్రహ్మకంటెను ప్రాధానిక నిరూపితాక్షరబ్రహ్మకంటెను మిగిలియున్నదియు, విలక్షణమును అగు అవ్యయబ్రహ్మను అక్షరోద్దేశ్యమున నిరూపించుటకు మూడవదగు శారీరకము ప్రవర్తిల్లినదనియే ఫలితార్థము.

ఇక:— అవ్యయాత్మ యొక్క అవ్యయాక్షరక్షరము లను మూడు సోపాధికరూపములకంటె సర్వథా వేరైనట్టియు, ఆనంద ఘనము, ఏకము, నిరుపాధికము నగు వేరొక యవ్యయ మున్నదంటిమి. శారీరకము సోపాధికావ్యయ నిరూపణచే ఆ వంకకు ఆంశికరూపముగ మనధ్యాన మాకర్షించినను అది యంతగా విదితము (స్పష్టము) గాలేదు. అవ్యయముతో నక్ష రము నుద్దేశ్యముగా బెట్టి యొకవిధముగ మనలను విశుద్ధావ్యయ సంపత్తి వంచితులను గావించినది. ఈ లోపముం బూరించుట కానందావతారము, ఆనందకందము, (ఆనందఘనము) భగ వంతుడు నగు శ్రీకృష్ణుని యుపదేశామృతరూపమగు నపూర్వ విజ్ఞానశాస్త్రము గీత ప్రవర్తిల్లినది.

ఇంతవరకైన సమన్వయప్రకరణముంబట్టి "ఒకే దర్శన శాస్త్రము మూడుభాగములు చేసి ఋషులు మనలను సంశయ కుండమున బడవేయలేదు. సత్యసిద్ధాంతమును మరుగుపరుప లేదు. మేలే చేసిరి. మూడు ఆత్మధర్మముల నొకే గ్రంథమున సమావేశపరచినచో ఆత్మబోధ వంచితులమే యగుదుము. కనుక వారు చేసినపని దోష మనుట అజ్ఞతాసూచకము" అని తెలియనగును.

ఇక:— దర్శనభక్తుల కపరిచిత మనదగు నింకొకదృష్టితో నా స్థూలారుంధతీన్యాయముం బట్టియే యాపనిషదసిద్ధాంతాను సారముగ మూడు తంత్రములను సమన్వయింతము—

త్రిమూర్తియు సోపాధికము నగు పూర్వోక్తాత్మను శ్రుతి,— అమృత - బ్రహ్మ - శుక్రము లను మూడుభాగములు గావించెను. ఈ సోపాధికాత్మ వివర్తనమష్టి నుపనిషత్తు అశ్వత్థ మని చెప్పెను—

"ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోశ్వత్థః సనాతనః
తదేవశుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే
తస్మిన్ లోకాః శ్రితాఃసర్వే తదు నాత్యేతి కశ్చన, ఏతద్వైతత్." (కఠ)

ఇవి యొకే యాత్మవివర్తములు అభిన్నములు అని సూచింపనే శ్రుతి, తదేవ - తత్ - తదేవ - ఏతద్వైతత్ - అనియెను. ఈ దృష్టితో— అవ్యయాక్షర క్షరసమష్టి యన్నృత్తాత్మ. పూర్వమవ్యయమమృతము; అక్షర మహాన్మృత్యువు; క్షరము

వృత్తులనన్నను వస్తుతః మూడు నమృతములే. అవ్యయ దృష్టిచే నక్షరమును, అక్షరదృష్టితో క్షరమును పూర్వోక్త ప్రకారముగ జెప్పబడును. కాని, బ్రహ్మదృష్టిం బట్టి ఈ మూడు నమృతములే. వ్యయాభావము లేనందున నవ్యయ మమృతమనుట సరియే కదా! క్షరణ (క్షయము) లేని యక్షరమును అమృతమే. "అమృతస్యావ్యయస్యచ" అని గీత చెప్పినదిగదా! ఇక, క్షరము పరిణామియయ్యు వికార ముత్పన్నము గావించియు తన స్వరూపమున నిది యవికృతమే అనుకొంటిమిగదా! కనుకనే, దీని నాత్మాక్షర మను పేరున నమృతాత్మకోటియం దంతర్భూత మనిరి. నిత్యస్వరూపస్థితివలన నిది యమృతమందుము. ఇట్లీ మూడు నేకమై యమృతసత్యాత్మ వివర్తమగును. ఇది సత్యస్య సత్య మందురు.

ఇందలి క్షరభాగమునుండి క్రమముగ ప్రాణాపోవాగన్నాన్నా దములను నైదు వికారక్షరములు కల్గును. వీని సమష్టి విశ్వోపా దానమై (శుక్రముద్వారా ఉపాదానమై) ఉపాదానకారణము బ్రహ్మ యనబడును గనుక బ్రహ్మ యందుము. పై యమృత సత్యాత్మకిది రెండవ వివర్తము.

ఈ బ్రహ్మసత్యము దేవసత్యమునకు జనక మగును. దేవ సత్యాశ్రయమే శుక్రము. దీనికి వాగాపోగ్నులు మూడు వివర్త ములు. ఇవి ఈశోపనిషద్విజ్ఞానమున జూపబడినవి.

ఆత్మను మనఃప్రాణ వాఙ్మయ మంటిమి. ఈ మూటికి (పర స్పరము) త్రివృద్భావ సంబంధ ముండును. అనగా ఇయ్యది

పంచభూత పంచీకరణము వంటిది. అందువలన నొకే యాత్మ ఈ యమృత - బ్రహ్మ - శుక్రము లను మూడు సంస్థలుగ నగును. ఈ విషయము మరొకచో జూచుకొందము. ప్రస్తుతము ప్రకరణసంగతి కొరకు కించుక చూపెదము.

1. ప్రాణవాగ్గర్భితమనస్సు పేరు అమృతము. ఇందలి మనోభాగానందమూర్తి యవ్యయము; ప్రాణభాగ విజ్ఞానమూర్తి యక్షరము; వాగ్భాగమనోమూర్తి క్షరము; ఈ మూటి మొత్తమమృతాత్మ. ఇం దవ్యయప్రాధాన్యము. కనుక నిది 'అవ్యయ సంస్థ' యనవచ్చును.

2. మనః+వాగ్గర్భిత ప్రాణము పేరు బ్రహ్మ. ఇందలి మనోభాగ మనోమూర్తిప్రాణ మాపస్సు. ప్రాణభాగప్రాణమూర్తి వాక్కు. వాగ్భాగవాఙ్మూర్తి అన్నాన్నాదము. ఈమూటి (అయిదిటి) మొత్తము బ్రహ్మాత్మ. ఈమూటను అక్షరప్రాధాన్యము. కనుక దీనిని అక్షరసంస్థ యనవచ్చును.

3. మనః ప్రాణగర్భితవాక్కు పేరు శుక్రము. ఇందలిమనోభాగము మనోమయీవాక్కు. ప్రాణభాగము ప్రాణమయాపస్సు. వాగ్భాగము వాఙ్మయాగ్ని. ఈమూటి మొత్తము శుక్రాత్మ. ఇందుక్షరతత్త్వము ప్రధానము కనుక నిది క్షరసంస్థ యనవచ్చును.

మనోఽవచ్ఛేదముచే నమృతాత్మ జ్ఞానతంత్రాధ్యక్షము. ప్రాణావచ్ఛేదముచే బ్రహ్మసత్యాత్మ క్రియాతంత్రమునకు ప్రభువు. వాగవచ్ఛేదముచే శుక్రాత్మ యర్థతంత్రమునకు ప్రభవ

ప్రతిష్ఠాపరాయణము. ఈమూడు నొకేయాత్మ - ఒకదానికే మూడురూపములు. చూడుడు:—

(1) అవ్యయ ప్రధానము — ఆనందవిజ్ఞాన మనస్సులు, మనఃప్రాణవాక్కులు, అవ్యయాక్షరాత్మక్షరములు:— మనస్సు - జ్ఞానతంత్రము, అమృతమ్, సత్యస్యసత్యం.

(2) అక్షర ప్రధానము — మనఃప్రాణవాక్కులు— మనః ప్రాణ వాక్కులు, ప్రాణాపః, వాక్, అన్నాన్నాదః — ప్రాణః — క్రియాతంత్రము; బ్రహ్మ - బ్రహ్మసత్యః.

(3) ఆత్మక్షర ప్రధానః — వాగాపోగ్నులు, మనఃప్రాణవాక్కులు, వాగాపోగ్నులు, వాక్, అర్థతంత్రము, శుక్రమ్ - దేవసత్యః.

ఈ మూడాత్మ వివర్తములును, అధ్యాత్మ సంస్థయందలి ప్రత్యక్ - శారీరక - శరీరము లను మూడువివర్తము లకు మూలస్తంభములు. (1) శుక్రావచ్ఛిన్న దేవసత్యాత్మ నిరూపకము చతుర్వేదసంహితాయుక్త బ్రాహ్మణభాగము. 2. బ్రహ్మావచ్ఛిన బ్రహ్మసత్యాత్మ నిరూపకము ఆరణ్యకభాగము. 3. అమృతావచ్ఛిన్న నిగూఢతమ సత్యస్యసత్యాత్మనిరూపకము ఉపనిషద్భాగము. ఇట్లు నాల్గుభాగములు గల యొకే వేదశాస్త్రము, తంత్రభేదముచే అశ్వత్థపురుషుని మూడుతంత్రములను స్థూలారుంధతీ న్యాయమున నిరూపించుచు తన వేదశాస్త్రత్వమును సిద్ధముగావించుకొనుచున్నది.

వేదోక్తాత్మతంత్ర త్రయోపబృంహణార్థై త్రితంత్రదర్శన శాస్త్రము ప్రవర్తిల్లినది. 1. వైశేషికతంత్రము. స్థూల, దేవసత్యాత్మ ఆత్మధర్మములను, 2. ప్రాధానిక తంత్రము సూక్ష్మ బ్రహ్మసత్యాత్మ యాత్మధర్మములను, 3. శారీరక తంత్రము నిగూఢ సత్యసత్యాత్మ ధర్మములను నిరూపించును. అవాంతర తంత్రములున్నను వేదశాస్త్రమొకటియే. అందు పరస్పరవిరోధమునులేదు. అట్లే అవాంతర తంత్రములున్నను దర్శనశాస్త్రమొకటే - అందును విరోధములులేవు.

1

1. సత్యసత్యాత్మ - అమృతం - పురుషః -
2. బ్రహ్మసత్యాత్మ - బ్రహ్మ - ప్రకృతిః- } అశ్వత్థః
3. దేవసత్యాత్మ - శుక్రం, ప్రకృతివికృతిః

2

1. సంహితానుగత బ్రాహ్మణభాగము:— శుక్రాత్మ నిరూపకం - అర్థతంత్రం - వాఙ్మయం-క్షరప్రధానం.

2. ఆరణ్యకభాగః — బ్రహ్మనిరూపకః - క్రియాతంత్రం - ప్రాణమయం - అక్షరప్రధానమ్.

3. ఉపనిషద్భాగః — అమృతాత్మనిరూపకః - జ్ఞానతంత్రం - మనోమయం - అవ్యయప్రధా॰మ్.

3

1. వైశేషికము:— శుక్రాత్మనిరూపకము - స్థూలశరీర పరకము - వాఙ్మయమ్.

అక్షరప్రకరణమున బఠింపబడిన దగుట నటబ్రహ్మాక్షరమన్నను బాధలేదు. ఇట్లు ప్రకరణ సంబంధముచే నవి సోపసృష్టములే. కనుక 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యందనుపసృష్టరూపమున నున్న బ్రహ్మశబ్దము 'ఏకత్రనిర్ణీతన్యాయమున' క్షరమనుట దుస్సాహసముగాక మఱేమి?

కానిండు అది క్షరమే యనుచో:— 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' 'నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనుచో బ్రహ్మశబ్ద మనుపసృష్టముగదా! ఇయ్యది సచ్చిదానందవాచకము. క్షరమన్ననో సచ్చిదానందముగాదు. సర్వమూర్తియుగాదు. మరి:— అనుపసృష్టబ్రహ్మ క్షరమే యనుచో, నే శ్రుతియు జరితార్థము కాదు. అవ్యయము మను కొన్నచో నేవిపత్తియు నుండదు. అవ్యయానందకళ యానం దము. విజ్ఞానకళ చిత్తు. మనః ప్రాణ వాక్సమష్టి సత్తు. ఈ మొత్తము సచ్చిదానందము. కనుక, ఈ రూపములచే నవ్యయ మొకటే సర్వరూప మగును. అందువలన జివరకు:— ప్రకరణ విశేషములందు అక్షర - భూతి సంబంధములచే అనుపసృష్ట బ్రహ్మశబ్దముగాని విశుద్ధరూపమున బఠింపబడిన అనుపసృష్ట బ్రహ్మశబ్దము కేవలము త్రిమూర్తి - అవ్యయప్రధానము నగు నద్వయబ్రహ్మకే వాచక మగును. కనుక శారీరకబ్రహ్మ అవ్యయమే.

అట్టిబ్రహ్మ:— మహామాయ - యోగమాయ లను భేదము లచే పరమాత్మ - జీవాత్మ యను నౌపాధికభేదము లొందును.

"ఈ సూత్రానంతరముననున్న 2. 'జన్మాద్యస్యయతః' 3. 'శాస్త్రయోనిత్వాత్' 4. 'తత్తుసమన్వయాత్' అను మూడు సూత్రములతో నీ నాల్గుసూత్రములు నొక యధికరణమునకు జెందినవి. ఇవి యేదో యొక తత్త్వము దెలుపును. కనుక పాశ్చాత్యప్రణాళింబట్టి యిది సూత్రచతుష్టయి యందురు. ఇందు వ్యాసుడు బ్రహ్మను నిరూపింపనున్నట్లు జిజ్ఞాసాశబ్దమే చెప్పుచున్నది. ఇట బ్రహ్మ యన నేమి?

బ్రహ్మతత్త్వము, అవ్యయాక్షరక్షరము లని మూడు భాగములు. ఇం దిచట గ్రహింపవలసిన దేది? సూత్రగతమగు నుపసర్గరహితబ్రహ్మశబ్దముంజూచినచో నీ ప్రశ్న గతార్థమగును. ఏవిశేషము లేకుండ బ్రయుక్తమైన బ్రహ్మశబ్దము క్షరవాచకము కాగలదు. ఉదాహరణము:— ముండకమునందలి 'తస్మాదేతత్ బ్రహ్మనామ రూపమన్నంచజాయతే' అనుచో ననుపసర్గ (విశేషరహిత) బ్రహ్మశబ్ద మున్నది. దీనికి 'జాయతే' ప్రయోగింపబడినది. వికారరూపమున బుట్టుట, ఉపాదానమై యుత్పత్తిక్రమమునందు సమావేశమగుట అవ్యయునిపనిగాదు. అక్షరుని పనియుగాదు. ఇక నది క్షరబ్రహ్మస్వరూప ధర్మము. ఇట్టిస్థితిలో:— 'ఏకత్రనిర్ణీతః శాస్త్రార్థః అన్యత్రోపకారకోభవతి' అన్నట్లు, అనుపసృష్టమగు నీ బ్రహ్మశబ్దము నుపనిషన్నిర్ణయానుసారము క్షరబ్రహ్మపరకమనియే చెప్పవచ్చును.

మరియు:— గీతంబట్టి— అవ్యయుడు 'పరబ్రహ్మ', అక్షరుడు, 'పరమబ్రహ్మ', అక్షరునుండి వికసిల్లు నాత్మక్షరము 'బ్రహ్మ'

అనబడెను. చూడుడు. వరుసగ: "పరస్తస్మాత్తుభావోఽన్యోఽ వ్యక్తోఽవ్యక్తాత్సనాతనః" "అక్షరం బ్రహ్మపరమం" "బ్రహ్మాక్షర సముద్భవం" ఇత్యాదులు బ్రహ్మ యక్షర సముద్భావకములట! అది క్షరమేగదా! ఇట్లు అనుపస్పృష్టబ్రహ్మశబ్దము గీతోపనిష త్తులమతమున క్షరబ్రహ్మయే యనుట న్యాయ్యము.

ఇది యుక్తివాదము. ఇక వస్తుస్థితియుంజూతము. ఈ సూత్రమందలి బ్రహ్మశబ్దము క్షరవాచకమే యనవలయును. కనుకనే అవ్యహితోత్తరముననే సూత్రకారుడు 'జన్మాద్యస్య యతః' అనియెను. అనగా:- జిజ్ఞాస్యబ్రహ్మ జన్మ స్థితి లయ కారణ మగునది యనిగదా తాత్పర్యము!

సృష్టివిజ్ఞానానుసారము పరిణామియగు నాత్మక్షరమే విశ్వ జన్మాదులకు గారణముగదా! కార్యమునకు బ్రభవప్రతిష్ఠా పరాయణ ముపాదానకారణముగదా! ఘటమునకు మృత్తు వలె విశ్వప్రభవప్రతిష్ఠాపరాయణము ఆత్మక్షరమే. అవ్యయా క్షరు లపరిణాములగుటచే వైకారికవిశ్వజన్మాదులు వారినుండి కాజాలవు గదా! కనుక శారీరకతంత్రబ్రహ్మ క్షరబ్రహ్మయే యనవలెను. ఇక నాతంత్ర మవ్యయబ్రహ్మ ప్రతిపాదక మనుట చెల్లునా?"

సమాధానము:- ఒకే అవ్యయాత్మకు అవ్యయాక్షర క్షరము లన్నవి మూడు సోపాధికరూపములు. ప్రాధానికులు అక్షర క్షరము లవ్యయునకు వేఱైన వనుకొనగా శారీరకము ముగ్గురు

నొకటే యను నద్వైతము జెప్పవచ్చినది. ఈ మూవురు నొక బ్రహ్మయే గాని వేరుగాదు. ఆ యొకబ్రహ్మయే క్షరభాగమున నుపాదాన కారణము. అక్షరభాగమున నిమిత్త కారణము. అవ్యయరూపమున నాలంబనమునై జగజ్జన్మాది కారణ మగు చున్నది.

వైశేషికులు కేవలము క్షరమును, ప్రాధానికు లక్షరమును కారణముగ నెంచి పురుషుని తటస్థుడనుకొని భేదవాదమే పురుషార్థ మనుకొనుచుండ, వ్యాసదేవు డా త్రితత్త్వవాదఖండన చేసి మూడు నొకే యద్వయబ్రహ్మ యనుకొండని ఘోషించుచు అనుపసృష్టబ్రహ్మను జన్మాదికారణ మని చెప్పెను. క్షరుడు జన్మాదిహేతు వగుట కవ్యయు ననుగ్రహమే. అవ్యక్తాక్షరుడు మూలప్రకృతి యగుటయు నవ్యయ సమన్వయఫలమే. కనుకనే బ్రహ్మశబ్దమును వ్యాసమహర్షి జన్మాదికారణముగ జెప్పెను.

పోనిండు, ఆ బ్రహ్మశబ్దము కొంచెము సేపు క్షరవాచక మన్నచో 'తత్తు సమన్వయాత్' అనుదాని కర్థమేమి? సమన్వయ మేస్థితియందైనను ప్రకృతిపురుషులకే గదా! జన్మాదులకు:— ఆలంబనకారణత అవ్యయదృష్టిచేతను, నిమిత్తకారణత యక్షరదృష్టిచేతను, ఉపాదానకారణత క్షర సమన్వయము చేతను సిద్ధమగునని యీసూత్రమువలన దెల్లమగును. చివరకు:- శారీరకబ్రహ్మ క్షరాక్షరావ్యయములందేదియుగాక యీమూడును

దేనిరూపములో, ఏది తనవగు మూడు అభిన్నరూపములచే జన్మాదుల కుపాదాననిమిత్త ఆలంబనకారణ మైనదో ఆ సచ్చిదానందమే బ్రహ్మపదార్థ మనియు సిద్ధమగుచున్నది.

ఈ మూడు నొకే యవ్యయవివర్తములే. కనుక నీయవ్యయ దృష్టిచే శారీరక మవ్యయప్రతిపాదక మనవచ్చును. సచ్చిదానందము లవ్యయుడే. ఇతనిం గ్రహించిన నన్నియు గృహీతము లగును. కనుకనే 'ఏకేన విజ్ఞాతేన సర్వమిదం విజ్ఞాతం భవతి' చరితార్థ మగుచున్నది. అటుగాక బ్రహ్మయన క్షరమే అనుకొన్నచో అక్షరావ్యయరూపములు దానివలనగ్రహింపబడవు. అక్షరక్షరము లవ్యయగర్భములోనివిగాని అవ్యయుడు వాని గర్భగతుడు గాడు. మరియు, 'ఆనందమయోఽభ్యాసాత్' అనుట పొసగదు. ఆనంద మవ్యయుని ప్రాతిస్వికరూపము అని అర్థనిరూపణావసరమున బూర్వము చెప్పియుంటిమి. కనుక శారీరకబ్రహ్మ అవ్యయుడే. ఆ శాస్త్ర మవ్యయపరకము.

ఇక:— గీతా, ముండకములనుండి చూపిన యనుపసృష్ట బ్రహ్మశబ్దమువూట యేమన్నచో:— ప్రకరణసంగతి నెరుంగకుండ నట్లనుకొనుట దుస్సాహసము. ఎట్లన:— అన్న, నామ, రూపములు భౌతికప్రపంచము. దానితో బరిగపబడిన బ్రహ్మశబ్దము క్షరవాచకమే. కనుకనే దానికి 'జాయతే' జేర్చవలసి వచ్చెను. వాస్తవముగ:— అనుపసృష్టబ్రహ్మశబ్దము సచ్చిదానంద వాచకము: ఆ యర్థ మిట బనికిరాదనియే శ్రుతి 'జాయతే' అన్నది. ఇట్లే 'బ్రహ్మాక్షర సముద్భవమ్' అనుచో

అక్షరప్రకరణమున బరింపబడిన దగుట నటబ్రహ్మాక్షరమన్నను బాధలేదు. ఇట్లు ప్రకరణ సంబంధముచే నవి సోపసృష్టములే. కనుక 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యం దనుపసృష్టరూపమున నున్న బ్రహ్మశబ్దము 'ఏకత్రనిర్ణీతన్యాయమున' క్షరమనుట దుస్సాహసముగాక మఱేమి?

కానిండు అది క్షరమే యనుచో:— 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' 'నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనుచో బ్రహ్మశబ్ద మనుపసృష్టముగదా! ఇయ్యది సచ్చిదానందవాచకము. క్షరమన్ననో సచ్చిదానందముగాదు. సర్వమూర్తియుగాదు. మరి:— అనుపసృష్టబ్రహ్మ క్షరమే యనుచో, నేశ్రుతియు జరితార్థము కాదు. అవ్యయము మను కొన్నచో నేవిపత్తియు నుండదు. అవ్యయానందకళ యానం దము. విజ్ఞానకళ చిత్తు. మనఃప్రాణ వాక్సమష్టి సత్తు. ఈ మొత్తము సచ్చిదానందము. కనుక, ఈ రూపములచే నవ్యయ మొకటే సర్వరూప మగును. అందువలన జివరకు:— ప్రకరణ విశేషములందు అక్షర - భూతి సంబంధములచే అనుపసృష్ట బ్రహ్మశబ్దముగాని విసృష్టరూపమున బరింపబడిన అనుపసృష్ట బ్రహ్మశబ్దము కేవలము త్రిమూర్తి - అవ్యయప్రధానము నగు నవ్యయబ్రహ్మకే వాచక మగును. కనుక శారీరకబ్రహ్మ అవ్యయమే.

అట్టిబ్రహ్మ:— మహామాయ - యోగమాయ లను భేదము లచే పరమాత్మ - జీవాత్మ యను నౌపాధికభేదము లొందును.

కల్పితములగు నివి యొకటా? రెండా? అనగా:— జీవేశ్వర భేద ప్రతిపత్తి వాస్తవికమా? కాల్పనికమా? వాస్తవముగ శారీరక తంత్ర మీ ప్రశ్నకు సమాధానము జెప్పనై యవతరించినది. చివరకు:— 'యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ మృత్యోః సమృత్యుమాప్నోతి యఇహ నానేవపశ్యతి' అన్నది ప్రధాన లక్ష్యముగా గొని అద్వైతమును స్థాపించెను.

ఇక:— వైశేషికము క్షరమును, ప్రాధానిక మక్షరమును, అవ్యయ నిరూపణద్వారా శారీరకమద్వైతమును నిరూపించి నైవగా, బ్రహ్మజిజ్ఞాస శాంతించియే పోయినది. మఱి పిష్ట పేషణముగ, గీతయెందుకు? అన్నచో:—

సత్యమే: కాని, ఒకటియడిగెదము:— "క్షరాక్షరములచే విశ్వప్రపంచ నిర్వాహమగుచుండ నూరక అవ్యయపురుషుడను నొక స్వతంత్ర తత్త్వకల్పన మాత్రమెందుకు?" అందుకు "అక్షరము జడము. దానికి అవ్యయ సహయోగములేక పని జరుగదు. కనుక అవ్యయు నంగీకరించితిమి" అందురా? అంగీకరించుట వలననే జడ చేతన వ్యవహారము సత్యమగుచో ప్రకృతినే చేతనమని యంగీకరింపరాదా? "కాదు, జ్ఞానమన్నది క్రియ కంటె వేరైనతత్త్వము. ప్రకృతి జ్ఞానమయి యనుచో నది పని సేయజాలదు." అనుచో, బాధలేదు "ప్రకృతియం దర్ధభాగము చేతనము. అర్థము జడము" అనుకొండు. చక్కగా బనిజరుగును.

ఈవిధముగ నవ్యయుని యపూర్వతావిలక్షణతావశ్యకతలు శారీరకము ద్వారా సిద్ధముసేయజాలము. ఇదే యీాదర్శనము

యొక్క-అకృత్స్నత-ఈలోపముం బూరింపనే గీతయవతరించెను. ఈవిషయ మీవరకు విస్తృతమైనదే. ఇట్లు అన్ని తంత్రములును వానివాని స్థానములందుండి యన్నివిధములచే సమన్వయము నొందుచున్నవి.

లేదా, ఒక కోశమునకు, మూడుకాండలు, ఒక వేదమునకు మూడుపర్వములు. అట్లే ఒకదర్శనమునకు మూడుతంత్రములు, ప్రతితంత్రమునకును సూత్రము - కారికయని రెండు భేదములు. ఇట్లు దర్శనపర్వములు మూ డనుటకు ఆరు అగును. సూత్రము - కారికకలిసి యొకేగ్రంథము. అట్టి మూడు గ్రంథములు నొకటియై ఆస్తికదర్శనశాస్త్ర మగును. ఎట్లన:— వైశేషిక - ప్రాధానిక - వేదాంత సూత్రగ్రంథములకు వరుసగ ఔలూక్య - షడధ్యాయీ - శారీరక సూత్రము లనియు పేరులు. వీనికి కారికానిర్మాతలు వేరువేరుగ నున్నారు. వైశేషికకర్తకు కణాదు డన్నది పౌరుషనామము. అతని జన్మనామము ఉలూకుడు. కనుక నతనిది ఔలుక్య దర్శనమందురు. "లవ - లేశ - కణా - ణవః" అను కోశానుసారము అణువులన్నను, కణములన్ననొకటే, అణువాదము మొదట నెదుట నుంచినవా డీయన. కణం = పరమాణువాదం, 'ఆదత్తే' అని యితనిం గణాదుడనిరి. అణ్వాదయనుట కంటె నిందుచ్చారణ సౌకర్యమున్నదికదా!

ఈయనకుబూర్వ మాత్మనుండియే విశ్వోత్పత్తి. 'బ్రహ్మైవేదం సర్వం" అనియే సిద్ధాంతము; దీనినొకవిధముగ ఖండించి

యీాయన పరమాణువాదమును స్థాపించెను. పూర్వ మీా వాదము స్పష్టముగ లేకున్నను, వికారాక్షర - విశ్వసృట్ రూపమున వేదమున నందందు ఈవాదమునకు రూపాంతరములు లభించును. కనుక నీవాద మవైదిక మనజాలము. కనుకనే ఇది ఆస్తికతంత్రము.

కొందరీయన పరమదరిద్రుడై లేకిబ్రతుకు బ్రతుకువాడు కనుక 'కణా నత్తి' అని కణాదుడన బరగెనందురు. అది వారియజ్ఞాన వైభవమును సూచించును. అద్భుతమగు పరమాణువాదము నావిష్కరించిన, ఆనాటి సుసమృద్ధ భారతదేశపు శాస్త్రవేత్త యన్నాతురుడై తిరిగెననుట పొసగునా?

పదార్థ విశేషకు గారణము పరమాణువులు. కనుకనిది వైశేషికమందురు. ఇదిశారీరక - ప్రాధానిక - న్యాయ - మీామాంసాదుల కంటె బ్రాచీనమనిశోచును. అది న్యాయ్యముగూడను. దృష్టి స్థూలమునుండియే సూక్ష్మమునకు బోవునుగదా? పౌరాణికుల కాలవాదముంబట్టియు నీవిషయమే ధ్రువమగును.

"న వయం షట్పదార్థవాదినః వైశేషికవత్" 'సమానప్రకృతేర్ద్వయోః' ఆద్యహేతుతా తద్ద్వారా పారంపర్యేఽప్యణువత్" "పరిచ్ఛిన్నత్వా న్నసర్వోపాదానమ్' నషట్పదార్థనియమః తదో్భధాన్యక్తిః" నాణునిత్యతా తత్కార్యత్వశ్రుతేః" ఇత్యాదిసాంఖ్య సూత్రములంబట్టి వైశేషిక ప్రాచీనత సిద్ధమగుచున్నది.

ఇట్లే:— "మహద్దీర్ఘవ ద్వాహ్రస్వపరిమండలాభ్యామ్"

అను సూత్రవివేచనమున శారీరకముకంటెను నిది ప్రాచీనమని దోచును. వ్యాసమహర్షి తనమైతిహ్య గ్రంధమందు ఉలాకుని స్మరించి తద్దర్శనప్రాచీనతను సూచించెను. "ధౌమ్యో, విభాండో, మాండవ్యో, ఉలూకఃపరమో విప్రో మార్కండేయోమహామునిః" (భీష్మస్తవరాజము) సాంఖ్యమునకు సాంఖ్యకారికలు, శారీరకమునకు గీతలువలె నుండదగిన దీనికిగల కారికాగ్రంధము నేడు విలుప్తమైపోయినది. దీనియతిప్రాచీనతయే యందుకు గారణమనవచ్చును.

రెండవది ప్రాధానిక సూత్రసందర్భము. షడధ్యాయి. ఇందారధ్యాయములని పేరే చెప్పును. ఇదిగాక తత్త్వసమాసమను నింకొకటి యున్నది. ఇందు 22 సూత్రములున్నవి. ఈరెంటి భేదము చెప్పుటకే దానిని షడధ్యాయియందురు. తత్త్వసమాసమను సాంఖ్యము వైశేషికముకంటె ప్రాచీనమని వినబడుచున్నది. షడధ్యాయీ సాంఖ్యప్రణేత అగ్నియొక్క యవతారమట.

"సనకశ్చసనందశ్చ తృతీయశ్చసనాతనః
కపిలశ్చాసురిశ్చైవ వోఢుః పంచశిఖఃతథా
శుక్లకృష్ణగతిర్దేవో యోబిభర్తిహుతాశనమ్
అకల్మషః కల్మషాణాం కర్తాక్రోధాశ్రితస్తుసః
కపిలంపరమర్షించ యం ప్రాహుర్యతయస్సదా
అగ్నిఃసకపిలోనామ సాంఖ్యయోగ ప్రవర్తకః॥"

తత్త్వసమాసకర్తకపిలుడు విష్ణువునవతారమట. "నారాయణః కపిలమూర్తి రశేషదుఃఖ హారణాయ జీవనివహాస్య

నమోస్తుతస్మై" ఈయన దేవహూతిపుత్రుడు, మొదట దీనిని తనతల్లికిజెప్పెను, గీతఖండించిన దీ తత్త్వసమాసమునే, గీతోపదేశము మొట్టమొదట భగవంతుడు దేవయుగమందే కావించెను, అంతకు బూర్వమునుండియు నీకపిలనిష్ఠ ప్రచారమునందుండెను, ఈశ్వర కృష్ణకారికలు షడధ్యాయికి జెందినవని యెరుంగవలయును.

మూడవది శారీరక సూత్రము. కర్త భగవంతుడు, దీనికి కారికా గ్రంథముగీత. దీనికిని రచయితఅతడే. అయినను సిద్ధాంతము వాసుదేవ కృష్ణునిది. కృష్ణార్జున సంవాదప్రసంగమునందు వాసుదేవ కృష్ణోపదిష్ట సిద్ధాంతమును, వ్యాసుడేదువందల శ్లోకములుగ లిపిబద్ధము గావించె; నదియేగీత - శారీరక కారికా గ్రంథము.

సమ్యగ్దర్శనత్వము. దర్శనశాస్త్రమున కవచ్ఛేదకమనియు సమ్యక్ జ్ఞానత్వము, విజ్ఞాన శాస్త్రమున కవచ్ఛేదక మనియు జెప్పియుంటిమి. మరియు - వైశేషిక - ప్రాధానిక - శారీరకములు, మూడును ఆత్మసమ్యగ్దర్శనముం గావించు, దర్శన శాస్త్రములుగను, గీత, యాత్మ సమ్యజ్ఞానము గల్గించుచు విజ్ఞానశాస్త్రముగను, ఉన్నవనియు, దర్శనమందులేని సమ్యక్ జ్ఞాన విజ్ఞాన, సమ్యక్చారిత్ర్యానుష్ఠాన వ్యావహారికోపయోగములను జెప్పి యాలోపపూర్తిం గావించునది గీతా విజ్ఞాన శాస్త్రమేయనియు, ఇందువలన నిది దర్శన మనక, దర్శనాంతర్గత మనియుననక స్వతంత్రశాస్త్ర మనియు జెప్పి

యుంటిమి. ప్రస్తుతము, పైనజెప్పిన వాద మిందుకు విరుద్ధ ముగ నున్నది. కనుక:-

సమాధానముగ:— గొంచెము వివరించెదము:— 1. సమ్యగ్దర్శన యుక్తి - ఆత్మధర్మత్వము, దర్శనశాస్త్రమున కవచ్ఛే

స మ న్వ య ము 173

యుంటిమి. ప్రస్తుతము, పైనజెప్పిన వాద మిందుకు విరుద్ధ ముగ నున్నది. కనుక:-

సమాధానముగ:— గొంచెము వివరించెదము:— 1. సమ్యగ్దర్శన యుక్తి - ఆత్మధర్మత్వము, దర్శనశాస్త్రమున కవచ్ఛే

"సంవిదన్తి న యంవేదా విష్ణుర్వేద నవావిధిః
యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ"

174 ఆత్మవిజ్ఞానము

"సంవిదన్తి న యంవేదా విష్ణుర్వేద నవావిధిః
యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ"

"సత్యపి భేదాపగమే నాథ! తవాహం, నమామకీనస్త్వమ్.
సాముద్రోహితరంగః, క్వచ న సముద్రో నతారంగః"

గీతాశాస్త్రము మీయభేదవాదమున విశ్రమింపదు. అది:– శారీరక (జీవాత్మ) ప్రత్యగాత్మ (పరమాత్మ) ల స్వరూపమును విమర్శింపుచు, అవ్యయాక్షరక్షరము లను మూడు వివర్తము లను మనయెదుట నుంచి చివరకవ్యయుని వైజ్ఞానిక స్వరూప మును జూపి, యిరువు రవ్యయులకు నభేదముంజెప్పి అవ్యయా క్షరాత్మక్షరముల మూటికి నవ్యయ విభూతిత్వము సిద్ధము గావించుచు, బుద్ధియోగము ద్వారా, శారీరకావ్యయునకు, తదభిన్న ప్రత్యగాత్మావ్యయప్రాప్తియొక్క వ్యావహారికోప యోగముం జూపుచు, నిరూపణీయ విషయసమాప్తి జేయు చున్నది. శారీరకమునకువలె గీతకు ముఖ్యలక్ష్య మభేదవాదము కాదు. మరేమన:– అవ్యయస్వరూప ప్రతిపాదనము, తత్ప్రాప్త్యు పాయభూత బుద్ధియోగనిరూపణము, దాని ముఖ్యలక్ష్యము. ఈదృష్టితో శారీరకము - తత్కారికయగు గీతయు సమాన తంత్రము లయ్యును వేరైయున్నవి.

పూర్వము చెప్పినట్లు క్షరముంజెప్పు వైశేషికముకంటెను, అక్షరముం జెప్పు ప్రాధానికము కంటెను, శారీరకమవ్యయ వాది యనవచ్చును. గనుక అవ్యయప్రతిపాదక గీతాశాస్త్రమును దీనికికారికాగ్రంథమని యంగీకరింప వచ్చును. కాని, సూక్ష్మ దృష్టితో జూచినచో:– శారీరక తంత్రదృష్టి కేవలము అభేద

వాద ప్రతిపాదనను విడచి విశుద్ధాద్వైయుని పై లేదని తేలును. తదీయ విజిజ్ఞాస్య బ్రహ్మపదార్థము వ్యాపకమనుటయు, 'ఆనంద మయోఽభ్యాసాత్' ఇత్యాదిగా, ఆంశికరూపమున నుండ్యాన మది యానందమూర్తియగు సవ్యయుని వంక కాకర్షించు మన్న దనుటయు సరియే. కాని, అందు విశుద్ధాద్వైయ 'స్వరూప స్పష్టప్రతిపాదన లభింపదు. మరియు:- 'అక్షరధియా......" "తత్తుసమన్వయాత్" ఇత్యాదులను జూచినపుడు, దాని దృష్టి యక్షరమునందే గలదనియు జెప్పుటకు వెనుదీయము. ప్రాధాని కుల సర్వస్వమగు నక్షరముతో నిది విరోధించి, పురుషప్రకృతి భేదవాదమును నిరాకరించుటయం దిది పూర్తిగ సఫలత నొందినను, విశుద్ధాద్వైయశాస్త్ర మొక్కగీతయే అందును.

వైశేషికము క్షరమువరకును, ప్రాధానికమక్షరమువరకును, బరువెత్తి శ్రాంతినొందగా, 'శారీరక మక్షరధియా' అవ్యయ ప్రతిచ్ఛాయం జూపి మౌనముం దాల్చినపుడు, విశుద్ధాద్వైయ వైజ్ఞానిక నిరూపణార్థము గీత వెలసినది. గీతాసిద్ధాంత మాంశి కముగ శారీరకమును సమర్థించును. గాన గీతకు శారీరకమును విమర్శించు నావశ్యకములేదు.

ఇందు ప్రాధానికతంత్రవిమర్శ కావలసినంత యున్నది. కాని, అవ్యయసిద్ధాంత విరుద్ధములు గాని ప్రాధానిక సిద్ధాం తములను లోకసంగ్రాహకుడగు భగవానుడు తనగీతయందు సమావేశపరచెను. తక్కినవానిం ద్రోచివైచెను.

ఉదాహరణము:— సాంఖ్యు "లవ్యక్తమునుండిసృష్టిప్రవృత్తి" యనిరి. గీతయు 'అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్తి' 'అవ్యక్తాదీనిభూతాని' అనియెను. పెక్కులేల, సాంఖ్యుల రెండుసిద్ధాంతములను దప్పించి తక్కిన యన్నిసిద్ధాంతములను గీత యాదరించెనన్నను బాధలేదు.

సాంఖ్యసిద్ధాంతానుసారము పురుషుడు (అవ్యయుడు) భోగ్యమగుజగత్తునకుభోక్త. అక్షరనామకావ్యక్తతత్త్వము భోగ్యపదార్థజనకము. అర్జించునదొకరు. భోగించునదింకొకరు. మొదటనే భగవంతు డీ సిద్ధాంతమునకువిరోధి. ప్రకృతియన్నది కార్యమునకు బూర్వావస్థ కనుక, ఉపాదానకారణమునే ప్రకృతియనుటతగును. తరువాతిదగు కార్యావస్థవికృతి. కనుక ప్రకృతియొక్క కార్యమును వికృతి (విరుద్ధకృతి) యందుము. అనగా:— ప్రకృతి యుపాదానకారణము; వికృతి కార్యము నని నిష్కర్ష. ఇట్లైచో:- సాంఖ్యము అక్షరమును బ్రకృతియనుచు పరిణామి యనుచున్నది. దానిదృష్టిలో అవ్యక్తాక్షరమే పరిణామి. అప్పుడే. దానిం బ్రకృతియనదగును. ఈయక్షరము దానిదృష్టిలో పురుషుడు బ్రకృతియుగూడ కాదు. పురుషుడాత్మ-క్షేత్రజ్ఞుడు-చిన్మాత్రుడు - నిష్క్రియుడు - సృష్టి యెడనుదాసీనుడు. ఇట్లు:— అక్షరమును ప్రకృతి (ఉపాదానకారణము) అనుటయు, అవ్యయునకు సృష్టిసంబంధము లేదనుటయు ననునీ రెండుసిద్ధాంతములును భగవంతుని దృష్టిలో గణింపదగనివి. ఈరెండుసిద్ధాంతములను గీత అంశతః ఖండించెను. అంశతః యేమి యన్నచో:— గీతయు

నవ్యక్తమునుండియే సృష్టినంగీకరించెను. సాంఖ్యము నంతే. కనుక నవ్యక్తత్వముచే రెండును అవిరోధములే.

ఇక ఖండనీయాంశ మేమన:- సృష్ట్యుపాదాన భూతావ్యక్తము నక్షరమనుకొనుట. ఈవిషయమున గీతాభిప్రాయ మేమన:- "అక్షరమక్షరమే (క్షరము=పరిణామి: కానిదక్షరము) అదియెన్నడు నుపాదానము కాజాలదు. కనుక నిట యవ్యక్తమన నాత్మాక్షర మనుకొనవలయును. జగదుత్పత్తిస్థితి భంగముల కుపాదానమదే. అదే పరిణామి - కనుక నే అదిక్షరమనబడును. అక్షరమును కారణమే. కాని అదినిమిత్తకారణము. ఈనిమిత్త కారణతా దృష్టితో "కృతేఃప్రాగవస్థా" అను నిర్వచనముచే దీనినిగూడ బ్రకృతియనుటకాపత్తిలేదు. కాని, ఈప్రకృతిని ఉపాదాన కారణత్వముచే ప్రకృతియనుట బొత్తిగాతప్పు"

ఈదృష్టితో సాంఖ్యప్రకృతివాదము నపరాప్రకృతినామకావ్యక్తక్షరపరకముగ నెంచవలయును. గీతాసిద్ధాంతముంబట్టి అవ్యయాక్షరక్షరములు మూడును అవ్యక్తములనియే పేరువడినవి. "పరస్తస్మాత్తుభావోఽన్యోఽ వ్యక్తో(అవ్యయః)ఽవ్యక్తాత్ (అక్షరాత్) సనాతనః" 'అవ్యక్తోఽక్షర ఇత్యాహుః' 'అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః' అయినను, సాంఖ్యావ్యక్త ముపాదానత్వమున బ్రయుక్తము. ఉపాదానము క్షరమే కాని మరేదియు గాదు. కనుక నదియాత్మక్షరపరకమనుకొనుట యుచితము.

ఇట — సాంఖ్యవాది (అక్షరవాది) "శ్రుతిగూడ స్పష్టముగ

అక్షర ముపాదాన మనుచున్నది. దానికి గీతార్థము విరుద్ధమా చూడుడు:—

"యథాసుదీప్తా త్పావకా ద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తేసరూపాః
తథాఽక్షరా ద్వివిధాః సోమ్యభావాః ప్రజాయన్తే తత్రచైవాపియన్తి"

అన్నచో:— అటనేమున్నది? స్వమతపుష్టికై జేర్చిన యవగ్రహముం దొలగించినచో మీయర్థ మెక్కడ నుండును! అక్షరము పరిణామియెన్నడు గాజాలదని గూఢశబ్దము, విజ్ఞానము కూడ జెప్పుచుండగ నీయవగ్రహబాధయేల? అందుము. కాదన్నచో పోనిండు. ఆపాఠమునేయుంచి యీసమాధానము వినుడు:—

అవ్యయ గర్భితాక్షర క్షరసమష్టిని విజ్ఞానశాస్త్రము ప్రజాపతియన్నది. ఈప్రజాపతికి:— "అర్థంహవై ప్రజాపతేరాత్మనో మర్త్యమాసీదర్థ మమృతమ్" అని లక్షణము. ప్రజాపతి యర్థభాగ మమృతము. ఇదేయక్షరము. అర్థభాగము మర్త్యము. ఇదేక్షరము. ఈ రెంటి సమష్టిరూప ప్రజాపతియే సృష్టికారణము. "ప్రజాపతి స్త్వేవేదం సర్వం యదిదం కించ" "ప్రజాపతిరకామయత సతపోఽతప్యత, సోఽశ్రామ్యత్"

ప్రజాపతియొక్క అక్షరక్షరములను నీరెండు రూపములందు క్షరముకంటె నక్షరమే వ్యాపకము "నత్వహం తేషు తేమయి" అన్నట్లు అక్షర గర్భమందు క్షరము ప్రతిష్ఠితము. కనుక అక్షరముం గ్రహించినచో క్షరమును గ్రహింపబడును. కాని క్షరము

గ్రహించిన నక్షరగ్రహణము గాజాలదు. శ్రుతి సృష్టికి మూల కారణముం జెప్పవలయును. మూలకారణము ప్రజాపతి. అందు అక్షరక్షరములు రెండును గలవు. శ్రుతికి ప్రజాపతి యమృత భాగమగు అక్షరమునకు గూడ ప్రాధాన్యము సూచింప వలసి యున్నది. కనుక నది 'తథాఽక్షరాత్' అనుట యావశ్యక మనుకొనెను. అక్షరముచే క్షరమును గృహీతమగును. అక్షర ప్రధానతయు దెల్లమగును. ఈస్థితిలో నీయాక్షేపణకేమియు మూల్యముండదు గదా?

ఇక:— "క్షర ముపాదానమనుట కాధారమేమి?" అన్నచో గీత అవ్యయుని పరబ్రహ్మ, అక్షరుని పరమబ్రహ్మ యన్నది. కనుక నిక పారిశేషిక న్యాయముచే బ్రహ్మ అనగా:— అవ్యయాక్షర ప్రకరణము నకుజెందిన యనుపస్మృష్టి బ్రహ్మశబ్దము కేలము క్షరవాచక మనుకొనవచ్చును. 'బ్రహ్మాక్షరసము ద్భవమ్'' "తస్మాదేతత్ బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే'' ఇత్యాదులందలి బ్రహ్మ శబ్దము క్షరవాచకమే. ఈ విషయము ఈవరకు గతార్థమైనదియే.

ఇంతటితో ప్రకృతివాదము సమాప్తమయినది: ఇక సాంఖ్య సమ్మత పురుషుని జూతము. ఈపురుష సిద్ధాంతముంగూడ నాంశికరూపమున గీతఖండించినది. అవ్యయ పురుషుడు సృష్టి యందు ఉదాసీనుడని సాంఖ్యమువలె గీతయు నంగీకరించెను. 'ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు' శరీరస్థోఽపికౌన్తేయ నకరోతి నలిప్యతే''

అయినను అవ్యయుని ప్రయోజన మేమియు లేదని యది యొప్పుకొనదు. ఇతడేమియు జేయనివాడయ్యును జేయువాడే. "తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయం" అందువలననే 'ఉదాసీనవత్' అన్నది. సర్వథా ఉదాసీనుడు గాడనుచున్నది. మరియు:— 'మత్తఃపరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ!' "అహం సర్వస్య ప్రభవః" "ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయం" ఇత్యాదిగా అవ్యయుని సర్వేశ్వరత సిద్ధము గావించినది.

ఇంకొక ప్రశ్న ఏమన:— అపరిణామి, వ్యాపకుడు, ఆప్త కాముడు, ఆత్మకాముడు, నిత్యతృప్తుడు, ఉదాసీనుడు నగు వాడు సృష్టికి మూల మనుటెట్లు? అతనికి ఆ కామన యేల? అను నిత్యాది ప్రశ్నలకు సముచితోత్తరములు విచారణ సేయ నందున సాంఖ్యము తన కారణతావాదము ప్రకృతితోడనే విశ్రాంతి నొందించెను. 'యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ' అన్నట్లు దానికి ఆ కారణతావాదము సరిగనేయున్నది. ఈ ప్రశ్నలకు చక్కని సమాధానము లిచ్చుచు నవ్యయుని కారణతను స్థాపింపనై గీతాశాస్త్ర మవతరించెను.

ఇది సమన్వయ నిరుక్తి

# షడ్దర్శన వాద మౌలిక రహస్యము

దర్శనము లారే యనుటెట్లు? అనుప్రశ్నను విజ్ఞానదృష్టితో విచారింపవలయునని మొదట ననుకొంటిమి. కాని, వ్యాఖ్యాతల

యనుగ్రహమువలన వేదశాస్త్రమువలె గలుషితమైపోయి, పరస్పరవైరముల నుత్తేజింపజేయు దర్శనములను సమన్వయము గావించిన పిదప విచారింతమని యెంచి యూరకొంటిమి. ఇంతకును:—

అస్తితత్త్వముం జెప్పునది యాస్తికదర్శనమనియు, ఆయస్తితత్త్వము 1. అవ్యయరూపమనస్సు 2. అక్షరరూపప్రాణము 3. ఆత్మక్షరరూపవాక్కు అను మూడే వివర్తము లొందుచున్నదే గాని నాల్గవ యస్తివివర్తమేదియు లేదనియు, ఈ మూటికి గ్రమముగ శారీరక ప్రాధానిక వైశేషికము లను మూడు తంత్రములును చాలుననియు, పూర్వమీమాంస, యోగము, న్యాయము అను మూడును దర్శనము లనుకొనుట భ్రాంతి యనియు నవగతమైనది. మరియు:—

ఇంకొకదృష్టితో జూతము:— జీవాత్మకు విశ్వాత్మదర్శనము జేయించుట దర్శనశాస్త్ర ముఖ్యోద్దేశ్యము. ఈ విశ్వాత్మ అధిదైవతాధ్యాత్మాధిభూతము లని మూడు విధములు. ఈ మూ డధికరణములను శారీరక ప్రాధానిక వైశేషికములు నిరూపింపగా నిక నేమున్నది? మీమాంసా యోగ న్యాయములు గూడ నీ మూటినే తెల్లము గావించినను వీని ముఖ్యలక్ష్యములు వేర్వేరుగ నున్నందున విశ్వాత్మదర్శనదృష్టితో నీమూడు నేకదేశీయములే. కనుక వీనిని దర్శనము లనజాలము.

ఉదాహరణమునకు:— పూర్వమీమాంసనుగొందము. దీని ముఖ్యలక్ష్యము. "కర్మవిధాయక వైదికాదేశ వాక్యేతికర్తవ్య

తలను సమన్వయించుట" అందువలన నది వైదికకర్మకాండ యొక్క యొక సువ్యవస్థిత స్వరూపమును మనయెదుట బెట్ట నెంచును. దాని ప్రధానోద్దేశ్య మాత్మనిరూపణ మగుచో దానిని 'కర్మమీమాంస' యనరు.

ఇటనొక ప్రశ్న:— 'అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున' "అంతరం మృత్యోరమృతం మృత్యావమృత మాహితం" 'తదంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః' ఇత్యాది శ్రౌత స్మార్త వచన ప్రమాణములచే అహంవాచ్య విశ్వాత్మ 1. అమృతలక్షణజ్ఞానము 2. మృత్యులక్షణకర్మ అను రెంటితో గూడినది. అందొక భాగము జ్ఞానము. వేరొక భాగము కర్మ. ఇట్టిచో కర్మ యాత్మస్వరూపమునకు వెలియైన దనజాలము. కనుక కర్మ నిరూపకమీమాంస నాత్మదర్శన శాస్త్ర మనుటకు బాధ యేమి? అన్నచో:—

సమాధానము:— ఆ దృష్టితో శాండిల్యదర్శనముంగూడ నేడవదిగా నంగీకరింపవలయును. ఏమన, కర్మసూచక బ్రాహ్మణ వచనసమన్వయము మీమాంసయు, భక్తిసూచకము లగు నారణ్యకవచన సమన్వయమును శాండిల్యదర్శనమును సేయును. భక్తియందు జ్ఞానకర్మలు రెండును గలవు. అవి యాత్మస్వరూప ములే. కనుక తన్నిరూపకమగునదియు నొక దర్శన మన వచ్చునుగదా!

వాస్తవమేమన:— శారీరక మన జీవాత్మపేరు. ఏతత్కల్యా ణమునకు కర్మ ఉపాసన జ్ఞానము అను మూడు మార్గములు.

వీని సమ్యగ్దర్శనార్థము ఆయువునందలి మొదటి పాతికవత్సరములందు గృహస్థధర్మములకు వేరుగనుండి గురుకులమునం దధ్యయనము గావింపవలయును. ఇదే యీ శారీరకాత్మకు మొదటిదగు బ్రహ్మచర్యాశ్రమము. పిమ్మట రెండవ పాతికవత్సరములందు కర్మ ననుష్ఠింపవలయును. ఇది రెండవదగుగృహస్థాశ్రమము. మూడవ పంచవింశతియందు ఉపాసనానుగామి యగుట మూడవదగు వానప్రస్థాశ్రమము. చివరిదగు నాల్గవ పంచవింశతియందు జ్ఞానము నాశ్రయించి సన్యస్తధర్మదీక్షితుడై బ్రహ్మతో తాదాత్మ్య మొంది ఆయువు నూరేండ్లను ధన్యము గావించుకొనును.

ఈ కర్మోపాసనాజ్ఞాన ప్రతిపాదకములు వరుసగ బ్రాహ్మణారణ్యకోపనిషత్తులు. ఒకే శాస్త్రము శారీరకాత్మోపకారకము. కనుక ఈ మొత్తము నొకే శారీరకశాస్త్ర మందుము. ఈ మూడు వేదభాగములను సమన్వయించుటకు జైమిని శాండిల్య వ్యాసులు క్రమముగ 12 – 4 – 4 అధ్యాయములను రచించిరి. ఇవి ఒకే వేదశాస్త్రమును మీమాంస సేయవెలసిన మూడు తంత్రములు. కనుక, మొత్త మొకటే మీమాంసాశాస్త్రము. అందువలననే వీనికి వరుసగ పూర్వ మధ్యమోత్తర మీమాంసలనియు పేరులు వెలసినవి. ఇందుకు నొక గుప్తకారణము కలదు:—

ఆరణ్యకభాగ ముపాసనాప్రతిపాదక మంటిమి. గీత 'బుద్ధియోగ'మని పిల్చు నీ నిష్కామోపాసన యొకవిధముగ జ్ఞాన

యోగమే:— ఈవిషయమును సూచింపనే ఆరణ్యక ముపనిష దంతర్భావముగ నాచార్యులెంచినట్లు 'బృహదారణ్యకోపనిష' దిత్యాది వ్యవహారముచే స్పష్టమగుచున్నది. కనుకనే మధ్య మగు భక్తి మీమాంసకు స్వతంత్ర వ్యవహారము లేదయ్యెను. ఇంతకును:—

మూడు నొకే మీమాంసాశాస్త్రము - ఒకే శారీరక శాస్త్రము. ఇందు ముఖ్యముత్తరమీమాంస, దీని ముఖ్యవిష యము జ్ఞానమూర్తి, అన్వయాత్మ. కనుక తక్కినతంత్రము లిం దంతర్భూతములు, ఇదియంగి; అవి యంగములు, ఏక దేశీ యములు. కనుక వీని స్వతంత్రము లనజాలము. శారీరక గ్రహణముచే మూడును గృహీతములగును.

ఆత్మదర్శన సన్న్యాసాపేక్షకములని మూడుభాగములు, జ్ఞానకాండ నిరూపించుచు వ్యాసుడు. ఈమూడాత్మధర్మములం దన్నియు బ్రహ్మనిరూపణ సేయుచు తనదర్శనతంత్రతను సిద్ధము గావించివైచెను. కాని, శాండిల్యజైమినులు, కేవలము మీ మాంసకులుగనే ప్రఖ్యాతినొందిరి. 'పరానురక్తిరీశ్వరే' అను శాండిల్యుడు భక్తిప్రతిపాదనము గావలెనంత చేసియు, ప్రాణ తంత్రాధ్యక్షమగు సంకర్షణుని స్పృశింపనైనలేడు. ఇట్లే 'చోద నాలక్షణార్థోధర్మః' అను జైమిని, పూర్ణముగ గర్మమీమాంస యొనరించినను, వాక్తంత్రాధ్యక్షమగు క్షురముంగూర్చి యొక మాటయు నెత్తడయ్యె.

అట్లైచో:- అక్షరక్షరములనిరూపించు రెండుదర్శనము లుండ వలయునను లోపము, ప్రాధానికవైశేషికములు, పూరించినవి. వానితోగూడి అవ్యయప్రతిపాదకమగు శారీరకతంత్రము దర్శన శాస్త్ర పూర్ణతకు హేతువయ్యెను.

ఇట్లు:— శాండిల్య — మీమాంసలు, భక్తి - కర్మలనే మీమాంసచేసి, అక్షరక్షరములను నిరూపింపనందున నీరెండును జ్ఞాన మీమాంసకమగు శారీరకసూత్రాంతర్భావము లయ్యెను. ఈదృష్టితో శారీరక - శాండిల్య - జైమినీయములు మూడును దర్శన మర్యాదాబహిర్భూతము లనవచ్చునుగాని శారీరకము జ్ఞాన మీమాంసతోబాటుగ 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యనుచు అవ్యయాత్మ ధర్మనిరూపణ చేసినది. కనుక నది దర్శన మయ్యెను. దీనితో అక్షరప్రతిపాదక ప్రాధానికము, క్షరప్రతి పాదకవైశేషికము గూడ దర్శనమర్యాద నొందినవి. ఇట్లు:— ఆస్తికదర్శనములు మూడు, లేదా, ఒకే యాస్తికదర్శనము నకు మూడు భాగములు, అయినవి. ఇది:- "పూర్వ మీమాంస ఆత్మ ధర్మలక్షణకర్మ నిరూపకమయ్యు నేల దర్శనము కాలేదు!" అను ప్రశ్నకు సమాధానము.

ఇక యోగశాస్త్రమును విచారింతము :— 'చిత్తవృత్తి నిరోధము దీనిముఖ్యలక్ష్యమని 'యోగశ్చిత్తవృత్తినిరోధః' అను సూత్రము స్పష్టపరచును. శాండిల్యజైమిని మీమాంసల ట్లిదియు, అవ్యయాక్షరక్షరములందు దేనినైన ముఖ్యలక్ష్య ముగా నుంచుకొనక "జీవాత్మ చిత్తస్థిరత నెట్లు పొందును?

ధారణా - ధ్యాన - సమాధుల యేక త్రసంయమన మెట్లు లభించును? అణిమాదిసిద్ధి ప్రాప్త్యుపాయములేవి?" ఇత్యాది ప్రశ్నలకు సమాధాన మిచ్చుటయందే గతార్థమయ్యెను.

ఎంతగా జూచినను, మీమాంసను శారీర కాంతర్భావ మన్నట్లు దీనిని పూర్వసాంఖ్య ప్రవచనాంతర్భావ మనవచ్చును. సాంఖ్యములు రెండంటిమి. 1. తత్త్వసమాసము. ఇదియుత్తర సాంఖ్యము, ప్రాచీనము, సేశ్వరసాంఖ్యము 2. షడధ్యాయి. ఇది యర్వాచీనము, పూర్వము, (ఇక్కడిది) "ఈశ్వరాసిద్ధేః" అనుసార మనీశ్వరసాంఖ్యము. యోగశాస్త్రమున కిందే యంత ర్భావము. దీనికైవల్య జ్ఞానమునకు సమకార్చరిత్రము నీ యోగమునిరూపించును. కైవల్యజ్ఞాన మెట్లు రాగలదు? అను టకు సమాధాన మీయోగశాస్త్రము. యోగ - సాంఖ్యములు పూర్వోత్తర మీమాంసలవలె సమానతంత్రములు. కనుకనే శారీరకదర్శనము సాంఖ్యముతో బాటుగ "ఏతేన యోగః ప్రత్యుక్తః' అని యోగముంగూడ ఖండించెను. ఇట్లు:- ఆత్మ ధర్మములు ముఖ్యోద్దేశ్యములుగ గానక, సాంఖ్యమున కంగ మగు నీయోగము స్వతంత్రమనజాలము.

ఇకమిగిలినది న్యాయశాస్త్రము:— ఇదియెందును అంతర్భా వముకాదు అగుననన్నచో, నన్నిటియందును నగును, దీని ముఖ్య లక్ష్యము కథాప్రసంగము, మొదటనే ప్రమాణ ప్రమేయాదిగ పదునారుపదార్థములనుల్లేఖించెను. వాని కాత్మపరీక్షతో సంబం ధము (ప్రధానముగ) లేదు. ఇతర విషయములతో బాటుగ

నాత్మయు సంగభూతము. 'ఆత్మ - శరీరము - ఇంద్రియార్థములు' మొదలగు 12 భావముల నిది నిరూపించినను, దర్శనతంత్రములవలె నాత్మవిచారమునకు జోటిచ్చినను, ఈ తన్నిటి యుపన్యాస విచారణయు కథా (వాది ప్రతివాదులం దగు శాస్త్రార్థము) రూపముననే జెందినదికాని, ముఖ్యప్రతిపాద్యము దీని కాత్మకాదు.

నిశ్శ్రేయసభావప్రాప్తి కారణము లని గౌతముడు చెప్పిన 16 పదార్థములందును, సంశయ, తర్క, వాద, జల్ప, వితండ, జాతి, నిగ్రహ, హేత్వాభాసములుకూడ నున్నవి. ఆత్మజ్ఞాన మందు వాదజల్ప వితండాదులకు గూడ బనియున్నదా? 'నానుధ్యాయాద్బహూన్ ఛబ్దాన్ వాచోవిగ్లాపనంహితత్' "హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్' "త్రైవిద్యో హేతుకస్తర్కీ" "తర్కా ప్రతిష్ఠానాత్" ఇత్యాదిగా నవి యాత్మజ్ఞాన ప్రతిబంధకములనిరిగదా! అట్టివాని బ్రతిపాదించు నిది యాత్మదర్శన మనజెల్లునా?

వేదముల నంగీకరింపక, తర్కజాలములచే, ఆత్మ - ఈశ్వర - పరలోకాదుల గూర్చి నాస్తికు లొనరించు నాక్షేపములకు యుక్తికి బ్రతియుక్తిన్యాయమున బరాస్తము గావింపనై తర్కశాస్త్రము వెలసినది. - శాస్త్రార్థవిజయమే యీశాస్త్రనిశ్శ్రేయ సాధిగమము. ప్రతివాదము బరాస్తమొనరించుట దీని ముఖ్య లక్ష్యము. దర్శనతర్క శబ్దములకిదే భేదము. ఇదియు దర్శన మగుచో దీనిని తర్కశాస్త్రమనరు. పాశ్చాత్యులు గూడ

దర్శనమును ఫిలాసఫీ - తర్కమును లాజిక్ - అందురు; విధర్మల - నాస్తికుల - తర్కజాల ప్రభావము మనపై బ్రసరింపజాలకుండునంతటి బుద్ధిప్రాబల్యము మనకు గూర్చుటయే ఈ శాస్త్రకృతకృత్యత.

వస్తుతః దీనిని కథాశాస్త్రమనక న్యాయశాస్త్రమనుటే తగును. కారణము? మన్వాదులు మనకు న్యాయశాస్త్రమును (లా) ప్రదర్శనమాత్రముగ జెప్పిరిగాని యుపపత్తులను (మాలిక రహస్యములను) జెప్పరైరి. ఈలోపమీగౌతమసూత్రసందర్భము పూరించెను. ఇందు మొదటిసూత్ర ముద్దేశమును తెల్లముగావించును. ప్రమాణము అనగా ఋజువుపరచునది. - ఋజువుపరువబడునది ప్రమేయము. వానిసంశయ ప్రయోజనములను దృష్టాంతముతో సమన్వయించిన యనంతరము సిద్ధాంతముంజేరుదుము. వర్తమానన్యాయముకూడ దీనిని బాటించును.

కాని అవయవతత్త్వమునిది (వర్తమానన్యాయము) యెరుంగదు. నిర్ణయమునకు జెందు పంచావయవసిద్ధి నెరుంగుకయో స్వార్థప్రతిబంధకమనియో దీనికుద్భావన జెప్పియున్నది. పంచావయవసిద్ధివలన సత్య - మిథ్యలు, నీరక్షీరములట్లు నిర్ణీతములగును. కానిండు: చెప్పదలచినదేమన - న్యాయశాస్త్రమును గూడ (అనగా, న్యాయవిభాగమునందు సర్వోచ్చప్రతిష్ఠనొందుటకాధారము నధికారమునొసంగు న్యాయమును) దర్శనము - ఆత్మచర్చ - యనుకొని బుద్ధిమాంద్యమున నైభవముంబోగొట్టు

కొనువారు. భారతవర్ష జగద్గురుత్వమునకు ముఖ్యశత్రువు లనియే!

ఇంతటితో ఆస్తికదర్శనములు మూడేయని తెల్లమయినది. అటుగాక వ్యాఖ్యాతల ననుసరించి ఆత్మనుగౌణరూపమున జర్చించు నేకదేశీయములగు మీమాంసాన్యాయ యోగము లను దర్శనములన్నచో:— వ్యాకరణ - నిరుక్త - సాహిత్య - జ్యోతిషాదులు మాత్ర మేమిపాపముచేసెను? శబ్దముద్వారా బ్రహ్మప్రతిపాదన గావించు వ్యాకరణముంగూర్చి భర్తృహరి స్పష్టముగ జ్ఞాన - మోక్షసాధక మనుచున్నాడు:—

'ఇదమాద్యంపదస్థానం సిద్ధిసోపానపర్వణాం
ఇయంసా మోక్షమాణానాం అజిహ్మరాజపద్ధతిః
అత్రాతీతవిపర్యాసః కేవలామనుపశ్యతి''

పతంజలియు నీసిద్ధాంతముల సమర్థించెను. స్వాయముగా వేదమును:— 'శాబ్దేబ్రహ్మణినిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి' అని యెను. ఇట్లే నిరుక్తాదులను ఆనుషంగికముగా ఆత్మచర్చను లక్ష్య ముగాగొన్నవి. ఇంతేగాక :— కావ్య - నాటక - కథా - నృత్య - వాద్య - ధనుర్వేద - ఆయుర్వేదాదు లన్నియు వేయేల భారతవర్షీయ గ్రంథములన్నియు జూచిన నన్నిటను ఆత్మపరిచ్ఛాయ సాక్షాత్కరించు చుండును. ఆస్తిక దేశమందలి శబ్దరచనా మాత్రమేదైనను అస్తి బ్రహ్మగంథముకోకనది యుం డదు. అంతమాత్రమున నవియన్నియు దర్శనములనజనునా?

ఇట్టి దర్శనమూలభక్తియే కర్మఠ భారతవర్ష గౌరవము నీకడకు వెచ్చినది. కానిండు: ఇంతటితో ఆస్తికదర్శనచర్చ యైనది. యికసంక్షేపముగా నాస్తికదర్శనత్రయి గూడ జూతము.

నేడునాస్తికదర్శనములు చార్వాక - మాధ్యమిక - యోగాచార - సౌత్రాంతిక - వైభాషిక - అర్హతభేదమున నారు విధములు. ఇందు మధ్యవినాల్గును బౌద్ధదర్శనావాంతర పర్వములు. వీని మొత్తము లోకాయతికమందురు. ఇదొకటే. ముఖ్యము. శిష్యభేదముననైన నాల్గుపర్వములకు నంత మహత్వములేదు. దీనిమూలాచార్యుడు గౌతమబుద్ధుడు. కనుక నిదియొకటియే దర్శనము. ఆర్హతమును _ జైనదర్శనమనియు స్యాద్వాదమనియు నందురు. ఇట్లు ఆరిటికి:— చార్వాక - లౌకాయతిక - స్యాద్వాదభేదముచే నాస్తికదర్శనములు మూడేయగును.

విజ్ఞానదృష్టి కట్లనుట తగును. ఆస్తికదర్శన ప్రకరణమందుల్లేఖింపబడిన యస్తితత్త్వమునకు రస - బల ప్రధానతంబట్టి రెండురూపములు, రసాత్మికయగు సత్తపేరు ఆత్మ. బలాత్మిక సత్త పేరు విశ్వము; విశ్వముయొక్క ఆత్మయు సత్తారూపమే. కాని యిందు రసమునకు ప్రధానత. స్వయముగా విశ్వమును సత్తాత్మకము, సత్తాశ్రితము. కాని, ఇందు అర్థశక్తిరూప బలమునకు ప్రాధాన్యము. కనుకనే నాస్తికదర్శన సమ్మత సత్తకు 'అర్థక్రియాకారిత్వంసత్' అని లక్షణమున్నది.

ఆత్మసత్త మనః ప్రాణవాఙ్మయి; విశ్వసత్త రూపకర్మనామ మయి. నామరూపకర్మ సమష్టియే వైకారికవిశ్వము. దీని గర్భమందు, మనఃప్రాణవాఙ్మయ సత్తా లక్షణబ్రహ్మ (ఆత్మ) ప్రతిష్ఠితమై యున్నది. ఆత్మ దానికే అమృతరూపము. అస్తి రూపము, విశ్వము దానికే మర్త్యరూపము, నాస్తిరూపము. అస్తి సత్తు; నాస్తి అసత్తు; "సదసచ్చాహమర్జున" అన్నట్లు ఆ యహం పదార్థమే (ఆత్మయే) సత్తు - అసత్తు. ఆత్మా (అస్తి) విశ్వము (నాస్తి) యు నైయున్నది. సదాత్మానుగ్రహమున నసద్విశ్వము సత్తుగనై సత్యముగానున్నది. 'నామరూపే సత్యమ్' అని శ్రుతియు వాకొన్నది. విశ్వముసత్యము, విశ్వాత్మ దీనికి సత్యము. కనుక నది సత్యస్యసత్యమ్.

1. ఆత్మసత్తయందలి నిగూఢమనోభాగమునుండి రూప వికాసము కల్గెను. ఇదే స్యాద్వాదదర్శన ముఖ్యలక్ష్యము. దర్శనమునకు విషయమురూపమే. దర్శనమువలననే జ్ఞానోదయ మగును. చారిత్ర్యసంబంధము జ్ఞానముతోడనే - కనుక, రూప మునకు జెందిన యీదర్శన జ్ఞానచారిత్ర్యములను లక్ష్యముగా గొన్న యీస్యాద్వాదదర్శనము "సమ్యగ్దర్శన జ్ఞానచారిత్రాణి మోక్షమార్గః" అని సూత్రించెను. ఆస్తికదర్శనములందు, నిగూఢమనస్తత్వ ప్రతిపాదకమగు శారీరకతంత్రమునకు ఏ స్థానముగలదో, ఆస్థానము, నాస్తికతంత్రము లందలి రూప తత్త్వ ప్రతిపాదకస్యాద్వాదదర్శనమునకు గలదు.

2. ఆత్మసత్తయందలి సూక్ష్మప్రాణభాగమునుండి కర్మ

వికాసము కల్గెను. ఇదే లౌకాయతికబౌద్ధ దర్శనమునకు ముఖ్యవిషయము. క్రియారూపాంతరమే కర్మ. క్రియయన్నది నాస్తి - అస్తి - నాస్తి అను మూడుక్షణములతో గూడినదై నాస్తిపారిణామియున్నది. క్షణిక - శూన్య - స్వలక్షణ - దుఃఖములు, కేవలము క్రియాధర్మములు. జ్ఞానమునందగాగోనని, అజ్ఞాన సమన్వితకర్మ పేక క్రియ, తప్పక పైజెప్పిన నాల్గు ధర్మములకు జననియగును. కర్మతంత్రవాదియగు బౌద్ధుడు, విశ్వము నీదృష్టితో జూచును. కనుక "క్షణికంక్షణికం శూన్యం శూన్యం - దుఃఖందుఃఖం స్వలక్షణం స్వలక్షణం" అని సిద్ధాంతము గావించెను. ఆస్తికదర్శనములందు, సూక్ష్మప్రాణ ప్రతిపాదకప్రాధానిక తంత్రమున కున్నస్థాన మీ నాస్తికదర్శనములందు, కర్మతత్త్వ ప్రతిపాదకమగు నీ లౌకాయతిక దర్శనమునకు గలదు.

3. ఆత్మసత్తయందలి స్థూలవాగ్భాగమునుండి స్థూలతమ నామప్రపంచ వికాసముకల్గెను. ఇదే చార్వాక దర్శన ముఖ్యవిషయము. ఇది తమోగుణమున కాత్యంతిక వికాసము. ఈధరాతలముం జేరగనే సూక్ష్మజగత్తు కూడ నంతర్లీన మగునప్పుడిక నాత్మకథకూడ నెక్కడ? దర్శనప్రకరణారంభమున నీమత ప్రదర్శనము గావింపబడినది. ఆస్తిక దర్శనములందు స్థూలవాక్తత్త్వప్రతిపాదక వైశేషిక తంత్రమునకున్న స్థానము నాస్తిక దర్శనములందు నామతత్త్వాను యాయియగు నీచార్వాక దర్శనమునకు గలదు.

ఇట్లు మూడు తంత్రములు క్రమముగ మనః ప్రాణవాఙ్మ యాత్మ సమ్యగ్దర్శనముం జేయించుచు ఆస్తికములనియు, మూడు తంత్రములు క్రమముగ రూప కర్మ నామ మయవిశ్వ దిగ్దర్శనము గావింపుచు నాస్తికములనియు పేరొందినవి. ఆత్మ దృష్టిచే ఆస్తికములట్లు, విశ్వదృష్టిచే నాస్తికములుగూడ నుపాదేయములే. మానవమనస్సు స్థూలము నుండియే గదా సూక్ష్మ ముంజేర నేర్చును! భ్రమాభినివేశవశమున ఆస్తికులు నాస్తిక దర్శనముల నాదరింపనిచో అస్తితత్త్వ మౌలిక రహస్యమును వారు కలలోనైన నెరుంగ జాలరు. ఇట్లే నాస్తికు లాస్తికదర్శ నానుగమనము సేయనిచో నెన్నటికిని శాశ్వతానందాధి కారులు కాజాలరు. కనుక నందరు నారుదర్శనముల నెఱుంగ దగునని మామనవి.

దర్శనముల ద్వారా మనకు దీరవలసిన యభీష్టమేమి? పూర్ణపురుష దర్శనముగదా! అట్టిచో నీయారు దృష్టులతో మనః ప్రాణ వాక్ - రూప కర్మనామ ప్రతిపాదక - శారీరక ప్రాధానిక వైశేషిక స్యాద్వాదిక లౌకాయతిక చార్వాక - దృష్టులతో దానిసరయనిచో నది యన్నివిధముల నసంభవము. పదార్థ విజ్ఞానము గూడ నీదృష్టిషట్కము నామోదించు చున్నది. జడమో చేతనమో యేయేపదార్థమునైన ఉర్ధ్వాధో త్తర దక్షిణ పూర్వ పశ్చిమము లను నారుదిక్కులనుండి చూడనంతవరకు తదీయ సంపూర్ణ రూపముం జూచినట్లు కాజాలదు. ఏవస్తువుంబూర్ణముగా దర్శింప వలయునన్నను దాని

యారుప్రక్కలం జిత్రింపవలయును. భారతీయుల షడ్దర్శన వాద మౌలిక రహస్యమిదియే.

ఆ త్మ ప్ర జా ప తి

| | | | |
|---|---|---|---|
| రసః. | ... | ... | బలమ్. |
| అమృతమ్. | ... | ... | మృత్యుః |
| ఆస్తి | ... | ... | నాస్తి |
| శారీరకదర్శనమ్ మనః | ... | ... | రూపమ్ స్యాద్వాదదర్శనమ్ |
| ప్రాధానికదర్శనమ్ ప్రాణః | ... | ... | కర్మ– లౌకాయతికదర్శనమ్ |
| వైశేషికదర్శనమ్ వాక్ | ... | ... | నామ–చార్వాకదర్శనమ్ |
| ఆస్తికదర్శనత్రయీ. | | ... | నాస్తికదర్శనత్రయీ |
| ఆత్మదర్శనమ్. | | ... | విశ్వదర్శనమ్. |

ఇదిః షడ్దర్శన మౌలిక రహస్యనిరుక్తి

షడ్దర్శన రహస్యమ్:
ప్రాజాపత్యశాస్త్రమిదం
నాస్త్యస్తిసారమ్దర్శనశాస్త్రం

ఇతి ఆత్మనః దర్శనపరీక్షాసమాప్తా

# వైజ్ఞానిక - ఆత్మపరీక్షా

"జ్ఞానం తేహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః
యద్జ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే"

## విషయప్రవేశము

ఆత్మ స్వరూప జ్ఞానముంగూర్చి యెన్ని విప్రతిపత్తుల నెదుర్కొన్నను, యథార్థముగ నెఱుంగజాలనంత జటిల సమస్య యని మొదటనే యనుకొంటిమి. ఆత్మ ప్రతిపాదకములందు, వైదికమగు నుపనిషద్భాగ మొకటి. అది సర్వశ్రేష్ఠము జ్యేష్ఠమ్ముగూడ నగును. కాని, అందును ఆత్మ విషయమున గన్పట్టు విరుద్ధార్థ ప్రతిపాదక వచనముల నవలోకించినపుడు మనయాశ నిరాశగ బరిణమించుచుండును.

రెండవది: దర్శనశాస్త్రము, ఆస్తిక దర్శనమందలి మూడు తంత్రములును, ఒకవిధముగ నాత్మజిజ్ఞాసను శాంతి నొందింపజాలనివే యనదగును. వానియందొకే యాత్మ యొక్క క్షరాక్షరావ్యయఃపర్తములు నిరూపింపబడినను, అంత మాత్రమున మన మాత్మస్వరూప మూలభావముం జేరజాల కుంటిమి ఎట్లనః:—

ఆత్మ:— భోక్తయేది? సాక్షియేది? తటస్థమేది? ఇంద్రియ సంచాలకమేది? ఏది బుద్ధిప్రేరకము? పితృప్రాణప్రతిష్ఠ యేది? ప్రేతభావము నొందునదియేది? ఏది మృతశరీరమందు నుండును?

పిండదాన విధానము దేనికి? ధర్మానుష్ఠానము దేనికొఱకు? అభ్యుదయ ప్రత్యవాయభాగి యేది? ఈ విధములైన యనేక ప్రశ్నలు, దర్శన ప్రతిపాదితాత్మ స్వరూపము నెరింగిన యనంతరముగూడ నెప్పటియట్ల సురక్షితములై యుండుచున్నవి.

ఈవిప్రతిపత్తుల దొలగింపనై మూడవదగు నాత్మప్రతిపాదక శాస్త్రము; గీత యవతరించినది. ఇదియొక క్రొత్త యాత్మ స్వరూపమును మనయెదుట బెట్టలేదు. ఉపనిషత్తులే విస్తరించి యీయాత్మ ప్రపంచమును నిశ్శేషముగ నిరూపించెను. కాని అది రహస్యభాష- సాధారణాధికారులు దానినెరుంగ జాలరు. దర్శనశాస్త్రము స్పష్టీకరింపవచ్చెను గాని అది తన స్వాభావిక సమ్యగ్దర్శన మూల దర్శన పరిభాషంబట్టి తటస్థ రూపముం జెప్పుటతోడనే కృతకృత్యమైనది. ఇక సమ్యగ్జ్ఞాన సమ్యక్చారిత్రము లను రెండు పర్వములు నట్లే యుండిపోయినవి. అందువలన మనజిజ్ఞాసయు శాంతింపదయ్యె.

ఆలోపము గీత పూరించినది. ఇంతేగాక దర్శనము చేసిన పనియు తనయందిమిడ్చుకొన్నది. కనుకనే అది, అపూర్వము, విలక్షణము, పూర్ణము, స్వతంత్రము నని పలుమరు చెప్పుచుంటిమి.

దర్శనశాస్త్రముపనిషత్తులకు గీతచేరినంత దగ్గరగ జేరలేదు. కనుకనే పద్యస్థానీయ సంకుచితౌపనిషదతత్త్వ ప్రతిపాదకము, గేయస్థానీయము నగు నీ విస్తృతశాస్త్రము గీతయని ప్రసిద్ధి నొందినది. వేదాంతిమభాగము కాకున్నను, 'భగద్గీతో

పనిషత్' అని పేరొందెను. - "అట్లయినచో:— ఉపనిషత్తులు - దర్శనములు, గీత, యు, వానిపైగల వ్యాఖ్యానములును ఆత్మ దర్శన, జ్ఞాన, చారిత్ర్యములను స్పష్టపరచుచుండగా మరల స్వతంత్రముగా నీయాత్మపరీక్షయేల" అన్నచో:

సమాధానము:—దర్శనప్రకరణారంభమందే చెప్పియుంటిమి. వ్యాఖ్యాతలు:— ఉపనిషత్తు దర్శనము గీత వీని యన్నిటి సిద్ధాంతము నొకటే యని స్థిరపర్చుకొని తమ సాంప్రదాయిక సిద్ధాంతమును ముఖ్యముగా గొని, సమన్వయింప బాటుపడిరి. వారి వారి సంప్రదాయములకు బనికివచ్చు వచనము లందందు లేకపోలేదు. కాని వానికి ముఖ్యగౌణభేదము నెంచి వ్యాఖ్యానము సేయుట దురాగ్రహము.

గీత:— శాంకరులకు శుద్ధ జ్ఞాన యోగ గ్రంథము, రామానుజ, వల్లభ, మాధ్వ, నింబార్కాది వైష్ణవాచార్యులకు శుద్ధ భక్తిగ్రంథము. స్వతంత్రరాష్ట్రవాదులకు కర్మయోగగ్రంథము. ఇట్లే ప్రస్థానత్రయి, నేడు 'నైకోఋషిర్యస్య వచఃప్రమాణమ్' చరితార్థము గావించుచు, సందేహనివృత్తికి బదులు ప్రవృత్తికే కారణ మగుచున్నది. వ్యాఖ్యాతలు 'గతానుగతికో లోకః' సార్థకము గావింపుచు, దర్శనమర్యాదం దప్పక, సాంప్రదాయికాభినివేశమును విడువక తమ అపూర్వ ప్రతిపాద్య విషయ వంచితులే యగుచున్నారు. కనుకనే మొదట దార్శనికాత్మ పరీక్ష గావించి యీ ప్రకరణ మారంభింపవలసి వచ్చినది.

ఆత్మస్వరూపము నెఱుగుటకు మూలాధారము వేద

శాస్త్రము. దాని నండగాగాని, గీతాప్రతిపాదితాత్మస్వరూపముం జేరుట చాల తేలికపని. అనగా:— వేదశాస్త్రము సమ్యగ్దర్శనరూపమున జేసిన యాత్మనిరూపణను దర్శనశాస్త్రము స్పష్టీకరించెను. ఇక వేదప్రతిపాదిత సమ్యగ్జ్ఞాన, సమ్యక్చారిత్ర మూలకాత్మ స్వరూపగానము (విస్తారము) గీతా శాస్త్రము చేసెను. విస్తృతమగు నీ స్మార్తోపనిషదాత్మకు మూలము సంకుచితమగు నుపనిషచ్ఛాస్త్రమే. ఉపనిషత్తు స్వతంత్ర శాస్త్రము కాదు. గీత కేవల ముపనిషదాత్మనిరూపణ మాత్రమే చేయలేదు. సంహితాయుక్త వేదమందలి బ్రాహ్మణారణ్యకోపనిషత్తులను మూటియందలి సోపాధికాత్మనిరూపణను గావించి 'కిమన్యైః శాస్త్రవిస్తరైః' అనిపించుకొన్నది.

ఇట్టిచో గీతాత్మస్వరూప పరిచయార్థము ఏసంప్రదాయాభినివేశమునను బడక, వేదవచన మీమాంసాదృష్టి కుండదగిన యర్థానుసారము ఆత్మయొక్క వైజ్ఞానిక స్వరూప మాత్మప్రియుల యెదుటబెట్టి పిమ్మట దానితో గీతాప్రతిపాదితాత్మ స్వరూపమును సమన్వయింతము.

ఇది విషయప్రవేశము

# నిర్గుణాత్మ నిరుక్తి

ఆత్మస్వరూపజిజ్ఞాస మనకు కల్గినపుడు విదితవేదితవ్యులు వేదమహర్షులు తచ్ఛాంతికొరకు పుట్టినదాదిగ మన కుపాసక

మగు 'న' కారము నెదుట బెట్టుటతో మనము విస్మితుల మగు చుందుము. పాశ్చాత్త్యులు నందువలననే తమ యిచ్ఛవచ్చినట్లు భారతీయ శాస్త్రవిషయమున నభిప్రాయములం గటాక్షించు వారు "ఆత్మశాస్త్రమందు ఘోరపరిశ్రమ సేయగా లభించు పురస్కార మీ జన్మసిద్ధ నకారమా? అయినచో బుద్ధిమంతు డెవడు ఇందు వ్యర్థముగ గాలక్షేపము సేయును?" అందురు.

మంచియుక్తి! ప్రత్యక్షసత్యము! ఆత్మవిషయమున "నేతి నేతీతివాహోవాచ" "యస్యామతం తస్యమతం" "విజ్ఞాత మవిజానతాం" ఇత్యాది శ్రౌతోపనిషద్వచనములు 'న' కారమునే మన యెదుట బెట్టుచున్నవి. కాని, యుక్తివాదుల కొక విషయము మరువగూడనిది. ఏమనః— "జన్మసిద్ధనకారమునకును, ఆత్మ సంబంధి నకారమునకును స్వరూపములందు అహోరాత్రముల కున్నంత యంతర మున్నది."

ఆత్మనకారముం దెలియుటకు తప్పక ఘోరపరిశ్రమ సేయ వలయును. మరియు, జన్మసిద్ధనకారము ఘోరనాస్తికుం జేయును. పరిశ్రమవలన లభించునాత్మ నకారము పరమాస్తికుం జేసి శాంతి సామ్రాజ్య పట్టాభిషిక్తుంజేయును.

జన్మసిద్ధనకార మస్తిలక్షణాత్మ ప్రతిద్వంద్వి. ఆత్మనకార మాత్మసత్తానుగామి. కాదు - ఆత్మయే. పుట్టినది మొదలుగ నుపాసించిన నకారముమాత్రమా? అదియు అస్తిమిశ్రితము. ఆ యస్తి యేనిది? నామ రూప కర్మమయ భౌతికపదార్థములది. భౌతికపదార్థములను 'అస్తి' అనుకొందుము. తదభావము

నకార మనుకొందుము. సరియే: మన యీ విశ్వాసము నట్లే యుంచి శ్రుతి యించుకంత సంశోధన గావింపనెంచుచున్నది.

భౌతికపదార్థములపై మనము పెట్టియుంచిన అస్తిని నకారముపైనను, నకారమును మనమనుకొన్న భౌతికవిశ్వముపైనను ప్రతిష్ఠించివైచినది కించిద్వినిమయము!

భౌతికవిశ్వమందలి యస్తి - ఆత్మ యన్నది సోపాధికము. అందు విశ్వస్వరూపము ప్రధానముగనున్నది. ఈభౌతిక విశ్వమున కతిరిక్తముగ నున్న ఆత్మయొక్క విశుద్ధనిరుపాధిక రూపమే, మనము నకారముగ నెంచియున్నదే, యథార్థతత్త్వము మన యభ్యాసము భూతభాగముపైనను, దాని (శ్రుతి) యభ్యాసమో, యభావముపైనను, నిలిచియున్నవి. అనగా, ప్రతిద్వంద్వులగు సోపాధికాస్తి - నాస్తిభావములపై నిల్చియున్నవి. ఇప్పుడు ఆ శ్రౌతనకారమును, అస్తిరూపముగ మన యెదుటనుంచినచో మనము దానిని నమ్మజాలము. కారణము? ఆ శుద్ధమగు 'అస్తి' ఇంద్రియాతీతము. మనమింద్రియగమ్యముం దప్ప తక్కినదానిని 'అస్తి' యను నలవాటులేనివారము. అట్టిచో శ్రుతి యేమార్గ మవలంబింపవలయును? మన మెఱింగిన నకారము రూపముననే అది మనకు ఆత్మయొక్క నిరుపాధికరూపముం జూపవలయును.

నిర్ద్వంద్వమగు నీ శ్రౌతనకారము, తాత్త్వికముగా, శూన్యము కాదు. విశుద్ధసత్తయు, విశుద్ధఅభావమును ఒకటే తత్త్వము. భావమన:— భావన - క్రియ - బలము; ఈభావాత్మక

విశ్వముయొక్క అభావముగూడ నాయాత్మతత్త్వమే. భౌతిక పదార్థములు భావపదార్థములు. ఎట్లు? ఇందు, ఆ భావస్వరూపిణి కనుకనే. అభావశబ్దవాచ్యయగు సత్త ప్రతిష్ఠితమై యున్నందు వలననే. ఈయభావమే భావమునకు స్వరూపసమర్పకము. పట సత్తకుగారణము పటవ్యతిరక్త సర్వపదార్థాభావమే. పట మెందుకు బటమైనది? అది ఘటమఠ వృక్షాదికము కాదుకనుక.

ఆ మహాసత్తాత్మకము, కనుకనే, మహాభావాత్మకమగు నాత్మయొక్క యుదరమందు:— మహాసత్తాత్మకాకాశ పటల మందుభావాత్మక నక్షత్రాదులు అందందు ప్రకాశించునట్లు భావాత్మకపదార్థములు, అందందు బ్రతిష్ఠితములై యున్నవి. ఆకాశభూమకున్న స్వరూపమే ఆ యాత్మకు గలదని "మనో మయోఽయం పురుషః భాః సత్యః ఆకాశఆత్మా" ఇత్యాదులు స్పష్టపరచును.

ఆత్మ ఆనందమయము, భూమయు నానందమే, భౌతిక పదార్థములు పరిచ్ఛిన్నములు, వీనినుండి అమృతలక్షణభూమా భావము నాశించుట వ్యర్థము. 'నామృతత్త్వస్యాశాస్తి విత్తేన' ఈయాకాశాత్మక భూమానందముం జూడుడు, అనుభవింపుడు!

మనము, అభావముగనెంచి శూన్యమను కొన్నది పూర్ణము. ఆనందకారణము నగుచున్నది. ఉత్తమభోజనాదు లానంద కారణము లనుకొందుము. కాని, ఆద్యంతము లవలోకించుచో ఆకాశాత్మక భూమయే ఆనందకారణము. యవగోధూ మాద్యోషధుల కాధారము ధరాతలము, దీని కాధారము

ఆకాశాత్మ. మనము తినుటకు, త్రావుటకు, విహరించుటకు, శరీరాంతర్బాహ్యములందు, తృప్తికి, వేయేల? అన్నిటికి, అన్ని యానందములకు మూలమేమి?

ఏకశయ్యాసన భోజనాదులు విసువుగొల్పు నెందువలన? ఈభూమాకాశాభావమే. విసర్జనమున, ఉపార్జనమున నానంద మెందువలన? ఈభూమాకాశమే. ఈయాకాశవిభూతి కానందింపని వాని నాత్మానందము తిరస్కరించును. వాడెన్నియో దినములు బ్రదుకడు; మనజీవితమందలి ప్రతిక్షణము నీయాత్మానందరూపాకాశానంద సురక్షితము. పుట్టిన దానందమున, పెరిగిన దానందమున, లయించునదియు నానందముననే. ఈ యానందవ్యాప్తిని శ్రుతి యిట్లు చెప్పినది:

"ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయన్తే, ఆనందేనజాతాని జీవన్తి, ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తి" (తై।ఉ।)

**అయినను, "సంసారము దుఃఖసముద్రము. వ్యాకుల సంకులము,' అని వినబడుచున్నది. ఆశ్చర్యము! నిక్కము! ఆత్మ నిత్యానందమగుచో నిదియేమి?" అన్నచో:— ఇది జటిలసమస్యయే. సాంప్రదాయికు లేమనిరో!**

**అద్వైతులు:— ఇది (సంసారము) మిథ్య - మాయికము, కర్మ క్షణికము, దుఃఖమూలము. కర్మయున్నచో శాంతిలేదు. కనుక కర్మను వదలి శుష్కజ్ఞాన నిష్ఠంబూనవలయు. 'నకర్మణా**

న ప్రజయా ధనేన త్యాగేనైకే౽మృతత్వమానశుః" అను దానిరహస్యమిదే:

[illegible]మతము, విశిష్టాద్వైతులు, శుద్ధాద్వైతులు, ద్వైతాద్వైతులు - అయ్యును వస్తుతః ద్వైతమార్గీయులగు నాచార్యుల దృష్టియందు దుఃఖమూలకారణము:— జీవాత్మ తన యుపాస్యమగు పరమాత్మ యనుగ్రహముచే వంచితుడగుట, భగవన్మాయామోహితుడై "అహంకరోమి' యనుదర్పమున మత్తుడై 'నేనెంతటివాడను, ఇదియంతయు జగన్నియంత యిచ్ఛాఫలము, నేనె, యొకగడ్డిపోచను వంచగలనా?" అనుకొనక యుత్పథగామియై, ఆ నియంతచే దండితుడై వ్యాధిభయశోకాది గ్రస్తుడగుచు సంసారచక్రమున దిరుగుచుండును. అటుగాక—

ఆ యనంతకళ్యాణగుణాకరుని, నిర్హేతుకజాయమాన కరుణావరుణాలయుని యనుగ్రహముంగోరి సాంసారికక్లేశనివృత్తి నొందవలయునో మనోవాక్కాయముల నాయన నుపాసింపవలెను. అన్నిపనులనుజేయుము, నీయిచ్ఛను నిమిత్తముగ బెట్టక యేమిచేసినను భగవదర్పణము గావింపుము. సర్వత్ర భగవద్బుద్ధి - నవధాభక్తితో తదుపాసన, గావించుచో దుఃఖమన్నదియుండదు, పరమశాంతి!

కర్మానుయాయులు,మీమాంసకులు:— "యజ్ఞతపోదానాది శాస్త్రీయకర్మహేళనయే దుఃఖమూలము. విశ్వమీశ్వరయజ్ఞకర్మ,దానివలన నాయనవిశ్వసంపదకుభోక్త -ఆనందఘనుడునగుచుండ నతని యంశజీవుడు ఈశ్వరాజ్ఞాసిద్ధ వేదోక్తకర్మలను

యూపజ్ఞనమనుష్ఠింపవలదా! కర్మయేగాక ఈశ్వరుని కింకొక రూపమేది? 'కర్మేతిమిమాంసకాః'' కర్మయే నిజమగు నుపాసన. అదియే కావలసిన ఫలమిచ్చును. ప్రాణిజీవియు నెప్పుడు నేదోకర్మ చేయుచున్నాడు. కాని ప్రకృతివిరుద్ధమగుటచే దుఃఖకారణ మగుచున్నది. కనుక శాస్త్రీయకర్మల జేయదగును. యిహాపర సుఖములు రెండును లభించును. శ్రమయనుకొనరాదు. మహా ఫలమున కీయల్పశ్రమ యొకలెక్కలోనిదా? ఇంతచాక వ్యాపా రము లేదు. జ్ఞానము కేవలము శాంతికిగారణము గాజాలదు. కర్మబంధములను ద్రెంపుటకు గర్మయేయుండవలయును—''అని యీవిధముగ:—

1. కొందరు విద్వాంసులు:— 'తమేవవిదిత్వాఽతిమృత్యు మేతి నాన్యఃపంథావిద్యతేఽయనాయ' 'తమేవధీరోవిజ్ఞాయ ప్రజ్ఞాంకుర్వీతబ్రాహ్మణః' 'త్యాగేనైకేఽమృతత్వమానశుః'' నాన్యఃపంథాః విద్యతే' ఇత్యాదులంబట్టి కర్మత్యాగ లక్షణ జ్ఞాన యోగమే క్లేశనివృత్తికి ముఖ్యకారణమనియు,

2. కొందరు ప్రపన్నాచార్యులు:— "తతస్తు తంనిష్కలం ధ్యాయమానః''"సోఽన్వేష్టవ్యః సవిజిజ్ఞాసితవ్యఃసఉపాసితవ్యః'' "తస్మైదేవాయ నమోనమః "తమక్రతుః పశ్యతి వీతశోకః ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్'' ఇత్యాదులంగొని భక్తి పూర్వక కర్మానుష్ఠానమే సిద్ధిద్వారమనియు,

3. కొందరు కర్మాభిమానులు:— 'కుర్వన్నేవేహకర్మాణి' అహరహః సంధ్యాముపాసీత - "జ్యోతిష్టోమేన స్వర్గకామో

యజేత" ఇత్యాద్యాదేశ వాక్యములంగాని ప్రవృత్తి మూలక యజ్ఞాదిశాస్త్రీయకర్మలే శాంతికి మూలభూమికలనియు జెప్పి నపుడు మనకు మూడునిర్ణయములు లభించుచున్నవి. అవిసంక్షిప్తముగా —

1. కర్మయేపరమశత్రువు. యేమియుజేయకున్న నే శాంతి లభించును.

2. మనకాలమెక్కువగ భగవత్పూజాశుశ్రూషలందు వినియోగించినచో నతడుప్రసన్నుడగును. ఈభగవ దనుగ్రహము ననే పాపఫలమగు మనపాపములు పరిమార్జితములగును.

3. మనమీజీవితమున నిరంతరముగ కష్టములకోర్చియైన యజ్ఞాదికర్మప్రవృత్తులము గావలయును. ఈకర్మాతిశయముచే పరలోక సుఖములభించును. అనియేర్పడును.

వీనియుపాదేయ తానుపాదేయతలంగూర్చిన మీమాంస ప్రకృతముకాదు. కాని, ఈవిషయమున సంగ్రహముగ గొంచెము చెప్పగోరెదము.

1. దుఃఖకాతరుడగు నొకసామాన్యాధికారి, (విజ్ఞానదృష్టితోనైనచో విశేషాధికారియే) కేవలజ్ఞానవాదమను నపస్వరాలాపము నెన్నడు ననుగమింపజాలడు. శరీరేంద్రియయుక్తమగు నాత్మ సర్వథాకర్మపరిత్యాగము సేసివేయుట యసంభవము.

2. ఇకభక్తిమార్గ మవశ్యముత్తమమే. కాని, పైజెప్పిన యాభక్తియందు లోకసంగ్రహమన్నది బొత్తిగాలేదు. ఆబాల గోపాలకావనితావృద్ధులందరు మృదంగతాళములంగొని నామ

సంకీర్తన పరాయణులగుచో వేదవిహిత చాతుర్వర్ణ్య ధర్మము పుష్పించి ఫలించు నవసరములభించునా? సమాజవ్యవస్థకు జెందిన దండనీతి అర్థనీతి కలాకౌశలము కృషి గోరక్ష - వాణిజ్యాదులు వికసించు నవసరమేది? మరియు:— వైజ్ఞానికదృష్టికి భగవంతుడు మనమెంతటి ఘోరపాపములను జేసినను చేతులు జోడించినంతమాత్రనే వానినన్నింటిని క్షమించు నంతటిదయాళువునుగాడు మనమంచిచెడ్డలఫలము మనమనుభవింప జూచుచుండు సాక్షిమాత్రుడతడు. నిగ్రహానుగ్రహములంగావించునవి మనకర్మలే. వాస్తవముడిగినచో:— నిట్టిభక్తి మనలను కర్మశూన్యులను - సోమరులను జేయుచుండును. కొలదిమంది పరమభాగవతాచార్యుల మహాత్మావతారికరహస్యము నెరుంగక వారిల్లోనములు గాగోరి యుబలాటపడుట పిచ్చితనమనిపించుకొనును. వీతరాగులవలెదోచుచు పరమభక్తులనిపించుకొను భక్తరాజులెందరో సాధారణమనుష్యులకంటెను క్లేశబద్ధులైయున్న వారింకెక్కుర నెరుంగుదుము. వాస్తవికానంద వంచితమగునిట్టిభక్తికేమియు మహత్త్వముండదు. కారణము? ఇదిలోకవ్యవస్థను నిరోధించును. చాతుర్వర్ణ్యధర్మము నవహేళనసేయును.

3. ఇకమిగిలిన ప్రవృత్తిమూలక కర్మవాదముంజూతము:- ఇందు పదేపదే కాయక్లేశము నెదుర్కొవలయును. ఒకక్లేశముం బాపుకొన వేరొకక్లేశమును సుఖాశతో ననుగమింపవలయును. ఆ సుఖమో ఈలోకమునగాదు, పరలోకమందు. అదియు శాశ్వతముగాదు. "క్షీణే పుణ్యే మర్త్యలోకంవిశన్తి"

కామ్యకర్మ ప్రవృత్తి కాలమందును అశాంతికారణమే - ఫల భోగ కాలమందు నశాంతికారణమే - అట్టిదానియం దెవడు ప్రవృత్తుడగును? ఇట్టిమూఁడు చికిత్సలును దుఃఖచికిత్సయందు అకృతార్థములే అయినవి.

ఈయపూర్ణతకు గారణమేమి? జ్ఞాన - కర్మలను వేరు సేయుట. అద్వైతవాది కర్మను తిరస్కరించి జ్ఞానకర్మమయ పూర్ణాత్మ నపూర్ణము గావించును. కర్మవాది జ్ఞానమును గౌణ ముగ నెంచి దాని (ఆత్మ) నపూర్ణము గావించును. భక్తివాది జ్ఞానకర్మలను భాగతః సంగ్రహించియు, భగవదనుగ్రహారూప కామవాసనను ఆరెంటినడుమనుంచి దాని నపూర్ణముగావించును.

అపూర్ణ మందు కేంద్రభావ విచ్యుతి యున్నది. అది భయము. అదిశోకమునకు మూలకారణము. ఇట్లు జ్ఞానకర్మ మయ పూర్ణాత్మతో అపూర్ణతా సంబంధము గలుగుటయే భయము. "యదుదరమంతరం కురుతే అథభయం భవతి ద్వితీ యాద్వై భయం భవతి" అని శ్రుతియు జెప్పెను.

ఈ శ్రుతియం దుదరశబ్దము ప్రయోగింపబడినది. అది యర్థశక్తి సూచకము. సాంసారిక భోగ్యసామగ్రియే ఉదరము. దీనికి భోక్తయు నుదర (పొట్ట) మే - భోగదాస్యము విషయా సక్తి - ఇంద్రియ - లోలుపత ఇవే ఉదరభావము. ఆత్మయొక్క జ్ఞానకర్మల మధ్యగ నీ యుదరభావము రాగానే భయ ముద యించును. భయమన్నది తనంత తాను గలుగదు. అందుకు 1. స్వస్వరూప విచ్యుతి 2. స్వస్వరూపమందు విజాతీయభావ

సమావేశము అను రెండు కారణములలో నేదో యొకటి యుండవలయును. కర్మత్యాగ లక్షణ జ్ఞానయోగమందును, ప్రవృత్తి లక్షణ కర్మయోగమందును స్వస్వరూప విస్మృతియు భక్తియోగమందు కామాసక్తి లక్షణ విజాతీయ భావసమావేశమును కలవు. ఇట్లీ మూడు యోగములును నుదరభావ సమావేశముచే భయనివృత్తికి బదులు భయోత్తేజకము లగుచున్నవి.

మన జీవన మూలాధార మాకాశాత్మకమగు నానందము గదా! కొంచెము సేపు "ఆకాశము లేకున్నచో ఉన్నను మన శిరస్సుల కొకటి రెండు గజములకు పైననుండినచో మనదశ యెట్లుండును!" అని యోచింపుడు! ఆకాశానందము వలననే నిజముగా మనమానంద మూర్తుల మగుచున్నాము. కనుకనే శ్రుతియు "కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందోనస్యాత్" అన్నది. సంసారమందు దుఃఖ సామ్రాజ్యమున్నది నిజమే. కాని జీవనసత్తయానందముపైననే యాధార పడియున్నది. ఆశానందము ప్రతీక్షానందము శ్రద్ధానందము విశ్వాసానందము తుష్ట్యానందము మొదలగు నానంద వివర్తముల వలననే మనము బ్రతుకుచున్నాము. బొత్తిగా నానందము లేనిక్షణమున మనము మనముగా నుండము. కనుకనే ప్రాణియొక్క ప్రత్యేక ప్రవృత్తియందును - కర్మయందును (అయ్యది ప్రత్యక్ష దుఃఖమయముగా దోచినను) ఆనందమే మూలప్రతిష్ఠగా నుండుచుండును. చావనెంచువాడు (ఆత్మఘాతకుడు) కూడ ఆనందముంగూర్చియే అట్లు ప్రవర్తించును.

ఆహా! ఇట్లింతటను ప్రవృత్తి ముఖ్యద్వార మానందమైనను అది యెంత ప్రయాసపడినను అల్పమాత్రగను అనిమంత్రిత దుఃఖ మతిమాత్రముగను కలిగించుచున్నది! ఆత్మశాస్త్రము లన్నియు నీదుఃఖ నివృత్తికై జనించినవని గీతావిజ్ఞానమందలి శాస్త్రోద్దేశ్యమును శీర్షిక క్రింద విస్తరించి యుంటిమి

ఇంతకు జెప్పదలచినది, ఆత్మ భూమా (వ్యాపక) నంద స్వరూపమనియే. అట్టియాత్మస్వరూపము నుపనిషత్తు నడిగిన నది నకారముచే హించును. గొప్పగా ననుగ్రహము కలిగినచో 'నేతి నేతీత్యహో వాచ' యనును. వాస్తవముగనంతకంటె సమాధానముండలేదు. వ్యాపకానందమున, బహిరింద్రియములకు గతి లేదు. 'నతత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నోమనో, నవిద్మో'. ఇక నిట్టియచింత్య - అవిజ్ఞేయ, అనిర్వచనీయ, నిరుపాధిక, వ్యాపకాత్మం గూర్చి 'నేతి నేతి' కంటె వేరేమనవలయును?

ఆత్మస్వరూపముంగూర్చి యడిగినచో శ్రుతి, ఆత్మ స్వరూపము నెఱుంగగోరునదెవరు? అని యడుగును. 'నేను' అని యుత్తరము నీయవలయునుగదా! 'నేను' అను పదార్థమేమి? అన్నది మరొకప్రశ్న. సరియే: 'నే'నన్నదే విజ్ఞాతయగు నాత్మ. తెలియగోరు నాత్మనీవే యగుచో, మఱి నన్నేలయడిగెదవు? అనును. 'విజ్ఞాతారమరే కేన విజానీయాత్' ఏ విజ్ఞాతయొక్క జ్ఞాన - కర్మకరణికచే జ్ఞానకర్మేంద్రియములన్నియు స్వస్వవ్యాపారసమర్థములగుచున్నవో అవి దానినెఱుంగుట సంభవమా? ఇవి పరిచ్ఛిన్నములు; అదివ్యాపకము గదా!

ఆత్మానంద మటుంచుము, పరిచ్ఛిన్న విషయానంద స్వరూప లక్షణము నిర్వచింప గలమా? శర్కర, గుడము, చెరుకు, ఇత్యాదులందలి మాధుర్య తారతమ్యమేమో రసనైకగమ్యమే గాని - అనుభవైకవేద్యమేగాని చెప్పజాలమే, అట్టిచో. సర్వ రసోత్పత్తి - వికాసకారణమగు నాత్మానందమునకు నిర్వచనమా? 'మూకాస్వాదనవత్'.

నాయమాత్మా ప్రవచనేనలభ్యో న మేధయా నబహునా శ్రుతేన
యమేవైషవృణుతే తేనలభ్యః తస్యైష ఆత్మావివృణుతేతనూం స్వామ్.

'అసద్వా ఇదమగ్ర ఆసీత్' శ్రుతియు దానిని నకారాత్మకమే యని ఘోషించుచున్నది. ఇట 'అసత్' అభావము కాదు, సద్వాచకము; అది విశ్వప్రతిష్ఠ. నుందుకు నకారాత్మకాసచ్ఛబ్దము అభావాత్మక మనుకొను నేమోయని శ్రుతియే 'సదేవేద మగ్ర ఆసీత్ కథమసతస్సజ్జాయేత' అని వివరించెను. అయసత్తు సద్రూపము, అది యభావవాచక మగుచో విశ్వోత్పత్తి యెట్లు?

అయినచో అసత్తననేల? - అన్నచో - సత్తు దేనియందుండు నదియసత్త బడును. సత్తునందు సత్తులేపందున, నది యసత్తనుట న్యాయసంగతమే కదా! మరియు - సామాన్యులు, సత్తన భౌతిక పదార్థములను గ్రహింతురు. శ్రుతిచెప్ప నెంచినది నిరుపాధిక సత్తు కనుక దాని నసత్తని చెప్పెను. లౌకికులనుకొను సదసత్తుల కంటె నీ యసత్తుభిన్నము. ఈ రహస్యమునే రూపాంతరమున,

వ్యక్తపరుపనై శ్రుతి 'నైవేహ కించనాఽగ్రేఽసదాసీత్ - నైవ సదాసీత్ - తదుక్తమృషిణా' నాసదాసీన్నో సదాసీత్తదానీమ్' అనెను.

"సత్తు (భౌతికవిశ్వము) నకు, అసత్తు (అభావము) నకును పూర్వము గలది అసత్తునుగాదు, సత్తునుగాదు. కనుకనే ఋషి "అప్పుడు సత్తును లేదు. అసత్తును లేదు." అనెను. అని శ్రుతి తాత్పర్యము. మరి ఆ యున్నదేమి? అన్నచో, అనిర్వచనీయ భావమొకటని శ్రుతి "తస్మాద్ధాఽన్యన్న పరఃకించనాస" అని తత్ కంటె మరియొక పరతత్త్వమేమియు లేదు అనియెను. అనగా 'అదే సత్తు; నసత్తును. అదే ఆ రెండునుగానిదియు నని తాత్పర్యము. ఎంతకలవరించినను! ఏమిచేయుదుము. గతిలేక ఆ శ్రుతినే విశ్రాంతి నొందవలయును.

ఇట్టి లౌకికుల సదసద్భిన్నమగుటచే 'సత్తును గాదు. అసత్తును గాదు.' అనవచ్చును. ఇక స్వయం స్వరూపమగుటచే సత్తనదగును. మఱి, సత్తునందు సత్తుండదు. కనుక అసత్తనియు ననవచ్చును. ఇది సదసత్తులకు దార్శనికోత్తరము. ఇటనొక:—

పూర్వపక్షముగ:— "భగవంతు డొకచో 'సదసత్తులు సర్వథా వేరైన తత్త్వములనుచు ఎన్నడును సత్తు అసత్తుగను, అసత్తు సత్తుగను గాజాలదు. సత్తునకు భావము, అభావమునకు సత్తయు నుండదు" అని సిద్ధాంతము జేసెను. ఇందువలన ఆ వ్యాపకతత్త్వము సత్తన్నచో అసత్తనరాదు. అసత్తన్నచో సత్తనరాదు. "ఇక నవి తమఃప్రకాశములట్లు విరుద్ధములగుటచే

నొకచో జేరనివి. కనుక, దానిని సదసత్తు ననజాలము. అట్టిచో-నది మొదట నసత్తనుట పిదప సత్తనుట, మరల సదసత్తులకు బరమనుట. చివరకు సదసత్తనుట సంగత మగుటెట్లు?" అన్నచోః—

సమాధానము:— ఇట్టి విరుద్ధార్థముం జెప్పిన శ్రుతినే యడుగ వలయును. గీత — శ్రుతి. ఇందు విరోధము కల్గినపుడు స్మృతి యగు గీత యుపేక్షణీయము. కాని, శ్రుత్యుక్తాత్మవిద్యా స్పష్టీకరణమునకు నగ్రణియగు శ్రీమద్భగవద్గీతోపనిషత్తు విషయమున నిట్టి విరోధము గల్పించుట తదీయ సిద్ధాంతము నెఱుంగమియు, ప్రాయశ్చిత్త భాగి యగుటయు నగును.

గీత, ఆ శ్రుతిసిద్ధమగు నిర్ద్వంద్వాతీతద్వంద్వము వంకకు మన ధ్యానమునాకర్షించుచున్నది. పూర్వపక్షి యో 'గీతోక్త సదసత్ శబ్దములకు సోపాధిక సత్తును అభావమును గొని ముందుకు వచ్చుచున్నాడు. కాని, భగవంతుని లక్ష్యము తత్త్వరూపసదసత్తు. కనుకనే శ్రుతివలె 'ఉభయోరపి దృష్టోంత స్త్వనయోస్తత్త్వదర్శిభిః' అని స్పష్టీకరించు టావశ్యక'మని యెంచెను. సదసత్తుల లౌకికరూపములు వేరు. తాత్త్వికరూపములు వేరు. లౌకికులు భౌతికసత్తును, అభావాత్మకాసత్తును సదసత్తు లనుకొనుచున్నారు. కాని, తత్త్వదృష్టితో విద్వాంసులు తత్త్వాత్మక సదసద్ద్వంద్వమును సాక్షాత్కరించుకొనుచున్నారు.

ఆ గీతావచనమందలి గొప్ప విశేషత యేమన:— శ్రుతి సూక్ష్మరూపమున జెప్పు సదసత్తుల తాత్త్వికస్వరూపమును

మరింత స్పష్టముచేసి మనయెదుట నుంచుచున్నది. శ్రుతి—ఒకదానినే సత్తనియు, అసత్తనియు జెప్పి ఎందుకట్లనెనో స్పష్ట పరచదయ్యెను. గీతయో, రెండును స్వతంత్రతత్త్వములనుచు అద్వైతమును సురక్షితము గావించుచున్నది.

అది యొకటే రెండు, రెండు నొకటి. రెండును పరస్పర మత్యంత విరుద్ధములు. అయినను ఏకము. ఇదే దీని విలక్షణత; అనిర్వచనీయత. ఆ రెండు స్వతంత్రతత్త్వములును క్రమముగ అమృత - మృత్యువులు; రస - బలములు. అమృతతత్త్వము సంఖ్యచే నేకము; దిగ్దేశకాలములచే ననంతము. మృత్యు తత్త్వము సంఖ్యచే ననేకము (నానా); దిగ్దేశకాలములచే సాది; సాంతము. అమృతము సత్; మృత్యువసత్. ఈ రెండును గ్రంథి భావమున బరిణతము గానంతవరకు విశ్వాతీతములు ఎప్పుడు సత్తున కసత్తుతో గ్రంథిబంధన మేర్పడునో అప్పు డా నిరుపాధి కము సోపాధికమై విశ్వము - విశ్వాత్మగ నగును. చూడుడు:—

> "కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్
> సతోబంధు మసతినిరవిందన్ హృదిప్రతీష్యా కవయోమనీషా."
>
> (ఋక్ 10)

ఇదే సదసదంత (నిరుపాధిక) రూపము. ఇదే అహం పదార్థము (ఆత్మా). గీత యందలి అసత్తు అభావవాచక మగుచో దాని నది యహంశబ్దమున వ్యవహరింపదు. 'అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున' అని సదసత్సమష్టి నది యాత్మ (అహం) అనుచున్నది.

ఇట్లు:— సదసద్ద్వంద్వమునకు శ్రుతి తాత్పర్యమే గీతా తాత్పర్యము నగును. (విస్తరము బ్రహ్మకర్మ పరీక్షయం దరయ నగును) ఇంతకున్నైన ఆనందమీమాంసచే జెప్పదలచినది:— ఆనందఘనాత్మ స్వరూపలక్షణముంగూర్చి 'శ్రుతి'న'యన్నది, ఆ 'న' కార పరిజ్ఞానమునకై మనము మహోవిశాల శబ్దశాస్త్రము నాశ్రయింపవలయును. ఈ నకార మొకానొక వరాలికరహస్య మును సూచించుచున్నదని 'నేతి నేతి' అను నీ యుత్తరవాక్య ముచే స్పష్టమైనది.

ఈ వాక్యమునకు సాధారణార్థము:— "విశుద్ధవ్యాపకాత్మ స్వరూపలక్షణముం గూర్చి ఒకటి కాదు రెండునకారములు,న-న- యందును. న - ఇతి; న - ఇతి, అనుటయే, జిజ్ఞాసకు సమా ధానము. తత్స్వరూప లక్షణ మసంభవమగుచో నంతకంటె (న - యే దానిస్వరూపలక్షణ మనుటకంటె) నేము చెప్పగలము.

రెండవయర్థము:— ఇది భౌతికవిశ్వముయొక్క 'నాస్తి'కి జెందినది. సామాన్యులు:— భౌతికపదార్థము వే ఆత్మ అనియో, ఆత్మయు భౌతికపదార్థమును ఎప్పుడును కలసియే యుండుననియో అనుకొందురు. — శ్రుతి, అట్టిభ్రాంతిం బోగొట్టి విశ్వాతీతము, నిరూపాధకను నగుతత్త్వముందెలుప నెంచి విశుద్ధాత్మంగూర్చి నేతినేతి' అనియెను. అనగా:— ఇంద్రియగోచరములగు భౌతిక, 'పదార్థముల నన్నిటిని న ఇతి - న ఇతి = ఇది (ఆత్మ) కాదు ఇదియాత్మకాదు అనుచు నిషేధించుచు బోగాబోగా నెచట నీ నేతి నేతి సమాప్తమగునో, అదేవిశుద్ధాత్మ, అనిభావము.

మూడవయర్థము:— ఇది వ్యాపకమగు నస్తిభాగమునకు జెందినవి. భౌతికవిషయములం దాసక్తులగు ప్రేయోమార్గానుగాములు ఉదరపరాయణులు, "శరీరము, లేక ప్రత్యక్షదృష్ట భౌతికప్రపంచముకంటె సత్తాలక్షణముగల యొక నిత్యాత్మ యేదియును లేదు." అందురు. ఈనాస్తికుల నకారము నుద్దేశించి శ్రుతి దాని ప్రక్కనింకొక నకారముంజేర్చి "న - ఇతి న - ఇతి, 'లేదన్నది లేదని' అనగా ఉన్నదనియే యెఱుంగుము" అనుచున్నది. ఘటాభావాభావము ఘటసత్తాసూచికము గదా!

నాలవ యర్థము:— ఇది లౌకికవ్యవహారమునకు జెందినది. దూరదర్శిత్వము లేని లౌకికులు, భ్రాంతివశమున నున్నదానినే లేదనుకొన్నప్పుడా యున్నదాని జాడ నెఱుంగువాడు 'లేదన్నది లేదు' అని చెప్పునట్టిచటను ఎఱుంగవలయును. (మూడవ - నాల్గవ యర్థముల భావములందీషద్భేదము.)

ఇట్లు న - న - యనుచున్నను, శ్రుతి మనలను తటస్థరూపమున నాయవిజ్ఞేయము వంకకు గొంపోవుచున్నది. శ్రుతి యొక్క శ్రుతిత్వము (సాక్షాత్కృతధర్మత్వము) ఇదే. ఇదే దాని అపౌరుషేయత్వము, (పురుషుడెవ్వడని తత్త్వముం జెప్పుట) - ఇదే మన విజ్ఞానికాత్మయొక్క - నిరుపాధికాత్మ యొక్క పరీక్ష. నకారముదప్ప నికేదియు దీనింబరీక్షింప జాలదు. అవిజ్ఞేయతయే దీనివిజ్ఞేయత. అనిర్వాచనీయతయే దీని నిర్వాచనీయత - తెలియబడ జాలదనుటయే తెలియుట. నిరు

పాధికము. కనుకనే శబ్దాతీతమగు నీవిశుద్ధాత్మజ్ఞాన మీమాంసజేయు నీశ్రుతివచనము లరయదగినవి:—

"యస్యామతంతస్యమతం, మతంయస్యనవేదసః
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతమవిజానతాం
సంవిదన్తినయంవేదా విష్ణుర్వేద నవావిధః
యతోవాచోనివర్తన్తే అప్రాప్య మనసాసహ"

శాస్త్రములలందు విస్తరించి యాత్మవర్ణితము; దానింగొని విద్వాంసులు మేమాత్మనెఱింగితి మనుకొనుట యెల్లనది సోపాధిక భావమునను జెందును. విశ్వాతీత విశుద్ధాత్మ శాస్త్రము లందులేదు, చెప్పఁబడజాలదు. దానిగుర్తు లభించదు. ఇట్లు శబ్దశాస్త్రాధారమున నాత్మజ్ఞానుల మనుకొనువారి భ్రాంతిని నిరూపించు నీ శ్రుతివచనము గమనింపదగినది.

"నతంవిదాథ యఇమా జజానాన్యద్యుష్మాక మంతరంబభూవ
నీహారేణప్రావృతా జల్ప్యాచాసుతృప ఉక్థశాసశ్చరన్తి"

శ్రుతిచెప్పుచున్నది:— "ఈవిశ్వమూలమగు నాత్మను మీ రెరుగరు, మీరొకదాని నింకొకటిగా నెఱింగితిరి. - అహంప్రత్యయము నాత్మయనుకొను చుందురు కాని, ఆ యనుభూతాహం సోపాధికము, అది విశుద్ధ నిరుపాధికము, దాని యనుభూతి యసంభవము - ఆత్మస్వరూప మట్టిది, యిట్టిది యని ప్రేలువారు, మంచుచే నావరింపబడి, తమ్ముదామాత్మజ్ఞానుల మనుకొనుచు ఉక్థశానులై తిరుగుచున్నారు."

మూలకారణముక్థము ఆత్మయుక్థము దాని నెఱింగితి మని శాసించువా రుక్థశాసులు (ఉపదేశకులు). వీరిదశ:— మంచున బోవువారి దశవంటిది. తమకేమియు గనుఁడ కున్నను అది, ఇది, అదిగో, ఇదిగోయని యితరులను భ్రాంతులం గావించుచు దామును భ్రాంతులగుచుందురు - వారు ఉక్థమగు నాత్మ యొక్క అర్కరూప సోపాధిక ప్రాణమునే ఆత్మయనుకొని తృప్తులైయున్నారు. (అసుతృపః)

"యోఽహం సోఽసౌ యోఽసౌసోహం" అన్నట్లు పరమార్థదృష్టిచే - వ్యాపకాత్మయు శరీర పరిచ్ఛిన్న జీవాత్మయు నభిన్నములు; ఒకే వస్తువు. దానిజ్ఞాన మసంభవ మగుచో దీనిస్వరూప లక్షణము మాత్ర మెఱుఁగ వచ్చునా? 'దానిమాట యెట్లున్నను దీని నెఱుంగవచ్చు' నందురా? ఈ శ్రుతినరయుడు:—

"నవిజానామి యదివేదమస్మి నిణ్యఃసన్నద్ధో మనసాచరామి
యదామాగన్ ప్రథమజా ఋతస్యాదిద్వాచో అశ్నువోభాగమస్యాః"

ప్రతివ్యక్తియు 'నేనుచేసితిని చూచితిని, ఇత్యాదిగా 'నేను నేననుట' వలన 'అహం' తత్త్వమెఱిఁగియే యున్నాఁడా?' అని తోచును; గాని ఇంచుక యోర్పుతో 'నేను' అన్న దేమి యను కొన్నచో నేమియు దోచజాలదు. ఎన్నియో గంటలు దిన ములు వత్సరములు తుదకు జీవితపర్యంతము మననము జేసిన నిదియింతే 'అహం' ను తెలిసికొనుచో ఆత్మస్వరూపమగు

విజ్ఞాతృభావము నాక్షేపించుటయే (విజ్ఞాతారమరే కేనవిజానీయాత్). ఈవిధముగా:– 'నంతవిదాథ' 'నహంజానామి' అనునీ రెండు శ్రుతులును శదీయేశదీ. యాభిన్నతం జూపుచు నీ నిరుపాధిక విశుద్ధాత్మ అవిజ్ఞేయమనియే చెప్పుచున్నవి.

ఇట పాఠకులు "ఈయాత్మ పరీక్ష బాగున్నది. దార్శనిక పరీక్షయందు ఏదోకొంచెము తెలిసినట్లేయున్నది. దీనివలన మంచియో చెడ్డయో సత్యమోమిథ్యయో ఈవరకేరింగినట్లున్న విశ్వాసముకూడ సరిగిపోయినదే! ఆత్మజిజ్ఞాసను శాంతింప జేయనై వైజ్ఞానికాత్మ నారంభింతు మనియు దానివలన ధర్మ-కర్మ - ఇహపరలోక సంబద్ధములగు ననేకభ్రాంతు లుండ వనియు జెప్పి చివరికిదియా చేసినది?" అనవచ్చును: కాని ఒక మనవి:–

ముందు జెప్పనున్న ఆత్మస్వరూపము లన్నియు నొకే యఖండబ్రహ్మకు సోపాధికములగు ననేకరూపములు, మన లక్ష్య మనేకాత్మవాదముతోడి యేకాత్మవాదము. ఇదే పరమార్థదృష్టి. దీనినొందుటకు వ్యావహారికనానాత్మ వాదానుగమన మావశ్యకము. ఏకసత్యవాదము జ్ఞానమునకు, నానాసత్యవాదము విజ్ఞానమునకు జెందినవి. ఈప్రకరణమునందు నానాసత్యములనే నిరూపింతుము. కనుక వైజ్ఞానికాత్మపరీక్ష యని పేరు బెట్టితిమి.

ఒకేయాత్మకు సగుణనిర్గుణములని రెండురూప భేదములు. ఇందు నిర్గుణము పరాత్పరమందురు. ఇదివిశ్వాతీతము కనుక

శాస్త్రానధికృతము, అవిజ్ఞేయము, అనుపాస్యము, దానిచర్చయే వ్యర్థము. కాని, అదిపశ్యాతీతమయ్యును "ఏకం వా ఇదం వి బభూవ సర్వమ్" అన్నట్లుసర్వమూలము, ఉక్థములకెల్ల మహోక్థము, వ్రతములకెల్ల మహావ్రతము, పురుషులకెల్ల పురుషుడు కనుకనే యదియన్నిటికిబ్రహ్మ - సామ - ఉక్థము నై యున్నది. అందువలన నది ప్రపంచాత్మ యనదగును "యస్యాయముక్థం సత్ బ్రహ్మ సత్ సామన్యాత్ సతస్యాత్మా" అనిగదా ఆత్మలక్షణము? -

ఇక:— ఇటనొక ప్రశ్న:—

ఆ వ్యాపక నిర్గుణాత్మకు విశ్వోత్పత్తిగావించు నావశ్యక మేమి? అదియొకవిధముగ కామన - ఇచ్ఛ గదా! అప్రాప్త వస్తుప్రాప్తికై గదాయిచ్ఛ? వ్యాపకమున కప్రాప్తియేమి? ఇచ్ఛ యన్నది మనస్సంభవము, మనస్సునకు హృదయముప్రతిష్ఠ 'హృత్ప్రతిష్ఠం యదజిరంజవిష్ఠం తన్మేమనః శివసంకల్పమస్తు". హృదయము సీమాభావమునకు జెందినది. ససీమము సాయతనము నగుదానియందే హృదయముండును, ఆ వ్యాపకతత్త్వ మసీమము. కనుక నందు హృదయమెట్లు? అనగా:— ఆ వ్యాపకాంశము హృదయమే, అది. స్వయముగా హృదయమూర్తి. దానియందునిక హృదయములేనపుడు, అటమనస్సేది? ఇకనిచ్ఛ? సృష్టి ?

కాని, ప్రత్యక్షదృష్టమగు సృష్టిని మిథ్యయందుమా? 'నామరూపే సత్యమ్' అనుశ్రుతి నేమనవలయును? మరియు, కారణములేని కార్యముండదన్నది మిథ్యయందుమా? కారణ

భూతతత్త్వమును శ్రుతి 'వ్యాపకాత్మ' యనుచున్నది. దానికి సృష్టిచ్ఛతో సంబంధము కన్పట్టుచున్న దంటిమి. ఈధర్మసంకట నివృత్తియెట్లు?

సమాధానము: ముందు దార్శనిక దృష్టితో నీప్రశ్న విచారింతము: ముఖ్యమగు శారీరకతంత్ర మీమాంసమస్యకు, 'లోకవత్తు లీలాకైవల్యమ్' అని తిన్నగా నొకసమాధానమిచ్చి వైచెను. దార్శనికదృష్టికది సమీచీనము, శాస్త్రభక్తుడు, శ్రద్ధాళువు నగు ఆస్తికునకది పరమమాన్యము.

ఆసూత్రాభిప్రాయ మేమన :— ఆతత్త్వమెట్లు అనిర్వాచనీయమో అట్లే తదీయకార్యకారణభావము ననిర్వాచనీయమే. ఈ యనిర్వాచనీయతయే దానిలీల. ఏదేని అపూర్వఘటనం గూర్చి 'భగవల్లీల!' యనిమనమనుకొనుచుండమా? ఏఫలాశయులేకయే యగు స్వాభావికభగవదిచ్ఛయే భగవల్లీల, యనబడును.

కొందరూరక కాలూపుదురు, చిటికలువైతురు, భూమిపై గీయుదురు, తృణములు త్రుంపుదురు, వీనియందిచ్ఛయున్నను అప్రాప్తవస్తుప్రాప్తీచ్ఛయిదికాదు గదా, ఇదేలీలాకైవల్యము. ప్రాప్తీచ్ఛలేకున్నను అన్నియు జేయుట. తదీయలీలామయ స్వాభావికేచ్ఛచే లీలామయవిశ్వము సృజింపబడినది. దీని యనిర్వాచనీయ కార్యకారణభావ విషయమున నూహాపోహాలు సేయుట వెఱ్ఱితనము. దీనియనిర్వాచనీయతకొక లౌకికోదాహరణము చాలును:—

స్వర్ణము - కటకము - ఇవి కారణ - కార్యములు. వీనిసంబంధమునరయుచో పంచవిధములగును. 1. కటకము సువర్ణమందున్నది:— (కార్యము కారణమందున్నది) 2. సువర్ణము కటమందున్నది. (కారణము కార్యమున్నది) 3. సువర్ణము - కటకము వేర్వేరు పదార్థములు (కార్యకారణములు భిన్నములు) ఎట్లు :—సువర్ణముంగాని రమ్మన్నచో కటకము, కటకముంగాని రమ్మనుచో సువర్ణము దేబోముగదా! 4. సువర్ణమే కటకము - నిరూపించుచో కటకమందలి ప్రతియణువు సువర్ణమే గదా, (కారణమే కార్యము) 5. సువర్ణము కటకముకంటె వేరు. కాని, కటకము సువర్ణముకంటె నభిన్నము (కారణము కార్యముకంటె వేరు, కాని కార్యము కారణముతో నభిన్నము) ఎట్లన కటకముగాకున్నను సువర్ణముండును. కానిసువర్ణములేనిదే కటకముండదుగదా!

ఇట్లు ఈపంచసంబంధములు పరస్పర మత్యంత విరుద్ధములయ్యు నొకచో సమావేశమగుచున్నవి: ఇదే ఆరవదగు ననిర్వచనీయసంబంధము. ఇదే దార్శనిక పరిభాషానుసారమధ్యాససంబంధము. ఈవిధముగ - లౌకిక కార్యకారణ భావ సంబంధముగూడ ననిర్వచనీయమగుచో నా యలౌకిక కార్యకారణ భావనిర్వచన మెట్లుసేయవచ్చును? కనుక చివరకు:— దానినుండి, విశ్వమెందుకు? సంబంధమేమి; అనుప్రశ్నలనుచితము లనవలయును. అవిజ్ఞేయభావ సంబంధమున నీ తర్కములా? ఒకచో శ్రుతియు నీవిషయమునే స్పష్టపరచెను.

గార్గికి యాజ్ఞవల్క్యుడు, అప్తత్త్వము మొదలు అన్నిలోకములకును ఓతప్రోతభావములను జెప్పి చివరకు బ్రహ్మలోకమెందు ఓతప్రోతము? అన్నప్రశ్న వచ్చెను ఆమెతో "నాతిప్రాక్షీః మాతే మూర్ధా వ్యపప్తదనతి ప్రశ్న్యాం వై దేవతామతిపృచ్ఛసి గార్గి మాతిప్రాక్షీః" (ఇతి తతోహ గార్గీ వాచక్నవ్యుపరరామ" (బృహ 3-6) అనుటయు నామె యూరకుండెనట!

సత్యమే. ఇంద్రియాతీతవిషయమునందు మనతర్కములకు నేమియు విలువయుండదు. కనుక - 'లోకవత్తులీలాకైవల్యమ్" అని విశ్రమించుటయే శరణము. అభియుక్తులును ఇట్లనిరి:-

'అచింత్యాఃఖలు యేభావా నతాంస్తర్కేణయోజయేత్
ప్రకృతిభ్యఃపరంయచ్చ తదచింత్యస్యలక్షణమ్"

ఒకచో శ్రుతి:- ఈసృష్టి ప్రవర్తనకైన నీకార్యకారణ రహస్యము తెలియునో! తెలియదో! యన్నది. వాస్తవమేమన:- ఇచ్ఛకల్గును, తదనుసారము పని సేయ మొదలిడుదుము, కాని, ఇచ్ఛయెందుకుకల్గును? కల్గినది అన్నచో, నేమో! చమురు వలన దీపము వెలుగును. నీటివలన వెలుగదెందువలన? నేమో! 'స్థితస్యగతిశ్చింతనీయా' ఇచ్ఛయొక్క యథార్థాన్వేషణ చేయబోవునపుడు పరమయిచ్ఛామూలమే మనకు దెలియదాయె, ఈయాధ్యాత్మిక చర్చ నీరసమైనదంతంచెప్పు నీశ్రుతింజూడుడు.

'కేనేషితంపతతిప్రేషితంమనః కేనప్రాణఃప్రథమఃప్రైతియుక్తః
కేనేషితాంవాచమిమాం వదన్తి చక్షుః శ్రోత్రంకఉదేవోయునక్తి' (కేన)

మనయిచ్ఛనే మనమెరుంగనపుడు ఆ వ్యాపకేచ్ఛామూలము నరయఁబోవుట వెఱ్ఱితనముకాదా? అదియు దనకార్యకారణభావపరిజ్ఞానమునం దున్ముగ్ధమట! గమనింపుడు:—

"కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుతఆజాతా కుతఇయం విసృష్టిః
అర్వాగ్దేవా విసర్జనేఽనాథాః కో వేద యత ఆబభూవ?
ఇయం విసృష్టి ర్యత ఆబభూవ యదివాదధే యదివాన
యోఽస్యాధ్యక్షః పరమేవ్యోమన్ సోఽంగ! వేద యదివా నవేద!
(ఋక్ 10.)

ఈ దార్శనికోత్తరమున నొక శ్రద్ధాళువు తృప్తి నొందవచ్చును. కాని, వైజ్ఞానికు లంతతో దృప్తి నొందజాలరు. ఇచ్ఛ మనస్సునకు జెందినది. మనస్సు హృదయమునకును, అది సీమాభావమునకును జెందినవి. వ్యాపకమునకు సీమాభావ మెక్కడ? అట్టిచో నది సృష్టిమూల మగునా?

పూర్వోక్తస్వాభావికేచ్ఛను విజ్ఞానముగూడ అంగీకరించును. అదియు తన్మూలము నన్వేషింపబోదు. అదియు 'స్థితస్య గతిశ్చింతనీయా' అనియే యెంచును. ఇక దాని ప్రశ్న ఇచ్ఛాస్వరూపముంగూర్చి మాత్రమే. ఇచ్ఛ యన్నది పరంపరగ సీమాభావమునకు జెందినదనుటను దార్శనికులు నంగీకరింప వలయును. ఆత్మ సీమాభావమునకు బరమనుటయు సమాన విషయమే. ఇక భేదము దృష్టికోణములందు మాత్రమే. ఎట్లన:— దార్శనికు లిచ్ఛను లీలామాత్ర మని చెప్పి తమ బాధ్యతను వదల్చుకొనిరి. వైజ్ఞానికు లీయిచ్ఛకు స్వరూపమేమి? యని

యరయజూతురు. ఇందుకు సమాధానముగ నీవచనములం గమనింపుడు:—

ప్రశ్న:—

కింస్విద్వనం? క ఉ స వృక్ష ఆసీత్? యతో ద్యావాపృథివీనిష్టతక్షుః
మనీషిణో మనసా పృచ్ఛతేదుతత్ యదధ్యతిష్ఠత్ భువనానిధారయన్?

ఉత్తరము:—

"బ్రహ్మవనం బ్రహ్మసవృక్ష ఆసీత్ యతో ద్యావాపృథివీనిష్టతక్షుః
మనీషిణో మనసా విబ్రవీమివః బ్రహ్మాధ్యతిష్ఠత్ భువనాని ధారయన్"
(తై॥ బ్రా)

ఈ ప్రశ్నోత్తరములు చాలసరళములు. ఇట దార్శనికులు, 'అంతయు (కార్యకారణములు) బ్రహ్మయే' యని చెప్పి వేయుదురు. కాని, నైజ్ఞానిక బ్రహ్మవాది:— బ్రహ్మమూలకాద్వైత సమర్థకుడయ్యు నంతటితో 'అవును' అనక "వనరూపబ్రహ్మ, వృక్షరూపబ్రహ్మ, విశ్వరూపబ్రహ్మ ఈ మూటి స్వరూపములందును తప్పక యౌపాధికభేదమున్నది. ఇందు కేదో మూలకారణ ముండును. 1. వనము ఏకము-అసీమము; 2. వృక్షములనంతములు; ససీమములు; 3. విశ్వకారణము వనరూపబ్రహ్మ కాదు. అందలి వృక్షరూప ససీమబ్రహ్మ" అనుకొనును.

ఇక దీనిని విచారింతము:— మొదట కేవలము అసీమము. వనస్థానీయమగు బ్రహ్మమాత్రమే యున్నపుడు ససీమవృక్షావిర్భావ మూలకారణమేది? సమాధానమునకై ఏ యక్ష (అభ్వ)

మూర్తి. అగ్నివాయ్వింద్రులకు బ్రహ్మబోధ కల్గించెనో, ఏది సృష్టికొలకు బ్రహ్మను విచారము గావించెనో, ఆ జగన్మాయ, హైమవతి, యుమ నాశ్రయించుచో నీ సృష్టిరహస్యముం జెప్ప గలదు. ఆమెయే బలరూప, శక్తిరూపిణి. ఆమెను మనస్సున నావాహన సేయకున్నంతవర కాత్మదేవతయొక్క సృష్టిరహస్యము నెరుంగజాలము. 'నాయమాత్మా బలహీనేన లభ్యః'

కేనోపనిషత్తు 'బ్రహ్మప్రాప్తికి ముఖ్యద్వారము శక్త్యుపాసనయే' యని స్పష్టముగావించెను. ఆశక్తి నెచట నన్వేషింతుము? 'సర్వత్ర'. 'సర్వత్ర' యను వస్తువేమి? సదసల్లక్షణ, అమృత మృత్యుమూర్తి పరాత్పర వ్యాపక బ్రహ్మ. అందుండి యందే యా వీర్యరూపశక్తి లభించును. దానిచే తదుపలబ్ధి (జ్ఞానము) కలుగును. ఈ యన్యోఽన్యాశ్రయభావమును సూచింపనే, 'ఆత్మనావిందతే వీర్యమ్' 'నాయమాత్మా బలహీనేన లభ్యః' అను రెండు వచనములు వెలసినవి.

గీతోక్త సదసద్ద్వంద్వ తాత్త్విక స్వరూపనిరూపణావసరమున నా 'అహం' శబ్ద వాచ్యాత్మ అమృతమృత్యుమయ మంటిమి. భాతులు రెండు. సత్త కేవల మమృతమేకము సచ్చిదానందము లను భాతిభేదములు మూడున్నను సత్తయొక్క యేకరూపతచే సచ్చిదానంద లక్షణ బ్రహ్మ అద్వయమని దర్శన మందువలె, అమృత మృత్యువు లను రెండు భాతిభేదములున్నను, ఈ సదసల్లక్షణబ్రహ్మ విజ్ఞానశాస్త్రముం దద్వయమనియే యెంచబడినది.

ఆ మూలబ్రహ్మయే, యీ తూలవిశ్వమునకు గారణమని

ప్రకరణారంభముననే యనుకొంటిమి. ఇక:— 'కారణగుణాః కార్యగుణానారభన్తే' అన్నట్లు చివరకు:— కార్యగుణాధారమున కారణగుణముల యొనుమానిక జ్ఞానము కల్గును. కార్యమగు విశ్వమందున్ననో వ్యష్టిగను సమష్టిగను పరస్పరము సర్వథా విరుద్ధభావములు కన్పట్టుచున్నవి. 1. సర్వథా అవికారియగు భావమొకటి 2. సర్వథా వికారియగు భావమొకటి. మనుష్యుడు శరీరముంబట్టి బాల్యయౌవనాద్యవస్థలందనుక్షణము బరిణామము నందుచున్నను ఈ మహాపరివర్తనతో వికారిభావముతో 'సఏవాయం' 'వాడేవీడు' అను అపరివర్తనీయ సత్తాభావము అక్షుణ్ణముగ నుండుచున్నదిగదా! ప్రతి పదార్థమునెడల నిట్లే యూహింపవలెను. ఒకటి నిత్యభావము. వేరొకటి అనిత్యభావము. ఈ కార్యవిశ్వ భాతిక్యయముంబట్టి దీనికి గారణమునకు తత్త్వమందును, ఈ రెండు విరుద్ధధర్మములు నుండవలయును; అవియే అమృత - మృత్యువులు; రసబలములు; సదసత్తులు; ఇత్యాదిగా జెప్పబడుచున్నవి.

రసతత్త్వము:— సర్వథా శాంతము, వ్యాపకము, నిష్క్రియము, ఏకము. బలతత్త్వము:— అశాంతము, పరిచ్ఛిన్నము, క్రియారూపము, అనేకము (నానా). నిత్యాశాంతిగర్భిత నిత్యశాంతతత్త్వమే వ్యాపకాత్మ. దీని రూపముత్తాలతరంగయుక్తమగు నొక శాంతసముద్రమువంటిది. "అపూర్యమాణమచల ప్రతిష్ఠమ్"

సర్వభౌతికపదార్థముల స్వరూపనిర్మాణమును, జలమువల

ననే యగును. కాని, స్వయముగ సముద్రమున కిందుజోక్యము లేదు. ధూమజ్యోతిస్సలిలమరుతస్సన్నిపాతరూప పుష్కలా వర్తాది మేఘము లాయనంత సముద్రమునుండి కొలదికొలదిగ జలమాత్రంగొని వృష్టిద్వారా, మనుష్యబుద్ధి వైభవములగు కాలువలద్వారా అన్నాదిపరిపాక కారణములగు చున్నవి. ఆయన్న సంపత్తి భౌతికప్రపంచజనని. సముద్ర మనంతభండారము, కోశము. వ్యాపకాత్మస్థితియు నింతే. అది స్వయముగ నేమియుసృజింపదు. ఆయనంతమాత్రా పరిగ్రహమునన్నైన యశ్వత్థవృక్షస్థానీయ పురుషుని వ్యాపారముచే విశ్వనిర్మాణము జరిగినది.

ఆయనంతగర్భస్థ బలనామక పరివర్తనీయతత్త్వము సంఖ్యకసంతమయ్యు— నాయనంత బలజాతులు లెక్కకు పదునారే. (ఈశోపనిషద్విజ్ఞానమున జూపబడినవి) అందొకటి తక్కిన పదునైదిటికిని మూలాధారము: ఆమహాబలకోశమే 'మహామాయ' యను పేరనొప్పును. సృష్టిమూల బీజమిదే. అసీమము ససీమముగ జేయుటదీనిస్వభావము: అందువలననే "మీాయతే అనయా" "మినోతియా" అని, 'మాయ' యందురు. రసబ్రహ్మరూపమువలె బలరూపయగు దీనిస్వరూపముగూడ నచింత్యమే. సద్రూప సంపూర్ణవిశ్వమున కిది మూలజనని, 'కథమసతః సజ్జాయేత' అన్నట్లు విశ్వదృష్టిచే దీనిని అసత్తనజాలము, ఇది బలరూప, బలముక్షణికము కనుక అసత్తు ఈదృష్టితో దీనిని 'సతీ' యనజాలము; పరస్పరవిరుద్ధమగుట 'సదసత్తు' అనజాలము.

పదార్థతత్త్వము సత్తు - అసత్తు - సదసత్తు. అనిమూడు భాగములు, ఈమూడునుగాని మాయ వస్తుతత్త్వమందుమా? కాదందుమా? ఇదే దీనివిలక్షణత. బ్రహ్మకూడ దీనియింద్ర జాలమునకు లొంగెనన క్షుద్రప్రాణులొక లెక్కయా ?

"యయాత్వయాజగత్స్రష్టా జగత్పాత్యత్తియోజగత్,
సోఽపినిద్రావశంనీతః కస్త్వాంస్తోతుమిహేశ్వరః"

(సప్తశతి)

జగదంబయొక్క యీవిలక్షణత నుపాసకులు:—

"నసతీసా, నాసతీసా, నోభయాత్మా విరోధతః,
కాచిద్విలక్షణామాయా, వస్తుభూతాసనాతనీ"

అనిపొగడుదురు.

తల్లియుత్పత్తింగనుగొందుననుట యున్మత్తతగదా! బ్రహ్మకు జనని! దానియథార్థస్వరూప జిజ్ఞాస యతిప్రశ్న కాదా? కనుక తత్స్వరూపపుజిక్కులోబడక, అది యచింత్యామిత వస్తుతత్త్వమును, పరిమితముగావించునని యనుకొన్నజాలును. సీమాభావ ప్రవర్తికయగు నీమాయయేలీల, ఈలీలారూపిణి యగు మాయతో నిత్యయుక్తుడా గనబ్రహ్మ భగవంతుడు. ఆయనస్వయముగ సృష్టిసేయుడు, చేయజాలడు. భగవంతుని యీలీలయే (మాయయే), భగవంతుని సృష్టిబంధనమున బడ వేయును. "లోకవత్తులీలాకైవల్య" మను దార్శనికోత్తరమున కును విజ్ఞానరహస్యమిదియే.

రసమందుండు జలస్వరూపము సముద్ర గర్భమందున్న తరంగముల స్వరూపమువంటిది. స్వస్థానమునుండి తరంగము బయలుదేరి యెచటవిశ్రమించునో, అటవరకు దానికవ్యక్త - వ్యక్త - అవ్యక్తములను మూడురూపములు - దానియాద్యంత క్షణము లవ్యక్తములు. ఇందు సముద్రము ప్రధానము, తరంగము గౌణము; తరంగముగర్భితము; సముద్రముగర్భ; మధ్య క్షణమునందీ స్థితికి వ్యతిరేకము. ఇక: సముద్రస్థానీయరసమునకు, తరంగస్థానీయ బలమునకు నిదేస్థితి యని యూహింపవలయును.

రసగర్భమందు బలమవ్యక్తావస్థ. బలగర్భమందు రసము వ్యక్తావస్థ. ఇది మధ్యస్థితి. చివరకు మరల మొదటిస్థితియే. అవ్యక్తక్షణములందస్తిరూపరసము ప్రధానము. తద్గర్భస్థిత బలము తదనుగ్రహముచే వంచితమై యుండును కనుక నీరెండు క్షణములు 'నాస్తి' యనబడును. వ్యక్త క్షణమునందు నాస్తిసారబలము అస్తిసారబలమునండగాగొని అస్తిభావము నొందును. అందువలననే దార్శనికులు, నాస్తిసారము బలాత్మకమునగు క్రియకు నాస్తి - అస్తి - నాస్తియను మూడు క్షణము లంగీకరించిరి. 'నాస్తి' యన నభావము కాదు; బలముయొక్క అవ్యక్తావస్థ. కనుకనే వైజ్ఞానికులు: ఈబలావస్థాత్రయమును గూర్చి సందిగ్ధార్థసూచకములగు నాస్తి - అస్తి - నాస్తి - అను శబ్దముల ప్రయోగింపక, అవ్యక్త, వ్యక్త, అవ్యక్త శబ్దముల ప్రయోగించిరి. చూడుడు:

'అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యానిభారత
అవ్యక్తనిధనాన్యేవ తత్రకాపరిదేవనా?' (గీతా)

మహామాయయు నొకబలవిశేషము. కనుక, ఇందును ఈమూడవస్థ లున్నవనవలయును. ఆయనంత పరాత్పరధరాతలమున మాయాబలము లనంతములు. ఒక్కొక్క బలగర్భమందు 15 చొప్పున సవాంతరబలకోశము లున్నవి. దేనిబలకోశ పంచదశి యవస్థాత్రయమునకు దానియవస్థాత్రయమే ప్రధాన కారణముగ నుండును. అప్పుడు తద్గర్భిత పంచదశ బలములును అవ్యక్తములుగ నుండును. మాయ వ్యక్తమగుచు నివియు వ్యక్తములగును. అది యవ్యక్తనిధనావస్థ నొందుచు నివియు నదే స్థితినొందును. ఈదృష్టితో అంతయు నన్నియు 'మాయయే' అనవలయును.

ఈమాయావస్థలుత్పత్తి స్థితిలయ బీజములు. పరాత్పర ధరాతలమందలి మాయల యీధారావాహిక క్రమమును అనంతము; అనాది. ఒక విశ్వముదయించును, ఒక విశ్వము స్థితినందును, ఒకవిశ్వము లీనమగును. ఇట్లు అంతటను ఆయనంతుని యనంత విభూతి సామ్రాజ్యమే సాగుచున్నది. ఎన్నిమాయాబలములో అన్ని స్వతంత్రవిశ్వములు. ఒక్కొక్కవిశ్వమునందనంత త్రైలోక్యములు. ఒక్కొక్క లోకమునందనంతప్రాణులు. ఒక్కొక్కప్రాణి శరీరమందనంతకీటాణువులు, ఇదేఆయనంతుని మహాలీలేతిహాసము. దీనిం గానముసేయు మహర్షు లనంతులు. వారి వాక్యరూపములగు వేదములును అనంతములు.

సరి:— సృష్టికి మొదట పరాత్పర ధరాతలములం దుచ్ఛ్వాసవచభావములచే నాందోళితమగు నొకమాయాబల ముద యించిన యాశ్రవదేము, సీమితమై పురుషుడనబరగును. సోపాధికాత్మ కిదే మొదటియవతారము. పరాత్పర మసీమము. మాయా యుక్తపురుషతత్త్వముససీమము. ఈ సీమాభావమువలన నందు, రెండవదగు హృదయబలము వికసించును. హృదయా వచ్ఛిన్నమగు నయ్యది (పురుషతత్త్వము) శ్వోవసీయస మను మనస్సని చెప్పబడినది. దీనినుండి సృష్టికామము (ఇచ్ఛ) "ఏకోఽహంబహుస్యామ్" అనునది యుదయించెను. ఈకామ నయే ఆ సద్రసమునకు, అసద్బలముతో గ్రంధిబంధనము గావించి వైచెను. ఆగ్రంధియే విశ్వస్వరూప సంపాదనజేయున దయ్యెను. ఈశ్రౌతవచనమరయుడు.

"కామస్తదగ్రే సమవర్తతాధి మనసోరేతః ప్రథమంయదాసీత్
సతోబంధు మసతినిరవిందన్ హృదిప్రతీష్యా కవయోమనీషా"

పరాత్పరమనంతధరాతలము. దానిపై బూర్వోక్తవిధమున దమతమవిశ్వమును సంచాలనసేయు నొక్కొక్కపురుషుని స్వరూపమును సంపాదించు మాయాబలము లసంఖ్యము లున్నవి. ఒక్కొక్కమాయాబలమునుండియొక్కొకవిశ్వ ముప్ప తిల్లినది. ఇట్లు కేవలమొక మయాబలము ననుగ్రహమున నాయొకే పరాత్పరవ్యాపకబ్రహ్మ - పరాత్పర - పురుష - విశ్వములను మూడురూపముల బరిణతమగుచున్నది. పరాత్పరు

డొక మహావనము. ఇంనదంతమాయా రూపానంతపురుషు లనంతవృక్షములు. ఈయొక్కొక్క వృక్షమును జెక్కబడియే యొక్కొక్క విశ్వము నిర్మిత మయ్యెను "బ్రహ్మవనం బ్రహ్మసవృక్షఆసీత్' అనుదాని రహస్యమిదే.

అసీముడగు పరాత్పరునివదలుడు. అనంతపురుషులనటుంచి ఒకపురుషునిగొనుడు. కారణము? మన యీయేకవిశ్వ సాక్షి యగుమహామాయి యొకడేపురుషుడు. ఈయొకపురుషునిదగు నొకమహావిశ్వమందు, ఒక వేయిశాఖలు గలవిశ్వములు ఇంకను గలవు. ప్రతి యొకశాఖయందును ఏడేసిలోకములున్నవి. ఇందు వలననే శ్రుతి 'నిష్టతక్షుః' అనియెను. ఆమహావృక్షపు వద్రంగముచేనొక సహస్రముశాఖలుగల విశ్వములు సంపన్నము లయినవి. ఇందు 999 శాఖావిశ్వములను వదలుడు. ఇక కేవలము సప్తలోకాత్మిక,పంచపర్వమయి యగు నొకశాఖకు జెందిన తదధ్యక్ష బల్మేశ్వర విశ్వమును విచారింపుడు. మనవేద మీబల్మావిశ్వమును, బల్మేశ్వరుని, నిరూపించుచుకృతకృత్యమగు చున్నది. ఈయొకదానిపరిజ్ఞానముచే స్థాలీపులాక న్యాయమున నంతయు నన్నియు దెలియనగును. "ఏకేన విజ్ఞాతేన సర్వ మిదం విజ్ఞాతంభవతి" "వ్యాపకము సృష్టిమూలమెట్లు?" అనుటకిది సమాధానము.

ప్రశ్నోత్థానికారంభమున నాత్మకుజెప్పబడిన నిర్గుణ - సగుణరూపములందలి సగుణాత్మకు:– మహామాయావచ్ఛిన్న పురుషుడు, బల్మేశ్వరుడునను భేదముచే రెండువివర్తములుగలవు.

ఇందు మనఃప్రకృతిలక్ష్యము సత్తనిరస్తి కాయాత్మక, సత్తలో కాధిష్ఠాత, ఒత్మేశ్వర నామక సగుణాత్మయేయని పూర్వకథనమునసే తెలియగలదు.

నిర్గుణబ్రహ్మ పరాత్పరము; సగుణబ్రహ్మ పురుషుడు; ఈ సగుణాత్మగు పరాగమాయాసంబంధముచే అమృత - బ్రహ్మ - శుక్రము లను మూడు భేదములు (ఇదివరకు ప్రకరణమున మున్నే నిరూపింపబడినవి). ఉపనిషత్తులం దీ మూడాత్మ వివర్తములును విస్తరింపబడినవి. కాని, వ్యాఖ్యాతల యనుగ్రహమున నవి వారి వారి మతానుసార మొకేమార్గమున నడచినవి. అందువలన ఆత్మస్వరూప విషయమున ననేక సందేహములు కలుగుచున్నవి. ఈ యాత్మవివర్తములను మూటిని చక్కగా నెరిగినచో నేసంది యము నుండదు, దర్శనతంత్రములు మూటను ఇమ్మూటియందలి యమృతాత్మయే స్పృశింపబడినది. కనుకనే దర్శనము నకృత్స్న మంటిమి.

ఇక గీతయు నీ మూటిని నిరూపించుచు, "అమృతాత్మ యొక్క యుత్తమసర్వరూపమగు నవ్యయముతో విశ్రాంతినొందు చున్నది. కనుక నిది కృత్స్న శాస్త్రమంటిమి. మరియు, నీయవ్యయాత్మతో బుద్ధియోగము గావించుటవలననే సర్వవిధ క్లేశనివృత్తి యగును 'నాన్యఃపంథా విద్యతేఽయనాయ" - ఇంతటితో పరాత్పరనిరుక్తియైనది. ఇక పురుషాత్మయొక్క అమృత- బ్రహ్మ - శుక్ర వివర్తములను క్రమముగ జూతము:—

ఇది నిర్గుణాత్మనిరుక్తి

# సగుణాత్మ నిరుక్తి

"ప్రజాపతే నత్వదేతాన్యన్యోవిశ్వారూపాణి పరితాబభూవ" "ప్రజాపతిస్త్వే వేదం సర్వం యదిదంకించ" "యత్కించ ప్రాణి నప్రజాపతిః" "సర్వము హ్యేవేదం ప్రజాపతిః" "ప్రజాపతిర్వా ఇదం సర్వం" ఇత్యాదులు విశ్వమందలి పదార్థములెల్ల వ్యష్టిగ - సమష్టిగ - ప్రజాపతి యనుచున్నవి. ప్రజ యుపాధి - ప్రజాయుక్తమగు నాత్మయే ప్రజాపతి: ఉపాధిక సగుణాత్మ - ఈసోపాధిక ప్రజాపతి (ఆత్మ) "చతుష్టయం వా ఇదం సర్వమ్" అను ననుగమానుసారము నాల్గు పర్వములు గలది. అవి క్రమముగ: ఆత్మ - ప్రాణ - విత్త - పాప్మ - లనబడును.

తక్కిన మూడు పర్వములకును ఆత్మ మూలప్రభవము ఉక్థము. ప్రాణము దీనియర్కలు (రశ్ములు). ఆత్మయొక్క శక్తియే విత్తము - ఇది:- అంతర్బహిర్భేదమున రెండు విధములు. శుక్రమందుండు బ్రహ్మ - క్షత్ర విణ్ణామకములందొక వీర్యమంతర్విత్తము. కళత్రా పత్యానుచర పశ్వన్న గృహ వస్త్రాది సంపత్తి బహిర్విత్తము. ఆత్మయొక్క జ్ఞానజ్యోతి నావరించు మోగమాయాలక్షణ షుగప్రధానాశీర్య పాప్మ. అన్నిటికి పైన పాప్మస్తర. దానికి లోపల బహిర్విత్తస్తర- దానికిలోపల అంతర్విత్తస్తర - దానికి లోపల ప్రాణస్తర - సర్వాంతర తమమాత్మ.

ప్రాణ - విత్తము లను రెండుపకరణములును ఆత్మస్వరూప రక్షకములు. కనుక ఆత్మానుకూల ధర్మములు.వీనిచే నుక్థరూప మగునాత్మ సురక్షితమగును. మూడవదగుపాప్మ ఆత్మ కుప సర్గము; ప్రతికూలము కనుక అధర్మము. ప్రాణవిత్తము లాత్మ మహిమలు తన మహిమ యందాత్మ ప్రతిష్ఠితమైయుండును.

ఈశ్వప్రజాపతి మొదలుగ నొకకీటాణు ప్రజాపతివరకు నొక్కొక్క యాత్మతోడను ప్రాణ విత్తములకు ఘనిష్ఠసంబంధ ముండును. ఆ రెండునులేని దాత్మప్రజాపతి కాజాలదు.

'ప్రజా + పతి' అను దానియందు విత్తమేప్రజ. దీనికాత్మ యే పతి. అది యుక్థరూపమున స్వస్థానము (హృదయము) న నుండును. స్వయముగనది ప్రజలను శాసింపదు. తదీయప్రా ణాత్మకరశ్ములు ప్రజాసంచాలన సేయును. ఆత్మపశుపతి విత్తము ప్రజారూప పశువు. ప్రాణము పశుసంచాలక మగు పాశము. ఇక నాల్గవ దగు పాప్మయన్నది ఆగంతుక (ధర్మ)ము.

ప్రాణమునకు నాత్మకును గల సంబంధము సూర్యునకు రశ్మలకును గలసంబంధము వంటిది. ఈయభేదమును 'అంత ర్యామ' మందురు. జలమందలి ద్రవత్వము 'అపాంసంఘాతో విలయనంచ తేజస్సంయోగాత్' అన్నట్లు ధర్త్రాపర నామక వరుణాగ్ని ధర్మము. ఈయగ్నియే అంతర్యామ సంబంధమున జలమునకు స్వరూప ధర్మమైనది. ఈయగ్నిని దొలగించినచో జలమునకు స్వరూప ముండదు: ఆత్మ - ప్రాణములకు నిదే సంబంధము.

రెండవ దగుమహిమ విత్తము. దీనికాత్మతో ఒహిర్యామ సంబంధము. అగ్నివలన జలమున కొక్కు వేడిమి యీసంబంధ మునకు జెందినదే. నాల్గవదగు పాప్మయున్నది ఆత్మయందువ యామ సంబంధమున నుండును: అనగా నిది కుంపటికి నిప్పు లకు నుండు సంబంధము వంటిది. ఆత్మసత్తయొక్క ప్రధాన వికాసము విత్త పర్యన్తమే. ! 'యావద్విత్తం తావదాత్మా' ఈప్రజాపతి పర్వములు నాల్గిటను ఈశ్వర ప్రజాపతికి నాల్గవ దగు పాప్మతో సంబంధము లేదు. దానితో జీవప్రజాపతికే సంబంధము. కనుక 'నీశ్వరుడు త్రిపాత్. జీవుడు చతుష్పాత్' అందురు. ప్రస్తుత మీశ్వర ప్రజాపతిం జూతము. ఇతనిని షోడశీ ప్రజాపతి యనియు నందురు. చూడుడు:

'యస్మాదన్యోన పరో౽స్తి జాతో య ఆవివేశభువనాని విశ్వా ప్రజాపతిః ప్రజయా సంరరాణః త్రీణిజ్యోతీంషి సచతే సషోడశీ'

పరాత్పరు నందలి మాయాబల సీమితభాగము పురుషు డంటిమిగదా! 'అనవచ్ఛిన్నస్యసతి మాయోపజనిత పురోపాధి కావచ్ఛేదకత్వం పురుషత్వమ్' అని యభియుక్తుల పురుష లక్షణముగూడ నిట్లే చెప్పెను. మాయోపాధివలన బురుషా విర్భావము. ఈమాయావిర్భావకాలమందు పురుషుడు విశుద్ధ మనోమయుడై యాకాశాత్మ - (నిష్కలుడు) గ నుండెను. కాని ఆక్షణమందే హృదయబల ముప్పతిల్లెను. దానిపేరే ప్రకృతి.

నేడు:—మాయ - ప్రకృతికి బర్యాయ మనుకొనుచున్నారు. కాని వాస్తవమున నవిరెండును భిన్నతత్త్వములు. మాయ యన్నది. పరాత్పర సమకక్షకు జెందిన యనవచ్ఛిన్న పురుషునితో సంబంధము గలది. ప్రకృతి కన్ననో షోడశీ పురుషునితో సంబంధము. మాయ పురుషునకు జన్మదాత్రి. ప్రకృతియో పురుషునికి బత్ని. పురుష - ప్రకృతులు మాయోదరమున నావిర్భవింతురు. ప్రకృతి యన్నదానికి రెండు పర్వములు. మాయ యనునదేకపర్వము. అమితమును మితము గావించుట మాత్రమే మాయాకార్యము; మితమగు నిష్కల పురుష తత్త్వమును షోడశకళముం జేయుట ప్రకృతిపని. ఇట్లు అనేక దృష్టులతో మాయాప్రకృతుల భిన్నత సిద్ధమగుచున్నది.

కానిందు: మాయా పుర కేంద్రము ప్రకృతి. పురుషునందు వలె నీప్రకృతియందును రస-బలము లను తత్త్వములు కలవు. అందువలన దానికి అమృత మృత్యువులను రెండు రూపములు కల్గును. అమృత ప్రకృతి అక్షరమనియు, మర్త్యప్రకృతి క్షర మనియు నందురు: అక్షర మపరిణామి: క్షరము పరిణామి. మూల పురుషుడు స్వయముగ నవ్యయుడు. ఆరంభమున నతడు నిష్కలుడు. కాని అక్షర వ్యాపారముచే నతని యందు రస-బల - చితి కలుగును. రసచితి ఆనంద విజ్ఞాన రూప. బలచితి ప్రాణవాగ్రూప. చేతనరూపమగు నక్షరముచే నగు నీచితిచే నీ మనోమయావ్యయుడు పంచకళుడై 'చిదాత్మ' యన బరగును.

ఆనందకళ సుప్రసిద్ధమే; విజ్ఞానకళ చిత్తు; మనఃప్రాణవాక్సమష్టినత్త. ఈమూటిముత్తము సచ్చిదానందములు. ఇవి యవ్యయుని విద్యా - వీర్యనామక ప్రధాన భక్తిద్వయము. ఆనంద విజ్ఞాన సమష్టి విద్యాభక్తి. ఇదే బ్రహ్మభక్తి. (భాగము) ప్రాణవాక్సమష్టి వీర్యభక్తి. ఇదే కర్మభక్తి. ఈ రెండుభాగములును మధ్యస్థమగు శ్వోవసీయస మనస్సునందగు చితులు. కనుక నాచితిరూప మగునవ్యయుని మనస్సి కామమయచిదాత్మ. ఇది ప్రధానరూపముచే జ్ఞానమూర్తియే.

అక్షరము గతిమూర్తి. ఈగతితత్త్వము 1. గతి 2. ఆగతి 3, (గతిసమష్టిరూప)స్థితి. 4. స్థితిగర్భితగతి. 5. స్థితిగర్భితాగతి. అనిపంచవిధములు. ఇవి క్రమముగ ఇంద్ర - విష్ణు - బ్రహ్మ - అగ్ని - సోమ నామములచే వ్యవహరింపబడును. ఇంద్రుడు 'ద' విష్ణువు 'హృ' బ్రహ్మ 'యమ్' ఈమూటిసమష్టి 'హృదయమ్' ఇదే హృద్యాక్షరత్రయి. దీనినే 'అంతర్యామి' యందురు. అగ్ని 'ఋ' సోమము 'ఇ' ఈ రెంటి సమిష్టి పృష్ఠ్యాక్షరద్వయి. ఇదే 'సూత్రాత్మ' యనబడును.

హృద్యములగు మూడక్షరములందు గతి - ఆగతి రూప ఇంద్ర విష్ణువులును, ఉపసృష్టగత్యాగతిరూపములగు అగ్ని + సోములును, ఋతరూపములు. ఇక:— స్థితిలక్షణాబ్రహ్మ సత్యమూర్తి. ఆ రెండు రెండు ఋతములతోడనుగూడి హృదయము మొదలుకొని పృష్ఠపర్యంతము తన విభూతి సంబంధముచే

వ్యాప్తుడై యీ సంపూర్ణవిశ్వమును దనపై తాను ప్రతిష్ఠించి యుంచుచున్నాడు. 'సత్యే సర్వం ప్రతిష్ఠితమ్'

విశ్వ మీాయన (బ్రహ్మ) యందును, ఈయన విశ్వమందును ఆహుతము లగుచున్నారు. ఇదే సర్వమేధము లేక సర్వాహుత యజ్ఞము. బ్రహ్మకర్తృకము, ఆత్మ+విశ్వముల యాహుతి లక్షణము నగు యజ్ఞమే విష్ణుదేవత 'యజ్ఞో వై విష్ణుః'.

ఈ యజ్ఞమునకు మూలప్రతిష్ఠ బ్రహ్మకర్మాత్మకావ్యయ పురుషుడు. 'అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాంవర' అవ్యయుని సచ్చిదానందధర్మములచే గూడి యక్షరుడు సృష్టి నిర్మాణముసేయనేర్చును. అవ్యయమనస్సుచే సర్వజ్ఞుడై కామన నేయును. ప్రాణముచే సర్వశక్తియై తప మొనరించును. వాక్కుచే సర్వవేత్తయై శ్రమించును. ఇట్లు ఈ యమృతాక్షరుడు కామతపఃశ్రమలద్వారా పరిణామియగు తన క్షరభాగ మును వికారముకొరకై యెదుటబెట్టుకొని సృష్టివితానమునకు గారణ మగును.

అవ్యయపురుషుడు బ్రహ్మకర్మాత్మకుడంటిమిగదా! ఈయన యీా కర్మభాగమునకు 1. రసప్రధాన ముముక్షు 2. బల ప్రధానసిసృక్షు అను నివృత్త ప్రవృత్త భాగములు రెండగును. ఆ యక్షరతత్త్వ మిందు 1. సిసృక్షామూలక మనఃప్రాణ వాక్ప్రధాన ప్రవృత్తకర్మ నాధారముగాగొని విశ్వప్రవృత్తికి గారణము, యజ్ఞస్వరూపసంపాదకము నగును. 2. ముముక్షా మూలకానంద విజ్ఞాన మనఃప్రధాన నివృత్తబలము నూతగా

గాని విశ్వనివృత్తికి యజ్ఞస్వరూపవిధ్వంసమునకు గారణమగును. మొదటిరూపముచే విష్ణువు, రెండవరూపముచే మహేశ్వరుడు నగు యక్షరతత్త్వము ఒకటే. బ్రహ్మరూపమున సృష్టికి, విష్ణురూపమున స్థితి-ప్రవృత్తికి, రుద్రరూపమున నివృత్తి-సంహారమునకు, అగ్ని-షోమరూపమున నుపాదానద్రవ్యప్రేరణకు కారణ మగుచున్నది. స్థితిగతి తారతమ్యతయే విశ్వపదార్థ వైచిత్ర్యహేతువు. ప్రతిపదార్థమును స్థితిగతులు గలదియే.

గతికి గత్యాగతులని రెండు వివర్తములను జెప్పితిమి. 1. అర్వాగ్గతి ఆగతి. 2. పరాగ్గతి గతి. ఇవే వరుసగ విష్ణువు, ఇంద్రుడును. అనగా:— ఆగతిరూప విష్ణువు స్థితిని రక్షించును. కనుకనే విష్ణువును బ్రతిష్ఠకు (బ్రహ్మకు) గూడ బ్రతిష్ఠయందురు. గతిరూపి యింద్రుడు స్థితినాశకుడు. ఈ రెండిటి లక్షణములతో గూడిన బ్రహ్మ స్వస్వరూపముచే విశ్వము నుత్పాదించును. ఇట్లు బ్రహ్మ విష్ణ్వింద్రులు సృష్టిస్థితిలయకారణములు. (పౌరాణికు లింద్రునే మహేశుడందురు) 'ఏకామూర్త్రిస్త్రయో దేవా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః' ఈ త్రిమూర్తి లేదా పంచమూర్తి నత్యాక్షరము. (పరాప్రకృతి) మనయాత్మ (జీవాత్మ) యని 'ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం జీవభూతాం మహాబాహో యయేదంధార్యతేజగత్' అను వచనముచే స్పష్టము.

అక్షరాత్మయందు విశ్వ మాహుతి మగుచున్నదంటిమి. ఆహుతిద్రవ్య మాత్మగర్భప్రవిష్టమగుటయే, భోగము - భోగాయతనము శరీరము, దీనినుత్పాదించుట యగ్నిషోములపని

వికాసశీలముగలయగ్ని తేజము, సంకోచశీలముగల సోమము, స్నేహము. ఒకటివేడి, ఒకటిచలువ. ఋతురూపములగు ఈ రెంటి సంబంధము ఋతువు. ఋతుసమష్టిసంవత్సరము. వృష్టి ద్వారా అది భూతజనకమై 'భూతానాంపతి' యనబడును. మూర్త్రద్రవ్యము లన్నియు దీనినుండి పుట్టినవి. మనశరీరమును ఈ కారణమునకు గార్యమే, 'అగ్నిషోమాత్మకంజగత్'.

అమృతాక్షరముయొక్క, మర్త్యము పరిణామియునగు భాగముక్షరము. దీనికిని ఆ బ్రహ్మాదిపంచకళలే కలవు. ఆ పంచ కళక్షరపురుషుడే అపరాప్రకృతి. అక్షరమీక్షరముద్వారానే విశ్వజన్మస్థితిభంగ కారణమైయున్నది. "జన్మాద్యస్యయతః"

1. పంచకళావ్యయపురుషుడు 2. పరాప్రకృతి యనబడు పంచకళాక్షరపురుషుడు 3. అపరాప్రకృతియనబడు పంచకళక్షర పురుషుడు అనునీమూటిమొత్తమే అకార - ఉకార - మకారములు. ఇకప్రణవస్వరూపసిద్ధికి గావలసిన యర్థమాత్ర - లేదా అమాత్ర ఆ యనిర్వచనీయపరాత్పర తత్త్వము.

సర్వబలవిశిష్టరసముపేరే పరాత్పరము. ఇక:— ఏ విశుద్ధరస మందు సత్తా - చేతనా - నందములు మూడు నున్మగ్నరూపమున నున్నవో, ఏది విశుద్ధానందమూర్తియో, దేనిగుణానువాద మీప్రకరణారంభమున గావించియుంటిమో, ఆవిశుద్ధరసమే, విశేషభావప్రవర్తక బలవృథక్త్వముచే 'నిర్విశేషమై' యున్నది.

ఈ నిర్విశేషరసమునందు బలలక్షణానంతమృత్యుభావములు నృత్యము సేయుచున్నవి. మృత్యుగర్భితమగునీ 'రసమే'

జ్ఞానము. అనద్బలములకీ రసమే మౌలికసత్త. ఇటనుండియే బల సంబంధముచే సచ్చిదానంద భావవికాసము. ఈయుద్బుద్ధ సచ్చిదానందలక్షణ, సర్వబలవిశిష్ట రసమూర్తి - సర్వధర్మోపపన్నబ్రహ్మయే పరాత్పరమైయున్నది. ఇట్లు ఒకే అనిర్వచనీయ బ్రహ్మకు నిర్విశేష (రస) పరాత్పర (సర్వబలవిశిష్టరస) భేదముచే రెండురూపములు.

ఈపరాత్పరునకు 1. భూమ 2. అణిమ 3. భూమాణిమ, అను మూడురూపములు; 1. సర్వథా అసీమ, అత్యనపినద్ధ, మహాపరాత్పరము భూమాలక్షణము 2. అట్లే అసీమాత్యనపినద్ధ శూన్యబిందు పరాత్పర ఘణిమా, భూమయు, అణిమయు నగునది అగమ్యాగోచరానిర్వచనీయము విశ్వాతీతము.

ఈపరాత్పరమే భూమాణిమారూపమున, విశ్వమందునుండుచున్నది. ఇందలి భూమాణిమలు పరస్పరసాపేక్షములు. ఒకే పదార్థము తనకంటె చిన్నదానికంటె పెద్దదియు పెద్దదానికంటె జిన్నదియు నగునుగదా! ఒక్కరాతిముక్క పర్వతముంబట్టి చిన్నదియు 1. మృత్కణముంబట్టి పెద్దదియునై 2. స్వయముగా భూమాణిమయునైయున్నది 3. ఈమూడవరూపమందు విశ్వాత్మ-శరీరాత్మలను పోల్చిచూచినచో మనము విశ్వాత్మను 'మహతోమహీయాన్' అనవచ్చును. కారణము? అంతకంటె నిక పెద్దదేమున్నది? ఇక జీవాత్మ "అణోరణీయాన్" అనవచ్చును. కారణము? అంతకంటె నణువును లేదుగదా? ఇకజగత్తునం దే యంశము భూమాణిమకు జెందినదో, అదే పరాత్పరతత్త్వము.

అదే అర్థమాత్ర. దీనితో గూడియే అవ్యయాక్షరక్షరమూర్తి యగు విశ్వాత్మ షోడశీప్రజాపతి యగుచున్నాడు. పరాత్పరావ్యయాక్షరాత్మక్షరములు నాల్గును అమృతాత్మలు. ఇందు పరాత్పర యుక్తావ్యయుడాత్మ, అక్షరముప్రాణము, క్షరము విత్తము. ఈమొత్తము ప్రజాపతి. ఈషోడశీ ప్రజాపతి తన - అవ్యయాక్షరక్షరములను మూడు జ్యోతిస్సులచే నంతటను వ్యాప్తుడగు చున్నాడు. ఏతద్వాచకము ప్రణవము "తస్య వాచకః ప్రణవః"

"తదేవశుక్రం తద్బ్రహ్మ తదే వామృతముచ్యతే" అన్నట్లు దీనికే అమృత - బ్రహ్మ - శుక్రము లని మూడువివర్తములు; ఇంతేకాక అది స్వయముగ, వేరుగ, నిర్విశేషము. అదే నిరుపాధికము. నిర్గుణాత్మ. ఆయమృతాదులు మూడు నీయొక దానికే, వేర్వేరు సోపాధికరూపములు. ఇవి యీశ్వర - జీవాత్మలకును జెందినవి. ఈశ్వరాత్మయొక్క ఆత్మవివర్తములు స్థూలదృష్టికి నాల్గు. సూక్ష్మదృష్టికి పంద్రెండు భాగములు; జీవాత్మయొక్క యాత్మవివర్తములు పదునెనిమిది. అట్టి జీవవిద్యా ప్రతిపాదకము గీత. అందలి 18 అధ్యాయముల రహస్యమిదే. (ఈవిషయమునకు గీతా విజ్ఞానము నరయుడు)

ఈశ్వరాత్మ వ్యూహదర్శనము:— ఈశ్వర - జీవులు వేరువేరాత్మలు గారు, ఇరువురును అమృతవ్యూహములు. ఇందు మొదట నీశ్వరాత్మవ్యూహమును గూర్చి విచారింతము. ఇది యమృతాత్మ స్వరూప మంటిమిగదా! పరాత్పర - అవ్యయ -

అక్షర - ఆత్మక్షరముల నాల్గిటి మొత్త మమృతాత్మ - ఇదే అమృతాత్మ వ్యూహము. ఇదే షోడశప్రజాపతి; ఇదే సహస్ర బల్శాయుక్తాశ్వత్థము - ఈశ్రుతివచనమిట నవధేయము:—

"యస్మాత్పరం నాపరమస్తికించిత్ యస్మాన్నాణీ యోనజ్యాయోఽస్తి కించిత్ । వృక్షఇవస్తబ్ధో దివితిష్ఠత్యేకః తేనేదంపూర్ణం పురుషేణ సర్వమ్."

ఈశ్వర ప్రజాపతిషోడశి. ఈవిషయమున పై శ్రుతి యుదహరింప బడినది. ఇక పాఠకులకు, ప్రమాణవిషయక చిత్తసమాధానమునకై క్రమముగ పరాత్పరావ్యయాక్షరాత్మక్షరములను గూర్చిన శ్రౌతప్రమాణములను గూడ నుద్ధరించెదము.— వీనింబట్టి నిర్విశేషుని భావింపుచు, శాస్త్రములందలి యాత్మ వ్యూహములను ధ్యానింపదగును.

1. పరాత్పరః (నిష్కలః)

1. "యథానద్యః స్యందమానాః సముద్రేఽస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ । తథావిద్వా న్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతిదివ్యం॥

2. నాయమాత్మా ప్రవచనేనలభ్యః నమేధయా నబహునాశ్రుతేన యమేవైషవృణుతే తేనలభ్యః తస్యైషఆత్మా వివృణుతే తనూంస్వాం॥

3. బృహచ్చ తద్దివ్యమచింత్యరూపం సూక్ష్మాచ్చతత్ సూక్ష్మతరంవిభాతి దూరాత్సుదూరే తదిహాంతికేచ పశ్యత్స్విహైవ నిహితంగుహాయాం॥

4. నచక్షుషాగృహ్యతే నాపివాచా, నాన్యైర్దేవైః తపసాకర్మణావా జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః తతస్తుతంపశ్యతే నిష్కలంధ్యాయమానః॥

5. బ్రహ్మైవేదమమృతం పురస్తాద్ బ్రహ్మపశ్చాత్ బ్రహ్మదక్షిణత
శ్చోత్తరేణ । అధశ్చోర్ధ్వంచ ప్రసృతంబ్రహ్మైవేదం విశ్వమిదంవరిష్ఠమ్॥

6. మనోమయః ప్రాణశరీర నేతా, ప్రతిష్ఠితో౽న్నే హృదయం సన్నిధాయ
తద్విజ్ఞానేన పరిపశ్యన్తిధీరా ఆనందరూప మమృతం యద్విభాతి॥

7. యస్యామతం తస్యమతం మతంయస్య నవేదసః
అవిజ్ఞాతంవిజానతాం విజ్ఞాతమవిజానతాం॥

8. తతోయదుత్తరతరం తదరూపమనామయం
యఏతద్విదు రమృతాస్తేభవన్తి అథేతరే దుఃఖమేవాపియన్తి॥

9. తమేవధీరోవిజ్ఞాయ ప్రజ్ఞాంకుర్వీత బ్రాహ్మణః
నానుధ్యాయాద్బహూఞ్ఛబ్దాన్ వాచోవిగ్లాపనంహితత్॥"

1. ఇందు, పరాత్పరుడు పురుషుడనుటకు గారణము ప్రాజాపత్యసంస్థ. ప్రజాపతిషోడశి. అందొకకళ పరాత్పరుడు. ఈయన మాయాపురమునకు వేరుగనుండి పురుషమర్యాదకు బహిర్భూతుడయ్యెను, పురుషసంస్థం బ్రవేశించుటచే బురుషుడనుట యనుచితముకాదు. షోడశికి దివ్య — లౌకిక భేదములు రెండు. దివ్యషోడశి యీశ్వరుడు. లౌకికషోడశి జీవుడు. ప్రకృతశ్రుతి దివ్యషోడశీపరాత్పర నిరూపకమగుటచే 'పరాత్పరం పురుష ముపైతిదివ్యమ్' అనిచెప్పబడినది.

అనంతపరాత్పరు డనంతసముద్రతుల్యుడంటిమి. శ్రుతి యతనిని బురుషుడనియు, బ్రాజాపత్య సంస్థాయుక్తుడనియు జెప్పి, సముద్ర దృష్టాంతమస్లేయుంచి, తదనంత తానవచ్ఛిన్నతలను సూచించుచున్నది. నామరూపకర్మ లవ్యయుని మనఃప్రాణ

వాక్కులకు జెందినవి. వానినుండి ముక్తుడగువాడే పరాత్పరు నందగలడని చెప్పుచు, పరాత్పరునకు - నవ్యయునకును పార్థక్యముం జెప్పుచున్నది. నామరూపమర్యాద యవ్యయునితో సరి. పరాత్పరుడు నామరూపమర్యాదలకు వెలియైనవాడు.

6. మనోమయుడు, ప్రాణాత్మక క్షరశరీర సంచాలకుడు నగు నక్షరుడు అన్నమందు ప్రతిష్ఠితుడై హృదయమం దున్నాడు. అతని నెరుంగుటచే బుద్ధియోగి, ఆ యానందామృత రూపమున ప్రకాశించు నాతనింజూడగలడు. హృదయమక్షర రూపమంటిమి. క్షరమన్నము, దీనిపైనది ప్రతిష్ఠితము. అక్షర పరిజ్ఞానమువలననే అవిద్యాగ్రంథివిమోకము. అందుచే సీమోచ్ఛిత్తికాగా నిస్సీమపరాత్పర దర్శనము లభించును.

8. ఉత్తర - ఉత్తమ శబ్దములు ప్రాయశః సమానార్థకములు. త్రిపురుషులం దవ్యయుడుత్తముడు కనుక ఉత్తరుడు. పరాత్పరుడీ యుత్తరుకంటె నుత్తరుడు. (పర=అవ్యయుని కంటెను, పరుడు=పరాత్పరుడు) కనుకనే శ్రుతి, యుత్తరతరు డన్నది. ఇచట ప్రాజాపత్యసంస్థాసంబంధమేమియులేని నిర్విశేషలక్షణ పరాత్పరుడొకడింకను గలడని జ్ఞప్తియుంచుకొనవలయును. అతడీ యుత్తరతరుకంటె నుత్తరుడుకనుక నుత్తమతముడు. ఈరహస్యసూచనకే శ్రుతి, యీసంస్థకు జెందిన పరాత్పరుని ఉత్తరతమ శబ్దమునగాక, ఉత్తరతర శబ్దముననే జెప్పినది. పరిచ్ఛిన్నతయే ఆమయము (క్లేశము). పరాత్పరు డపరిచ్ఛిన్నుడు, భూమారూపి. కనుక అనామయమన్నది.

## 2. అవ్యయః:-

1. సదృశంత్రిషులింగేషు, సర్వాసుచవిభక్తిషు,
వచనేషుచసర్వేషు యన్నవ్యేతి తదవ్యయమ్ (గోప)

2. గతాఃకలాః పంచదశప్రతిష్ఠా దేవాశ్చసర్వే ప్రతిదేవతాసు
కర్మాణి విజ్ఞానమయశ్చఆత్మా పరేఽవ్యయే సర్వఏకీభవన్తి॥

3. పురుషఏవేదంవిశ్వం, కర్మ, తపో, బ్రహ్మ, పరామృతమ్
ఏతద్యోవేద నిహితంగుహాయాం సోఽవిద్యాగ్రంథిం వికిరతీహసోమ్య॥

4. దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యంతరోహ్యజః
అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్ పరతఃపరః ॥ (ముండక)

5. అనంతశ్చాత్మా విశ్వరూపోహ్యకర్తా.

6. క్షరంప్రధాన మమృతాక్షరం హరః క్షరాత్మనామీశతే దేవఏకః
తస్యాభిధ్యానాత్ యోజనాత్ తత్త్వభావాత్ భూయశ్చాంతే విశ్వ
మాయానివృత్తిః॥

7. సర్వవ్యాపినమాత్మానం క్షీరేసర్పిరివార్పితమ్
ఆత్మవిద్యాతపోమూలం తద్బ్రహ్మోపనిషత్పరమ్॥

8. సర్వేంద్రియగుణాభాసం–సర్వేంద్రియ వివర్జితమ్
సర్వస్యప్రభుమీశానం సర్వస్యశరణంసుహృత్ ॥

9. నతస్యకార్యం కరణంచవిద్యతే నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే
పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ॥

10. యస్తూర్ణనాభ ఇవతంతుభిః ప్రధానజైః, స్వభావతో దేవఏకః
స్వమావృణోతి । సనోదధాతు బ్రహ్మావ్యయమ్॥

11. నైవస్త్రీ నపుమా నేష నచైవాయంనపుంసకః
యద్య చ్ఛరీరమాదత్తే తేనతేన సయుజ్యతే.

12. ఏతద్జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం నాతఃపరం వేదితవ్యంహి కించిత్ భోక్తా-భోగ్యం-ప్రేరితారంచ మత్వాసర్వంప్రోక్తం త్రివిధం బ్రహ్మ మైతత్ ॥

13. తమీశ్వరాణాం పరమంమహేశ్వరం తందేవతానాం పరమంచదైవతమ్ పతింపతీనామ్ పరమంపరస్తాత్ విదామదేవం భువనేశమీడ్యమ్॥

14. తతఃపరం బ్రహ్మపరంబృహన్తం, యథానికాయం సర్వభూతేషుగూఢం విశ్వస్యైకం పరివేష్టితారమీశం తంజ్ఞాత్వాఽమృతాభవన్తి. (శ్వేతా)

3. పరామృతము అవ్యయుడు, జ్ఞానమయ మనోభాగ ముచే బ్రహ్మ, ప్రాణమయ క్రియాభాగముచే తపస్సు, వాఙ్మ యార్థ భాగముచే కర్మ.

4. "సామాన్యే సామాన్యాభావః" అనున్యాయమున నప్రాణః అమనః విశుద్ధజ్యోతిర్మయు డగుటచే శుభ్రః. ఇందు "అక్షరాత్పరతః పరః" అనుటవలన నవ్యయా - క్షరపార్థక్యము స్పష్టపడుచున్నది.

6. క్షరాక్షరముల కీశుడవ్యయుడనుట వలన అవ్యయాక్షర క్షరభేదము గోచరించును. క్షరము (ప్రధానము), ప్రకృతి, ఉపా దానము. అక్షరమమృతము.

8. ఇట గీతయు, "ప్రభుఃసాక్షీ నివాసః శరణం సుహృ" త్తనుట గమనింపవలయును. ఇంద్రియములకు సత్వాదిగుణము లకు మూలప్రవర్తకుడగు నవ్యయుడు, నియతేంద్రియ లక్షణ సర్వేంద్రియవర్జితుడు.

9. విశ్వకార్యోపాదాన కారణము క్షరము. నిమిత్తకారణ మక్షరము. అవ్యయుడు కార్యకారణాతీతుడు. అతని స్వాభావిక శక్తి-పరా-అపరా, ప్రకృతి రూపాక్షరక్షరములు జ్ఞానబలక్రియా రూప పరిణతి నొందుచు విశ్వోపాదాన నిమిత్తములగుచున్నవి.

10. అక్షరయుక్తక్షరము (ప్రధానము - ప్రకృతి) చే వెలయు విశ్వసూత్రములచే సాలెపురుగు తన హృదయ మను ప్రధానముచే వెలయు సూత్రములందు వలె నావృతుడగు నవ్యయబ్రహ్మ మమ్ము తనయవ్యయరూపమందు బ్రతిష్ఠించుగాక!

12. భోక్త అక్షరము, భోగ్యముక్షరము, ప్రేరయిత అవ్యయుడు, బ్రహ్మకీ మూడు రూపములు.

13. అభూ, ప్రతిమా, జీవాదులునగు నీశులకీశుడీ మహా మాయావచ్ఛిన్నావ్యయుడు పరమమహేశ్వరుడు. బ్రహ్మ విష్ణుమహేశాది దేవతలకు పరమదేవత ............

3. అక్షరః:—

1. యథాసుదీప్తాత్ పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తేసరూపాః తథాఽఽక్షరాద్వివిధాః సోమ్య! భావాః ప్రజాయంతే తత్రచైవాపి యంతి॥

2. ఏషోహదేవః ప్రదిశోఽనుసర్వాఃపూర్వోహజాతః సఉగర్భేఅంతః సఏవజాతః సజనిష్యమాణః ప్రత్యఙ్ జనాం స్తిష్ఠతి సర్వతోముఖః॥

3. యోదేవోఅగ్నౌ యోఅప్సు యోవిశ్వంభువనమావివేశ యఓషధీషు వనస్పతిషు తస్మైదేవాయ నమోనమః॥

4. యఏకో జాలవానీశత ఈశనీభిః సర్వాన్ లోకానీశత ఈశనీభిః యఏవైక ఉద్భవేసంభవేచ యఏతద్విదురమృతాస్తే భవన్తి॥

5. అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదాజనానాం హృదయే సన్ని
విష్టః । హృదామనీషా మనసాభిక్లప్తః యఏతద్విదు రమృతాస్తే భవన్తి॥

6. యోయోనిమధితిష్ఠత్యేకో యస్మిన్నిదంసంచవిచైతిసర్వమ్,
తమీశానం వరదందేవమీడ్యం. నిచాయ్యేతాం శాంతిమత్యంతమేతి॥

7. యదాతమస్తన్నదివా నరాత్రి ర్నస న్నచాస చ్ఛివఏవకేవలః
తదక్షరం తత్సవితుర్వరేణ్యం ప్రజ్ఞాచ తస్మాత్ ప్రసృతాపురాణీ॥

8. యచ్చస్వభావం పచతివిశ్వయోనిః పచ్యాంశ్చసర్వాన్ పరిణామ
యేద్యః, సర్వమేతద్విశ్వమధితిష్ఠత్యేకో గుణాంశ్చసర్వాన్ వినియో
జయేద్యః॥

9. ఆదిః స సంయోగనిమిత్తహేతుః పరస్త్రికాలా దకాలోఽపి దృష్టః
తంవిశ్వరూపం భవభూత మీడ్యం దేవంస్వచిత్తస్థ ముపాస్యపూర్వమ్॥

10. సవిశ్వకృ ద్విశ్వవిదాత్మయోనిః జ్ఞః కాలకాలో గుణీసర్వవిద్యః
ప్రధాన క్షేత్రజ్ఞపతి ర్గుణేశః సంసార మోక్ష స్థితిబంధహేతుః (శ్వేతా)

11. ధనుఃగృహీత్వౌపనిషదంమహాస్త్రం, శరంహ్యుపాసానిశితంసంధయీత
ఆయమ్యతద్భావగతేనచేతసా, లక్ష్యంతదేవాక్షరం సోమ్యవిద్ధి॥

12. యస్మిన్ ద్యౌఃపృథివీచాంతరిక్ష మోతంమనః సహప్రాణైశ్చ సర్వైః
తమేవైకం జానథ ఆత్మానమ న్యావాచో విముంచథ అమృతస్యైష సేతుః॥

13. యఃసర్వజ్ఞః సర్వవిద్ యస్యజ్ఞానమయంతపః
తస్మాదేత ద్బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే॥

14. ఏతద్ధ్యేవాక్షరంబ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరంపరం
ఏతద్ధ్యేవాక్షరంజ్ఞాత్వా యోయదిచ్ఛతితస్యతత్॥

15. భిద్యతేహృదయగ్రంధిః ఛిద్యంతేసర్వసంశయాః
క్షీయన్తేచాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే॥

16. సవేదైతత్ పరమంబ్రహ్మధామ, యత్రవిశ్వం నిహితంభాతిశుభ్రం,
ఉపాసతేపురుషం యేహ్యకామాః తేశుక్రమేతదతివర్తన్తి ధీరాః॥

17. తద్వేదగుహ్యోపనిషత్సుగూఢం తదబ్రహ్మావేద(య) తేబ్రహ్మయోనిం
యోపూర్వ్యందేవా ఋషయ శ్చతద్విదుః తేతన్మయా అమృతా వై
బభూవుః॥

2. సర్వాదిగ్వ్యాప్త్యుడు, మొదట బయల్పడువాడు, గర్భమునుండి జీవస్వరూప మెత్తినవాడు, ఎత్తువాడును, ప్రత్యగ్భావమున హృదయమందుండి రశ్మిరూపమున, సర్వతోముఖ వ్యాప్తిగలవాడు, అక్షరుడు, జీవసృష్టికధిష్ఠాత (పరాప్రకృతి) "జీవభూతాం మహాబాహో" (గీత)

3. హృ-ద-య-రూపమున త్ర్యక్షరమూర్తియగు నక్షర ప్రజాపతి ప్రతివస్తుహృదయమునుండి యంతర్యామియనబడుచు స్తుతింపబడును.

4. క్షరజాలముచే జాలవంతుడై తన శాసనమాత్ర ప్రణాళి యను నియతిచే క్షరజాలమునకు, తదుత్పన్న విశ్వమునకు శాసకు డగుచున్నాడు. ఇతడే ఉద్భవ (మైథునీ సృష్టికి) కారణము (క్షరధియా) ఇతడే ఋషి మన్వాది సంభవమునకు (భావసృష్టికి) కారణము (అవ్యయధియా). ఇతనికటువైపు నవ్యయుడు నిటువైపునక్షరుడు నున్నారు. క్షరముద్వారా భూతోత్పత్తికి, అవ్యయుద్వారా భావోత్పత్తికి నితడే కారణము. అవ్యయుడు భావసృష్టికి క్షరుడువికార (మైథునీ) సృష్టికి నధిష్ఠాతలు. గుణసృష్టికధిష్ఠాతయక్షరుడు: స్వయముగ నవ్యయు

ద్వారా సంభూతి (భావసృష్టికి) క్షరముద్వారా ఉద్భవమునకు (మైధునీసృష్టికి) కారణమని తాత్పర్యము.

6. అక్షరతత్త్వము విశ్వయోనిరూప యోనిభావముపై బ్రతిష్ఠితముగ నుండు నేకాకి. ప్రపంచమంతేయు దానియం దిమిడి యున్నది. దాని ద్వారా ఉత్పన్నమగుచున్నది. — సర్వేశము వరప్రదము ప్రణమ్యము నగు నాదేవత్త్వమును వేరుగ నెఱింగిన బుద్ధియోగి శాంతినొందును. — పరిణామియగు క్షరము విశ్వకార్యోపాదాన కారణమగుటచే విశ్వయోని లేదా భూతయోని యగుత్స్య వికారమువలన నది నానాభావాపన్నము, ఈక్షరకూటము పైకూటస్థుడక్షరుడున్నాడు. ఈతని యవ్యక్తా వస్థ ప్రళయము; వ్యక్తావస్థసృష్టి. క్షరబుద్ధితో నీయనం జూచుచో అనగా:- క్షరవిశిష్టాక్షరముపై దృష్టి యున్నంతవరకు నీయక్షరుడు విశ్వప్రవృత్తికి విశ్వబంధనమునకు గారణమగును. ఇతర:— బుద్ధియోగముచే క్షరుని వేరుచేసి యాయక్షరునే గాంచుచో నతడు: హృద్గ్రంధి విమోక కారణమై శాంతినిధి — యవ్యయుం జేర్చును.

7. ఈప్రపంచము తమోగర్భమునమండియున్న ఆ అప్రతర్క్యఅనిర్దేశ్య, అలక్షణ,అప్రజ్ఞాత; ప్రసుప్తవద్యుగమున రాత్రిం బవళ్లు సదసత్తులు లేక కేవలము అవ్యయుని శాంతిచే శివమూర్తిగ నక్షరుడు మాత్రముండెను - గాయత్ర్యుపాసకుల కీయక్షరసవితా దేవత సంగ్రహణీయ తత్త్వము. దీని నుండియే ఆపురాతన ప్రజ్ఞ (జ్యోతిర్మయమగు నంతర్మనస్సు) వెలసినది,

ఆ మనస్సు శివభావమూల భావభూమిక. ఆ ప్రజ్ఞానేత్రసంబంధమున నే అక్షరమూర్తి శివుడు- త్రినేత్రుడు.

8. విశ్వయోనియగు నక్షరుడు తనస్వభావ (క్షర) పరిపాకము గావించును. పాకయోగ్యభౌతిక పదార్థములను పరిణమింప జేయును. విశ్వమున కతడే యధ్యక్షుడు. తన త్రిగుణభావములను సృష్టియం దుపయోగపరచును.

విశ్వయోని యన క్షరుని పేరు. అయిన నతడక్షరుడు; లేనిచో నుపపన్నుడు కాడు. కనుక నక్షరుడు విశ్వయోనియని చెప్పబడినది. అతడు సర్వయోని యనవచ్చును. విశ్వశబ్దము ప్రపంచ వాచకము, సర్వద్యోతకము నగును. "విశ్వాని దేవ సవితుర్దురితాని పరాసువ" "యఇమావిశ్వాభువనాని" అనుచో విశ్వశబ్దము సర్వతాద్యోతకమె కనుక నిటను, విశ్వయోని యనుటకు సర్వయోని యనవచ్చును. క్షరముక్షరమర్త్య రూపమే. కనుక నది యతని స్వ - భావమనదగును. సృష్టికాముకాక్షరుడు సృష్ట్యుత్పాదనార్థము స్వ - భావభూతక్షర పరిపాకముం జేయును. తపస్సుచే, క్షరమును భృగ్వంగిరోయుక్తము గావించుటయే పరిపాకము. పాచ్య, వైకారిక, క్షర రూప, భౌతికపదార్థములు స్వస్వరూపముచే సర్వథాజడములు. వీని నాయాపరిణామము లొందజేయుట, కేవలమంతర్యామియగు నక్షరుని పని. "యయేదంధార్యతే జగత్" అన్నట్లు పరాప్రకృతి లక్షణాక్షరుడే విశ్వాధిష్ఠాత. వ్యక్తక్షరప్రకృతి

యొక్క మూడుగుణములను సృష్టికొరకు వినియోగించుటయు, నీనియంతయగు నక్షరుని పనియె.

9. భౌతికక్షర పరమాణు సంయోగ నిమిత్తకారణ మగు నక్షరాత్మయే విశ్వమున కాది. అది అవ్యక్త - వ్యక్త - అవ్యక్తము లను త్రికాలములకు నతీతమగుట నకాలము. లేదా అకలము. విశ్వరూప (సర్వరూప) భూత భావనము, ప్రణమ్యము నగు నా దైవతత్త్వము స్వస్థచిత్తప్రతిష్ఠితము. ఉపాస్యము. భౌతికవిషయాసక్తిచే చిత్తప్రజ్ఞ యస్థిరమైనచో నక్షర స్వరూపము చెడును. అట్టి యక్షరుడు క్షరానుగామియగుటచే ననుపాస్యుడు స్థిరప్రజ్ఞా స్థితశాంతాక్షరుడే యుపాస్యుడు.

10. అగుడు:— విశ్వనిర్మాత, విశ్వప్రపంచజ్ఞాత, జీవాత్మకు యోని, జ్ఞానమూర్తి, కాలమునకు కాలము, సర్వజ్ఞుడు, ప్రధాన (క్షర) నామక క్షేత్రజ్ఞపతి, గుణ (గుణమయీ వ్యక్తక్షర) ప్రకృతికీశుడు. విశ్వ మోక్ష (భంగ) స్థితిబంధకారణము, క్షర ముపాదానము, అక్షరము నిమిత్తము. నిమిత్తమే కర్త, నిర్మాత యందురు. అవ్యయుని జ్ఞానముగాని తాను నిర్మించు విశ్వమునకు అక్షరుడు జ్ఞాత (భోక్త). అవ్యయక్షర గర్భితాక్షరునుండియే జీవస్వరూపనిష్పత్తి. మృత్యురూపమగు క్షరము కాలము. విశ్వ ముపాదానకారణమందే లయించును. కాని కాలరూపక్షర లయ మక్షరగర్భమందే. కనుక నక్షరుడు కాల కాలుడు. విశ్వక్షేత్రమునకు క్షేత్రజ్ఞుడు. పతి. క్షరము. అక్షరుడు దీనికి బతి. ఈ యక్షరునివలననే క్షరునిద్వారా విశ్వ

ముక్తిస్థితిబంధనము లగును.

11. అవ్యయునికి జ్ఞానయోగముతో, క్షరునకు కర్మయోగముతో సంబంధము. ఉపాసన యన్నది కేవలము మధ్యనున్న యక్షరునకు జెందినది. కారణము? ఉపాసనయందు జ్ఞానకర్మలు రెండుభాగములు గలవు. అందువలననే అది భక్తియోగ మన బడును. మధ్యనున్న యక్షరుడు జ్ఞానకర్మయుక్తుడు.

12. జగద్ధారుడగు నక్షరుడే జగదాధారుడు. సామాన్య లింగము మనస్సుల నాత్మ యనుకొందురు. ఇవి యన్నియు నెందున్నవో అది యాత్మ యగును. ఇదియంతయు క్షరప్రపంచము. అనేకము. కూటస్థుడగు నక్షరుడన్నవో ఏకము. అమృత (అవ్యయ) ప్రాప్తి సాధన మేకాక్షరజ్ఞానము, ఏకాక్షరోపాసనయే.

13. అక్షరుడు అవ్యయజ్ఞానముచే సర్వజ్ఞుడు. క్షరార్థముచే సర్వవేత్త. తన ప్రాణముచే సర్వశక్తి. మన తపము (కర్మ) జ్ఞానప్రధానము గామిచే నభ్యుదయమునకుబదులు పతనమునకు గారణమగును. ఈశ్వరాక్షరతపస్సు జ్ఞానమయ మగుటచే విశ్వ విభూతికి గారణము. అసంగతచే విశ్వబంధనమునకు వెలియు నగును. ఇదే ఈశ్వరప్రజాపతియొక్క అబంధనబుద్ధియోగము. 'బ్రహ్మాక్షర సముద్భవమ్' అన్నట్లు క్షరమే బ్రహ్మ. ఏతద్వికాస మాయాక్షరునివలననే. నామరూపము సత్యజ్యోతి. ఏతత్ప్రభవమక్షరుడే. బ్రహ్మాక్షరము అన్నాత్మక వైష్ణవయజ్ఞ ప్రవర్తకముగదా!

14. అవ్యయచితిపంచకము, చేతనరూపాక్షరునిచే సంపన్నము. అందువలననే (అక్షర లేదా హృదయమువలన నగు చితివలననే) అతడు (అవ్యయుడు). చిదాత్మ యనబడుగదా! ఈ దృష్టితో నక్షరు నవ్యయు డనవచ్చును. అక్షరునుండియే క్షరవికాసమును గనుక నతనిని బ్రహ్మయు ననవచ్చును. అక్షర ప్రకరణమున ననుపస్పృష్ట బ్రహ్మశబ్ద మక్షరవాచకమే. పరశబ్ద మవ్యయవాచకముగదా! 'అక్షరాత్పరతఃపరః' అనియు శ్రుతి. మధ్యస్థుడగుటచే నక్షరు పూర్వోత్తరుల యిరువురి ధర్మములు గలవాడగును. కనుక నతని నెటులన్నను అనవచ్చును. జ్ఞాన-క్రియార్థములు మూడే యిచ్ఛావిషయములు. అక్షరోపాసన వలన నీ మూడును లభించును.

15. అవ్యయుడు పరుడు. క్షరు డవరుడు. మధ్యవాడగు నక్షరుడు పరావరుడు. స్థూలశరీరగ్రంధి మనస్సునకు జెందినది. దీని విమోకముచే మృత్యువగును. సూక్ష్మశరీరగ్రంధి బుద్ధికి జెందినది. దీని విమోకముచే సాయుజ్యభావలక్షణముగల అపరాముక్తి లభించును. కారణశరీరగ్రంధి యక్షరునకు జెందినది. ఇదే హృద్గ్రంధి. దీని విమోకముచే సమవలయ లక్షణా పరాముక్తి యబ్బును.

"జ్ఞాత్వాదేవం (అక్షరం) సర్వపాపప్రహాణిః క్షీణైః క్లేశైః జన్మమృత్యు ప్రహాణిః తస్యాభిధ్యానః తృతీయందేహభేదే విశ్వైశ్వర్యం, కేవల అప్తకామః" [శ్వే]

క్షరవిశ్వము ద్వైతభావాపన్నము. ద్వైతము (విషయ ద్వైవిధ్యము) సంశయకారణము. క్షరవిశ్వానుగమన మున్నంత వరకు సంశయము తప్పదు. అద్వైతమగు నక్షరము జేరగనే స్వాద్వాదదర్శనమూలక సంశయావసర ముండదు. క్షరవిశ్వమే ఆసక్తికి మూలము. అది కర్మలేపకారణము. అసక్తాక్షర పరిజ్ఞానముచే నది తొలంగును.

16. అవ్యయుడుపరుడు. క్షరుడవముడు. మధ్యస్థాక్షరుడు పరమబ్రహ్మ. 'అక్షరం బ్రహ్మ పరమం' నిష్కామోపాసకు లీ పరమబ్రహ్మధామము నందగలరు. శుక్రము క్షరవిభూతి. విశ్వబీజమగు క్షరమే శుక్రముగదా! అక్షరోపాసన దీనిం దాటించును.

4. ఆత్మాక్షరః—

1. యుజేవాం బ్రహ్మపూర్వ్యం, నమోభిర్విశ్లోకాయన్తి పథ్యేవసూరాః।
[శేః] శృణ్వంతి [తు] విశ్వే అమృత్యపుత్ర [త్రాః] ఆయేధామాని దివ్యానితస్థుః॥

2. అగ్నిర్యత్రాభిమథ్యతే వాయుర్యత్రాధిరుధ్యతే
సోమోయత్రాతిరిచ్యతే తత్రసంజాయతేమనః॥

3. సవిత్రాప్రసవేనజుషతే బ్రహ్మపూర్వ్యమ్,
యత్రయోనింకృణవసే నహితేపూర్వమక్షిపత్॥

4. నవద్వారేపురేదేహీ, హంసోవేలాయతేబహిః
వశీసర్వస్యలోకస్య స్థావరస్యచరస్యచ॥

5. యఏకోవర్ణో బహుధాశక్తియోగాత్ వర్ణానసేకాన్నిహితార్థోదధాతి,
విచైతిచాన్తే విశ్వమాదౌసదేవః సనోబుద్ధ్యా శుభయాసంయునక్తు॥

6. తదేవాగ్ని స్తదాదిత్యః తద్వాయుః తదుచంద్రమాః
తదేవశుక్రం తద్బ్రహ్మ తదాపస్తత్ ప్రజాపతిః॥
7. త్వం స్త్రీ త్వంపుమానసి త్వంకుమార ఉతవాకుమారీ
త్వంజీర్ణోదండేనవంచసి త్వంజాతోభవసి విశ్వతోముఖః॥
8. నీలఃపతంగో హరితోలోహితాక్షః తదిద్గర్భబుుతవః సముద్రాః
అనాదిమత్త్వం విభుత్వేనవర్తసే యతోజాతాని భువనానివిశ్వా॥
9. యోదేవానామధిపో యస్మిన్లోకాఽధిశ్రితాః
యఈశేఅస్యద్విపదః చతుష్పదః తస్మైదేవాయ హవిషావిధేమ॥
10. తత్కర్మకృత్వా వినివర్త్య భూయః, తత్త్వస్యతత్త్వేన సమేత్య-
యోగమ్। ఏకనద్వాభ్యాం త్రిభిరష్టభిర్వా కాలేనచైవాత్మ గుణైశ్చ-
సూక్ష్మైః॥
11. ఆరభ్యకర్మాణి గుణాన్వితాని భావాంశ్చసర్వాన్ వినియోజయేద్యః।
తేషామభావే కృతకర్మనాశః కర్మక్షయే యాతి సతత్త్వతోఽన్యః॥
12. సవృక్షకాలాకృతిభిః పరోఽన్యోయస్మాత్ప్రపంచః పరివర్తతేఽయమ్।
ధర్మావహం పాపనుదంభగేశం జ్ఞాత్వాత్మస్థ మమృతంవిశ్వధామ॥
13. ఏకోవశీ నిష్క్రియాణాంబహూనాం, ఏకంబీజంబహుధాయఃకరోతి,
తమాత్మస్థం యేఽనుపశ్యంతిధీరాః తేషాంసుఖం శాశ్వతంనేతరేషాం॥

[శ్వేతా]

ఇందు ప్రథమ మంత్ర విషయమున విశేషమున్నది. ఈ మంత్రము ఋగ్యజు స్సంహిత లందును గలదు. సనాతన ధర్మమునకు జెందిన ముఖ్యులు పలువురు దీనిపై గావించిన వాఖ్య లిం దుదహరింతుము.

శ్రీశంకర భగవత్పాదా చార్యుల వారు:— కరణరూప జీవాత్మ - అనుగ్రాహకరూప పరమాత్మ యను నీరెంటితో

సంబంధముగల చిరంతన బ్రహ్మ దానికి మీకు సమాధానము గావించెను. అనగా — జీవేశ్వర భేదముమిథ్య. ఒకే బ్రహ్మకు రెండు వివర్తములు. చిత్తప్రణిధానాదిరూప నమస్కారముల చేతనే దానికి సమాధానము గావించెను. ఇట్లు సమాధానము గావించు నాకీర్తితవ్యభావమువంకకు తెలివిగలవాడు సన్మార్గ మునకు వలె మనుజుడు చనవలయును. లేదా — ప్రార్థనారూప మగు నీవాక్యమును దివ్యలోకమందున్న హిరణ్యగర్భనామక బ్రహ్మపుత్రులు విందురుగాక!

శ్రీశంకరానందులు:— జీవాత్మ పరమాత్మలగు మీరిరు వురును మొదటనే యుండి యున్నదియు త్రివిధ పరిచ్ఛేద రహితము చిదానందైకరసరూపము నగు బ్రహ్మకొరకు వివిధ కీర్తి యుక్తులై ఆవంకకే విద్వాంసులు సన్మార్గమున కరుగునట్లు చనుచున్నారు.

శ్రీనారాయణస్వామి:— ఓ మనోబుద్ధులార! మీతో సంబంధించిన బ్రహ్మనామక యోగమార్గము వంకకు మీ మనోయోగము కల్గించెదను.

శ్రీవిజ్ఞాన భగవత్స్వామి:— అనాదిబ్రహ్మతో నా ప్రత్యగాత్మ నేకీభవింపజేయుచున్నాను. దీనికి మనః ప్రణిధానము సాధనము. ఓమనోబుద్ధులార! మిమ్ములను నిరువురను ప్రత్యగాత్మతో గూర్చుచున్నాను.

శ్రీసాయణాచార్యులు :— ఓ హావిర్ధాన శకటములార! (ఆహుతికొరకగు సోమవల్లిందెచ్చు బండ్లు) నేను (యజ్ఞకర్త —

అధ్వర్యుడు - లేక యజమాని) అనాదికాల ప్రవృత్త బ్రహ్మ (మంత్రము) నుచ్చరించి సోమాది లక్షణాన్నముతో మీకు యోగము కల్గించుచున్నాను. అనగా:— మీపై సోమాదివల్లి, నుంచి పత్నీశాలా సమీపస్థ హావిర్ధాన మండపము వంకకు గొంపోవుచున్నాను. దివ్యలోకస్థులగు అమృత బ్రహ్మపుత్రులు దేవతలు మీధ్వని విందురుగాక!

శ్రీ ఉవ్వటాచార్యులు :— ఓ దంపతులార! యజమానుడు, పత్నియు, అన్నయుక్త సప్తర్షిబ్రహ్మను మీకొరకు గూర్చుచున్నాను.

శ్రీ మహీంధరులు :— ఓ పత్నీయజమానులార! పూర్వ ఋషులచే ననుష్ఠితమయిన అగ్నిచయనమను బ్రహ్మ(కర్మ)ను మీకై సంపాదింతును. లేదా, బ్రహ్మశబ్దము సప్తర్షిబ్రాహ్మణ వాచకము, నేనుమీకై యా పురాతన బ్రాహ్మణజాతి నన్న యుక్తముగ జేయుచున్నాను: "అన్నముచే బ్రాహ్మణులను తృప్తినొందించుచున్నాను" అని తాత్పర్యము.

ఇందు శంకర శంకరానందులదృష్టిలో బ్రహ్మశబ్దము నిర్విశేషవాచకము, పూర్వ్యాశబ్దము చిరంతన భావవాచకము, బ్రహ్మకువిశేషణము. 'వాం' అన్నది జీవాత్మ - పరమాత్మల సూచకము. మంత్రోద్దేశ్యము అభేదవాద ప్రతిపాదనము. నారాయణస్వామి, బ్రహ్మయన్నది యోగపరకముగ నెంచెను. 'వాం' అనగా మనోబుద్ధులకు గ్రహణము, "బ్రహ్మప్రాప్తికై యోగమార్గమున, మనోయోగముగావలయు" నని తాత్ప

ర్యము. ఎట్లైన నిదియు, అద్వైతము ననుగమించును, విజ్ఞాన భగవత్స్వామియు ద్రావిడప్రాణాయముగ తన యద్వైత భక్తినే పోషించుకొనెను—సాయణమతమున:-'వాం' హవిర్ధాన వాచకము 'పూర్వ్యం' బ్రహ్మకు విశేషణము: 'బ్రహ్మ' మంత్ర వాచకము: ఇట్లిది శకటమందు సోమవల్లీయోగముం జెప్పు చున్నది. ఉవ్వటమతమున :—'వాం' యజమాన దంపతీవాచ కము—బ్రహ్మయన:—సప్తర్షులు. బ్రాహ్మణజాతికి శుభచింతకు డగు మహీధరునిమతమున:— బ్రహ్మయన నగ్నిచయనమను యజ్ఞకర్మ. లేదా, బ్రాహ్మణజాతి మంత్రోద్దేశ్యము బ్రాహ్మణ భోజనము. సనాతనధర్మములకు వ్యతిరేకముగజెప్పిన, వారి యాచార్యభక్తి నూతగాగాని అంతయు సప్రామాణికముగ నెంతురనుటకు సందియములేదు. అయినను, పై మతములన్నియు వారికి మాన్యములేకనుక పరస్పర విరుద్ధములుగదోచు నిందేది సనాతనధర్మానుకూలము? అనియడిగి దేనికిని బాధలేనివిధమున వీనిని సమన్వయింతురా ? యందుము.

సరియే: ఇక వేదవచనములయాధారమున నీమంత్రార్థ మును స్వతంత్రదృష్టి నన్వేషింతము. ఈమంత్రము క్షరబ్రహ్మ ప్రతిపాదకముకాగలదు. 'బ్రహ్మాక్షరసముద్భవమ్, 'తస్మాదేత ద్బ్రహ్మనామ' ఇత్యాదులచే నిచటి యనుపసృష్ట బ్రహ్మ శబ్దము క్షరబ్రహ్మవాచకమే కాగలదు. ఈ దృష్టితో నీ మంత్రార్థము:—

"ఓ మనోబుద్ధులార ! మీ యిరువురను పూర్వ్యబ్రహ్మ

(క్షరబ్రహ్మ)తో గూర్చుచున్నాము. లేదా మీతో బ్రహ్మను గూర్చుచున్నాము. ఆబ్రహ్మ నొకసన్మార్గమట్లు విద్వాంసులు నమోవచనములచే గుణకీర్తన సేయుచున్నారు. దివ్యలోకస్థులు అమృతబ్రహ్మపుత్రులు (జీవాత్మలు) దానికీర్తిని వినుచున్నారు.''

కార్యరూపవిశ్వపూర్వావస్థపూర్వ్యము. అదివిశ్వోత్పాదనమే కాగలదు. అది క్షరబ్రహ్మయే కనుక పూర్వ్యం బ్రహ్మయన క్షరబ్రహ్మయందుము. ఈ మంత్రమునకు బూర్వమంత్రమున "యుంజతే మన ఉతయుంజతేధియః'' ఇత్యాదిగా మనోబుద్ధుల యోగభావముల్లేఖింపబడినది. దానినే యీమంత్రము 'యుజేవాం' అని పఠించెను. ఈ స్థితిలో సమానప్రకరణప్రాప్తమగు 'వాం' పదముచే మనోబుద్ధులను గ్రహించెదము. దర్శనమున వైశేషికముచేసిన యుపదేశమునే యీమంత్రముచేసెను.

సాధారణముగ మనమనోబుద్ధులు కార్యరూపవైకారిక విశ్వవిషయ బ్రహ్మాసక్తములుగ నుండును. వాని నాయుత్తర బ్రహ్మాసక్తినుండి తప్పించి కారణరూప పూర్వ్యబ్రహ్మ (ఆత్మ క్షరబ్రహ్మ)తో గూర్పనై మంత్రము "విద్వాంసులనుగమించు సన్మార్గమిదియే. ఇది రసప్రధానమగుటచే సద్రూపము స్థూలము నుండి సూక్ష్మమునకే యరిగెదరు. విశ్వవిషయములు బలప్రధానములు; అసద్రూపములు. వీనివెంటబడుట యసన్మార్గమునబడుటయే. 'అసతోమాసద్గమయ' భూతయాజివి కాకుము; ఆత్మయాజివికమ్ము; అర్థయోగివికాక ఆత్మయోగివగు''మని పూర్వార్థ

మున జెప్పినది. ఇక యుత్తరభాగము ఫలమునకు జెందినది.

ఆత్మయోగియగుచో నేమగును? అన్నచో "దివ్యధామము లందున్న అమృతపుత్రులు మీయశమును విందురు" అను చున్నది. సాంసారికమర్త్యవిషయాసక్తుల యమృతాత్మలు మృత్యుపాశబద్ధములై మత్యుసంసారసాగరమున 'జాయస్వ మ్రియస్వ' యగుచుండును. అందువలన అమృతాత్మాంశలగు నందరు నమృతపుత్రులయినను, మృత్యుపుత్రులేయగుదురు. కనుక నిట్టివారు దివ్యలోకాధికారులుగారు. ఇక:— సంసార మందేయుండి మృత్యుభావాసక్తులుగాక పూర్వ్యమగు నమృత బ్రహ్మననుగమించువారు తమ యాత్మాంశమును సురక్షితము గావించుకొనుచు దివ్యలోకాధికారులగుదురు. దివ్యధామస్థులట్టి వారిం గీర్తింతురు. వారికందును నిందును ఆనందమే.

(2) ఎచట అగ్నిమథింపబడునో వాయువవరుద్ధమగునో సోమము నిశ్శేషమగునో అచటనే మనముయొక్క లగ్నమగు గాక!

అగ్నివాయుసోమము లను నీ మూడు తత్త్వములును క్షర సృష్టికి మూలాధారములు. అగ్నిసోమసమన్వయరూపయజ్ఞమే. సహయజ్ఞాఃప్రజాఃసృష్ట్వా' అన్నట్లు విశ్వము అగ్ని యజ్ఞము నకుయోని. సోమమాహుతిద్రవ్యము (రేతస్సు). దీనిం దాని యందు హోమముగావించుట గతి ధర్మముగల వాయువుపని. ఇది ఆ యాహుతరేతోవేష్టనమున నవరుద్ధమై గర్భసంపత్తి కారణమగును. సృష్టి కాముకమనుష్య శారీరాగ్ని వాయు

ప్రేరణచే క్షుబ్ధమైపోవును. ఈ సంఘర్షమే అగ్నిమంథనము. దానిచే స్నేహధర్మముగల శారీరశుక్రము (సోమము) స్వస్థాన చ్యుతమగును. ఇదే సోమాతిరేచనము. అటనుండి యది వాయువుచే స్త్రీ గర్భాశయస్థ యోనిరూప శోణితాగ్నియం దాహుత మగును. శుక్రము నలుగడలను వాయువు వేష్టించియుండును గనుక నది ఋతమయ్యు నిటు బోజాలదు. కాని వాయువు రెండుభాగములగుచో నదియు రెండుభాగ ములై యమళసంతతికి గారణమగును.

ఇట్లు విశ్వసృష్టి- విశ్వప్రజాసృష్టి యను రెంటి స్వరూప నిష్పత్తియు అగ్నిమంథనము - వాయునిరోధము - సోమాతి రేచనము అనువానివలననే యగును. ఈ మూడును వైకారిక పదార్థములు. వీనికిమూల మాత్మాక్షరబ్రహ్మ. దీనినుండియే, ఆమూడు వికారక్షరములును మూడుకార్యములను సేయగలవు. "ప్రజాత్మక లేక విశ్వాత్మక అగ్ని సోమ వాయురూప మృత్యు భావములం దాసక్తిగానక (మనోబుద్ధులను యోజింపక) ఈమూటికి మూలమగు-నాత్మాక్షరలక్షణ పూర్వబ్రహ్మ నను గమింపవలయునని శ్రుతి పరోక్షవిధముగ నాదేశించుచున్నది.

3. సవితాదేవతాప్రేరణచే పూర్వబ్రహ్మను సేవింపుము. మనకదియేయోని యనియెరుంగుము, ఆబ్రహ్మ నీపూర్వభావ మును (నేడును) విడువలేదు.

దుఃఖనివృత్తికై పూర్వబ్రహ్మ నాశ్రయింపక తప్పదు. హృదయస్థసవితా ప్రాణప్రేరణ లేకున్నచో మన మనస్సటు

వోదు. ఆబ్రహ్మను మనముమరచిన నది మనలను మరువదు. కారణము? అదిమనయోని - పూర్వభావము (యోనియన్నది కేవలము క్షరబ్రహ్మయే కనుక పూర్వబ్రహ్మశబ్దము క్షర వాచకమే).

4. హంస=కర్మాత్మ - కర్మరూపియగునిది క్షరప్రధానము. భౌతికవిశ్వమే తత్సజాతీయము కనుక ఈ విశ్వాకర్షణమున నిది విషయాసక్తమగుచుండును. "క్షరాత్మనగునేను ఈయన్నిటి కధత్యుడ"నను వశీభావముకలిగినంతనే యీ బహిరాసక్తి నివర్తించును.

5. అమృతాక్షర సంశ్లిష్టుడై యుండువాడగుటచే స్వయముగ నేకవర్ణుడు (ఏకరూపి). అతడు కర్మాత్మనైన నాకు శుభ బుద్ధి నొసంగుగాక! అనేక భావాత్మక సృష్టికి సంచాలకము, ఉత్పాదకము. ఆద్యంతములు కేవల మాత్మక్షరమే. కనుక దేవశబ్ద మాత్మక్షరపరకము.

6. అగ్ని - వాయు - ఆదిత్య - చంద్ర - (భాస్వరసోమ) శుక్ర (విశ్వయోని) బ్రహ్మ (ఉపాదానకారణము) అపః - (స్నేహము) ప్రజాపతులు. అదే—

అగ్ని వాయు ఆదిత్యులు మూడు నగ్నులు. చంద్రాపస్సులు రెండును సోమములు. వీనికి ప్రభవము క్షరాత్మ. తదీయాగ్ని కళచే అన్నాదాగ్నియొక్కయు, సోమకళచే అన్నసోమము యొక్కయు వికాసములు కల్గెను. బ్రహ్మకళ శుక్రము, విష్ణు కళ బ్రహ్మ, ఇంద్రకళ ప్రజాపతి. అనగా:—

ఆత్మాక్షరునికి మర్త్యభావప్రధానములగు బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోమము లను పంచ కళలు గలవు. ఇందు 1. బ్రహ్మకళ విశ్వయోని. 'బ్రహ్మ వై సర్వస్య (ప్రతిష్ఠా) ప్రథమజమ్' కదా! (యోనినే శుక్ర మందురు. బ్రహ్మాత్మక ప్రాణమే శుక్రము.) 2. విష్ణుకళ. ఆపస్సుద్వారా భౌతిక విశ్వమున కుపాదానము. ఉపాదానమును బ్రహ్మ యందురు. 3. ఇంద్రకళ. వాక్కుద్వారా ప్రజాసృష్టి కధిష్ఠాత్రి. కనుక ప్రజాపతి యనబడును. 4. అగ్నికళ. అన్నాదద్వారా వైకారికాగ్నిత్రయికి (అగ్ని వాయ్వాదిత్యులకు) కారణ మగును. 5. సోమకళ. అన్నముద్వారా సోమద్వయికి గారణ మగును. ఇట్లు ఆత్మాక్షరమే తన పంచ మూలకళలచే తూలకళలద్వారా అంతయు నన్నియు నగును. ఈ పరిలేఖ నవలోకింపుడు:-

| మూలకళాః | | తూలకళాః | కార్యవివర్తమ్ |
|---|---|---|---|
| 1. బ్రహ్మా | ... | ప్రాణః | శుక్రవికాసః—తదేవ శుక్రమ్ |
| 2. విష్ణుః | ... | ఆపః | బ్రహ్మవికాసః—తద్బ్రహ్మ |
| 3. ఇంద్రః | ... | వాక్ | ప్రజాపతివికాసః—సప్రజాపతిః |
| 4. అగ్నిః | ... | అన్నాదః | అగ్నివాయ్వాదిత్యవికాసః—తదేవాగ్నిస్తదాదిత్యస్తద్వాయుః |
| 5. సోమః | ... | అన్నమ్ | అప్చంద్రమసోర్వికాసః—తదు చంద్రమాః తా ఆపః |
| **ఆత్మాక్షరః** | | **వికారక్షరః** | **వైకారికభావాః** |

7. నీవే స్త్రీవి - పురుషుడవు - కన్యవు - కుమారుడవు-

పురాతనుడవు. కనుకనే దండముతో నందరను బెదరింతువు. నానారూపము ల బుట్టుచున్నవాడవు నీవే.

స్త్రీ పురుషశబ్దములు దాంపత్యావస్థాసూచకములు. తత్పూర్వావస్థను కన్యాకుమారావస్థలు సూచించును. అవ్యయాక్షరము లొకటే. ఈయుభయ విశేషమునుండి విశేషభావ మొప్పుకలిగెను. మరియు శ్రుతి స్పష్టముగా 'నస్త్రీపుమానేష' యని అవ్యయాక్షరములు విశేషభావ బహిష్కృతము లన్నదికదా:-ఇట్టిచో ఆత్మవర్గమందు విశేషభావముంబుట్టించు నేకోయుక విశేషాత్మయు నున్నదనుకోవలయును. అది వైశేషికతంత్రసమ్మతక్షరాత్మయే కావలయును. గర్భన ప్రకరణమునందు విశేష భావమును విశదముగా నిరూపించితిమి. తాడన మక్షరునిపని; బెదరించుట క్షరునిపని కనుకనే 'వంచసి' యని చెప్పబడెను. ప్రపంచమంతయు క్షరవంచనావ్యస్తము "ముసలివాడు కఱ్ఱ గొని పిల్లలను బెదరించుచుంగాని కొట్టడు" అదేతీరు ఇచటను ఎంచవలయును. జాతుడు విశ్వతోముఖుడు నితడే (క్షరమే).

8. నీలకంఠ - భ్రమర-శుక - కురవక-తడిద్గర్భ-ఋతు-సముద్రాదులన్నియు నాత్మక్షరమే. అనాది ఆత్మవిభువు. తజ్జనితములే సర్వలోకములు.

9. లోకములాశ్రయించియున్న దేవాధిపతియు ద్విపద చతుష్పదశాస్తయు అగునట్టి 'క' యను ననిరుక్తప్రజాపతి కొరకు హవిర్విధానము సేయుదుము.

10. ఆ (క్షరాత్మ) సృష్టికర్మ గావించి నివృత్తుడై మరల

తత్త్వముగొక్క- తత్త్వముతోగూడి - యోగభావమునొంది కాలముంబట్టి ఒకటి, రెండు, మూడు, ఎనిమిది యగు తన సూక్ష్మగుణములచే సృష్టిప్రవృత్తు డగుచున్నాడు.

ఈ మంత్ర మాత్మాక్షరుని యన్నియవస్థలను నిరూపించు చున్నది. సృష్టిదశయం దాయన కర్మచేయును. అందుచే ప్రాణాపానాగాది వికారక్షరములు పుట్టుచున్నవి. వీనినుండి వైకారికవిశ్వము జనించును. కేవలవికారోత్పాదన మతనిపని. ఆ దశయందే యతడు విశ్వకర్మకు ప్రభువు. వికారోత్పత్తిజేసి యతడు నివృత్తుడగును; విశ్వకర్మయం దాసక్తుడుగాడు. ఈ య వికృతావస్థలో తన విశుద్ధతాత్త్విక రూపమునకు వచ్చును. ఈయనకీమూల మక్షరుడు; అతనికీమూల మవ్యయుడు. అతడు (అవ్యయుడు) అవికృతుడు; ఏకరూపి. అట్లే సృష్టికర్మ నివృత్తుడగు విశుద్ధుడీయనయు (ఆత్మక్షరుడును) తత్త్వతత్త్వము (తనకు దత్త్వమగు నక్షరునకు దత్త్వమగు నవ్యయుని) తోగూడి తద్రూపుడే యగును.

"క్షరంత్వవిద్యా హ్యమృతంతువిద్యా" "జ్ఞాజ్ఞౌద్వౌ" "క్షరంప్రధాన మమృతాక్షరం" మొదలగు వచనములచే క్షరుడు సృష్టికాలమందు అవిద్యారూపి. అక్షరుడు విద్యా రూపి. క్షరుడజ్ఞుడు-అక్షరుడు 'జ్ఞు'డు. క్షరుడు ప్రధానము-అక్షర మమృతము. అవ్యయుడు సత్యమూర్తి - అక్షరుడు రజోమూర్తి. క్షరుడు తమోమూర్తి - తమస్సు అవిద్య. సృష్టి మూలబీజ మిదే. ఈ యాత్మ క్షరుడే సృష్టోపయికుడు; ఏకరూపి; ప్రథమ

రూపి. మొట్టమొదట నితడు ప్రకృతి-వికృతు లను రెండురూపము లను ధరించును. స్వస్వరూపమున నితడు ప్రకృతి (ప్రధానము). ఇతనినుండి వెలువడు ప్రాణాదివికారపంచకము వికృతి. అవ్యయుడు పురుషుడు, అక్షరుడు ప్రకృతి, కాని సృష్టికాలమందాత్మక్షరుడు ప్రకృతివికృతి. ఇవియే యితని రెండురూపములు. పిదప నీ వికారములతో వైకారికసృష్టి నిర్మాణమునకై యితడు త్రిగుణభావ పరిణతి నొందును. అవ్యయుని సత్త్వము నుండి సత్త్వము, అక్షరరజస్సునుండి రజస్సు, తసదగు తమోగుణము గూడగా త్రిగుణమూర్తియై ఆవికారములచే త్రైగుణ్య విశ్వము పుట్టుకకు గారణమగును. ఇవే యితని మూడురూపములు "భూమిరాపోఽనలోవాయుః ఖం" అను పంచతన్మాత్రలతో మనోబుధ్యహంకారములతో గూడి యష్టగుణోపేతుడగును. ఇందు సాంఖ్యు లేడుతత్త్వములే గాని బుద్ధి నెరుంగరని మున్నే చెప్పియుంటిమి గదా (1) అవిద్య (2) ప్రకృతి - వికృతులు, (3) త్రిగుణములు, (4) అష్టవివర్తములు - ఇవి ఆత్మక్షరుని సూక్ష్మరూపములు. వీనినుండియే స్థూలభూతాత్మక స్థూలవిశ్వ ముత్పన్నమయినది.

(11) అవిద్యాదులద్వారాక్షరమేవైకారికవిశ్వోపాదానమై విశ్వదశయందు తన వికారభావముచే విశ్వమూర్తియై ఆత్మభావవంచితమై క్షరుడనబడును. అటు గానినా డాత్మరూపపరిణతినంది క్షరుడయ్యు నాత్మక్షరు డనిపించుకొని యాత్మకోటిలోని వాడుగ నంగీకరింపబడును. ఇట్లు ఇతనికి తాత్త్విక-

యౌగిక భేదములచే రెండురూపములు. తాత్త్వికమాత్మ- యౌగికము - విశ్వము. ఇందు తాత్త్వికము గ్రాహ్యము అని శ్రుతి తాత్పర్యము.

(12) అతడు (ఆత్మాక్షరుడు) వృక్ష - కాల - ఆకృతులకు బరుడు, భిన్నుడు. అతనివలన నీ విశ్వమంతయు బరివర్తితమగు చుండును. ధర్మప్రదాత పాపవినాశకుడు విశ్వేశమూర్తి విశ్వ ధామమూర్తి యగు నీత డాత్మస్థుడు అమృతుడు అని యెరింగి యుపాసించు వాడు ముక్తుడగును.

ఔపనిషదవృక్షవిద్య 1. బ్రహ్మాశ్వత్థము 2. కర్మాశ్వ త్థము నని యిరుదెఱగులు. మొదటిదాని కవ్యయునితోడను రెండవదానికి విశ్వకర్మ ప్రవర్తకాత్మాక్షరునితోడను సంబంధము. మధ్యస్థుడగు నక్షరుడీ రెంటికిని స్వరూపసంపాదకుడు. సాధా రణులీ విశ్వవృక్షమునే యాత్మాక్షరు డనుకొందురు. విశ్వము తదీయ వైకారికరూపము, దీనికది మూలము, పరము, భిన్నము, త్రికాలమర్యాదాతీతము. ఆకృతిరూపావిద్యా పార్థక్యముగలది. ఈ మూటికంటె వేరైన అదియే విశ్వప్రపంచ మూలప్రతిష్ఠ. తన యవికృతరూపమున నది ధర్మబుద్ధి ప్రవర్తకము, పాప రూపకర్మలేప వినాశకము. అతడు స్వయముగ భవము (విశ్వము) కాడు, భవేశుడు విశ్వముగాడు, విశ్వధామము (ఆలంబనము).

పూర్వశ్రుతి ఇతని కాత్మ-విశ్వ భేదమున రెండురూపము లను జెప్పెను. విశ్వరూపదశయందదే మృత్యుప్రధానమై విశ్వ

కాలాన్వృతి రూపమై ధర్మా-ధర్మ, పాప్మ-భవాది రూపమై యున్నది. కాని యీయాత్మదశయందు విశుద్ధామృతరూపము సర్వాతీతముగనే యున్నది. అవ్యయాక్షరాత్మస్థము (కనుక నే) ఆత్మస్థము అగు నక్షరమే ఆత్మాక్షరమై యమృతమగును. విశ్వస్థమగుచో నదే మృత్యువు. ఇందు ఆత్మస్థామృతరూపము జ్ఞేయము.

(13) నిష్క్రియానంత పదార్థముల కత డొకడే వశి, ఆ యొకతనే ఒక బీజమును నానాభావపరిణతి నొందించును. అతని నాత్మస్థుగా నెరుంగువా డానందాధికారి. విశ్వస్థుడుగా నెరుంగు నితర వ్యక్తి ఆనందవంచితుడు.

జ్ఞానశక్త్యధిష్ఠాత అవ్యయుడు. క్రియాశక్తి ప్రవర్తకు డక్షరుడు. అర్థశక్తి ప్రభువాత్మక్షరుడు. భౌతికపదార్థము లర్థరూపములు. జడములు నిష్క్రియములు. ఈయనంత నిష్క్రియభావ (భౌతిక పదార్థ) ప్రభు వత డొకడే. అతడు స్వాయముగ శుక్రాత్మక బీజము. అతనినుండి యసంఖ్యభావాత్మక విశ్వము లుత్పన్నములగును. బుద్ధియోగియగు ధీరుడతని నాత్మస్థుగా నెరింగి యాత్మానందాధికారియగును. మందబుద్ధియగువాడు విశ్వస్థునిగా నెంచి దుఃఖానుగామి యగును. అతనిని బీజరూపునిగ నుపాసింపుము. మూలరూపము నన్వేషింపుము. ఆత్మరూపానుగామి కమ్ము - అని తాత్పర్యము.

పరాత్పరయుక్త - అవ్యయాక్షరక్షరాత్మ :—

1. తమేకనేమిం[1] త్రివృతం[2] షోడశాంతం,[3] శతార్ధారం,[4] వింశతి[5] ప్రత్యరాభిః। అష్టకైః[6] షడ్భిర్విశ్వరూపైకపాశం,[7] త్రిమార్గ[8] భేదం, ద్వినిమిత్తైః[9] మోహం॥

2. పంచస్రోతోఽంబుం పంచయోన్యుగ్రవక్రాం, పంచప్రాణోర్మిం పంచబుద్ధ్యాదిమూలాం పంచావర్తాం, పంచదుఃఖౌఘవేగాం, పంచాశద్భేదాం పంచపర్వామధీమః॥

3. ఉద్గీథమేతత్ పరమంతు బ్రహ్మ తస్మింస్త్రయం సుప్రతిష్ఠాక్షరంచ అత్రాంతరం బ్రహ్మవిదో విదిత్వా లీనాబ్రహ్మణి తత్పరా యోని ముక్తాః॥

4. సంయుక్తమేతత్ క్షరమక్షరంచ వ్యక్తావ్యక్తే భరతేవిశ్వమీశః అనీశశ్చాత్మా బుధ్యతే భోక్తృభావాత్ జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వ. పాశైః॥

5. జ్ఞాజ్ఞౌద్వా వజావీశానీశౌ, అజాహ్యేకా భోక్తృభోగార్థ యుక్తా అనంతశ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా-త్రయం యదా విందతే బ్రహ్మమేతత్॥

6. క్షరం ప్రధాన మమృతాక్షరం హరః క్షరాత్మా నీశతే దేవఏకః తస్యాభిధ్యానాత్ యోజనాత్ తత్త్వభావాత్ భూయశ్చాంతే విశ్వ మాయా నివృత్తిః॥

7, ఏతద్ జ్ఞేయం నిత్యమేవాత్మ సంస్థం నాతఃపరం వేదితవ్యంహి కించిత్ భోక్తాభోగ్యం ప్రేరితారంచ మత్వా సర్వంప్రోక్తం త్రివిధం బ్రహ్మ రూపం॥

8. ద్వేఅక్షరే బ్రహ్మపరేత్వనంతే విద్యావిద్యే నిహితే యత్రగూఢే క్షరంత్వవిద్యా హ్యమృతంతువిద్యా విద్యావిద్యే ఈశతే యస్తు సోఽన్యః॥

9. భావగ్రాహ్య మనీడాఖ్యం, భావాభావకరం శివం
కాలసర్గకరం దేవం యేవిదుస్తే జహుస్తనుం॥ [శ్వేతా]

10. యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ్య మచక్షు శ్రోత్రమ్.
అపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్.
తదవ్యయం తద్భూతయోనిం పరిపశ్యన్తిధీరాః

11. పురుష ఏవేదం విశ్వం కర్మతపోబ్రహ్మ పరామృతమ్.
ఏతద్యోవేద నిహితంగుహాయాం సోఽవిద్యాగ్రంథిం వికిరతీహ
సోఽమ్య॥ [ముండక]

12. పురుషఏవేదంసర్వం యద్భూతం యచ్చభావ్యం,
ఉతామృతత్త్వస్యేశానః యదన్నే నాతిరోహతి – [శ్వేతా]

1. నేమి అవ్యయుడు, నాహామక్షరుడు, ధుర - పరిధు లాత్మక్షరుడు, రథము వైకారికవిశ్వము, నేమిమూలము, ధుర - పరిధులు తూలములు, రెంటికి సంయోజకము నాహాము. నాహామందే నేమిరూపకీలకమును అరలు పరిధియు నున్నవి. త్రిపురుష పురుషాత్మక పురుషస్థితియు నింతే. విశ్వరథనేమి అవ్యయుడు, మధ్యస్థాక్షరాధారమున ప్రతిష్ఠితుడై యున్నాడు. ధుర - పరిధి - రూపక్షరుడును అక్షరరూప నాహామందే ప్రతిష్ఠితుడై యున్నాడు. ఇట్లు అవ్యయదృష్టితో విశ్వరథనేమియు, అక్షర దృష్టితో నాహామును, ఆత్మక్షరదృష్టితో అరా - పరిధులు నతడే, ఒకేఆత్మకు మూడు వివర్తములు. వీనిని సమష్టిగ శ్రుతి నిరూపించుచున్నది.

అవ్యయుని నేమిత్వ - సర్వాలంబనత్వములు శ్రుతి యిట్లు నిరూపించెను.

"అచికిత్వా న్చికితుష శ్చిదత్రకవీన్ పృచ్ఛామి విద్మనే నవిద్వాన్
వియస్త స్తంభ షడిమారజాంసి *అజస్య రూపే కిమపిస్విదేకమ్"
"ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరమ్.
ఏతదాలంబనం జ్ఞాత్వా యోయదిచ్ఛతి తస్యతత్"

ఇక "విశ్వరూపైకపాశము" తక్క తక్కిన శబ్దములు లాత్మ క్షరమునకు జెందినవి. త్రివృత్తు = తొమ్మిది. షోడశి యందలి అవ్యయాక్షరక్షరులు త్రివృ ద్భావాపన్నులు. మూవురందు మూవురు నుందురు. "తాసాంత్రివృతా మేకై కాంకరవాణి" యనుటలోని త్రివృత్కరణ ప్రక్రియ యిదే - మూవురును త్రివృత్తులే. సృష్టిదశయందు త్రివృద్భావ వికాసము ఆత్మ క్షరునందే యగును. శుక్రోద్భావకు డితడే - వాగాపోఽగ్ని సమష్టి శుక్రము. ఇవి వరుసగ అన్న జల తేజములు. వీని త్రివృ ద్భావముననే శుక్రావచ్ఛిన్నాత్మక్షరుడు సప్తలోకములకు లేదా సృష్టికి గారణమగును. లేదా:— సత్త్వ - రజ - స్తమ త్రివృద్భావమునను ఈతనిని త్రివృత్తనవచ్చును. లేదా:— మనః ప్రాణవాక్కుల త్రివృద్భావమునను త్రివృత్తనవచ్చును.

పంచతన్మాత్రాజనిత పృథివ్యాది పంచమహా భూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, ఇంద్రియ మనస్సు, ఈ మొత్తము షోడశి. దీనిని ప్రాధానికమునందు నిరూపించితిమి. - వీనికంతము (పరాయణము) ఆత్మక్షరుడు

* షోడశీప్రజాపతి ముఖ్యభాగమజనామక మహామాయా వచ్ఛిన్నా వ్యయ పురుషుడు.

ఇతనినుండి పంచతన్మాత్రలును వికసింపగా, వానినుండి గదా! యీ పదునారును వెలసినవి! కనుకనే 'షోడశకో అంతఃయస్య' అను నిర్వచనముచే నితనిని షోడశాంత (16 వికారముల కంత మగు విశ్రామభూమి) యనవచ్చును.

లేదా:- ఇట బ్రశ్నోపనిషత్తునందలి ప్రాణ - శ్రద్ధా - ఆకాశ - వాయు - జ్యోతి - ఆపః - పృథివీ - ఇంద్రియ - మనః - అన్న - వీర్య - తపః - మంత్ర - కర్మ - లోక నామములను 16 కళలను గ్రహించి వానింబట్టియు 'షోడశాంత' యనదగును.

తమ, మోహ, మహామోహ, తమిస్ర, అంధతామిస్రము లను పంచ విపర్యయములు. 11 ఇంద్రియములకు జెందిన మూలకత్వాది 11 అశక్తులు, అంతఃకరణమునకు జెందిన 9 తుష్టులకును ప్రతిబంధకములగు తొమ్మిది యశక్తులు, 8 సిద్ధులకు బ్రతిబంధకములగు నెనిమిది యశక్తులు - ఇట్లు మొత్తము 28 అశక్తులు, 9 తుష్టులు, 8 సిద్ధులు, వీని మొత్తము 50. ఈయన్నిటికి మూలమగు యాత్మకుడే. కనుక 'శతార్ధారః' అని చెప్పబడెను. ఈ 50 భావములు అక్షరరూప నామము యొక్క ఆధారమున బ్రతిష్ఠితుడై యున్న క్షరుని అరములు. కనుక "అర్ధశత ప్రత్యయభేదాః అరా ఇవ యస్య" అను నిర్వచనము చొప్పున 'శతార్ధారః' అనవచ్చును.

వింశతి ప్రత్యరలు = అరలు దృఢముగా నుండుటకై నాభి పరిధులందు బిగించు మేకులు ప్రత్యరలు, కౌషీతకీ సమ్మతము లగు 10 యింద్రియములు వాని నియతవిషయములు 10. మొత్త

వీా యిరువదియు ఆత్మాక్షర ప్రత్యారామాపములు. వీనితోఁగూడియే యతఁడు శతాధార మూర్తియై యున్నాఁడు. — ఇఁక ఆత్మాక్షరుని షడష్టకములీ కోష్ఠమునఁజూడుడు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| ప్రకృత్యష్టకమ్ | ధాత్వష్టకమ్ | ఐశ్వర్యాష్టకమ్ | భావాష్టకమ్ | దేవాష్టకమ్ | గుణాష్టకమ్ |
| భూమిః | త్వక్ | అణిమా | ధర్మః | బ్రహ్మ | దయా |
| అపః | చర్మ | మహిమా | జ్ఞానమ్ | ప్రజాపతిః | శాంతిః |
| అనలః | మాంసమ్ | గరిమా | వైరాగ్యమ్ | దేవాః | శౌచమ్ |
| వాయుః | రుధిరః | లఘిమా | ఐశ్వర్యమ్ | గంధర్వాః | అనాయాసః |
| ఖమ్ | మేదః | ప్రాప్తి | అభినివేశః | యక్షాః | మంగళమ్ |
| మనః | అస్థి | ప్రాకామ్యం | మోహః | రాక్షసాః | అకార్పణ్యం |
| బుద్ధిః | మజ్జా | ఈశత్వం | అసక్తిః. | పితరః | అనసూయా |
| అహంకారః | శుక్రమ్ | వశిత్వం | అస్మితా | పిశాచః | అస్పృహా. |
| ప్రకృతి-వికృతులు- | ధాతువులు- | సిద్ధులు- | బుద్ధులు- | యోనులు- | గుణములు. |

'త్రిమార్గభేదం' క్షరవృత్తిచే కర్మమార్గమునకు, అక్షరభావనచే ఉపాసనా మార్గమునకు, అవ్యయభావనచే జ్ఞానమార్గమునకు ప్రవర్తకుఁడతఁడే. 'ద్వినిమిత్తైకమోహం' తన తమోమయా

విద్య, కామమయ మనస్సు నను రెండు నిమిత్తములచే విశ్వమోహప్రవృత్తికి గారణ మగుచున్నాడు.

'విశ్వరూపైకపాశమ్' ఈ వాక్య మక్షరునకు జెందినది. నానారూపముగ నున్నను విశ్వము ఒకటే. ఈ యేకత్వప్రతీతి నానాభావాపన్న క్షరకూటస్థుడగు నక్షరుని పాశముయొక్క కృపాఫలము. అవ్యయపశుపతి, యీ యేకరూప కూటస్థాక్షర పాశమున విశ్వరూపక్షరపశువును బంధించియున్నాడు.

2. ఈ మంత్ర మొక నదీదృష్టాంతమున షోడశీ ప్రజాపతిని నిరూపించుచున్నది. అవ్యయుని యానందాది పంచ కళలు కోశాత్మకములు. పంచస్రోతస్సులు వీనిమాత్రలంగానియే సర్వము నుపజీవించుచున్నవి. అమృతభావప్రధాన బ్రహ్మాద్యక్షర పంచకళలు. పంచయోనులు (ఉగ్రవక్రములు). ఇక:- ప్రాణాపో వాగన్నాన్నాద ప్రాణాత్మకోర్మ్యులైదును క్షరునకు జెందినవి. ఇతడే మనోరూపమున పంచజ్ఞానేంద్రియ జన్యజ్ఞానమునకు మూలప్రతిష్ఠ. ఈ యైంద్రియక విషయములు ఈ క్షరునకు (ప్రాణులకు) మునుగుటకు, నీదుటకు స్థానములు. అవిద్యాది పంచక్లేశములు నితనికి జెందునవే. ఇట్లు ఆరు భాగములుగ (బంచ) పంచరూపమున నున్న యీ ప్రజాపతి నధ్యయనము సేయుదుము. ఇందు మొదటి రెండు పంచకము లవ్యయాక్షరులను, తక్కిన నాల్గు పంచకములు నాత్మక్షరుని సూచించును.

3. పరమబ్రహ్మ యన్నచో (అక్షరబ్రహ్మ) ఉద్గీథము. భోక్తృ-భోగ్య-ప్రేరయితృ లక్షణత్రయంబ్రహ్మ యిందే ప్రతి

ష్ఠితమై యున్నది. కాని, ఇందు అక్షరుడే సుప్రతిష్ఠితుడు. ఈ ప్రతిష్ఠాత్రయి యందు నిగూఢతత్త్వము (అవ్యయు) నెరింగి బ్రహ్మజ్ఞానులు తత్పరు (అవ్యయపరు) లై జన్మ మృత్యు లక్షణ ద్వంద్వయోని విముక్తులై యా యవ్యయబ్రహ్మ యందే లీను లగుదురు.

అక్షరునకు 'పరమంబ్రహ్మ' యని సంకేతము. ఛాందోగ్యానుసారము హృదయస్థభావమునే యుద్గీథ మందురు. హృదయరూపాక్షరమే పరమబ్రహ్మ. ఇదే అవ్యయాక్షర క్షరులకు బ్రతిష్ఠ. ఈ మూవురును విశ్వమునకు బ్రతిష్ఠ. ఇందక్షరుడే విశ్వమునకు సుప్రతిష్ఠ.

4. వ్యక్తాక్షరము, అవ్యక్తాక్షరము బరస్పరసంశ్లిష్టములై విశ్వభరణ పోషణము లాచరించుచు, విశ్వేశులై యున్న చంద మెరుంగని జీవు డనీశుడు. విషయభోగాసక్తుడై బంధనమున జిక్కుకొనును. ఈశు (అవ్యయు) నెరుంగువాడు ముక్తుడగును.

5. ఒకడు క్షరగర్భితుడు. కనుకనే క్షరరూపియు నజ్ఞుడు నగు నజాత్మ. మరొకడు అక్షరరూపి, జ్ఞుడు నగు అజుడు. ఈ యిరువురు క్రమముగ అనీశుడు, ఈశుడు నై యున్నారు. వీరికి భోగ్య-భోక్తృ భావమును నిష్పన్నముగావించునది అజ యను త్రిగుణ భావమయ ప్రకృతి యోగమాయ. ఈ యిరువురికంటె వేరుగ గారణ కార్యాతీతుడు, అనంతాత్మ (అవ్యయుడు.) (క్షరముద్వారా) విశ్వరూపుడయ్యు అకర్తయై యున్నాడు.

ఈముగ్గురి నొకచో జూచువాడు బ్రహ్మ వాస్తవికస్వరూపము నెరుంగువాడు.

6. విశ్వమునకు బ్రకృతియగు క్షరుడు ప్రధానము. అమృతాక్షరుడు హరుడు. (పాపనాశకుడు-గ్రంథిబంధవిమోచకుడు.) ఈ యిరువురకును శాస్త్రయగు దేవుడు (అవ్యయుడు) వేరుగ నున్నాడు. తద్ధ్యానమున బుద్ధియోగమున తత్త్వమీమాంసచే జివరకు విశ్వమాయానివృత్తియగును.

7. తన యధ్యాత్మసంస్థయందు ప్రేరయితృరూపముననున్న యక్షరుని, భోక్తృరూపమున నున్న యవ్యయుని, భోగ్యరూపమున నున్న క్షరుని ఏకముగ నెరుంగవలయును. అంతటితో నంతయు నెరుంగుట యగును. ఒకే బ్రహ్మకు (ఆత్మకు) ఇవి మూడు వివర్తములు (రూపములు).

8. విద్యావిద్యాత్మకములగు రెండక్షరములు. (1. అక్షరుడు 2. అక్షరసంశ్లిష్టుడగుటచే నక్షరుడనబడు నాత్మక్షరుడు). ఆ యనంత నిగూఢ పరబ్రహ్మ (అవ్యయబ్రహ్మ) యందు బ్రతిష్ఠితములై యున్నవి. క్షరు డవిద్య. అమృతక్షరుడు విద్య. ఈ రెంటికి బ్రభువగు నవ్యయుడు వేరు.

9. ఆ ప్రజాపతి (అవ్యయుంబట్టి) కేవలము భావగమ్యుడు, అశరీరి. (అక్షరదృష్టింబట్టి) భావాభావాత్మక సదసత్ సృష్టికి గర్త. (క్షరదృష్టిచే) కాలాత్మక విశ్వసర్గమున కుపాదానము. ఈ త్రిపురుష పురుషాత్మకాత్మదేవు నెరుంగువాడు శరీరబంధ విముక్తుడగును.

10. ఆ ప్రజాపతి (అవ్యయదృష్టిచే) అదృశ్యుడు, అగ్రాహ్యుడు, అగోత్రుడు, అవర్ణుడు, చక్షుశ్శ్రోత్రాద్యతీతుడు. (అక్షరదృష్టిచే) పాణిపాదరహితుడు, నిత్యుడు, విభువు, సర్వగతుడు, సుసూక్ష్ముడు. విద్వాంసులతనిని భూతయోని (ఆత్మక్షరుని) గను జూతురు.

11. ఈ యంతయు పురుషవివర్తమే. (క్షరదృష్టిచే) నతడు కర్మరూపి. (అక్షరదృష్టిచే) తపోరూపి. (అవ్యయదృష్టిచే) పరనామకామృతబ్రహ్మ. తన శరీరగుహాయందలి యితని నెరుంగు త్రిమూర్తి నెరుంగువా డవిద్యాగ్రంథివిమోకము నొందగలడు.

ఇంతవరకునైన ప్రమాణవాదము వలన వినుగు తోచినను ఒక విమర్శకుమాత్ర మవసరము లభించును. ఏమన:— శ్రౌత వచనము లాకానొక యద్వైత తత్త్వము (పరాత్పరము) ను, లక్ష్యము గావించుకొని వేరువేరగు నాత్మవివర్తములనే నిరూపించుచున్నవి. అన్నియు నదే. కాని, యన్నియు నొకటి కావు. ముఖాక్షినాసాశ్రవణములు మొదలగు వాని కహం విశ్రామభూమి. కనుకనే నేను చూచుచున్నాను. వినుచున్నాను. ఇత్యాది సర్వేంద్రియక ప్రత్యయములతోడను 'అహం' సమానరూపముగ సంబద్ధమై యున్నది. అయినను ఏయింద్రియమున కదే వేరుగదా! అయినను అహమన్నది యన్నిటికి నభిన్నమే. ఇదేతీరు నాత్మవివర్తములందు నెరుంగదగును. పరాత్పరుడందరకు నొకడయ్యు అవ్యయాక్షరక్షరులు పరస్పర భిన్నులే. అందరు నన్నియు పరాత్పరుడే. కాని అవ్యయాక్షరు లల్లు

గారు. మరియు, అవ్యయుడక్షరక్షరులు గాడు. అక్షరుడవ్యయ క్షరులు గాడు. క్షరు డవ్యయాక్షరులు గాడు. పూర్వోదా హృతశ్రుతులు మూలమందు దమ యద్వైతసిద్ధాంతమును గాపాడుకొనుచు నీ యాత్మవ్యూహ స్పష్టీకరణము గావింపు చున్నవి.

వెనుక నొకేయాత్మకు అమృత - బ్రహ్మ-శుక్రములను మూడు వివర్తము లంటిమి. మరియు, నీమూటికి ఈశ్వర - జీవభేదము లచే రెండు సంస్థలనియు జెప్పితిమి. ఇందు క్రమప్రాప్తనిరూపణే యేశ్వరసంస్థకు జెందిన అమృతాత్మవిభాగమును సంగ్రహముగ నిరూపించితిమి. అశ్వత్థము (బ్రహ్మాశ్వత్థము) ఈశ్వరుడు. దీనికి ధాతు - వివర్త - ఆత్మ - పర్వము లను నీ నాల్గు విభాగములు కలవు. ఇందు:—

1. ధాతుదృష్టిచే దీనికి అమృత - అమృత - బ్రహ్మ - శుక్రము లను నాల్గు విభాగములు. 2. వివర్తదృష్టిచే నీ నాల్గింటిని క్రమముగ పరాత్పర పురుష ప్రకృతి వైకారికము లనవచ్చును. (3) ఆత్మదృష్టిచే వీనినే క్రమముగ నిగూ ఢాత్మా - పరమాత్మా - అధియజ్ఞాత్మా - సర్వ భూతాంత రాత్మా-యనవచ్చును. (4) పర్వదృష్టిచే నిగూఢాత్మయన్నది సర్వశక్తిఘనము-అనంతర బాహ్యాభూమయు నైయున్నది. ఇం దేపర్వమున లేదు. ఉన్నదనుచో భూమ - భూమాణిమ - అణిమ-అను మూడు పర్వములు కలవు. పరమాత్మయందు అవ్యయాక్షరక్షరము లను మూడు పర్వములు అధియజ్ఞాత్మ

యందు స్వాయంభూ-పరమేష్ఠి-సూర్య-చంద్ర-పృథివీ అను నైదు పర్వములు సర్వభూతాంతరాత్మయందు విరాట్టు-హిరణ్యగర్భ-సర్వజ్ఞ అను మూడు పర్వములు.

ఇట్లు సమష్టిదృష్టిచే ఈశ్వరాత్మ వ్యూహము నాల్గుభాగములుగను వ్యష్టిదృష్టిచే 14 లేక 11 భాగములుగను ఉన్నది. ఇందు త్రిపర్వ పరమాత్మ యొక్కయు అపర్వ లేక త్రిపర్వ పరాత్పరునియొక్కయు సప్రమాణ నిరూపణమైనది. ఇక ముందు ప్రకరణమునందు, క్రమప్రాప్తమగు బ్రహ్మనామక మగు రెండవ లేక మూడవదగు పంచపర్వయుక్త అధియజ్ఞాత్మ యొక్క సప్రమాణ నిరూపణ సేయబడును.

(1) పరాత్పరాత్మ (నిగూఢాత్మ - అధయాత్మ - తురీయం బ్రహ్మ) (అపర్వా) (1) భూమాత్మా, (2) అణిమాత్మా, (3) భూమాణిమాత్మా (త్రిపర్వా).

2. అవ్యయాత్మ-జ్ఞానమూర్తి ఆలంబనాత్మ
3. అక్షరాత్మ-క్రియామూర్తి-సర్వమూర్తి-నియంతాత్మ
4. క్షరాత్మ-అర్థమూర్తి-పరిణామ్యాత్మ

} పరమాత్మ [పురుషః]

సవిశేషచతుష్పర్వా - అమృతాత్మా ప్రథమో వ్యాఖ్యాతః

ఇతి - సగుణామృతాత్మనిరుక్తిః

# అధియజ్ఞాత్మనిరుక్తి

ఆత్మసంస్థలందుత్తరోత్తరమునందు బూర్వపూర్వ సంస్థలనువర్తించుచుండునని జ్ఞాపకముంచుకొనవలయును. శ్రుతియు

'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' అనియెను. ఈ దృష్టితో కార్యరూపావ్యయునందు కారణరూప పరాత్పరుడు అను నీచొప్పున జీవరకు గార్యరూపక్షరునందు పరాత్పరావ్యయాక్షరులు నుందు రనకోవలయును.

ప్రస్తుత బ్రహ్మాత్మ సంస్థాకారణత అమృతాత్మయొక్క నాల్గవపర్వముకు క్షరునకే యున్నను అతడక్షరావ్యయ పరాత్పరా వినాభూతుడు కనుకనే శ్రుతియు షోడశీప్రజాపతినే కారణముగ జెప్పుచు 'ప్రజాపతిః ప్రజయాసంరరాణ స్త్రీణిజ్యోతీంషి సచతే సషోడశీ' అని చెప్పెను. ఈ కార్యకారణ ప్రవాహమునే రాబోవు నాత్మసంస్థాంను నెఱుంగవలయును. ఈ ప్రవాహం ఫలమేమి? ఒక మహాపశ్వమం దెన్ని యాత్మసంస్థలు (బ్రహ్మవిభూతులు) ఉన్నవో అన్నియు నొక యావగింజయందు బరీక్షించినను ఉన్నవని తేలును. వేయేల? అన్నిట నన్నియు నుండుచున్నవి. ఇదే బ్రహ్మయొక్క సర్వత, సర్వవ్యాపకత "సర్వం ఖల్విదం బ్రహ్మ, 'బ్రహ్మైవేదంసర్వం' "ప్రజాపతేనత్వ దేతాన్యన్యో విశ్వారూపాణి పరితాబభూవ" "ప్రజాపతిస్త్వేవేదం సర్వం యదిదంకించ" "సర్వ ముహ్యేవేదం ప్రజాపతిః" "యద్వై కించప్రాణి సప్రజాపతిః" ఇత్యాదు లీ రహస్యమునే ప్రకటించును. దీనిని లక్ష్యముగాగొని, అమృతాత్మయొక్క క్షరభాగమునుండి వెలసిన పంచపర్వయుక్త అధియజ్ఞాత్మను మీమాంస సేయుదము.

అక్షరునుండి యాత్మక్షరవికాస మయ్యెను. ఒక సెనగ

గింజ కివి రెండు దళములు:— ఒకటి అపరిణామ-అమృతప్రధానము అక్షరము పరాప్రకృతి. రెండవది పరిణామి బలప్రధానము క్షరము అపరాప్రకృతి. దానికళలే దీనికిని గలవు. ఇక భేదమేమన :— అవి నిత్యములు పరిణామరహితములునగుట నందుండి యే వికారములును గలుగవు. ఇవి, స్వకారణతాదృష్టింబట్టి నిత్యములు నవికృతములు నయ్యును పరిణామజనకములు. వికారములు వీనినుండియే కలిగెను.

అక్షరబ్రహ్మయొక్క అమృతప్రధాన బ్రహ్మకళాప్రతిష్ఠత క్షరమృత్యుప్రధాన బ్రహ్మకళనుండి పుట్టిన వికారము ప్రాణము. ఇట్లే అమృత విష్ణుకళా ప్రతిష్ఠిత మర్త్య విష్ణు కళాజనితవికారమాపస్సు. అమృతేంద్రకళాప్రతిష్ఠిత మర్త్యేంద్ర కళాజనిత వికారమువాక్కు. అమృతాగ్ని కళాప్రతిష్ఠిత మర్త్యాగ్ని కళాజనితవికారమన్నాదము - అమృత సోమకళాప్రతిష్ఠిత మర్త్య సోమ కళాజనిత వికారమన్నము అనబడును.

ప్రాధానికమున, 'గుణభూతములు తన్మాత్రలు' నాబడునవినై జ్ఞానికులచే వికారక్షరము లనబడును. ప్రాణవికారము శబ్ద తన్మాత్ర-ఆపోవికారము స్పర్శతన్మాత్ర - వాగ్వికారము రూప తన్మాత్ర - అన్నాదవికారము గంధతన్మాత్ర - అన్నవికారము రసతన్మాత్ర. ఇవి పుట్టిన వెంటనే స్వతంత్రములుగా నుండక నొకదానియం దొకటి యాహుతములగును. ఇదే ప్రాథమిక యజ్ఞము. అగ్నియందు సోమాహుతి యజ్ఞము. దేనియం దాహుతియగు నది యగ్ని. అదే యోని. ఏది యాహుతియగు

నయ్యది సోమము. అగ్ని అన్నాదము, సోమ మన్నము. అయిదిట నైదును ఆహుతములగుటచే నన్నియు నన్నములు నన్నాదములు నగు 'సర్వ మన్నం, సర్వ మన్నాదః'.

ప్రాణము యోని యనుకొనుడు. తక్కిన యాపోవాగన్నాదాన్నము లను నాల్గిటిని రేతోరూపాహుతిద్రవ్యము లనుకొనుడు. వీని యాహుతిచే వికసితమగు పంచాత్మకప్రాణము 'పంచీకృతప్రాణ' మనబడును. ఇదే పిమ్మటి భౌతికసర్గకారణ మగును. కనుక నిది 'విశ్వసృట్ప్రాణ' మని చెప్పబడినది. ఇందు అయిదునున్నను ప్రధానత యోనిస్థానీయ ప్రాణమునకే. 'రేతః' స్థానీయములగు తక్కినవిగౌణములు కనుక తద్వాద న్యాయముచే, ఈ పంచకృతప్రాణమును 'ప్రాణ'మనియే యందురు. సరిగా నిదే క్రమమును పంచీకృతాపోవాగన్నాన్నాదముల విషయముననూ ఎరుంగవలయును. ఇదే దర్శనశాస్త్రము నందలి సుప్రసిద్ధ పంచీకరణ ప్రక్రియ. దీనినే వైజ్ఞానికులు యజ్ఞప్రక్రియ యందురు. చివరకు క్షరుని పంచకళలనుండి పుట్టిన ప్రాణాది పంచవికారక్షరముల పంచీకరణ రూపయజ్ఞముచే యజ్ఞాత్మకములగు ప్రాణాది పంచ 'విశ్వసృట్' నిష్పత్తియయ్యెనని తేలినది.

ఈ 'విశ్వసృజ'ములనే పంచజనము లందురు. ఉత్పత్తిభావ సూచకము జనత్ శబ్దము. వీనినుండియే స్థూలజగ దుత్పత్తి. కనుక వీనికీ పేరులు. "యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః" అను వాక్యమీ ప్రాణాదిపంచ పంచజనములనే చెప్పును. అన్నిట నన్నియు హోమములగుటచే నీ మొదటి

యజ్ఞము సర్వహుతము, సర్వమేధము అనబడును. 'సహాయజ్ఞాః ప్రజాః' వేదాదిసృష్టుల కిదేమూలప్రవర్తక యజ్ఞము 'తస్మాద్య జ్ఞాత్సర్వహుతః ఋచః సామానిజజ్ఞిరే".

సృష్టికి మూలము లీయ్మెదే యగుచో సృష్టియందు వైష మ్యమే లేకుండెడిది. కాని, సృష్టియొక్క పంచ పర్వములందు నెంతో భేద మున్నది. ఇందుకు పంచజనముల విశేషతయే కారణము. అనగా:— యజ్ఞముచే మరల యజ్ఞము జరుగును. అపుడు ఆ పునరుత్పన్న యజ్ఞము సమత్వాచ్యుతమై విషమమగును. ఎట్లన:—

పంచీకృతప్రాణము యజ్ఞమూర్తి. దీనిని యోని యను కొనుడు. ఇందు తక్కిన నాలుగు పంచీకృత యజ్ఞక్షరములు ఆహుతములు కాగా బుట్టు విశేషభావము 'పంచీకృత పంచజన' మగును. ఇట నిక ప్రాణాది నామము లుండక ఈ పంచకము నకు వేద - లోక - దేవ - భూత - పశునామములు కల్గును. అనగా:— 1. ప్రాణప్రధాన పంచీకృత పంచజనము వేదము. 2. ఆపఃప్రధాన పంచీకృత పంచజనము లోకము. 3. వాక్ప్ర ధాన పంచీకృత పంచజనము దేవత. 4. అన్నప్రధాన పంచీ కృత పంచజనము పశువు. 5. అన్నాదప్రధాన పంచీకృత పంచ జనము భూతము. ఈ పంచకమే ప్రత్యక్షదృష్ట - సుప్రసిద్ధ పుర పంచకోపాదన మగును. కనుక వీనిని పురంజనము లందురు. పంచజనాత్మక యజ్ఞముచే మరల యజ్ఞము జరిగినపిదపనే యజ్ఞ మూర్తి గర్భిత (పంచజనగర్భిత) యజ్ఞమూర్తు లీ పంచపురంజన

ములు వికసిల్లెను.

శారీరకతంత్రదృష్టి అక్షరధియా అవ్యయుపై నున్నట్లు, ప్రాధానికదృష్టి గుణభూతరూప వికారక్షరముపై విశ్రమించు నట్లు విశేషభావముం బ్రేమించు వైశేషికము పంచజనములపై విశ్రమించును. ఇదే దాని యణువాదము. ఇక పురంజన వాదమే తార్కికుల పరమాణువాదము. ఇంతకు జెప్పదలచి నది:- ఆత్మాక్షరమే వికార, పంచజన, పురంజన రూపములం బరిణమించునని యే.

ఈపంచపురంజనములనుండియే సుప్రసిద్ధములగు స్వాయంభూ-పరమేష్ఠి - సూర్య - పృథివీ చంద్రపురము లైదును వెలసినవి. వేదమునుండి స్వాయంభువుయొక్కయు, లోకమునుండి పరమేష్ఠి యొక్కయు, దేవతనుండి సూర్యునియొక్కయు, భూతము నుండి పృథివియొక్కయు, పశువునుండి చంద్రునియొక్కయు వికాసములు కలిగెను. అయిదు పురంజనములనుండి వెలసిన యైదును బిమ్మట వీని స్థూలరూప జనకము లగుచున్నవి. 1. వేదమయ స్వయంభువు వేదసృష్టికి, లోకమయ పరమేష్ఠి లోకసృష్టికి, దేవమయ సూర్యుడు దేవసృష్టికి, భూతమయ పృథివి భూతసృష్టికి, పశుమయ చంద్రుడు పశుసృష్టికి అధిష్ఠాత లగుదురు. ఇదే సంపూర్ణమగు పంచపర్వ విశ్వప్రపంచము. ఈ యైదిటి యొక యాత్మ 'అధియజ్ఞాత్మ' యనబడును. అనుప సృష్ట క్షరమును బ్రహ్మయందురు. కనుక నీ సప్తలోకాధిష్ఠాత యగు నధియజ్ఞాత్మను 'బ్రహ్మ' యనవచ్చును. ఇదే వైజ్ఞానికు

లచే ఉపేశ్వరు డనబడును.

ఏలయన:— వెనుక అఖండపరాత్పరునందు ఒక్కొక్క మాయచే నొక్కొక్క యశ్వత్థబ్రహ్మసంబంధమును, వానికి వేయి - వేయిశాఖలును, ప్రతిశాఖకు పంచ పంచపర్వములు చెప్పియుంటిమి. పంచపర్వములు గల యొకబల్శ యొక చిన్న విశ్వము. మహామాయియగు నా విశ్వేశ్వరునందు ఇట్టివి 1000 విశ్వము లున్నవి. సహస్రశాఖలు గలది మహావిశ్వము. ఆ మహేశ్వరసంలగ్నములగు నీసహస్రబల్శేశ్వరుల నొక్కొకని నుపేశ్వరు డనవచ్చునుగదా!

పరాత్పరుని 'వన' మంటిమి. 'షోడశీ ప్రజాపతి' యనబడు మహేశ్వరు డావనమందలి యొకవృక్ష మంటిమి. ఏమి వృక్షము! అశ్వత్థము వనస్పతి విభాగములోనిదగుటచే దీనిని శ్రుతి, వేయి శాఖలుగల దన్నది. ఒక్కొకశాఖయందు స్వాయంభ్వాది పంచ పర్వము లున్నవి. ఇందు బ్రహ్మాగ్ని రూప స్వాయంభువు ద్యు లోకము, దేవాగ్ని రూప సూర్యుడు అంతరిక్షలోకము, అన్నా దాగ్ని రూప పృథివి పృథివీలోకము, సప్తలోకావచ్ఛిన్నో పేశ్వర ప్రజాపతి కీ భూర్భువస్స్వః నామకములు మూడును మహా వ్యాహృతులు. 'త్రివృత త్రివృత ఇమే లోకాః' అన్న త్రివృ ద్భావముచే నిందు ప్రతిదానియందు నీమూడు నుండుచుండును. ఈ విధముగ మూడును ఏడులోకము లగును. మన మున్నది భూః. సూర్యుడున్నది స్వః. మధ్యదగు నంతరిక్షము భువః; ఇదే మొదటిదగు రోదసీత్రిలోకి. ఇది మొత్తముగ భూః.

పరమేష్ఠి యున్నది స్వః. ఈ రెంటి నడుమదగు నంతరిక్షము భువః ఇదే రెండవదగు క్రందసీ త్రిలోకి. మరల నీ మొత్తము భూః. స్వయంభూ స్వః. ఈ రెంటినడుమ భువః. ఇదే మూడవ దగు సంయతీ త్రిలోకి రోదసి క్రందసికి భూః-క్రందసి సంయతికి భూః. కనుక నే 9కి బదులు ఏడే లోకము లగును. ఈ యేడు లోకములును క్రమముగ 'భూః - భువః - స్వః - మహః - జనత్ - తపః - సత్యం' అనబడును. ఇవి యీ ప్రజాపతికి సప్త వ్యాహృతులు.

పృథివి భూః, సూర్యుడు స్వః, రెంటిమధ్య నున్నది భువః (ఇందే చంద్రుడు). సూర్య - పరమేష్ఠి మధ్య మహః. పరమేష్ఠియే జనత్ లేక జనలోకము. పరమేష్ఠి-స్వయంభూమధ్య తపోలోకము. స్వయంభు వే సత్యలోకము. ఈ సప్తలోకము లందును మహావ్యాహృతిరూపములగు స్వయంభూ - సూర్య - పృథువు లన్నవి మూడే లోకములు ప్రధానములు. ఎట్లన:- ఇవి వరుసగ బ్రహ్మాగ్ని-దేవాగ్ని-అన్నాదాగ్నులు. పరమేష్ఠీ చంద్రులు రెండును సోమములు. పరమేష్ఠిసోమము బ్రహ్మాగ్ని దేవాగ్నుల మధ్యనుండి తద్గ్రహణ గృహీతమును, చాంద్ర సోమము - దేవాగ్ని అన్నాదాగ్నుల మధ్యనుండి తద్గ్రహణ గృహీతమును కాగా నిట్లు ఒకశాఖయందు మూడే ముఖ్య పర్వము లుండును.

బ్రహ్మాగ్ని బ్రహ్మ, దేవాగ్ని విష్ణువు, అన్నాదాగ్ని శివుడు. వీరు వరుసగ సత్య-దేవ-భూత పతులు. బల్యాత్మక

త్రిలోకీ సంచాలకులు మూావురు దేవతలే. సత్యమూర్తి యగు బ్రహ్మ (స్వయంభువు) ఉపేశ్వరుని మస్తకము. దేవమూర్తి విష్ణువు. (సూర్యుడు) చక్షూపలక్షితహృదయము. భూతమూర్తి శివుడు. (పృథివి) పాదము. ఆ మహాశ్వత్థవృక్షమునకిట్టి శాఖ లోక సహస్ర మున్నవి. అనగా, వేయి యుపేశ్వరులున్నారు. కనుక మహామయీ మహేశ్వరుని (ఈ సహస్రోపేశ్వర సంబంధముచే) శ్రుతి యిట్లు వర్ణించెను.

"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
సభూమిం సర్వతఃస్పృత్వా ఉత్యతిష్ఠ ద్దశాంగులమ్"

ఈ మహామాయీ సహస్ర సృష్టిధారలను సృష్టీకరించు నీ వచనముల నరయుడు.

1. వనస్పతే! శతబల్శోవిరోహ, సహస్రబల్శా వివయం రుహేమ
యంత్వామయం స్వధితిస్తేజమానః ప్రాణినాంమహతే సౌభగాయ ॥
(ఋక్)

2. గౌరీర్మిమాయ సలిలానితక్షత్యేకపదీ ద్విపదీ సప్త చతుష్పదీ
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్ (ఋక్)

3. ప్రసోమాయ వ్యశ్వవత్ పవమానాయ గాయత, మహేసహస్రచక్షసే
(ఋక్)

4. కృత్యానినౌ సఖ్యాబభూవుః సచావహే, యదవృకం పురాచిత్
బృహంతంమానం వరుణఃస్వధావః సహస్రద్వారం జగమా గృహంతే॥

5. సహస్రధా పంచదశాన్యుక్థా యావద్ద్యావాపృథివీ తావదిత్తత్
సహస్రధా మహిమానః సహస్రం యావద్బ్రహ్మవిష్ఠితం తావతీ
వాక్ ॥ (ఋక్)

1. శతబల్శయగు నో వనస్పతీ! (నీ యథార్థ విస్తారము నెరింగి) మేము నీ సహస్రశాఖలపై నెక్కగలము; అట్లనుగ్రహింపుము. యజ్ఞకర్తలగు ప్రాణుల సౌభాగ్యముకొరకు నిన్ను నఱకుచున్నాను.

యజ్ఞమందు వృక్షశాఖ కుపయోగ మున్నది. నఱకుట చెడ్డపని. కనుక చెడుఫలము రాకుండ నీ ప్రార్థన. దీని నా యశ్వత్థముతో బోల్చిన భావనతో "నీకు వేయిశాఖలున్నవి. నీవు పూర్ణమవు. నీ వెన్నడును భిన్నము గాజాలవు. నీవు స్వయముగనే నీయందలి కొలదిప్రదేశమును, (ఒకశాఖను) సప్తలోకవాసులగు ప్రాణుల జీవనముకొరకు ప్రదానము చేయుచున్నావు" అని యట్లు చెప్పబడినది.

2. (వీచీతరంగ రూపయగు నా) గౌరి (గాభావయుక్తయగు అక్షరవాక్కు) ఈ సముద్రమును సీమితముగావించెను. అదియే భిన్న భిన్న ఆపోమయ పదార్థములను మితములు (మానమునకు లొంగినవానిని) గ జేయుచు, ఏకపది, ద్విపది, సప్తపది, చతుష్పది, అష్టాపది, నవపది యగుచు, జివరకు తనదగు నా మహామాయామయ పరమాకాశమందు వ్యాప్తమై సహస్రాక్షర (సహస్రబల్శాత్మక) మైనది.

3. సోమముకొరకు వృద్ధిభావము కలిగెను. ఆ సహస్రద్రష్టయగు పవమాన సోమముకొరకు స్తోత్రపాఠముంచేయుదు.

సోమము పారమేష్ఠ్యతత్త్వము. ఇటనుండియే సహస్రధారా వికాసము కల్గును. కనుకనే సోమమును సహస్రచక్షా యని

చెప్పెను. ఈ సహస్రధార సోమాహుతిచే సూర్యుడు సహస్రాంశు డగుచున్నాడు. సోమముయొక్క యీ సహస్రధారలు ఆ సహస్రబల్శాత్మిక యగు వాక్కుయొక్క తూలావస్థలు. 'సోఽపోఽసృజత వాచఏవలోకాత్ - వాగేవసాస్సృజ్యత' అనుటచే వాక్కే అమూర్తియగు సోమరూపమున బరిణతి మగుచున్నది.

5. ఆప్రజాపతియందు సహస్రభావాత్మక లేక సహస్రరూపమున వికసితములగు 15 ఉక్థము లున్నవి. ద్యావాపృథువులు (మహావ్యాహృతులు) వ్యాప్తములై యున్నంతవరకు ఈ సహస్రభావము వ్యాప్తమై యున్నది. ఇంతేగాక తదీయ సహస్రపర్వములును బిమ్మట తమ మహిమచే నొక్కొక్కటియు మరల వేయి వేయి భావములుగ బరిణతి నొందుచున్నవి. కాని ఎంతవరకు (పరమాకాశాత్మకమగునీ) యధియజ్ఞాత్మ వ్యాప్తమై యున్నదో అంతవరకు వాగ్రూపమగు నీ యేకసహస్రధారా వితానము నున్నది.

ఋగ్వేదమున నింకను ఆకు చోట్ల ఆమహామాయియొక్క సహస్రభావముల నిరూపణ మనేకరూపముల నున్నది. అన్నిటికి మూలము సహస్రభావాపన్నాశ్వత్థప్రజాపతి. కనుకనే, అతని విశ్వమందలి ప్రతిపర్వమందును మన మీ సహస్రభావము నరయగలము.

ప్రతివస్తువునందును తత్తన్నియత సాహస్రీమండలముందును. ప్రతియొక సాహస్రియు వేదలోకవాగ్భేదమున మూడు మూడు

భాగములుగ నుండును. పదార్థము భౌతికము. భౌతికవిశ్వ సంచాలకులు బ్రహ్మ-విష్ణు-ఇంద్రులుముగ్గురు దేవతలు; ఇందు బ్రహ్మప్రతిష్ఠ. ఏతదాధారమున నున్న ఇంద్ర - విష్ణువుల స్పర్ధ వలననే పై జెప్పిన వేద లోక వాక్సాహస్రులు వితతములగును. ఈ వచనము నరయుడు:-

'ఉభాజిగ్యథు ర్నపరాజయేథే నపరాజిగ్యే కతరశ్చనైనోః
ఇంద్రశ్చ విష్ణూ యదపస్పృధేథాం, త్రేధాసహస్రం వితదైరయేథాం,
కింతత్ సాహస్రమితి? ఇమే లోకాః - ఇమే వేదాః - అథో వాగితి
బ్రూయాత్.

పూర్ణేశ్వరుని (మహేశ్వరుని) పూర్ణత సహస్రసంఖ్యతో సమాప్తము. కనుకనే సహస్రశబ్దము పూర్ణార్థకమనిరి. 'సర్వం వై సహస్రం' *'పూర్ణం వై సహస్రమ్' ప్రతిపదార్థమందును సహస్రవర్త్మ యగు సామవేదసంబంధమున సహస్రగవోప భోగము జరుగుచున్నది. వీనివలననే వషట్కారనామక వాక్సాహస్రీ స్వరూపము నిష్పన్న మగుచున్నది. వేయవదగు సామ మా వస్తువునకు సమాప్తి - పూర్ణత. కనుకనే యది (ఆసామము) ఉద్భృచసామ - నిధనసామ అను మొదలగు నామ

---

*ఈ రహస్యమెరుగక పూర్వులకు 1000 కంటె నంకెలసంగతి తెలియ దనుకొనువారు: పాపము! "తదిదమిమాః అతివిధ్య దశధా, శతధా, సహస్రధా, అయుతధా, ప్రయుతధా,నియుతధా, అర్బుదధా, న్యర్బుదధా, నిఖర్వధా, పద్మ - మక్షితి-వ్యోమాంతః యథాద్యౌ, విష్యన్దమానః పరః పరోవరీయాన్ భవతి ఏవమేవైతత్షరం పరః పరోవరీయోభవతి - యను శ్రౌతవచన మెరుంగరు.

ముల బిలువబడును. కానిండు! ఈ విషయ వివరణ మిప్పు డప్రస్తుతము.

ప్రస్తుతము:— మహామాయి యగు సర్వతేశ్వరుని యొక్క శాఖాసంబంధముగల బల్శేశ్వరుడే యుపేశ్వరుడు. సప్తవితస్తి కాయుడగు నీతనిని బ్రహ్మాత్మ - అధియజ్ఞాత్మ యందుము. ఆషోడశీ అన్ని బల్శావిశ్వములందువలెనే మన యీ బల్శావిశ్వ మందును బ్రవిష్టు డగుచున్నాడు. పంచపర్వాత్మక బల్శాయుం దవారపారీణుడుగ నుండు నాయొక షోడశియే అధియజ్ఞాత్మ. అతడు క్షరబ్రహ్మ నెదుటబెట్టుకొనియే ఈ బల్శాకు లేదా యజ్ఞమునకు అధ్యక్షుడై యున్నాడు. కనుక నీ యజ్ఞవిశ్వముం బట్టి యతనిని బ్రహ్మాత్మ యందుము. ఆయన ఆత్మ. బల్శ యతని శరీరము. రెంటి సమష్టి ప్రజాపతి (ఉపేశ్వర ప్రజాపతి). మహావిశ్వము షోడశికి శరీరము. బల్శాత్మకము సప్తలేక పంచ పర్వాత్మకమునగు విశ్వమీ క్షరప్రధానాధియజ్ఞాత్మకు (బ్రహ్మాత్మకు) శరీరము. త్రైలోక్యమును, అందలి చరాచరప్రజను గర్భమందుంచికొన్న యీ క్షరప్రధానాధియజ్ఞాత్మ నీ క్రింది వచనములు నిరూపించుచున్నవి.

అధియజ్ఞాత్మ (సప్తలోకాధిష్ఠాత-ఉపేశ్వరః-యజ్ఞపురుషః)

---

1. త్రిస్రోమాతౄ స్త్రీన్ పితౄన్ బిభ్రదేక ఊర్ధ్వస్తస్థౌ నేమవ గ్లాపయన్తి
మంత్రయన్తే దివో అముష్యపృష్ఠే విశ్వమిదం వాచ మవిశ్వమిన్వామ్ ।
[ఋక్]

2. ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ
ప్రాణైః చిత్తం సర్వ మోతం ప్రజానాం యస్మిన్ విశుద్ధే విభవత్యేష
ఆత్మా॥ (ముండక)

3. ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని భూతం భవ్యం యచ్చ వేదా వదన్తి
అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్ తస్మింశ్చాన్యో మాయయా
సంనిరుద్ధః॥ [శ్వే]

4. యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః
తమేవమన్యే ఆత్మానం విద్వాన్ బ్రహ్మాఽమృతోఽమృతమ్॥

5. యస్మిన్నిదం సంచ విచైతిసర్వం యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః
తదేవ భూతం తదుసర్వమాఇదం తదక్షరే పరమే వ్యోమన్॥

6. యేనావృతం ఖంచ దివం మహీంచ యేనాదిత్య స్తపతి తేజసా
భ్రాజసాచ । య మంతస్సముద్రే కవయోవయన్తి యదక్షరే పరమే
ప్రజాః॥

1. మూవురు మాతలను (పృథువులు) మూవురు పితలను (ద్యులోకము) (మూడంతరిక్షములను) ధారణసేయు నా హృదయస్థమగు నేకతత్త్వము (అధియజ్ఞాత్మ) ఇంచుకంతయు నలయదు. దీని స్వయంభూరూప ద్యులోకపృష్ఠమందలి సప్తలోక పదార్థములును, సంపూర్ణవిశ్వముగ నగుచున్నను విశ్వాతీతముగ నుండునట్టి వాక్కుతో మంత్రణ సేయుచున్నవి.

మూడు ద్యులోకములు, మూడు పృథువులు, మూడంతరిక్షములు ఈ మొత్తము 9 లోకములు. ద్యులోకము పిత. పృథివి మాత. ఈ 9 యు 7 అగునని మున్ను చెప్పియుంటిమి. వీని కన్నిటికిని సప్తలోకవ్యాపి అధియజ్ఞాత్మయే ప్రతిష్ఠ. సప్త

లోక చరాచరప్రజ, మూలప్రతిష్ఠారూపము, ద్యులోకస్థానీయము నగు సత్యస్వయంభూయొక్క వాక్కుతో మంత్రణ సేయుచున్నవి. (వాక్కుతో సంబంధించుటయే మంత్రణ). 'వాచీమా విశ్వా భువనాన్యర్పితా' చివరకు వాక్కుయొక్క విశ్వాతీతత్వము సిద్ధమగుచున్నది. కనుకనే 'అవిశ్వమిన్వామ్' అని చెప్పబడినది.

అధియజ్ఞాత్మ వాఙ్మయము. వాక్ప్రధానము. అవ్యయుని మనోవికాస మతనియందే. ప్రాణవికాస మక్షరునందు. వాగ్వికాసము క్షరునందు. ఈ క్షరుడే పూర్వోక్త ప్రకారమున నధియజ్ఞాత్మగ బరిణమించును. అధియజ్ఞాత్మయొక్క యీ వాగ్వికాసము సత్యస్వయంభువునందే యగును. కనుకనే స్వయంభూబ్రహ్మను ప్రాణసంబంధముచే ప్రాణమూర్తియన్నట్లే వాక్సంబంధమున వాక్పతి యనియు నందుము. ఈయనయే ద్యుపృష్ఠము. ఇటనుండియే సప్తలోకములును వాక్కుంగొని జీవించును.

2. అణువగు నీ యధియజ్ఞాత్మ విశుద్ధచిత్తముచే విజ్ఞేయము. ఇందు ప్రాణాఽపానవ్యానోదానసమానము లను నీ పంచప్రాణములు (యజ్ఞక్షరములు) ప్రవిష్టములైనవి. ఈ ప్రాణముల నాధారముగ గొనియే సప్తలోకప్రజాచిత్తములు నోతములై యున్నవి. చిత్తము శుద్ధికాగా, ఆత్మ వైభవము నొందును.

3. గాయత్ర్యాది సప్తఛందములు. అతియజ్ఞ, మహాయజ్ఞ, శిరోయజ్ఞాది సంపూర్ణయజ్ఞములు (పురుషార్థకర్మలు) అగ్ని

హోత్ర, అగ్న్యాధానాది సర్వక్రత్వర్థకర్మలు, వేదోక్తభూత భవిష్యములు అన్నియును దీనినుండి వెలువడినవి. ఆ మాయి యీ విశ్వము నుత్పన్నము సేయుచున్నాడు. ఇక, నీతని యంశభూతుడగు నింకొకమాయి (జీవుడు) తన యజ్ఞానముచే ఈ మాయయందు బద్ధుడగుచున్నాడు.

4. పంచీకృత ప్రాణాపోవాగన్నాన్నాదము లను పంచ పంచజనములును, వీనికి మూలభూతమగు స్వయంభూరూపమగు నాకాశమును నిందున్నవి (అధియజ్ఞాత్మయందున్నవి). వ్యోమ ప్రతిష్ఠయగు నిది పరమవ్యోమము. ఇదే (విశ్వమునకు) ఆత్మ. ఈ యమృతలక్షణ బ్రహ్మాత్మ నెరుంగువాడు తానును తద్రూ పుడే యగును.

5. సప్తలోకములు, అందరు దేవతలు, భూతభవిష్యములు, సర్వము నిందేయున్నవి. ఈ సర్వప్రతిష్ఠాలక్షణాక్షరమూర్తి యధి యజ్ఞాత్మ పరమవ్యోమ లక్షణాక్షురునందు ప్రతిష్ఠితమై (తద్రూపమున) యున్నది.

6. ఆకాశము (సయంభువు) ద్యౌ (సత్యము) పృథ్వి (భూ తము) దేని (గర్భమందున్నవో) చే నావృతములై యున్నవో, దేని ప్రభావముచే ఆదిత్యుడు, వర్చోలక్షణ తేజస్సు - దీప్తి లక్షణభ్రాజస్సులచే తపించుచున్నాడో వైజ్ఞానికులు దేనిని (పారమేష్ఠ్య) సముద్రగర్భమందు (మహానాత్మగర్భమునందు) వితతము గావించుచున్నారో - ఏయక్షరసహాయోని (కనుక నే అక్షరమూర్తి) (పరమమగు) అధియజ్ఞాత్మయందు జీవసర్గ

మంతయు బ్రతిష్ఠనొంది యున్నదో ఆయాత్మయే జ్ఞేయము.

షోడశీప్రజాపతియను నాత్మకు పరాత్పరావ్యయాక్షరక్షరము లను నాల్గుభేదము (పర్వము) లున్నట్లు - సప్తలోకవ్యాపియగు నీయధియజ్ఞాత్మకును అవాంతర భేదములు అయిదున్నవి. ఇం దొకటి 'పరమప్రజాపతి ఆభూప్రజాపతి పరోరజా' మొదలగు నామములం బిలువబడును. తక్కిన నాల్గుభేదములను ప్రతిమా ప్రజాపతులందురు. ఇవియొక్కొక్కటిగా జూతము.

1. పరమ ప్రజాపతి (స్వయంభూ పరోరజా ఆభూ) స్వయంభూతత్త్వమే పరమప్రజాపతి. ఒకవిధముగ నధియజ్ఞాత్మయునిదియు నభిన్నములవంటివే అయినను, ప్రాణపర్వదృష్టితో దీనినదే యనక దానియందొక పర్వమందుము 'యస్మిన్ ప్రాణాః పంచధా సంవివేశ' అన్నట్లు ఇది ప్రాణరూపస్వయంభువు; అ బ్రూపపరమేష్ఠి మొదలగునైదు నందేప్రోతములు. స్వయంభూ మహిమయందును నైదునున్నను అయిదవది స్వయంభువే కనుక తత్సంబంధమున 'యస్మిన్ ప్రాణః పంచధా' అన్నవచనము చక్కగా చరితార్థముకాదు. కారణమేమన:—

ఏడిటను స్వయంభువు కేవలము సత్యలోకప్రధానుడు. స్వస్వ రూపముచే నాకాశాత్మ - ఆకాశరూపి. ఇందు నాలుగే పంచ జనము లున్నవి. అయిదవ పంచజనము స్వయంభువు తానే. ఇక: నిందు పంచపురంజనములు, సప్తలోకములు, సప్త లోకాధిష్ఠాతసత్యాకాశమగు "తాను" అనుదృష్టితో శ్రుతి యట్లు చెప్పియున్నది.

స్వాయంభువు బ్రహ్మ ప్రాణప్రధానము. యజ్ఞాత్మకు ప్రాణరూపమగు నొకపర్వము సత్యలోకాధిష్ఠాత ఆకాశాత్మ. దీనికి ఆత్మ - పద - పునఃపదము లను మూడుపర్వములు. హృదయస్థ భావమాత్మ - దీనిని ప్రాణాత్మ సత్యాత్మ యందుము:- స్వాయంభూపిండము పదము. స్వాయంభూమహిమ (ఆకాశము) పునః పదము. పదరూపమున నీస్వాయంభువు పరమేష్ఠిపైనున్నది. సప్తలోకమూర్తియగు నిది సర్వాధారస్థిరము. తక్కినవాల్గును చలములు. చంద్రుడు పృథివి నలువంకలను, చంద్రపృథువులు సూర్యుని నలుగడలను పృథివితోడి సూర్యుడు పరమేష్ఠికి నలువైపులను సూర్యసహితపరమేష్ఠి స్వాయంభువు నలుదిక్కులను పరిక్రమించుచున్నారు. ఇందువల్ల నీభూరాదులు 'రజస్సు' లందురు; సత్యస్వాయంభువు సర్వాధారస్థిరము కనుక 'పరోరజా' యనబడును.

ఈ స్వాయంభువు తక్కినయూరిటను అంతటను వ్యాప్తమై యుండుటచే 'అభూప్రజాపతి' యనబడును. అయిదింటిలో నిదే పెద్దపర్వము. కనుక 'పరమప్రజాపతి' యనబడును; వేద - సూత్ర - నియతిభేదమున దీనికి మూడుమనోతలు. ఈయవ్యక్త స్వాయంభువు వేదాత్మకనై వ్యక్తప్రజాసృష్టికి కారణమగుచున్నది. నియతిరూపమున నంతర్యామి యగుచున్నది. ఇక సూత్రభాగము:- ఋత - సత్యభేదములచే ద్విధావిభక్తము గావించి ఋతసత్యాత్మకములగు పదార్థములకు దనమాత్రాప్రదానము గావించుచున్నది. ఇట్లు సప్తలోకాత్మకవిశ్వమున

కంతయు నన్నియు నిదే యైయున్నది. కనుక నిది యధి యజ్ఞాత్మకు దుల్యమంటిమి. ఈ విశ్వకర్మయగు స్వయంభువును శ్రుతి యిట్లు నిరూపించుచున్నది.

1. విశ్వకర్మాహ్యజనిష్టదేవ ఆదిద్గంధర్వో అభవద్ద్వితీయః
తృతీయః పితా జనితౌ షధీనా మపాంగర్భం వ్యదధాత్ పురుత్రా॥
[యజు]

2. యా తే ధామాని పరమాణియావమా యామధ్యమా విశ్వ కర్మన్ను తే
మా। శిక్షాసఖిభ్యో హవిషిస్వధావః స్వయంయజస్వ తన్వంవా
వృధానః॥ ["]

3. కింన్విదాసీదధిష్ఠానమ్, ఆరంభణం కతమత్ స్విత్ కథాసీత్
యతోభూమిం జనయన్ విశ్వకర్మా విద్యామౌర్ణోత్ మహినా విశ్వ
చక్షా॥

4. యో నఃపితా జనితా యోవిధాతా ధామాని వేద భువనానివిశ్వా
యో దేవానాం నామధా ఏకఏవ తంసంప్రశ్నం భువనాయంత్యన్యా॥

5. పరోదివా పరఏనాపృథివ్యా పరోదేవేభి రసురైర్యదస్తి
కింస్విద్గర్భం దధ్రఆపో యత్రదేవాః సమపశ్యన్త పూర్వే॥

6. తమిద్గర్భం ప్రథమం దధ్రఆపో యత్రదేవాః సమగచ్ఛన్త విశ్వే
అజస్య నాభా వధ్యేకమర్పితం, యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః॥

7. విశ్వతఃచక్షు రుత విశ్వతోముఖః విశ్వతోబాహు రుతవిశ్వతస్పాత్
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై ర్ద్యావాభూమిం జనయద్దేవ ఏకః॥

## వేదసృష్టి

8. బ్రహ్మా దేవానాంప్రథమః సంబభూవ విశ్వస్యకర్తా భువనస్య గోప్తా
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠాం అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ
ప్రాహ॥

9. ఘృతాత్పరం మండ మివాతిసూక్ష్మం జ్ఞాత్వా దేవం సర్వభూతేషు గూఢం । విశ్వస్యైకం పరివేష్టితారం, జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వ పాశైః॥

## అంతర్యామి

10. ఏషదేవో విశ్వకర్మా మహాత్మా సదాజనానాం హృదయే సన్నివిష్టః । హృదామనీషా మనసాభిక్లప్తో య ఏతద్విదు రమృతాస్తే భవన్తి॥

11. హృత్పుండరీకం విరజం విశుద్ధం విచింత్యమధ్యే విశదం విశోకమ్। అచింత్య మవ్యక్త మనంతరూపం, శివంప్రశాంత మమృతం బ్రహ్మ యోనిం॥

12. సఏష కాలో భువనస్యగోప్తా విశ్వాధిపః సర్వభూతేషు గూఢః। యస్మిన్యుక్తా బ్రహ్మర్షయో దేవతాశ్చ తమేవంజ్ఞాత్వా మృత్యు పాశాన్ ఛినద్మి॥

13. త్రీనిపదాని నిహితాగుహాసు యస్తద్వేద సపితుః పితాసత్ ।
సనోబంధుః జనితా సవిధాతా, ధామాని వేద భువనానివిశ్వా॥

14. సప్తప్రాణాః ప్రభవన్తితస్మాత్ సప్తార్చిషః సమిధః సప్తజహ్వాః
సప్త ఇమేలోకా యేషుచరన్తి గుహాశయా నిహితాః సప్తసప్త॥

15. తతఃస్వయంభూ ర్భగవా నవ్యక్తో వ్యంజయ న్నిదం
మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీ త్తమోనుదః॥ [మను]

1. మొదట దేవుడు విశ్వకర్మ వెలసెను. తదవ్యవహితోత్తరకాలముననే గంధర్వనామకమగు రెండవ తత్త్వము జనించెను. మూడవవాడు ఓషధుల పిత (సోముడు) ఆపో గర్భము ననేకభాగములుగ (సూర్యుని 12 లేక వేయి భాగములుగ) జేసినవాడు జనించెను.

ఈ మంత్రము స్వాయంభువు - పరమేష్ఠి - సూర్యుడు అను మూడు పర్వములను నిరూపించుచున్నది. విశ్వకర్మ స్వాయంభువు. ఈయన ఆకాశాత్మకుడు. మహాభూతములకు ఆది భూతము. పిదప నాపోమయపరమేష్ఠి వికసిల్లెను. పరమేష్ఠి సోమలోకము 'తృతీయస్యాం వై ఇతః దివిసోమ ఆసీత్' అని శ్రుతి చెప్పెను. సోమము నసురాక్రమణమునుండి రక్షించు ప్రాణము; గంధర్వనామకము. గంధర్వశబ్దముచే పరమేష్ఠియే యుపలక్షితము. మూడవదగు సోమము శుక్రరూపమున నందరకు బిత. కనుక సౌమ్యప్రాణము పితృశబ్దమున బిలువబడును. ఓషధీపితయగు నీసోమమే ఆపోమయ సముద్రగర్భమందు బీజ రూపమున నున్న యగ్నియం దాహుతియై దానిని సూర్య రూపమున బరిణమింపజేయును. ఈ సోమాహుతి వలననే సూర్యజ్యోతి 12 భేదము లొందును. ఇదే ద్వాదశాదిత్యులు. 'అజనయత్ సూర్యే జ్యోతిరిందుః' అన్నట్లు సోమాహుతిచే సూర్యునందు జ్యోతిర్మయ సహస్రరశ్ములు వికసిల్లును.

2. ఓ విశ్వకర్మ! పరమధామ - అవమధామ - మధ్యమ ధామములను నీమిత్రములకు నిన్నుంబోలు శిక్షణ లొసంగు చున్నావు. నీ వీ విశ్వరూప హావిస్సునందు నిన్ను నీవు యజనము సేయుచు నీ శరీరమును వృద్ధినొందించుచు యజింపుము.

స్వాయంభూపరమేష్ఠులు పరమధామములు. పృథివీచంద్రులు అవధామములు. మధ్యమున్న సప్తస్వర్గాత్మక సూర్యుడు మధ్యమధామము. స్వాయంభువునకు నీయన్నియు మిత్రములు.

ఈ వైదును సమానశీలవ్యసనములు. కనుక నివి స్వాయంభువునకు బ్రతిమలు, ప్రతికృతులు అని బడును. స్వాయంభువునకు వలె వీనియందును ఆత్మ - పద-పునఃపదము లను మూడేసి మనోతలుండును. ఇదే వీని కా స్వాయంభూశిక్ష. సర్వహుతయజ్ఞము ద్వారా స్వాయంభువు స్వయముగ హవిస్సుగనై విశ్వరూపముగ వితతమయ్యెను. తచ్ఛరీర మీమాంసము ప్రభావముచే పంచభాగములుగ వితతము య్యెను.

3. అన్వయమాలంబనము (అధిష్ఠానము). క్షురముపాదాన (ఆరంభణ)ము. అక్షరము క్రియారూపనిమిత్తము. వీని యాధారముననే విశ్వకర్మ విశ్వద్రష్ట స్వాయంభువు విశ్వరచనాసమర్థుడయ్యెను.

4. మనకు పాలకుడు, ఉత్పాదకుడు; ప్రతిష్ఠ. (సప్త) లోకధామముల నెరింగినవాడు; దేవతలందరకు ఒకే సామాన్యనామమగువాడు; సర్వభువనాశ్రయభూతుడు.

5. ద్యు (సూర్య) లోకమునకు పృథివికి, (సౌర) దేవతలకు పారమేష్ఠ్య ఆప్యప్రాణాత్మ కానురులకు, పరమగు నాతత్త్వాధారమున జలములు ఆ యాపోలోకమందందరు దేవతలు మిళితులై యున్న దేనిని తమగర్భమందు ధరించెను?

స్వాయంభువు, పృథివీసూర్య పరమేష్ఠులకు బరము, దీనియాధారమున నాపోమయ పరమేష్ఠి యా స్వాయంభువ వేదాగ్నిని తన గర్భమందు ధరింపగా నీ గర్భము పిదప సోమాహుతి వలన సూర్య రూపమున బరిణమిల్లి దేవతానివాస భూమియగును.

(ఇది ప్రథమ మంత్రమున గతార్థమైనది.)

6. దేవతలందరుగల యాగర్భమును జలములు ధరింపగా అజనాభి (అవ్యయకేంద్ర) యం దర్పితమైయున్నది. ఆగర్భము నాధారముగా గొని భువనము లన్నియు నున్నవి.

సూర్యుడే ఆపోగర్భము - విశ్వకేంద్రమతడే-ఇందే షోడశీ ఆత్మ పూర్ణముగ వికసిల్లును; కనుక సూర్యేంద్రుడు షోడశినా బడును. మనఃప్రాణవాఙ్మయుడగు నవ్యయు డజశబ్దవాచ్యుడు; స్వాయంభునందు కేవలము వాక్కళయు, పరమేష్ఠియందు ప్రాణ వాక్కళలును, సూర్యునందు మనఃప్రాణవాక్కళలు మూడును వికసిల్లును; కనుక సూర్యు నజనాభి యందురు. హృదయ మూలక సృష్టివిజ్ఞానముంబట్టి సూర్యుడే విశ్వమునకు ప్రతిష్ఠ.

7. విశ్వకర్మ స్వాయంభువు, ప్రాణప్రధానము. ఈ ప్రాణము అసత్తు - ఋషి యను పేరులనొప్పును. ఇదే చితియజ్ఞము ద్వారా సప్తపురుషపురుషాత్మకమగును - సప్తప్రాణసమష్టియే సప్తపురుషపురుషాత్మక స్వాయంభూప్రజాపతి, విశ్వమునకు ప్రథమప్రతిష్ఠ. 'బ్రహ్మ వై సర్వస్యప్రతిష్ఠా' 'బ్రహ్మవై సర్వస్య ప్రథమజం' ఏతదంగభూత ప్రాణములందు నాలుగుఆత్మలు, రెండు పక్షములు ఒకటిపుచ్ఛప్రతిష్ఠ. ఏడిటిశ్రీ (సార) భాగము మస్త కము. ఇదే సుపర్ణచితి. సుపర్ణముపక్షి. తదీయపక్షరూప వాయువుల ధమనముచే ద్యావాపృథువు లేర్పడును. (ఈవిష యము మరియొకచో—)

8. స్వయంభువు త్రయీ వేదమూర్తి-ఈయన నుండి పిమ్మటి

పరమేష్ఠ్యాదులు ప్రతిమాప్రజాపతులు నలువురు వికసిల్లిరి; కనుక వీరాయనపుత్రులు; ఇందు పరమేష్ఠి పెద్ద. ఆపోమయుడు. ఇయ్యనయే అథర్వవేదము. ఆ త్రయీమూర్తి బ్రహ్మ 'సోఽనయాత్రయ్యావిద్యయా సహాపఃప్రావిశత్' అన్నట్లిందు ప్రవేశించెను. మొదట త్రయ్యాగమన మాపోమయ పరమేష్ఠి యందే (అథర్వయందే). ఈమంత్రమున కధ్యాత్మాధిభూత అధిదైవతములు మూడుభావము లున్నవి.

9. ఘృతము పుత్పత్తిము 'ఆదిగ్ఘృతేన పృథివీ వ్యుత్పద్యతే' అనిశ్రుతి. ఆపోమయుపరమేష్ఠియందు మండరూపమున స్వయంభు వున్నాడు. ఘృతమందాపస్సు తేజస్సు అను రెండు భాగములున్నవి. వరుణప్రతిమూర్ఛితేంద్రుడు 'తైలము'. అట్లే వరుణప్రతిమూర్ఛితాగ్ని 'ఘృతము.' ఆపస్సంబంధముచే ఘృతము తరళముగదా, నిగూఢమైయున్న మూర్ఛితాగ్నియే తేజస్సు. కనుకనే 'తేజోవై ఆజ్యమ్' పరమేష్ఠిఘృతమన్నచో నిగూఢాగ్నిమూర్తి స్వయంభువు (త్రయీమూర్తి) తేజోరూప మండము. ఘృతమునకు సారభాగమదే.

10. ఈ విశ్వకర్మ నియతిభావముచే హృదయమందుండి బుద్ధితో మనస్సుతో సంబంధముగల్గియుండును. ఇతని నెరుంగువాడు మృత్యుపాశ ముక్తుడగును.

11. హృదయకమలరూపి – ఇత్యాదిగా నితని జింతింపవలయును.

12. అతడే సంచరకాల రూపాహారాగమమందు తన

యవ్యక్తభావమునుండి వ్యక్తరూపమునొంది భువనగోప్త – అధిపతి – భూతప్రవిష్టుడు నగును......

13. 'భూర్భువస్స్వః' అను మహావ్యాహృతి రూపములగు మూడుపదములు నీనివగు 'వస్తి – ఉరః – శిరః' అను గుహాలం దున్నవాని నెరుంగువాడు పితుఃపిత. అతడే మాకు బంధువు, జనిత – విధాత – విశ్వభువనవేత్త.

14. సప్తప్రాణములు, సప్తాగ్నిజ్వాలలు, సప్తసమిధలు, సప్తజిహ్వాలు, సప్తలోకములు అధ్యాత్మసంస్థయందలి శిరః – ఉరః – ఉదర– వస్తి అనునాల్గు గుహాలందు (ప్రతిదానియందును) ఏడేసిచొప్పున నున్న ఈ సప్తకములెల్ల నా సప్తపురుష పురుషా త్మక స్వాయంభూప్రజాపతి నుండియే యుత్పన్నములైనవి.

15. సృష్టికామనానంతరము ఆ యవ్యక్తస్వాయంభువు అస ద్రూపతమస్సును దూరముచేసి, అంతటిని వ్యక్తపరచుచు ఆకాశరూపి యగుటచే నాదిభూతమయినవాడు వర్ష్టలవృత్తౌ జస్సు గలవాడు తనంతతాను వెలసెను. కనుకనే స్వాయంభువు "స్వయముద్భవొ".

2. పరమేష్ఠి (ప్రతిమాప్రజాపతిః)

స్వాయంభువు వేదమూర్తిగదా! వేదతత్త్వము ఋగ్యజు స్సామభేదమున మూడుభాగములు. ఇందు ఋక్సామములు వయోనాధములు (ఛంద – ఆయతనములు). యజుస్సు వయస్సు (వస్తువు). ఇందు యత్ – జూ అను రెండుభాగములు. యత్ = గతిరూపప్రాణము, ఇదేవాయువు. జూ=స్థితిరూపయగువాక్కు

ఇదే యాకాశము. ఆకాశవాయువులు, వాక్ప్రాణములు, స్థితి గతులు - ఈమొత్తమే యజ్జూ. ఇదే పరోక్షభాషయందు యజుస్సు (వేదవిజ్ఞానము నరయుడు).

యజుస్సుయొక్క వాగ్రూపాకాశ మమృతమర్త్యభేదముచే రెండువిధములు. ఇం దమృతాకాశ మమృతదేవసృష్టి ప్రవర్తకము. మర్త్యాకాశము మర్త్యభూతజనకము. ప్రాణవాయు వ్యాపారముచే యజుఃపురుషుని యీ మర్త్యవాగ్రూపాకాశమే యంశరూపమున ద్రుతమై యాపస్సుగనగును. 'సోఽపోఽసృజతవాచఏవలోకాత్ - వాగేవసాఽసృజ్యత' అనిశ్రుతి. ఇట్లు త్రయీవేదమూర్తి స్వాయంభువు వాగ్భాగమునుండి మొదట అప్తత్వవికాసమే జరిగినది. మనువు నిట్లు:—

"సోఽభిధ్యాయ శరీరాత్ స్వాత్ సిసృక్షుః వివిధాః ప్రజాః
అపఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్," అనియెను.

ఈ యాపోమయ మండలమే రెండవదగు పరమేష్ఠిప్రజాపతి. స్వాయంభువునందువలె నిందును ఆత్మ - పద - పునఃపదము లను మూడుసంస్థలు నున్నవి. పరమేష్ఠిపిండము సూర్యునకు పైనున్నది. దానినలువంకల సూర్యుడు పరిక్రమించును. పునః పదరూపమున నీబుతపరమేష్ఠి, సూర్యచంద్రపృథువుల (పుండీర స్వాయంభువునుగూడ) తనగర్భమున లోగొనియున్నాడు. ఈ మహత్త్వమువల్లనే ఈయన 'మహదాత్మ' యనబడును. భృగు-అంగిర - అత్రి - యనుమూడు నీయనకు మనోతలు. ఈ సమానత వలన నీయన స్వాయంభువునకు ప్రతిమ యందురు.

ఈపరమేష్ఠియే త్రిగుణమూర్తియై త్రైగుణ్యవిశ్వసంచాలన గావించును. ప్రాధానికుల వ్యక్తప్రకృతి యిదే. షోడశీ పురుషుని యోనియు నిదే. ఆకృతి - ప్రకృతి - అహంకృతి భావములకు జనకమిదే. ఇదే లోకసృష్ట్యధిష్ఠాత. ఇదే స్థూలభూతముల కాది. ఈశ్రౌతవచనము లరయుడు:—

1. మహాన్ప్రభుర్వై పురుషః సత్వస్యైషప్రవర్తకః
సునిర్మలాం ప్రాప్తిమీశానో జ్యోతిరవ్యయః॥

2. యో యోనింయోని మధితిష్ఠత్యేకో విశ్వానిరూపాణి యోనీశ్చ సర్వాః
ఋషిం ప్రసూతం కపిలం య స్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్॥

3. ఏకైకంజాలం బహుధావికుర్వన్ అస్మిన్ క్షేత్రే సంహరత్యేషదేవః
భూయః సృష్ట్వా పతయస్తథేశః సర్వాధిపత్యం కురుతే మహాత్మా।
[శ్వేతా]

1. ఈ మహదాత్మప్రభువు సర్వపురుషయోని. కనుక పురుషుడు. సత్వ (అవ్యయ) భావప్రవర్తకము. సునిర్మలజ్యోతి (జ్ఞాన) మయ పరాశాంతి ప్రాప్తింగూర్చి యిదియే సమర్థము.

అవ్యయాత్మ మహత్తునందే గర్భము ధరించును. దీని సంబంధముననే అజుడు జన్మధారణసేయును. ఆయన దీనియందు ప్రతిష్ఠితుడు. కనుక దీనిద్వారా ఆయనప్రాప్తి కల్గును. 'మమ యోని ర్మహద్బ్రహ్మ'.

2. ప్రతియోనికి నిది యధిష్ఠాత. విశ్వరూపము (ఆకృతు) లకు యోను (ప్రకృతు) లకు బ్రతిష్ఠ. (తనంత తాను) పుట్టిన

(విష్ణ్వవతారమగు) కపిలఋషిని తన జ్ఞానరశ్మియుక్తుం జేయును. తన్నుండి కలిగిన విశ్వమును తనజ్ఞానమున భరించి చూచును.

కపిలశబ్ద మిట హిరణ్యగర్భవాచకము కాదు. అట్లు ఎచ్చటను లేదు. కపిలుడు ప్రాధానికుడు. గుణవాది. శారీరకాత్మానుయాయి. ప్రతిశరీరభిన్న చైతన్యవాది. నానాజ్ఞానధార గుణత్రయాలంబితము. గుణత్రయి మహదాత్మాలంబితము. కపిలుని భేదవాదమూల జ్ఞాన మీ మహదాత్మ యనుగ్రహఫలము.

3. ఈ క్షేత్ర (విశ్వము - శరీరము) మం దొక్కొక జాలము ననేకరూపముల బరిణతము గావించి యీ మహదాత్మ దేవుడు చివరకు అందరను అన్నిటిని తనయందే లయము గావించుకొనును. సంచరకాలమందు మరల ప్రతిశరీరభిన్న శరీరాభిమాని ప్రజాపతులను కల్గించి వారి కీశుడై, సర్వాధిపతి యగుచున్నాడు.

మహదాత్మ శుక్రమునకు బ్రతిష్ఠ. శుక్రగత మహత్తే సప్తపిండపర్యంతము జాలరూపమున వితతమగును. ఈజాలరూపమే తనన (సంతాన) భావకారణము. ప్రజాతంతు మూలప్రతిష్ఠ. ప్రతిశరీరభిన్న చైతన్యోపలబ్ధి కీశు డీ మహదాత్మ. ఇదే ప్రజాపతి యగు నాత్మను క్షేత్రభేదముచే ననంతరూపములుగ విభాగింపను సంహారకాలమున నన్నిటికి పరాయణముగాను కారణమగుచున్నది.

3. సూర్యుడు (ప్రతిమాప్రజాపతి)

స్వయంభువునుండి యాపోమయపరమేష్ఠి ప్రాదుర్భవించెను.

తద్గర్భమున నపౌరుషేయలక్షణ త్రయీబ్రహ్మ బీజరూపమున ప్రతిష్ఠితుడు కాగా నాబీజాగ్ని పిదప నా పారమేష్ఠ్యగర్భమందలి పారమేష్ఠ్యసోమాహుతిచే ప్రజ్వలితమయ్యెను. అదే సూర్యుడు. హిరణ్యగర్భఋషి యితనిని హిరణ్యగర్భు డనియెను. ఇందును ఆత్మ - పద - పునఃపదము లను మూడుసంస్థ లున్నవి. పదమగు సూర్యుడు భూపిండమునకు పైనున్నది. భూమి సూర్యుని చుట్టును బరిక్రమించుచున్నది. పునఃపదరూప సూర్యమహిమా మండలగర్భమున సచంద్ర, సనుహిమాపృథుపు లున్నవి. ఈయన రోదసీత్రైలోక్యమున కధిష్ఠాతృదేవత.

సూర్యుడు సాక్షాత్తుగ క్షత్రరుద్రుడు, ఏకాకి. అతని యనంత రశ్ములు విట్ రుద్రులు. ద్యుస్థ్సిమూర్ధ స్థలస్థితుడు, ఆగమ ప్రసిద్ధుడు, దక్షిణామూర్తి శివు డీయనయే. ఈతనికి 'జ్యోతి - గౌ - ఆయుః' అని మూడు మనోతాలు. జ్యోతులు 33. ఇందుండి 33 గురు దేవతలు వికసిల్లుదురు. గౌ అన్న వాక వేయి. వీనినుండి భూతవికాస మగును. ఆయువులు 36000. వీనినుండి శతాయురాత్మ వికసిల్లును. ఇట్లు పరమేష్ఠివలె నీయనయు స్వయంభూప్రతిమయే.

సౌరాగ్నియే గాయత్రీమాత్రిక యను పౌరుషేయ వేద ప్రతిష్ఠ. దీనినుండియే సంవత్సరయజ్ఞవికాసము కల్గును. రోదసీ త్రైలోక్యస్థితములకెల్ల సూర్యుడు ప్రతిష్ఠ. భూతజ్యోతిరూపమున విశ్వమందు మొదట వెలసిన దీయనయే. కనుకనే సౌరాగ్ని నగ్ని యనిరి. ఈ వచనము లిట గమనింపవలయును.

1. యదర్వాక్ సంవత్సరో అహోభిఃపరివర్తతే
తద్దేవాజ్యోతిషాంజ్యోతిః ఆయుర్హోపాసతేఽమృతం,

2. హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేకఆసీత్
సదాధార పృథివీం ద్యాముతేమాం, కస్మైదేవాయ హవిషావిధేమ.

3. విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతిరేకం తపంతం,
సహస్రరశ్మిః శతధావర్తమానః ప్రాణః ప్రజానా ముదయత్యేషసూర్యః.

4. చిత్రందేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః
ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం సూర్యఆత్మా జగత స్తస్థుషశ్చ.

5. ఆకృష్ణేనరజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యంచ
హిరణ్మయేన సవితారథేన దేవో యాతి భువనాని పశ్యన్,

6. అంభస్యపారే భువనస్యమధ్యే నాకస్యపృష్ఠే మహతోమహీయాన్
శుక్రేణ జ్యోతీంషి సమనుప్రవిష్టః ప్రజాపతిః చరతి గర్భేఽన్తః॥

1. ఎవని యర్వాగ్భాగమునందలి యహోరాత్రములచే - లేక అహర్గణములచే సంవత్సరము తిరుగుచున్నదో ఆజ్యోతిస్సులకు జ్యోతియు, ఆయూరూపి అమృతరూపియు నగు సూర్యుని దేవత లుపాసించుచున్నారు.

సూర్యుడు బ్రహ్మాండమధ్యమందున్నాడు. కనుక నీతనియం దమృతమర్త్యభావములు రెండు నుండును. ఇందు మర్త్య వాగ్రూపమే సహస్రగౌరూప పరిణతమై యహర్గణస్వరూపము నొందును. ఈ ౩౬౦ అహర్గణములచే నహోరాత్రరూప సంవత్సర యజ్ఞస్వరూప మేర్పడును. ఆతని మర్త్యరూపమగు సంవత్సర మమృతాత్మకుడగు నాతని యధోభాగమునందున్నది.

మంత్రమందలి గౌశబ్ద మతని గామనోతను, జ్యోతిశ్శబ్దము జ్యోతిని, ఆయుశ్శబ్ద మాయు వను మూడవమనోతను సూచించును. ఒకే సంవత్సరయజ్ఞ మీామనోతాత్రయ సంబంధముచే గ్రమముగ జ్యోతిష్టోమ-గోష్టోమ - ఆయుష్టోమము లను మూడు స్తోమయజ్ఞములుగ బరిణతమగును. సూర్య - చంద్ర - తారక - విద్యుత్ - అగ్ని యను నీ పంచ జ్యోతులందు మూలభూత మీా స్వజ్యోతిర్లక్షణ సూర్యజ్యోతి. కనుక నిది 'జ్యోతిషాం జ్యోతి' యని చెప్పబడెను.

2. ఈ రోదసీ త్రైలోక్యమందు ముందు వెలసినది హిరణ్యగర్భుడు. రోదసీత్రైలోక్య భూతముల కేకైకపతి యితడు. ఈతడే భూమియు ద్యులోకమును ధరించియున్నాడు. ఈ ప్రజాపతికే హవిర్విధాన మొనరింతుము.

3. హారిణః=రశ్మిలచే పార్థివాన్నాహరణము సేయువాడు. జాతవేదః=జ్ఞానప్రదాత. శతధా=అనేకవిధములుగ.

4. దేవతాసమష్టిరూపి మిత్రవరుణాగ్నులకు చక్షూరూపి. సూర్యుడు వెలసెను. మూడులోకములందును వ్యాప్తుడు. స్థావరజంగమముల కాత్మ యతడు.

5. తన కాలకిరణయుక్తుడై అమృతమృత్యుభావములను నివేశింపజేయుచు ఆగ్నేయరథమున నతడు భువనముల నవలోకించుచు చనుదెంచును.

6. అంభస్సునకు బారమున, భువనమధ్యమున, నాకపృష్ఠమందు మహాతో మహీయాన్ సూర్యదేవుడు శుక్రముద్వారా

జ్యోతులందు బ్రవేశించి ప్రజాపతియై గర్భమందు చరించు చున్నాడు.

త్రైలోక్యములందలి సంయతిసముద్రము నభస్వాన్, క్రందసీ సముద్రము సరస్వాన్, మనగోదసీసముద్రము అర్ణవము అందురు. ప్రకృతమంత్రమం దీయర్ణవమే 'అంభఃశబ్దముచే నభి ప్రేతము. సూర్య - పృథువుల మధ్యనున్న యాపోమయ ములాంతరిక్షమే అర్ణవసముద్రము. దీని యాధారముననే ప్రథమమంత్రోక్త సంవత్సరస్వరూప నిష్పత్తియైనది. శ్రుతియు 'సముద్రాదర్ణవా దధి సంవత్సరోఽజాయత' అనియెను. దీనికి ఆవలనే అమృతాత్మకసూర్యదేవత యున్నది. పంచపర్వాభువన మధ్యము సూర్యస్థానము. కనుకనే 'భువనస్యమధ్యే.' సప్త స్వర్గ విజ్ఞానముంబట్టి 18 - 19 - 20 - 21 - 22 - 23 - 24 అను నేడహర్గణములు సప్తదేవస్వర్గములు నాబడును. ఇందలి 21 వ దగు పార్థివాహర్గణము 'నాక' స్వర్గ మనబడును. 'ఏకవింశో వా ఇత ఆదిత్యః' అన్నట్లు 21 వ దగు నాకపృష్ఠమందు సూర్యు డున్నాడు. మధ్యస్థుడగు నీయన తనకు బైనున్న స్వాయంభూ పరమేష్ఠులను నమృతలోకములకు గ్రిందనున్న చంద్ర - పృథువు లను మర్త్యలోకములకు ననుగ్రాహకు డగుచుండుటచే నితనిని 'మహతోమహీయాన్' అనవచ్చును. ముందు చెప్పబడనున్న శుక్రాత్మతో గూడియే యీయన అగ్ని - విద్యు - దింద్రు లను మూడు జ్యోతులుగ బరిణమించుచు సర్వభూతాంతరాత్మ యగుచున్నాడు.

పృథివీ (ప్రతిమా ప్రజాపతి)

పృథివి సూర్యుని యుపగ్రహము. ఇందును ఆత్మ-పద-పునః పదము లను మూడు సంస్థ లున్నవి. హృదయభావ మాత్మ. పిండము పదము. మహిమామండలము పునఃపదము. ఈ మహిమామండలమునందే సమహిమచంద్ర సూర్యపిండము లున్నవి. వాక్కు-గౌ-ద్యౌ అనునవి పృథివీమనోతలు. ఈ మనోతలవలన మహిమాపృథివి భూః భువః స్వః అను మూడు రూపము లొందుచున్నది. పృథివి పృథివి. సూర్యుడు ద్యౌ. మధ్యస్థాన మంతరిక్షము. ఈ పార్థివప్రజాపతి రోదసీ త్రిలోకీ ప్రతిష్ఠ. అధ్యాత్మసంస్థకు ప్రాణాత్మ. అధిదైవతసంస్థయందు ఆనందమూర్తి యగు మహాదేవుడు. (ఈ విషయ మాప్రకరణ మున స్పష్టమగును)

5. చంద్రుడు (ప్రతిమా ప్రజాపతి)

ఇయ్యది పృథివి కుపగ్రహము. ఇందును ఆత్మా-పద-పునః పద భావము లున్నవి. రేతః - శ్రద్ధ - యశస్సులు మనోతలు. ఇది విశ్వాంతిమ పర్వము. అంతిమమగు నధియజ్ఞాత్మ - విశ్వ క్రమమున నంతిమము, నిధనమూర్తి యైనను, పార్థివప్రజోప యోగదృష్టిం బట్టి సూర్యపృథువుల మధ్యస్థత నంగీకరించి సూర్య - చంద్ర - పృథువు లను క్రమ మేర్పరుపబడినది.

ఇట్లు పంచ పంచజనాధిష్ఠాతయగు నా బ్రహ్మమూర్తి యధి యజ్ఞాత్మ వరుసగ:- తన ప్రాణాపోవాగన్నాదాన్న ప్రధాన; వేద లోక దేవ భూత పశు పురంజనములచే స్వాయంభూ పర

మేష్ఠీ సూర్య పృథివీ చంద్ర-రూప పర్వములుగ బరిణతమగుచున్నది. అమృతే బ్రహ్మ శుక్రమూర్తి అశ్వత్థేశ్వర బ్రహ్మకు ఇది రెండవ ప్రకృతిలక్షణాత్మవ్యాఖ్యానము. అధియజ్ఞాత్మఅంగి. స్వయంభ్వాదు లంగములు. ఇట్లు అదియొకటే పంచభావములొందును. ఇది బ్రహ్మాత్మస్వరూపన గ్రహము.

అధియజ్ఞాత్మ — సప్తలోకవ్యాపి

బల్వేశ్వరః - ఊహేశ్వరః.

| [1] | [2] | [3] | [4] |
|---|---|---|---|
| స్వయంభువు | పరమేష్ఠీ | సూర్యః | పృథివీ—భూతపురంజనః అన్నాదః |
| 1. వేదాత్మ | 1. ఆకృత్యాత్మ | 1. దేవాత్మ | [5] |
| 2. మాత్రాత్మ | 2. ప్రకృత్యాత్మ | 2. భూతాత్మ | చంద్రమాః—పశుపురంజనః అన్నమ్ |
| 3. నియతి | 3. అహంకృత్యాత్మ | 3. ఆత్మ | |
| వేదపురంజన | లోకపురంజనః | దేవపురంజనః | |
| ప్రాణప్రధాన | అప్ప్రధాన | వాక్ప్రధాన | |

ఇది అధియజ్ఞాత్మ నిరుక్తి

# సర్వభూతాంతరాత్మ

అశ్వత్థపురుషుని మూడవవివర్తము శుక్రము. ఇది వాక్కు-ఆపస్సు - అగ్ని అని మూడుభాగములు. వీని కన్నాదమయ పృథివితో సంబంధము. అధియజ్ఞాత్మ యైదవపర్వము భూపిండము. ఇది యన్నాదాగ్నిమయము. ఈయగ్ని కమృత - మర్త్యభేదముచే రెండవస్థలు. మర్త్యాగ్ని చిత్యము, అమృతాగ్ని చితేనిధేయము. మర్త్యాగ్నివలన భూపిండ స్వరూపము, అమృతాగ్నివలన మహిమా పృథివీస్వరూపమును ఏర్పడెను. అధియజ్ఞాత్మరూప బ్రహ్మసత్యాత్మకు రోదసీత్రైలోక్యము తోడను, శుక్రమూర్తియు కనుకనే వైకారికమగు సర్వభూతాంతరాత్మకు స్తోమ్యత్రిలోకి యనబడు (మహిమాపృథివి) తోడను సంబంధము. అటు చంద్రుడు ఇటు భూపిండము. ఈ రెంటినడుమ మహాపృథివీరూప సర్వభూతాంతరాత్మ. ఇది ప్రాకృతికస్థితి. మహాపృథివియందు క్రమముగ వాగాపోఽగ్నిశుక్ర త్రయోపభోగము జరుగుచున్నది.

ఈ స్తోమ్యత్రిలోకిరూప మహాపృథివికి జగతి - సాగరాంబర - మహీ యను మూడురూపములు. పృథివియందు 48 అహర్గణములు, ఇందు భూకేంద్రము మొదలుకొని 48 వ అహర్గణ పర్యంతమును వాక్శుక్రము సర్వాలంబనరూపముగ నున్నదని 'యావద్బ్రహ్మవిష్ఠితంతావతీవాక్' అనుటచే స్పష్టము. ఈ వాక్కునకు బ్రహ్మతో సంబంధము. కనుక వాక్శుక్రమును 'బ్రహ్మాత్మకశుక్ర' మందుము. భూకేంద్రమాదిగ వాగంతిమ

సీమ 48 పర్యంతము గలపార్థివప్రపంచము 'మహీ' యన బడును. ఇదే మహతోమహీయాన్ వాఙ్మయ మహాపృథివీ మండలము.

భూకేంద్రమునుండి 33 వ అహర్గణమువరకు వాగ్ధరాతల మున రెండవదగు నాపశ్శుక్ర స్తర యున్నది. తత్త్రయ స్త్రింశస్తోమావచ్ఛిన్నయగు నాపృథివి 'నాగరాంబర' యన బడును. ఈ యప్తత్త్వమునకు విష్ణువుతో సంబంధము. పర మేష్ఠి యాపోమయము. ఏతద్దేవత విష్ణువు. ఇదే రెండవదగు నాపోమయ పృథివీమండలము.

భూకేంద్రమునుండి 21 వ యహర్గణమువరకు ఆపస్తరముపై మూడవదగు నగ్నిశుక్ర స్తర మున్నది. తదేకవింశస్తోమా వచ్ఛిన్నయగు నాపృథివి జగతి యనబడును. ఈయగ్నితత్త్వ మునకు మహాదేవునితో (రుద్రునితో) సంబంధము. ఏతదుదర మున 33 గురు దేవతలున్నారు. కనుక మహాదేవు డన దగును. 'మహాదేవోమర్త్యాన్ఆవివేశ' యన్నట్లీమహా దేవుడే జీవసంస్థ కధ్యక్షుడైయున్నాడు. (ఇది జీవాత్మ వ్యూహప్రకరణమున దెలియనగును.)

21 వ అహర్గణమువరకు నుండు నీయగ్నికి-అగ్ని - వాయు ఇంద్రులను మూడవస్థలు. 9 వరకు అగ్ని. 15 వరకు వాయువు. 21 వరకు ఇంద్రుడు. త్రివృత్ స్తోమావచ్ఛిన్న జగతీపృథివి త్రివృ దగ్నిసంబంధముచే పృథివీలోకము. (2) పంచదశస్తోమా వచ్ఛిన్నజగతీపృథివి పంచదశవాయు సంబంధముచే నంతరిక్ష

లోకము (3) ఏకవింశస్తోమావచ్ఛిన్న జగతీపృథివి ఏకవింశేంద్ర (ఆదిత్య) సంబంధముచే ద్యులోకము. ఇట్లు కేవల మగ్నిశుక్రముతో సంబంధముగల 21 స్తోమావచ్ఛిన్న జగతీపృథివియందే అగ్నియొక్క ఘన - తరళ - విరళావస్థారూప - అగ్ని - వాయు ఆదిత్య సంబంధముచే మూడులోకము లగుచున్నవి. వీని మొత్తము స్తోమ్యత్రిలోకి.

అగ్నికి పృథివీలోకముతో, ఆపస్సునకు అంతరిక్షలోకముతో, వాక్కునకు ద్యులోకముతో సంబంధమనుట వైదిక సామాన్యపరిభాష. ఆపస్సుయొక్క తరళావస్థయే వాయువు. కనుక వాయువునుగూడ అంతరిక్ష లోకాధ్యక్షముగ జెప్పిరి. వాగ్వికారమే ఇంద్రుడు. 'ఇంద్రో వాగిత్యాహుః' ఏమన:- పంచప్రకృతులయందు మూడవదగు వాక్ప్రకృతికి సౌరేంద్రునితోడనే సంబంధము చూపబడునుగదా!

ఈదృష్టితో:- అగ్ని - ఆపః - వాక్ - అను నీమూడు శుక్రములకును క్రమముగ అగ్ని - వాయు - ఇంద్రు లను స్తోమ్యత్రిలోకీ దేవతలతో సంబంధము సిద్ధమగుచున్నది. కనుక త్రివృదవచ్ఛిన్నాగ్ని లోకమును పృథివీలోకమనియు పంచదశావచ్ఛిన్నాపోమయవాయులోకము నంతరిక్షలోకమనియు ఏకవింశావచ్ఛిన్న వాఙ్మయేంద్ర లోకమును ద్యులోకమనియు నన వచ్చును.

పార్థివాగ్నియే గాక చిన్మయమగు భూమాగ్ని మరొకటి యున్నది. దానినే అగ్నయమ్ణాత్మను వాగ్రూపమ్మనుముగ జెప్పి

యుంటిమి. యజ్ఞపరిభాషానుసార మీపిండరూప భౌమచిత్యా గ్నిని 'పురాణగార్హపత్యాగ్ని' యందురు. త్రివృదవచ్ఛిన్న పార్థివచితే ఃధే యాగ్నిని 'నూతనగార్హపత్యాగ్ని' యందురు. పంచదశావచ్ఛిన్నాంతరిక్ష్యవాయువును 'ధిష్ణ్యాగ్ని' యందురు. దీనికి ఎనిమిది నాక్షత్రిక నాగముల సంబంధముచే నెనిమిది పర్వములు కల్పమును. ఇక ఏకవింశావచ్ఛిన్న దివేంద్రుని 'ఆహావ నీయాగ్ని' యందురు. ఇట్లు ఒకే యగ్నికి 11 భేదములు. అగ్ని పిలిచే మహాదేవుడు - రుద్రుడు. అతని 11 రూపము లివియే.

పార్థివాగ్నియొక్క యవాంతరావస్థ లెనిమిదియు అష్టవసువులు. అంతరిక్ష్య వాయువుయొక్క యవాంతరావస్థ లాంతరిక్ష్య లేకాదశరుద్రులు; ఇక దివ్యాదిత్యుని యవాంతరావస్థలు పంద్రెండును ద్వాదశాదిత్యులు; సాంధ్య దేవతలిరువురు 'నాసత్యదస్ర' నామప్రసిద్ధులు. ఇట్లు ఒకే రుద్రాగ్నికి మొదట, అగ్నివాయ్వాదిత్యు లని మూడు. పిదప 33 విభాగములగును. ఇవేయజ్ఞసంబంధముచే 'యజ్ఞియ దేవత' లనబడును చూడుడు:-

"ఇతిస్తు తాసో అసథారిషాదసో యేస్థత్రయశ్చ త్రింశచ్చ మనోర్దేవాయజ్ఞియాసః"—అష్టవసుమూర్తియగు నగ్ని యష్టాక్షరగాయత్రీ ఛందస్సుచే ఛందితము. ఏకాదశరుద్రమూర్తి వాయువు, ఏకాదశాక్షరత్రిష్టుంచ్ఛందో ఛందితము. ద్వాదశాదిత్యమూర్తి ఇంద్రుడు, ద్వాదశాక్షరజగతీ ఛందస్సుచే ఛందితుడు - జగతీఛందస్సుపైననే అగ్నిశుక్రమున కంతిమావస్థారూపియగు నాదిత్యునిసమాప్తి. పృథివియొక్క 21 వ

యహర్గణము సంతటితో సరి. కనుక నేకవింశావచ్ఛిన్న పృథివిని 'జగతీపృథివి' యంటిమి. చివరకు:- కేవల మొక యగ్నిశుక్రమునుండియే జగతీసంస్థాస్వరూప మేర్పడెననియు దీని కధ్యక్షుడు రుద్ర దేవతయనియు, ఇందు అగ్నివాయ్వింద్రరూపమున అగ్ని ఆపః వాక్కు అను మూడుశుక్రములభోగము నగుచున్నదనియు ఫలితార్థము.

స్తొమ్యత్రిలోకియందలి యగ్ని — వాయు — ఆదిత్యు లను మూవురి దేవతలకు పరస్పరము యజనముజరుగును. 1 అగ్నియందు:- వాయు - ఆదిత్యులాహుతికాగా, ఆయగ్ని స్తొమ్య త్రైలోక్యవ్యాపకమగుచు విరాట్టునాబడును; ఈ విరాడ్విష్ణువు అర్థశక్తికధిష్ఠాత. త్రైలోక్య ప్రజాపోషకుడు. 2 వాయువునందు:- అగ్ని-ఆదిత్యులయాహుతికాగా నావాయువు త్రైలోక్య వ్యాపకమై హిరణ్యగర్భనామమునొందును. ఈ హిరణ్యగర్భ బ్రహ్మ క్రియాశక్తి కధిష్ఠాత. త్రైలోక్యప్రజోత్పత్తి గావించును. 3 ఆదిత్యునందు:- అగ్నివాయువులాహుతికాగా - నా యాదిత్యుడు త్రైలోక్యవ్యాపకుడై సర్వజ్ఞుడనబడును. ఈ సర్వజ్ఞశివుడు జ్ఞానశక్తికధిష్ఠాత. ఈతనినుండియే ప్రజలకు బంధవిముక్తి. ఇట్లు మూవురు దేవతల పారస్పరిక 'తానూనప్త్ర' లక్షణ సర్వహుతయజ్ఞముచే అగ్నిమూర్తి విష్ణువు, వాయుమూర్తి బ్రహ్మ, ఆదిత్యమూర్తి శివుడు వికసిల్లుదురు. 'తలవకారోపనిషత్తు' ఈ త్రిమూర్తి విజ్ఞానస్వరూపమును మనయెదుట బెట్టును.

అగ్నిశుక్రమునకు బృథివీలోకముతో సంబంధ మంటిమి. తద్వ్యాప్తి 21 వరకు గదా! ఈ దృష్టితో నంతవరకున్న

స్థామ్యత్రిలోకీరూపపృథివిని పృథివీలోక మనవచ్చును. ఏతదధిష్ఠాతభూతపతి రుద్రుడు మహాదేవుడు. ఇతడే అగ్రపతి. అన్నాదాగ్నికి భూతపురంజనుతోడనే సంబంధము. భూతమున కర్ధముతోడనే సంబంధము. కనుక అర్ధ శక్త్యధిష్ఠాత మహాదేవుని 'భూతేశు' డనజెల్లును. జగతీపృథివి కీయనయే ముఖ్యప్రభువు.

రెండవది యాపశ్శుక్రము. భూగర్భమునుండి దీనివ్యాప్తి 33 వరకంటిమి. దీనికి అగ్ని - ఆపః - సోమ అనుమూడవస్థలు. 21 వరకు అగ్నిమయ (జ్యోతిర్మయ) ఆపఃప్రధానత. 27 వరకు విశుద్ధాపఃప్రధానత. 33 వరకు సోమప్రధానత. 22 నుండి 27 వరకునుండు ఆపస్సు 'దిక్సోమము'. 28 - 33 వరకు నుండు ఆపస్సు 'భాస్వరసోమము'. ఇది వాఙ్మయము. అది యాపోమయము. ఇక జ్యోతిర్మయాపస్సు అగ్నిమయము. ఇట్లు:— కేవలమాపస్తర యందే అగ్ని - ఆపః - వాక్, అను శుక్రత్రయోపభోగము సిద్ధమగుచున్నది.

1. అగ్ని మయాపోయుక్త పార్థివ (జగతీపృథివీ) భాగమాపశ్శుక్ర పృథివీలోకము. 2. ఆపోమయాపోయుక్త పార్థివ భాగ మాపశ్శుక్రాంతరిక్షలోకము. 3. వాఙ్మయాపోయుక్త పార్థివభాగ మాపశ్శుక్ర ద్యులోకము. వీనికి వరుసగ మహాదేవ, విష్ణు, బ్రహ్మ లధ్యక్షులు. వీరు, అర్ధక్రియాజ్ఞానశక్తుల కధిష్ఠాతలు; ఈ మూటిమొత్తె మాపోమయ సాగరాంబర పృథివి. ఇందును ఇట్లు మూడు లోకములు; ఈపరిలేఖల నరయుడు:—

1. స్తోమ్యాత్రిలోకి (అగ్నిత్రిలోకి) జగతీ పృధివి (మహావేది)

| | | |
|---|---|---|
| 21 స్తోమము: | 15 స్తోమము: | 9 స్తోమము |
| 21 - 20 - 19 - 18 - 17 - 16 | 15 - 14 - 13 - 12 - 11 - 10 | 1, 2, 3, 4, 5,6, 7, 8, 9 |
| ఆదిత్యమూర్తి ఏకవింశ - ఇంద్రః | రుద్రమూర్తిః పంచదశో వాయుః | వసుమూర్తి, త్రివృదగ్ని |
| సర్వజ్ఞః జగతీ | హిరణ్యగర్భః, త్రిష్టుప్ | అగ్ని విరాట్ |
| జ్ఞానమ్ | క్రియా | గాయత్రీ |
| శివః | హిరణ్యగర్భబ్రహ్మ-అంతరిక్ష్యః | అర్థః |
| దివ్యః | అంతరిక్షమ్ | విరాడ్విష్ణుః |
| ద్యౌ | అపశ్శుక్రభోగః | పార్థివః |
| వాక్శుక్రభోగః వాగింద్రః | ఆపోవిష్ణుః | పృథివీ |
| | | అగ్నిశుక్రభోగః. |
| | | అగ్నిః మహాదేవః |

1. అగ్నిశుక్రమ్:- అగ్నిర్మహాదేవః. త్రైలోక్యాధిష్ఠాత:- జగతీఏకవింశస్తోమావచ్ఛిన్నా.

2. స్తోమ్యత్రిలోకి (అష్టిలోకి,) సాగరాంబరా పృథివీ.

| [1] | [2] | [3] |
|---|---|---|
| 1 మొదలు 21 వరకు: | 22, 23, 24, 25, 26, 27. | 28, 29, 30, 31, 32, 33. |
| అగ్నివాయు ఆదిత్యమూర్తి | దిశోస్సమమూర్తిః విష్ణుః | భాస్వరసోమమూర్తిబ్రహ్మ |
| మహాదేవః | ఆపః | సోమః |
| భూతపతి | క్రియా | వాక్ |
| అగ్నిః | అపోమయః, అమ్మూర్తి | జ్ఞానమ్ |
| అర్థః | అతరిక్షమ్ | బ్రహ్మ, వాఙ్మయః |
| అగ్నిమయః, అగ్నిమూర్తి | అపశ్శుక్రభోగః | సోమమూర్తిః |
| పృథివీ | అపోవిష్ణుః | వాక్శుక్రభోగః: |
| అగ్నిశుక్రభోగః, అగ్నిర్వారుద్రః | | వాకోస్సమః |

2. ఆపఃశుక్రమ్: ఆపః, విష్ణుః - (త్రైలోక్యాధిష్ఠాత - సాగరాంబరా, త్రయస్త్రింశ స్తోమావచ్ఛిన్నా.

మూడవది వాక్స్రక్రము:— దీనికి 'మహీ' పృథివితో సంబంధము. ఈ పృథివీస్తోమము 'ఛందోమాస్తోమ' మందురు. భూకేంద్రమునుండి 48 వరకు మూడు ఛందోమాస్తోమములు భుక్తములగుచున్నవి. భూకేంద్రమునుండి 24 వరకు గాయత్రి యుపభోగము. ఇదే మొదటిదగు గాయత్రినామక ఛందోమాస్తోమము. భూకేంద్రమాదిగ 44 పర్యంతము త్రిష్టుప్ఛందోపభోగము. ఇదే రెండవదగు త్రైష్టుభమను ఛందోమాస్తోమము. భూకేంద్రమునుండి 48 వరకు జగతీఛందోపభోగము. ఇదే మూడవదగు జాగతనామక ఛందోమాస్తోమము.

1. గాయత్రీఛందమున కగ్నిశుక్రమయాగ్నితో సంబంధము. ఏతద్వ్యాప్తి 24 వరకు. అగ్నికి బృథివీలోకముతో సంబంధము. కనుక నీ ప్రదేశమును పృథివీలోక మనవచ్చును. 2. త్రిష్టుప్ఛందమున కాపశ్శుక్రమయ వాయువుతో సంబంధము. దీనివ్యాప్తి 44 వరకు. వాయువున కంతరిక్షముతో సంబంధము. కనుక నీ ప్రదేశము నంతరిక్షలోక మనవచ్చును. 3. జగతీఛందస్సునకు వాక్శుక్రమయాదిత్యుతో సంబంధము. దీనివ్యాప్తి 48 వరకు. ఆదిత్యునకు ద్యులోకముతో సంబంధము. కనుక నీ ప్రదేశమును ద్యులోక మనవచ్చును.

48+44+24=116. యుగ్మస్తోమనామక ఛందోమాస్తోమ యజ్ఞముచే మనుజుడు తన యాయుస్సూత్రము 116 వర్షముల వరకు వితతము సేయగలడు. (తై॥ బ్రా). ఇంతకు, చెప్పదలచిన దేమన:— కేవలము మహీపృథివి యందును త్రైలోక్య

భోగ మున్నదనియే. 24 వరకు అగ్నిమయవాక్కు. 44 వరకు ఆపోమయవాక్కు. 48 వరకు వాఙ్మయవాక్కు. వీనికి వరుసగ అగ్ని - ఆపః - వాక్ - శుక్రములతో సంబంధములు. వీనికి వరుసగ అర్థ క్రియా జ్ఞాన వికాస భూములగు మహాదేవ - విష్ణు - బ్రహ్మ లధ్యక్షులు. ఇట్లు వాక్శుక్రమయ మహీపృథివి యందును శుక్రత్రయ లోకత్రయ సత్తలు సిద్ధ మగుచున్నవి. ఈ పరిలేఖ నరయుడు:—

1. స్తోమ్యత్రిలోకి (వాక్త్రిలోకి) 'మహీ'

48 ఛందోమాస్తోమః జాగతః–48–వాఙ్మయవాక్కు–బ్రహ్మ–ద్యౌ

44 ఛందో మాస్తోమః–త్రైష్టుభం. 44–ఆపోమయ వాక్కు–విష్ణు అంతరిక్షము.

24 ఛందోమస్తోమము గాయత్రిః, 24. అగ్నిమయవాక్కు పృథివి.

భూః

వాగ్బ్రహ్మ–త్రైలోక్యాధిష్ఠాత, వాక్శుక్రమ్.
మహీ–అష్టచత్వారింశత్ స్తోమావచ్ఛిన్నా.

ఒకేమహా (మహిమా) పృథివికి 48 స్తోమములు. ఇందు 21-33-48 క్రమమున అగ్ని-ఆప-వాక్ శుక్రములు విభక్తములు. ఈమూడును భూః - భువః - సువః ఇదే మహాస్తోమ్యత్రిలోకి, ఇందలి మూడు లోకములు జగతీ - సాగరాంబర-మహీ - నామక ములు. వరుసగ వీనికి మహాదేవ - విష్ణు - బ్రహ్మ లధ్యక్షులు.

ఇక: శుక్రత్రయీ త్రివృద్భావముచే భూర్భువస్స్వః యను మూట నొక్కొక్కటను, భూర్భువస్స్వః భేదము లేర్పడును. కనుక నిట్లు మహాస్తోమ్య త్రిలోకీ గర్భమందు అవాంతరములు

మూడు స్తోమ్యత్రిలోకులు ఏర్పడును. ఈ త్రైలోక్య త్రిలోకీ రూప మహాస్తోమ్య త్రిలోకికి గేవలము మహాపృథివి తోడనే సంబంధము. మరియు, అన్నాదమునకు భూతపురంజనము తోడనేగదా! సంబంధము? కనుక విరాణ్మూర్తి విష్ణువు, సర్వజ్ఞ మూర్తి శివుడు, హిరణ్యగర్భమూర్తి బ్రహ్మ అను నీ మూడు దేవతల సమష్టిరూప భౌతికాత్మను 'సర్వ భూతాంతరాత్మ' యందుము.

సర్వభూతాంతరాత్మయొక్క స్వరూపము శుక్రాత్మక మహాదేవ - విష్ణు బ్రహ్మలవలన సంపన్నమయినది. లేదా:- గాయత్రాగ్ని, త్రైష్టుభ వాయువు (ఆపస్సు) జాగతాదిత్యుడు(వాక్కు) అనువానివలన నేర్పడినది. కనుక దీనిని దేవసత్యాత్మయందుము. దీనికిబ్రతిష్ఠ ఆయశ్వత్థవృక్షముయొక్క మహాపృధివీ రూపశాఖ యొక్క అగ్రభాగము.

పంచపుండీరాత్మికయగు బల్శ యా యశ్వత్థమున కొకశాఖ. దీనియగ్రమున మహాపృథివియున్నది. ఇటనే, యాసర్వభూతాంతరాత్మ యుండి, పార్థివత్రిలోకికి, అందలిప్రజకు సాక్షి యగుచున్నది. కనుక దీనినుపనిషత్తులు సాక్షీసుపర్ణుడన్నవి. 1 మహామాయావచ్ఛిన్నాశ్వత్థ పురుషుడు మహేశ్వరుడు, 2 పంచపుండీరబల్శపై నేకరూపమున నున్న యధియజ్ఞాత్మ యుపేశ్వరుడు. 3 పంచపుండీరములందలి స్వయంభూనామక ఆభూప్రజాపతి పరమేశ్వరుడు. (పరమప్రజాపతి) తక్కిన నలుగురును ప్రతిమేశ్వరులు (ప్రతిమాప్రజాపతులు). (5) ఇక:-

సర్వజ్ఞ హిరణ్యగర్భ విరాణ్మూర్తియగు నీసర్వభూతాంతరాత్మ 'ఈశ్వరుడు' ఈయనయే 'దేవసత్య' నామప్రసిద్ధుడు. దేవసత్యప్రతిష్ఠ బ్రహ్మసత్యము. దీనికమృతసత్యము ప్రతిష్ఠ. సర్వప్రతిష్ఠ పరాత్పరతత్త్వము. దేవసత్యమునకే ఈశ్వర - జీవభేదముచే రెండువివర్తములు. ఇరువురును సయుక్సఖులు - (ఈ విషయము ముందుస్పష్టముకాగలదు) ముందటిపేజీలోని పరిలేఖచే సర్వభూతాంతరాత్మయొక్క సమష్ట్యాత్మక స్వరూపము స్పష్టముకాగలదు. ఈత్రిపర్వ సర్వభూతాంతరాత్మను శ్రుతి యిట్లు నిరూపించును.

1. ద్వాసుపర్ణాసయుజాసఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్న న్నన్యోఽ భిచాకశీతి॥

2. అగ్నిర్మూర్ధా చక్షుషీచంద్రసూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చవేదాః
వాయుఃప్రాణో హృదయంవిశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేషసర్వ
సర్వభూతాంతరాత్మా॥

3. సమానేవృక్షే పురుషోనిమగ్నో ఽనీశయా శోచతి ముహ్యమానః
జుష్టంయదా పశ్యత్యన్య మీశం, అస్య మహిమాన మితి వీతశోకః॥

1. అభిన్నమిత్రములు రెండుసుపర్ణములు ఒకవృక్షశాఖ నధిష్ఠించియున్నవి. అందొకటి పండు రుచిచూచుచున్నది. రెండవది తినక తినుదానిం జూచుచున్నది.

ఈశ్వరీయదేవసత్యము సాక్షి. ద్రష్టామాత్రము. జీవదేవసత్యము భోక్త. ఈ రెండు నాయొకే యశ్వత్థముయొక్క

మహాపృధివీరూప శాఖపై నున్నవి. ఇది భూతాత్మ - అది సర్వభూతాంతరాత్మ.

2. తదీయమస్తకమగ్ని; చంద్రసూర్యులు నేత్రములు. దిక్సోమముశ్రోత్రములు, వాక్ధాసనీయ వాగ్వివర్తములు వేదములు. వాయువుప్రాణము, (స్త్రామ్యత్రైలోక్యరూప పార్థివ ప్రపంచము) విశ్వముప్రతిష్ఠ. పృథివి (భూపిండము) పాదములు.

పృథివివలననే ఏతద్రూపసంపన్నత. పృథివి భూతపురంజనమునకు జెందినది. భూతమయి. దీనికిజెందిన త్రిదేవతలచే తనరూపనిర్మితి గావించు పార్థివత్రైలోక్యాధిష్ఠాత-త్రికళుడు - శుక్రావచ్ఛిన్నుడు - కనుకనే వైకారిక దేవసత్యాత్మ సర్వభూతాంతరాత్మయే.

3. ఒకేసమాన వృక్షమందున్న జీవసుపర్ణుడు, తనయంశియగు నీశునెరుంగక మోహితుడై దుఃఖము నొందుచున్నాడు. ఆయననెఱింగి యతనిమహిమ (భూమానందము) నొంది శోకముక్తుడగును.

ఈపరిలేఖ నరయుడు :—

| 1 2 3 4 5 6 7 8 9 | 10 11 12 13 14 15 | 16 17 18 19 20 21 | 22 23 24 25 26 27 | 28 29 30 31 32 33 | 34 35 36 37 38 39 40 41 42 43 44 | 45 46 47 48 |
|---|---|---|---|---|---|---|
| అగ్నిః — అగ్నిః | వాయుః,అపః | ఆదిత్యవాక్. | దిక్సోమః | భాస్వర సోమః | అంతరిక్షమ్. త్రిష్టుప్ వాయుః అపః | ద్యౌ జగతీ |
| 9. పృథివీ, విరాట్, అర్థః గాయత్రీ. | 15. అంతరిక్షం హిరణగర్భః క్రియా, త్రిష్టుప్ | 21. ద్యౌః సర్వజ్ఞః జగతీ | అపః–అపః– | అపః–వాక్ | | ఆదిత్యః వాక్ |

1. అగ్నివాయుఆదిత్యాత్మికా, స్తోమ్యత్రిలోకీప్రథమా, అంతరిక్షం ద్యౌః
అగ్నిమయీ, జగతీ, పృథివీ,–గాయత్రీ. త్రిష్టుప్ జగతీ
మహాదేవః–విరాట్–పృథివీ–అగ్నిః. వాయుః–అపః ఆదిత్యః
వాక్.

2. అగ్ని–వాయు–ఆదిత్యాత్మికా, (అగ్ని—అపః–సోమమయీ) స్తోమ్య
త్రిలోకీ–ద్వితీయా, ఆపోమయీ, సాగరాంబరా పృథివీ, త్రిష్టుప్
విష్ణుః–సర్వజ్ఞః–అంతరిక్షం–వాయుః–

3. అగ్ని–వాయు–ఆదిత్యాత్మికా, (అగ్ని అప్ వాఙ్మయీ) స్తోమ్యత్రిలోకీ తృతీయా, వాఙ్మయీ
మహీపృథివీ–జగతీ–బ్రహ్మ–హిరణ్యగర్భః–ద్యౌః–ఆదిత్యః.

ఏష సర్వభూతాంతరాత్మా.

ఇట్లు ఒకేమూలాత్మ కారంభమున అమృతాత్మ-బ్రహ్మాత్మ శుక్రాత్మ-అను మూడు వివర్తములగును. అమృతమునకు రెండు వివర్తములు, కనుక నాల్గు వివర్తము లేర్పడును. 1. పరాత్పరాత్మ. 2. పురుషాత్మ. ఈ రెండు నమృతి వివర్తములు, 3. బ్రహ్మ (ప్రకృతి) వివర్తము ప్రాకృతాత్మ. 4. శుక్ర వివర్తము వైకారికాత్మ. ఈ నాల్గును వరుసగ 1. నిగూఢాత్మ 2. పరమాత్మ 3. అధియజ్ఞాత్మ 4. సర్వభూతాంతరాత్మ యనబడును. ఇట్లు ఈశ్వరీ యాత్మవర్గమందు, ప్రధానముగ నాల్గు ఆత్మ వ్యూహము లేర్పడును.

ఇందు 1. పరాత్పరాత్మ యను మొదటి యమృతాత్మ వ్యూహమునకు : 1. భూమాత్మ 2. అణిమాత్మ 3. భూమాణిమాత్మ అను మూడు వివర్తములు. 2. పరమాత్మ యను రెండవయమృతాత్మ వ్యూహమునకు: 1. అవ్యయాత్మ 2. అక్షరాత్మ 3. క్షరాత్మ యను మూడు వివర్తములు. 3. అధియజ్ఞాత్మయనుమూడవదగు బ్రహ్మాత్మవ్యూహమునకు: 1. వేదాత్మ (స్వాయంభూ) 2. లోకాత్మ (పరమేష్ఠి) 3. దైవాత్మ(సూర్యుడు) 4. పశ్వాత్మా (చంద్రుడు) 5. భూతాత్మా (పృథివీ - భూపిండము) అను పంచవివర్తములు. 4. సర్వభూతాంతరాత్మ యను నాలవ శుక్రాత్మ వ్యూహమునకు:- 1. సర్వజ్ఞాత్మ 2. హిరణ్యగర్భాత్మ 3. విరాడాత్మ అను మూడువివర్తములు. ఇట్లు 3+3+5+3 - 14 ఆత్మ వివర్తములు. ఇవే 14 ఆత్మ లోకములు. లేదా, ప్రాజాపత్యలోకములు. ఈశ్వర ప్రజాపతి,

పరాత్పరసృష్టిచే నొకేయాత్మ అయ్యు, తన-విజ్ఞానభావముచే 14 ఆత్మల ఏకవ్యూహము, ఈ 14 వివర్తముల యథార్థ స్వరూపజ్ఞానము లేనిచో జీవాత్మ తత్త్వ సాక్షాత్కారము కాజాలదు. ఇది సర్వభూతాంతరాత్మ నిరుక్తి.

## జీవాత్మవ్యూహ నిరుక్తి

"అంశోనానావ్యపదేశాత్" అన్నట్లు జీవాత్మ యీశ్వర ప్రజాపతి యంశ. అంశియందలి ధర్మములే అంశయందు నుండును; కనుక ఈశ్వరప్రజాపతిధర్మములు (అతనియందలి ఆత్మ విభాగములు) అన్నియు జీవప్రజాపతియందును సిద్ధములగుటే గాక కొన్ని యధికముగా గూడనుండుటవలన ఈశ్వరాత్మ వ్యూహమునందు 14 ఆత్మవివర్తములగుచో జీవాత్మవ్యూహ మునందు 18 ఆత్మవివర్తములగును. వానియూభాసము గీతా విజ్ఞానమందు నామమీమాంసా ప్రకరణమునందుచూపబడినది.

ఈశ్వరసంస్థయందు అమృతవర్గీయాత్మలు 6. బ్రహ్మవర్గీ యాత్మలు 5. శుక్రవర్గీయాత్మలు 3. మొత్తము 14. ఇక:- జీవాత్మసంస్థయందు:- అమృత - బ్రహ్మ వర్గములందు సమాన తయే, కాని వైకారికశుక్రవర్గమందు భేదమున్నది. దీని కవాంతరవిభాగములు తొమ్మిదియగును. కాగా, ఆత్మవివర్త ములు 20 అగును. పరాత్పరవివర్త మొకటియే యనుకొనుచో ఈశ్వరసంస్థయందు (4 అమృతవర్గీయములు, 5 బ్రహ్మవర్గీయ

ములు 3 శుక్రవర్గీయములు) 12 ఆత్మవివర్తములేయగును. ఈ దృష్టితో జీవసంస్థయందు (4 అమృతవర్గీయములు, 5 బ్రహ్మవర్గీయములు, 9 శుక్రవర్గీయములు) 18 ఆత్మవివర్తములగును. ఈయాధ్యాత్మికాత్మవివర్తముల యథార్థస్వరూపములు బ్రహ్మవిజ్ఞానాదిగ్రంథములం దరయనగును. ప్రస్తుతము వానిని నామమాత్రములుగ నిట నుదహరింతుము.

1. అమృతాత్మవ్యూహనిరుక్తి:—

జీవసంస్థను జెందిన షోడశీపురుషుడే అమృతాత్మ. తద్వివర్తములు పరాత్పర - అవ్యయ - అక్షర - క్షరము లనునవి నాలుగు గదా! రసాత్మలేక - నిర్విశేషుడు అనబడు విశుద్ధరసమూర్తి యగు నాత్మతత్త్వమును గూడ లక్ష్యముగా బెట్టుకొనుచో అమృతాత్మవర్గమునకు బంచవిభాగములగును. ఇందు నిర్విశేషుడు రసమూర్తి. 'రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానందీభవతి' బలరహిత విశుద్ధరస స్వరూపియగు నీయనను 'ఐకాంతికసుఖ' మనవచ్చును.

ఈతత్త్వమే, విశేషభావప్రవర్తక బలయుక్తమై (అనగా సర్వబలవిశిష్టరసము) పరాత్పరు డనబరగును. ఈయన సీమాభావ సంపాదక మాయాబలాతీతుడై విశ్వాతీతుడగును. విశ్వధర్మము నాశముగలది. విశ్వాతీతపరాత్పరతత్త్వ మన్నవో 'శాశ్వతధర్మ' - దీనికనంతర మవ్యయపురుషుడు. జీవాత్మసంస్థయం దితడే పరుడనబడు పురుషుడు. ఈ యాధ్యాత్మిక పరపురుష (అవ్యయ) ధర్మనిరూపణమున గీత చెప్పుచున్నది.

"ఉపద్రష్టా నుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహే ఽస్మిన్ పురుషః పరః
అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోఽపి కౌన్తేయ! నకరోతి నలిప్యతే॥

అవ్యయునితరువాత అక్షరపురుషుఁడు. ఈయన అవ్యయ పురుషుని అమృతప్రకృతి. కనుక 'అమృత' శబ్దమున నొప్పును. ఇతనికి బిదప నాత్మక్షరుడు. అనుపసృష్ట బ్రహ్మ శబ్దము క్షర వాచకమంటిమి గదా! కనక క్షరుఁడు బ్రహ్మ యనవచ్చును.

ఇట్లు:- రసరూపనిర్విశేషుడు, రసబలరూప పరాత్పరుడు, అవ్యయుడు, అక్షరుడు, క్షరుడు అనునీయైదు అమృతవర్గీయాత్మ వివర్తములను, క్రమముగ ఐకాంతిక సుఖ - శాశ్వతధర్మ - అవ్యయ - అమృత - బ్రహ్మ నామములం బిలువవచ్చును. ఆధ్యాత్మికామృతవర్గీయములగు నీయైదాత్మ వివర్తములకును బ్రతిష్ఠ లాయాధిదైవికామృతవర్గీయ పంచవివర్తములే. అంశియే అంశమునకు బ్రతిష్ఠ. ఈయాధ్యాత్మికామృతవర్గీయాత్మప్రపంచమును భగవంతు డిట్లు స్పష్టీకరించెను.

"బ్రహ్మణోహి ప్రతిష్ఠాహం, అమృత స్యావ్యయస్యచ
శాశ్వతస్యచ ధర్మస్య సుఖ స్యైకాంతికస్యచ"॥

"ఆత్మసంస్థలైదిటిని జూపుచు నేను (ఈశ్వరప్రజాపతి) 1 క్షర బ్రహ్మభాగముచే నాధ్యాత్మికబ్రహ్మ (క్షరాత్మ) కును, 2. అమృతాక్షర భాగముచే నాధ్యాత్మికామృతాక్షరాత్మకును, 3. అవ్యయభాగముచే నాధ్యాత్మికావ్యయాత్మకును, 4. పరాత్పర

భాగముచే నాధ్యాత్మిక పరాత్పరున (శాశ్వతధర్మున) కును
5. నిర్విశేషభాగముచే నాధాత్మి కైకాంతికసుఖ (నిర్విశేష)
మునకును బ్రతిష్ఠమై యున్నాను.” అనివచించెను. వ్యాఖ్యాత
లిట నేమివ్రాసినను వ్రాయసిండు; విజ్ఞానదృష్టి కీపంచవివర్త పార్థ
క్యము సువ్యవస్థితమే. నిర్విశేషుడుతటస్థుడు - పరాత్పరు డభ
యాత్మ - అవ్యయుడాలంబనాత్మ - అక్షరుడు నియంతాత్మ -
క్షరుడు పరిణామ్యాత్మ. ఈ మొత్త మమృతవర్గము.

బ్రహ్మాత్మవ్యూహము:-

ఈశ్వరీ యాధియజ్ఞాత్మయే బ్రహ్మాత్మ. లేదా, ప్రాకృ
తాత్మ. దీనికి స్వాయంభూ - పరమేష్ఠీ - సూర్య - చంద్ర
పృథువు లను పంచవివర్తములు. ఇవి యాధిదైవికములగు
నంశులు. వీనివలన నాధ్యాత్మికాంశల స్వరూపములేర్పడును.
1 అధ్యాత్మనుందు స్వాయంభూ అంశ 'శాంతాత్మ' 2 పరమేష్ఠి
యంశ 'మహదాత్మ' 3 సూర్యాంశ 'విజ్ఞానాత్మ' 4 చంద్రాంశ
'ప్రజ్ఞానాత్మ' 5 భూపిండభౌతికాంశ 'శరీరాత్మ' (ఆత్మావై
తనూః) వీని మొత్త మాధ్యాత్మకబ్రహ్మాత్మ. లేక అధియజ్ఞాత్మ.
ఇదే ఆధ్మాత్మిక పంచపుండీర (జీవ) ప్రాజాపత్యబల్శా.

1. శాంతాత్మ:- ఆకాశాత్మక గుహారూప పరోవరీ
ణావ్యక్తాత్మ [illegible] శాంతాత్మ. దీనినే అవ్యక్తాత్మయందురు.
ముక్తిదశయ [illegible] (ఘునిషాతిరిక్త) సంపూర్ణప్రపంచము మొదట
నీ శాంతాత్మ [illegible] దే లీనమగును. చూడుడు:-

'యదాసదేవో జాగర్తి తదేదంచేష్టతేజగత్
యదాస్వపితిశాంతాత్మా తదాసర్వం నిమీలతి''. (మను-స్మృ1/52)

ఆధ్యాత్మికములగు దహరాకాశ, హృదయాకాశ - శరీరాకాశములు మూటికి ప్రతిష్ఠ ఆకాశాత్మకమునత్యలోకాత్మకమునగునీయవ్యక్తశాంతాత్మయే. ఇదే ఆధ్యాత్మిక వేదసృష్టి కధిష్ఠాత. ఇయ్యది తన; వేద - సూత్ర - నియతి రూపములచే అధ్యాత్మమందు ప్రతిష్ఠితమై యున్నది. బ్రహ్మాత్మకమగు నిది స్థితిరూపము. దీనికి కంపనములేనందున నిది శాంతాత్మ.

2. మహదాత్మ:- అ[illegible]మయమై పరమేష్ఠి[illegible]- గుణత్రయమూర్తిరూప మహదంశయే మహదాత్మ. ఇది శరీరాకృతికి, ఇంద్రియముల స్వాభావికప్రవృత్తి (ప్రకృతి)కి ప్రతిష్ఠ. శుక్రము దీనికి ప్రతిష్ఠాభూమి. ఇదే (మహదాత్మయే) ప్రజాతంతువితాన మూలకారణము. 84 పితృప్రాణములతోగూడి యేడుతరములదనుక సమానరూపమున, వితతమగుచు సప్తపురుషపర్యంతము సాపిండ్యభావమునకు గారణమగుచున్నది. సత్త్వ రజస్తమః ప్రతిష్ఠయునిదే. దీనింగూర్చియే, ఏకోద్దిష్ట పార్వణాదిశ్రాద్ధములు గావింపబడుచున్నవి.

3. విజ్ఞానాత్మ:- ఇదిసూర్యాంశ. దార్శనికులబుద్ధి. విశేషభావప్రవర్తిక. మనుజులందలి పెద్ద — చిన్న — ఉత్తమ — మధ్యమ — అధమాది భేదములకు గారణము. విషయముల వెంట బరువిడును, విషయములేకున్నను స్వతంత్రకల్పనలం గావించును. దీనికి ధర్మజ్ఞానాదులు ఎనిమిది వివర్తములు

కలవు. ఇది ప్రజ్ఞానాత్మతో (మనస్సుతో), నిత్యము సంప రిష్వక్తమై యుండును. ధర్మాధర్మములకు దీనితోడనే సంబంధము. దీని ధర్మాచరణముచే కర్మాత్మ పుణ్యాత్మ యగును. అధర్మాచరణముచే అది పాపాత్మయగును. ఇదే యజ్ఞమునకు ప్రతిష్ఠయగుచు సౌరస్వర్గప్రాప్తికి గారణమగును.

4. ప్రజ్ఞానాత్మ:— ఇది చంద్రాంశ. దార్శనికుల మనస్సు. సర్వేంద్రియాను గ్రాహకమగుటచే సర్వేంద్రియమందురు. ఇంద్రియ సంచాలకమయ్యు దాను ఇంద్రియమర్యాదా బహిర్భూతమగుటచే దీని ననింద్రియమనస్సనియు నందురు. బుద్ధివలె నిది విషయములపై కరుగదు, అరుగజాలదు. విషయములే యింద్రియములద్వారా దీనిపై కరుదెంచును. సంకల్ప (పరిగ్రహ) వికల్ప (పరిత్యాగ) ముల కిది యధిష్ఠాత. ఇది విషయాసక్తమై కర్మాత్మకు బంధకారణమును అనాసక్తమై ముక్తికారణము నగును.

5. ప్రాణాత్మ:- పంచదేవతామయియు, అన్నాద ప్రకృతి యుక్తయునగు పంచీకృత పృథివ్యంశమిది. పార్థివాన్నాద ప్రాణము అగ్ని-వాయు-ఆదిత్యు లను మూడుభాగములు. దీని గర్భమందు దిక్సోమ - భాస్వరసోమము లనుమరిరెండు సౌమ్య ప్రాణము లిమిడియున్నవి: అన్న (సోమ) తత్త్వము అన్నాద (అగ్ని) తత్త్వముగర్భమున జేరగనే అన్నాదముగనై అన్నాద మనియే వ్యవహరింపబడును "తద్యదా సమాగచ్ఛతః అత్తై వాఖ్యాయతే నాద్యం". ఇట్లు అగ్నిత్రయీ, సోమద్వయీ

సంబంధముచే నోకేపార్థివమగు నన్నాదప్రాణము పంచావస్థ॰ నొందును. వీనికిప్రభువు ప్రాణాత్మ (అన్నాదాత్మ) యొకటియే. ఈ నైమెదిటియంశలనుండియు, అధ్యాత్మసంస్థయందు క్రమముగ (i) వాక్కు (అగ్ని) (ii) ప్రాణము (వాయువు) (iii) చక్షువు (ఆదిత్యుడు) (iv) దిక్సోమము (శ్రోత్రము) (v) (భాస్వర సోమమయ) ఇంద్రియ మనస్సు అను పంచేంద్రియ ప్రాణముల వికాసము కల్గును. "యస్మిన్ప్రాణాః పంచధా సంవివేశ" అన్న ట్లీ పంచేంద్రియ ప్రాణములును ఆ సమష్టిరూప, లేదా, అవయ వీరూపమగు నన్నాదమయ ప్రాణాత్మయం దర్పితములు. ఇంద్రియ వర్గమే తదీయ వాలికస్వరూపము, కనుక నీప్రాణాత్మ నింద్రియాత్మ యనియు ననవచ్చును.

దీనికి రోదసీత్రిలోకి తోడనే సంబంధము. అన్నాద మగ్ని; అగ్నినే రుద్రుడందురు. తత్సంబంధముననే యీ త్రిలోకి 'రోదసి' యనబడును. కనుకనే రోదసి రుద్రపత్ని యని పురాణము చెప్పును. ఈ త్రిలోకికి పృథివీ లోకము భూః. సూర్యలోకము స్వః. ఈ రెంటి మధ్యాకాశము భువః. సూర్యునకుపైని నాలవదగు నాపోలోకమున్నది 'అస్తివై చతుర్థో దేవలోక ఆపః' దీనికి దిక్సోమ - భాస్వర సోమము లను రెండు విభాగములు. మొత్తమీనైదిటను క్రమమున అగ్ని వాయు ఆదిత్య దిక్సోమ-భాస్వర సోమములు ప్రతిష్ఠితములై యున్నవి. ఈనైదిటికి భూతేశరుద్ర సంబంధముచే నివి భూతాగ్నులు. వీనితోడనే ప్రాణాత్మకు సంబంధము.

ముందు జెప్పబడనున్న కర్మాత్మయు నన్నాద సంబంధము కలదే. ప్రాణాత్మయు నట్టిదే. కాని, రెంటికిని రోదసీ-స్తామ్య భేదముచే సర్వథా పార్థక్యమున్నది. ప్రాణాత్మ ప్రకృతి, కర్మాత్మవైకారికము. ప్రాణాత్మకు బ్రహ్మసత్యముతోడను, కర్మాత్మకు దేవసత్యరూప శుక్రముతోడను సంబంధము. ప్రాణాత్మ స్వరూపనిష్పత్తి రోదసీ త్రిలోకీనామక పార్థివత్రిలోకికి జెందిన పంచదేవతల వలన నైనది. కర్మాత్మ స్వరూప నిష్పత్తి స్తామ్యత్రిలోకీ నామక పార్థివత్రిలోకి వలన నైనది. ఈ రెండు భేదములను చక్కగ గమనించి యాత్మ వివర్తముల నెరుంగవలయునే గాని సామ్యమాత్రమున విరోధ మున్నదని పొరపడరాదు. కానిండు:

ఇంతవరకు: - ఈశ్వరసంస్థకు జెందిన స్వాయంభ్వాది పంచక ప్రత్యంశలవలన అధ్యాత్మ సంస్థను జెందిన శాంతాత్మ - మహదాత్మ-విజ్ఞానాత్మ-ప్రజ్ఞానాత్మ-ప్రాణాత్మ లను నీ పంచప్రాకృతాత్మల స్వరూప నిష్పత్తియు నైనదని తేలినది. ఇదే ఆధ్యాత్మిక శాత్మ వ్యూహమందలి బ్రహ్మాత్మవర్గము. దీనినే బ్రహ్మ సత్యాత్మ అధియజ్ఞాత్మ యందురు:- ఈ పరిలేఖల నవలోకింపుడు:-

1. బ్రహ్మాత్మవర్గః-బ్రహ్మసత్యాత్మ

1. శాంతాత్మా-అవ్యక్తమ్-ప్రాణః-స్వాయంభువః
2. మహానాత్మా-మహాన్-అపః-పారమేష్ఠ్యః
3. విజ్ఞానాత్మా-బుద్ధి-వాక్-సౌరః

4. ప్రజ్ఞానాత్మా–మనస్సు–అన్నమ్–చాంద్రః
5. ప్రాణాత్మా–ఇంద్రియములు,–అన్నాదః–పార్థివః

2. రోదసీ త్రైలోక్యమ్ ప్రాణాత్మా

5. దిక్సోమః–
4. భాస్వరసోమః } పారమేష్ఠ్యాపః శ్రోత్రం, మనః
3. ఆదిత్యః–సూర్యః–సువః–చక్షుః
2. వాయుః, అంతరిక్షం, భువః–ప్రాణః
1. అగ్నిః–పృథివి–భూః–వాక్.

3. శుక్రాత్మవ్యూహము.

ఈ శుక్రాత్మకు స్తోమ్యత్రిలోకియందలి యన్నాదాగ్నితో సంబంధము. ఈశ్వరీయ సర్వభూతాంతరాత్మను వివరించుచో పృథివికి: 1. జగతి, 2. సాగరాంబర 3. మహీ, అను, మూడు స్వరూపములను జెప్పియుంటిమి. ఆ మూడుస్వరూపములను, వానితోసంబంధముగల యాత్మవివర్తములను ఎదుటనుంచికొని యీ శుక్రాత్మను విచారింపవలయును. ఆసర్వభూతాంతరాత్మ స్వరూపసంస్థాక్రమములే, సరిగా నీ శుక్రమూర్తి భూతాత్మకును గలవు. అది సాక్షీసుపర్ణము, ఇది భోక్తాసుపర్ణము. దానిస్వరూపమును అగ్ని-వాయు-ఆదిత్య (ఇంద్రు) ల పారస్పరిక వైకారిక యజ్ఞము వలననే సంపన్నమయినది. దీని స్వరూపమును ఈ త్రిదేవమూర్తి వలననే సంపన్నమయినది.

అగ్నితత్త్వ త్రివృద్భావమువలన నీ వైకారిక శుక్రాత్మకు 9. రూపములగును. తద్విశేషవివరణములు, మరొకచో జూచు

కొనవచ్చును. ప్రస్తుతమిట నామమాత్రోల్లేఖన గావింతుము. వాగాపోగ్నులు మూడు శుక్రములు. 1. వాక్శుక్రమునకు 48 స్తోమావచ్ఛిన్న 'మహీ' పృథివితోడను, 2. ఆపశ్శుక్రము నకు 33 స్తోమావచ్ఛిన్న 'సాగరాంబర' పృథివితోడను, 3. అగ్ని శుక్రమునకు:- 21 స్తోమావచ్ఛిన్న 'జగతీ' పృథివితోడను సంబం ధముగలదని వెనుకటి సర్వభూతాంతరాత్మ ప్రకరణమునందు సపరిలేఖముగా జెప్పబడినది.

ఈమూడే యమృతశుక్రములు. వీనివలననే మహాపృథివీ రూపమగు నీస్తొమ్యత్రిలోకీ స్వరూప మేర్పడినది. వీనికే మూడు మర్త్యావస్థలున్నవి. ఈమర్త్యశుక్రములవలన భూపిండ స్వరూపము సంపన్నమయినది. యజ్ఞభాషయందు, మర్త్య శుక్రమూర్తియగు భూపిండమును కృష్ణాజినమనియు అమృత శుక్రమూర్తియగు మహాపృథివిని పుష్కరపర్ణమనియు నందురు. చయనపరిభాషయందీరెంటిని, 'ఆషాడ' - 'ఉఖా' అనియు, విజ్ఞానభాషయందు, చిత్య - చితేనిధేయ నామములను బిలు తురు. ఇందు మొదట చిత్యభూపిండముంజూతము.

భూపిండమునకు వాగ్గాద్యా అను మూడు మనోతలని చెప్పితిమి. శుక్రమున కమృత - మర్త్య భేదముండుటచే నీపార్థివ మనోతలకును రెండవస్థలు సిద్ధించును. కాగా:- 1. మర్త్య వాఙ్మనోతకు మర్త్యాగ్నితోడను, 2. మర్త్యగౌమనోతకు మర్త్యాపః శుక్రముతోడను 3. మర్త్యద్యామనోతకు మర్త్య వాక్శుక్రముతోడను, సంబంధముండును:-

భూః - భువః - స్వః అను నీ మూడువ్యాహృతులకు భూపిండముతోడను పృథివి - అంతరిక్ష - ద్యౌ - అనునీ మూడు లోకములకును మహాపృథివితోడను సంబంధముగలదు. ఈరెండును పర్యాయసంబంధము గలవనుకొనుట పొరపాటు. అనగా ద్యౌ - స్వః; అంతరిక్షం - భువః; - పృథివీ - భూః; ఇవిపర్యాయములు గావు. "దివంచపృథివీం చాంతరిక్షమథోసువః" ఇత్యాది మంత్రమందు స్వః యను దానిని ద్యులోకముకంటె వేరుగ లెక్కించుటయే ఈ పర్యాయసంబంధము తప్పు అని స్ఫురింప జేయును. ఆరెంటికిని పార్థివసంస్థయందు ద్యౌ - అంతరిక్ష - పృథివీ - భూః - భువః - స్వః అను క్రమము నెరుంగవలయును.

అన్నిటికిపైని ద్యౌస్తర. దానిగర్భమం దంతరిక్షస్తర. దానిగర్భమందు పృథివీస్తర. తద్గర్భమందు భూస్తర. - అందు స్వస్తర యున్నవి. ఇక: 1 ద్యౌతో ద్యౌనామకమగు నమృత మనోతకును, వాఙ్నామకామృత శుక్రమునకును, 2 అంతరిక్షముతో గౌనామకామృతమనోతకును, ఆపోనామకామృత శుక్రమునకును, 3 పృథివితో వాఙ్నామకామృతమనోతకును, అగ్నినామ కామృతశుక్రమునకును సంబంధములు. ఇట్లే 1 భూఃతో వాఙ్నామక మర్త్యమనోతకును అగ్నినామక మర్త్య శుక్రమునకును, 2 భువఃతో గౌనామక మర్త్యమనోతకును, ఆపోనామక మర్త్యశుక్రమునకును 3 స్వఃతో ద్యౌనామక మర్త్యమనోతకును, వాఙ్నామక మర్త్యశుక్రమునకును సంబంధములు.

భూపిండముయొక్క కేంద్రము స్వర్లోకము. ఇచటనే వాగ్రూప మర్త్యశుక్రమును, ద్యౌరూపమర్త్య మనోతయు ప్రతిష్ఠితములు. ఇదే మొదటిదగు బ్రహ్మసంస్థ. దీనిం గూర్చియే, "ప్రజాపతిశ్చరతిగర్భే" అని చెప్పబడినది. 2 పిమ్మటిపై దాపోమయస్తరము. ఇదే భువర్లోకము. దీని కొరకే "అధోభువనపాతాళంబలిసద్మరసాతలమ్"అనువచనము. ఇచటనే ఆపోరూప మర్త్యశుక్రము, గౌరూప మర్త్యమనోతయు ప్రతిష్ఠితములు. ఇదే విష్ణుసంస్థ. 3 అన్నిటికి పైని మృణ్మయస్తర. ఇదే ప్రతిష్ఠాలక్షణ భూపిండము. భూలోక మిదే. ఇచటనే అగ్నిరూపమర్త్య శుక్రమును, వాగ్రూపమర్త్య మనోతయును ప్రతిష్ఠితములు, ఇదే మూడవదగు రుద్రసంస్థ.

భూపిండమును మహాపృథివీలక్షణ స్తోమ్యత్రిలోకిని వేరు సేయునది 'ఏమూషవరాహ' నామక వాయువు. ఈస్థిర వాయువు, ఆవహ, ప్రవహ సంవహాది సప్తస్వరూప ధారణ గావించి భూపిండము నలువంకలను ప్రతిష్ఠితమై యున్నది. భూపిండమును స్వస్వరూపమున నిల్పుటయే దీనిపని. విశకలన ధర్మముగల యగ్ని భూపిండమును విదీర్ణము గావింపగోరును. కాని, యీ వరాహవాయు దృఢవేష్టనముచే నది యట్లు కాకున్నది. కనుకనే వరాహమును భూపిండోద్ధారక మని చెప్పియున్నారు. కనుకనే పృథివి వరాహపత్నిగా బురాణము లందు వర్ణింపబడినది. ఘనతయే పృథివీ స్వరూపము. ఈ ఘనతా ప్రవర్తకము, రక్షకము ఈ వరాహప్రజాపతియే.

వరాహాధరాతలము మొదలు 21 స్తోమపర్యంతమును పృథివీలోకము. ఇందు వాఙ్నామ కామృతమనోతయు, అగ్ని నామ కామృతశుక్రము నున్నవి. ఇది మొదటిదగు రుద్ర సంస్థ. 33 స్తోమపర్యంతము అంతరిక్షలోకము. ఇందు గౌ నామ కామృతమనోతయు, ఆపోనామ కామృతశుక్రము నున్నవి. ఇది రెండవదగు విష్ణుసంస్థ. 48 స్తోమపర్యంతము, ద్యులోకము. ఇందు ద్యౌనామ కామృతమనోతయు, వాఙ్నామ కామృతశుక్రమునున్నవి. ఇదే మూడవదగు బ్రహ్మసంస్థ. ఈ మూడమృతసంస్థలనే వెనుక జగతీ - సాగరాంబర - మహీ, అని వ్యవహరించితిమి. ఇందు జగతియే పృథివి. సాగరాంబర యంతరిక్షము. మహియే ద్యౌ. ఈ మూటను అవాంతర త్రైలోక్యము లున్నవి. ఇట్లు:- మూడు స్తోమ్యత్రిలోకు లేర్ప డును. ఈవివరమంతయు వెనుక, ఈశ్వరీయ ప్రకరణమునందు విస్తరించితిమి.

అమృతభాగము దివ్యము. మర్త్యభాగము భౌతికము, ఈదివ్యభౌతికభేదముంబట్టి పార్థివాత్మయు రెండు విధములు; భూతాత్మకు మర్త్యభూపిండముతోడను, దివ్యాత్మ కమృత పృథివితోడను సంబంధము. మర్త్య భౌతిక పిండమునందు 1 భూపిండము, 2 వాయుస్తర యను రెండుభాగములు చెప్పి యుంటిమి. ఈ రెండుభాగములును భౌతికములే. ఇందు— భూపిండ ప్రత్యంశ శరీరాత్మ. వాయ్వంశ హంసాత్మ. ఒక సాంవత్సరిక పరిక్రమానంతరము శరీరమునందు ఘనత యేర్ప

డును. ఘనతా సూచకములు దంతములు. వాయువునకు ఘనతతో సంబంధమంటిమి కదా! దంతనిర్గమన కాలమందే వాయవ్యహంసాత్మ భౌతికశరీరమున ప్రవేశించును. అంతకు బూర్వ మేతదాగమనములేదు; కర్మభోక్తయగు కర్మాత్మ, స్థూలశరీరమును విడచినను, ఆశరీరభూతములు, మహాభూతములందు గలయకున్నంతవరకు నీహంసాత్మ యాశరీరమును విడువదు; హంసాత్మయొక్క యీబంధమును విడిపించుకొరకే ఆర్యసభ్యత, శరీరమునకు దాహసంస్కార మావశ్యక మన్నది. దంతోత్పత్తికిబూర్వము, హంసాత్మాగమనము లేనందున నప్పటిశరీరమునకు దహనసంస్కారము నిషేధించినది. ఇంతకు జెప్పదలచినది:— "వాగాపోగ్నిమయమును, వాక్ప్రధానమగు భూపిండమునుండి శరీరాత్మ (బాహ్యాత్మ) యుత్పన్నమగును. ఇదే అన్నమయపురుషుడు, అన్నాహుతి యున్నంతవరకే దీనిసత్త. తదుత్క్రాంతియే దీనియుత్క్రాంతి. చిత్యాగ్నియే దీనిస్వరూపము. రెండవది ఆపశ్శుక్రమయహంసాత్మ. ఈ రెంటికిని భూపిండాంశతోడనే సంబంధము." అనియే.

ఇక దివ్యపృథివిం జూతము:- దీని కగ్నివాయు ఇంద్రు లను మూడు వివర్తములు. వీనితో గ్రమముగ అగ్ని - ఆపః - వాక్శుక్రమములకు సంబంధములు. ఈశుక్రభేదముచే ఈ యొకే దివ్యాత్మకు 1 అగ్నిప్రధానవైశ్వానరము, 2 వాయుప్రధాన తైజసము, 3 ఇంద్రప్రధానప్రాజ్ఞము అను మూడు భేదములు. ఇవి వరుసగ, ధాతుజీవ - మూలజీవ - జీవజీవుల కాత్మలు.

ఇట్లు ఒకేదివ్యాత్మకు 1 అర్థప్రధానవైశ్వానరాత్మ 2 క్రియా ప్రధానతైజసాత్మ 3 జ్ఞానప్రధానప్రాజ్ఞాత్మ యను మూడు వివర్తములు.

ఇంద్రమయ ప్రాజ్ఞాత్మయందే సోమమునకు సంబంధము. చిదాత్మ (ఈశ్వరుని) యవతార మిటనే జరుగును. ఈప్రాజ్ఞాత్మకు ఈశ్వరజన్మా, ఈశ్వరాంశ, ఈశ్వరాభిన్న - భేదముచే మూడువిర్తములు. 1 వాసనాసంస్కారమయ కర్మమూర్తి యీశ్వర జన్మయగు ప్రాజ్ఞుడు కర్మాత్మ. 2 జ్యోతిర్లక్షణ జ్ఞానమయేశ్వరాంశప్రాజ్ఞుడు చిదాభాసుడు. 3 అర్థమయ, ఈశ్వరాభిన్న సర్వశక్తిలక్షణ ప్రాజ్ఞు డీశ్వరుడు.

ఈసూాధ్యాత్మికేశ్వరునకును, మనఃప్రాణ వాగ్భేదమున మూడువివర్తములు. 1 మనోమయేశ్వరుడు విభూతిలక్షణుడు; 2 ప్రాణమయేశ్వరుడు ఊర్గ్లక్షణుడు, 3 వాఙ్మయేశ్వరుడు శ్రీలక్షణుడు; ఈయాత్మవివర్తముల నన్నింటిని గలిపికొన్నచో శుక్రవర్గమందు 9 ఆత్మవివర్తములగును.

ప్రకారాంతరముగ:- (i) శరీరాత్మ:- వాగ్జన్యము, భూతమయము. (ii) హంసాత్మ:- అబ్జన్యము, వాయుమయము. (iii) దివ్యాత్మ:- అగ్నిజన్యము ప్రాణమయము. దీని వివర్తములు 1 కర్మాత్మ 2 చిదాత్మ 3 ఈశ్వరుడు, అని మూడు. ఇందు 1 కర్మాత్మ:- వాసనామయము, ఈశ్వరజన్మా. ఈశ్వరునకు (సర్వభూతాంతరాత్మకు) 1 విరాట్టు 2 హిరణ్యగర్భుడు 3 సర్వజ్ఞుడు అను మూడుకళలను జెప్పితిమిగదా. వైశ్వానర

తైజస ప్రాజ్ఞరూప కర్మాత్మ యాత్రికశ్వేశ్వరునుండి వెలసినది. 2 చిదాత్మ (చిదాభాసుడు) జ్యోతిర్మయుడు, ఈశ్వరాంశ. 3 ఈశ్వరుడు:- శక్తిమయుడు, ఈశ్వరాభిన్నుడు:- ఈ ఈశ్వరుడు:- (i) సత్యాత్మ (ii) యజ్ఞాత్మ (iii) సర్వభూతాంతరాత్మ యను భేదమున మూడువిధములు. (i) ప్రాణాగ్నిమయ సప్తలోక శరీరమూర్తి (సప్తవితస్తికాయ) బ్రహ్మయే సత్యాత్మ- మొదటి యీశ్వరసంస్థ యిదే. (ii) వాగగ్నిమయ హిరణ్యగర్భశరీరమూర్తి విష్ణువు యజ్ఞాత్మ. ఇదే రెండవ ఈశ్వరసంస్థ. (iii) అన్నాదాగ్నిమయ మర్త్యత్రైలోక్య (రోదసీత్రైలోక్య) శరీరమూర్తి మహాదేవుడే 'సర్వభూతాంతరాత్మ.' ఇదేమూడవ యీశ్వరసంస్థ. ఈత్రిమూర్తి యీశ్వరుడే జీవశరీరపరిచ్ఛిన్నుడగుచు, జీవాత్మపై తన బ్రహ్మకళచే ఊర్గ్భావమును, విష్ణుకళచే శ్రీభావమును, మహాదేవకళచే విభూతిభావమును ప్రవర్తిల్లజేయును. అనగా నాభావముల కనుగ్రాహకుడగునని తాత్పర్యము. ఏజీవాత్మలయందీ ఊర్క్ — శ్రీ — విభూతి భావము లగపడునో వానిపై నీశ్వరుని విశేషానుగ్రహమున్నట్లు భావింపవలయును. "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా, తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్." (గీతా)

ఈ చెప్పబడిన 9 ఆత్మవివర్తములకును, వాగాపోగ్ను లను మూడు శుక్రములందె యంతర్భావము. కనుకనే ఈ యాత్మవర్గమును 'శుక్రాత్మ' యందురు. ఇదే వైకారికాత్మవర్గము. ఇదే ఆయశ్వత్థవృక్షమునకు మూడవదగు శుక్రము. ఈవిధ

ముగ:-శుక్రాత్మకు 9, బ్రహ్మాత్మకు 5, అమృతాత్మకు 4ఁ మొత్తము జీవాత్మవ్యూహమందు 18 ఆత్మవివర్తములగును. పరమార్థతః ఆత్మయొకడే. వ్యవహారతః ఆత్మలు 18. జీవుడాత్మ కాదు, ఆత్మగ్రామము. విజ్ఞానసమ్మతములగు నీ 18 ఆత్మవివర్తముల నెరుంగుటే వైజ్ఞానికాత్మపరీక్ష. ఈక్రింది పరిలేఖలను చక్కగా గమనింపవలయును.

శుక్రాత్మ:—

| | |
|---|---|
| 1. శరీరాత్మా - భూతమయః - వాక్శుక్రః | పార్థివః |
| 2. హంసాత్మా - వాయుమయః - ఆపశ్శుక్రః | |
| 3. దివ్యాత్మా* - అగ్నిమయః - అగ్నిశుక్రః | |

| | |
|---|---|
| 1. 6. ద్యౌః-ద్యౌః-వాక్-48-మహీ. | మహాపృథివీ |
| 2. 5. అంతరిక్షమ్-గౌః-ఆపః-33-సాగరాంబరా. | |
| 3. 4. పృథివీ - వాక్-అగ్నిః-21-జగతీ | |

| | |
|---|---|
| 1. 3. భూః-వాక్-అగ్నిః- | ——భూపిండః |
| 2. 2. భువః-గౌః-ఆపః- | |
| 3. 1. స్వః-ద్యౌః-వాక్- | |

| | | |
|---|---|---|
| భూపిండః- | వాక్ | శరీరాత్మా |
| వాయుస్తరః- | భూతమయీపృథివీ-తతః | హంసాత్మా |
| | ఆపః- | |

మహాపృథివీ-అగ్నిః-ప్రాణమయీపృథివీ-తతః-దివ్యాత్మా.

1. శరీరాత్మా - భూతమయః - అగ్ని శుక్రః
2. హంసాత్మా - వాయుమయః - అప్ శుక్రః
3. దివ్యాత్మా* - అగ్ని మయః - వాక్శుక్రః

3*. వైశ్వానరః - అగ్నిమయః - అగ్ని శుక్రః
4. తైజసః - వాయుమయః - అప్ శుక్రః
5. ప్రాజ్ఞాత్మా - ఇంద్రమయః - వాక్శుక్రః

5. కర్మాత్మా - ఈశ్వరజన్మా - వాసనాలక్షణకర్మమయః - అగ్ని శుక్రః [1]

6. చిదాభాసః - ఈశ్వరాంశః - జ్యోతిర్లక్షణజ్ఞానమయః - అప్ శుక్రః [2]

7.* ఈశ్వరః - ఈశ్వరాభిన్నః - సర్వశక్తిలక్షణార్థమయః - వాక్శుక్రః [3]

---

7. ప్రాణమూర్తిరీశ్వరః-ఉగ్రలక్షణః- 1. (అప్ శుక్రః)

8. వాఙ్మూర్తిరీశ్వరః-శ్రీలక్షణః- 2. (అగ్ని శుక్రః)

9. మనోమూర్తిరీశ్వరః-విభూతిలక్షణః- 3. (వాక్శుక్రః)

ప్రకారాంతరముగా:-

| | | |
|---|---|---|
| 3. | 1. శరీరాత్మా-వాగ్జన్యః-భూతమయః<br>2. హంసాత్మా-అబ్జన్యః-వాయుమయః<br>3. దివ్యాత్మా-అగ్నిజన్యః-ప్రాణమయః | భూతాత్మా |
| 3. | 1. కర్మాత్మా-వాసనామయః-ఈశ్వరజన్మా-అగ్నిః<br>2. చిదాభాసః-జ్యోతిర్మయః-ఈశ్వరాంశః - అపః<br>3. ఈశ్వరః-శక్తిమయః-ఈశ్వరాభిన్నః - వాక్ | జీవాత్మా |
| | 1. సత్యాత్మా-బ్రహ్మా-ఊర్జంప్రవర్తయతి వాక్<br>2. యజ్ఞాత్మా-విష్ణుః-శ్రియంప్రవర్తయతి అపః<br>3. సర్వభూతాంతరాత్మా-మహాదేవః-విభూతిం ప్రవర్తయతి-అగ్నిః | ఈశ్వరాత్మా |

ఇది శుక్రాత్మనిరుక్తి

జీవాత్మ వ్యూహము:-

| | | |
|---|---|---|
| 1. అమృతమ్ పరాత్పరః - | 1. అభయాత్మా | 1 |
| 2. అమృతమ్- పురుషః తదేవామృతముచ్యతే | 1. అవ్యయః-ఆలంబనాత్మా | 2 |
| | 2. అక్షరః-నియంతాత్మా | 3 |
| | 3. క్షరః-పరిణామ్యాత్మా | 4 |
| 3. బ్రహ్మ - ప్రకృతి తద్బ్రహ్మ | 1. శాంతాత్మా (అవ్యక్తం) | 5 |
| | 2. మహదాత్మా (మహత్తు) | 6 |
| | 3. విజ్ఞానాత్మా (బుద్ధి) | 7 |
| | 4. ప్రజ్ఞానాత్మా (మనస్సు) | 8 |
| | 5. ప్రాణాత్మా (ఇంద్రియములు) | 9 |

| | | |
|---|---|---|
| 4. శుక్రమ్ - వైకారికః | 1. శరీరాత్మా | 10 |
| | 2. హంసాత్మా | 11 |
| | 3. వైశ్వానరాత్మా | 12 |
| | 4. తైజసాత్మా | 13 |
| తదేవశుక్రం | 5. కర్మాత్మా | 14 |
| | 6. చిదాభాసః | 15 |
| | 7. సత్యాత్మా | 16 |
| | 8. యజ్ఞాత్మా | 17 |
| | 9. సర్వభూతాంతరాత్మా | 18 |

వైజ్ఞానిక దృష్టితో నాత్మపరీక్షాప్రకరణము సమాప్తమయినట్లే. ఈ యాత్మవ్యూహపరిజ్ఞానముచే ఆత్మసంబంధి సందేహములు చాలవరకు నివృత్తములగును. గీత వీనినన్నిటిని సూచింపుచు అవ్యయునిపై విశ్రాంతి నొందినది. ఉపనిషత్తులన్నియు నవ్యయునో, తత్సమకక్షకు జెందిన పరాత్పరునో ముఖ్యలక్ష్యము గావించుకొన్నవి — యను దృష్టితో నాత్మశాస్త్రము లన్నియు నభిన్నార్థకము లైనను; ప్రతిపాదించు మార్గములు మాత్రము భిన్నములు; ఒకటి ప్రజ్ఞానముద్వారా, వేరొకటి విజ్ఞాముద్వారా, ఇంకొకటి మహాన్ద్వారా, లక్ష్యముం జేరుచుండును. ఈవివరము మరొకచో జూడవచ్చును. ప్రస్తుతమునకొకయుదాహరణమునకు కఠోపనిషత్తుంగొనుడు. ఇది భోక్తాత్మయను కర్మాత్మ ద్వారా లక్ష్యప్రాప్తి కుపాయమును జెప్పుచున్నది:—

“ప్రాజ్ఞరూపకర్మాత్మ, మొదట తనవాఙ్మనస్సులను సంయమనము గావింపవలయును. మనస్సును జ్ఞానాత్మ (బుద్ధి-విజ్ఞ

నాత్మ) యందును, జ్ఞానాత్మను మహదాత్మయందును, దానిని శాంతాత్మయందును సంయమనము సేయవలయును." అనుచు వాక్కు (ఇంద్రియరూప-ప్రాణాత్మ) మనస్సు (ప్రాణాత్మ) విజ్ఞానాత్మ - మహదాత్మ - శాంతాత్మ యను పంచప్రాకృతాత్మలందును క్రమముగ నారూఢముచేసి దానిని (శుక్రమూర్తి కర్మాత్మను) ఆ పురుషాత్మం జేర్చుచున్నది. ఈ వచనమరయదగినది:—

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేద్ జ్ఞానఆత్మని
జ్ఞానమాత్మని మహతి తద్యచ్ఛే చ్ఛాంతఆత్మని" (కఠ)

ఇట్లు ఈ యుపనిషత్తునందు, మరొకతావునందును ఈ యాత్మభేదము స్పష్టీకరింప బడినది. శరీరాత్మ కర్మాత్మకాయతనము, అది శరీరముననుండి యింద్రియములద్వారా అర్థసంచయము గావించును. ఆయర్థములకు మనస్సుతో సంబంధము కలుగును. ప్రజ్ఞానాత్మ (మనస్సు) విజ్ఞానాత్మయందును, అది మహదాత్మయందును అది అవ్యక్తాత్మ యందును, అది పురుషాత్మయందును అశ్రితములు. ఇదే జీవాత్మకు పరాకాష్ఠ - ఇట్లు శరీరమందున్న శుక్రమూర్తికర్మాత్మ, 1 ఇంద్రియ లక్షణ ప్రాణాత్మ - తద్వ్యుక్తములగు అర్థములు, మనస్సు - బుద్ధి - మహత్తు - అవ్యక్తము అనువానిం క్రమముగదాటి పురుషాత్మం జేరనేర్చునని చెప్పుచున్నది. చూడుడు:—

'ఇంద్రియేభ్యఃపరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః
మనసస్తుపరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః.

మహాతఃపర మవ్యక్తం అవ్యక్తా త్పురుషః పరః
పురుషా న్నపరం కించిత్ సాకాష్ఠా సాపరాగతిః" (కఠ)

(i) విజ్ఞానాత్మయే క్షేత్రజ్ఞాత్మ. ఇదే కారయిత. (ii) ప్రాజ్ఞ లక్షణ కర్మాత్మయే కర్మకర్త. ఇదే భూతాత్మ. (iii) వైశ్వానర - తైజస - ప్రాజ్ఞమూర్తి కర్మాత్మయే జీవాత్మ. కాని దీని జీవత్వము మహదాత్మపై నాధారపడి యున్నది. చిదంశమునకు యోని మహత్తే. కనుక మహత్తునే జీవాత్మయందుము. విజ్ఞానాత్మ (క్షేత్రజ్ఞాత్మ), జీవాత్మ (మహదాత్మ) అను నీ రెండును ప్రజ్ఞానమనస్సు ద్వారా భూతభాగయుక్తములై యీ కర్మాత్మరూప భూతాత్మను కర్మభోగార్థ మాయా యోనులకుం గొంపోవు చుండును. మహాన్ - క్షేత్రజ్ఞయుక్త భూతాత్మయే, పాపపుణ్య - ధర్మాధర్మ సంస్కారముల కధికారి. కనుకనే ధర్మశాస్త్రము లీమూడాత్మ వివర్తములనే లక్ష్యములుగ బెట్టుకొన్నవి. ఈమనువచనముం గమనింపుడు.

"యోఽస్యాత్మనః కారయితా తం క్షేత్రజ్ఞం ప్రచక్షతే
యః కరోతితుకర్మాణి సభూతాత్మోచ్యతేబుధైః
జీవసంజ్ఞోఽంతరాత్మాన్యః సహజః సర్వదేహినాం
యేనవేదయతేసర్వం సుఖందుఃఖంచజన్మసు,
తావుభౌభూతసంపృక్తౌ మహాన్ క్షేత్రజ్ఞ ఏవచ
ఉచ్చావచేషుభూతేషు స్థితం తం వ్యాప్యతిష్ఠతః"
అసంఖ్యామూర్తయస్తస్య నిష్పతన్తి శరీరతః
ఉచ్చావచానిభూతాని సతతంచేష్టయన్తి యాః
పంచభ్య ఏవమాత్రాభ్యః, ప్రేత్యదుష్కృతినాంనృణాం

శరీరంయాతనార్థీయం, అన్యదుత్పద్యతే ధ్రువమ్
తేనానుభూయతాం యామీః శరీరేణేహ యాతనాః
తాస్వేవ భూతమాత్రాసు ప్రలీయంతే విభాగశః॥
సోఽనుభూయా సుఖోదర్కాన్ దోషాన్ విషయసంగజాన్
వ్యపేతకల్మషోఽభ్యేతి తావేవోభౌమహౌజసౌ॥
తౌధర్మంపశ్యతస్తస్య పాపంచాతంద్రితౌసహ,
యాభ్యాంప్రాప్నోతి సంపృక్తః ప్రేత్యేహచ సుఖాసుఖం,
యద్యాచరతిధర్మంస ప్రాయశోఽధర్మమల్పశః
తైరేవచావృతోభూతైః స్వర్గేసుఖముపాశ్నుతే
యదితుప్రాయశోఽధర్మం సేవతేధర్మమల్పశః
తైర్భూతైః సపరిత్యక్తో యామీః ప్రాప్నోతి యాతనాః
యామీస్తాయాతనాఃప్రాప్య సజీవో వీతకల్మషః
తాన్యేవపంచభూతాని పునరప్యేతిభాగశః
ఏతాదృష్ట్వాఽస్యజీవస్య గతీఃస్వేనైవచేతసా
ధర్మతోఽధర్మతశ్చైవ ధర్మేదధ్యాత్సదామనః"

ఇక గీతనన్వేషింతము, దానిని సర్వశాస్త్రమంటిమి. కారణము? అందన్ని యాత్మవివర్తములును సూచింపబడినవి. చరమలక్ష్యమగు నవ్యయప్రాప్తి సోపాయముగ వివరింపబడినది. ఆత్మవిషయమున నెరుంగవలసిన వన్నియు నిందున్నవి. మొదట నమృతాత్మం గైకొనుడు. దీనికి వెనుక జెప్పబడిన 1. రసరూపనిర్విశేషము, 2. రసబలరూప పరాత్పరము, 3. అవ్యయము, 4. అమృతప్రకృతి రూపమగు అక్షరము, 5. బ్రహ్మరూపక్షరము, అనునీ పంచవివర్తములును ఒకేచోట గీత యిట్లు నిరూపించె గదా!

"బ్రహ్మణోహి ప్రతిష్ఠాహం అమృతస్యావ్యయస్యచ
శాశ్వతస్యచధర్మస్య సుఖస్యైకాంతికస్యచ."

ఇది సమష్టి నిరూపణము. ఇక వ్యష్టిగ, నిర్విశేష - పరాత్పరముల నిరూపింప శక్యముకాదు. కారణము? వ్యష్టికి మాయాపరిచ్ఛేద ముండవలయును. ఆ రెండన్ననో మాయాతీతములు; కనుక వ్యష్టినిరూపణకు వెలియైనవి. కనుకనే గీతయందు అమృతాత్మ యందలి అవ్యయాక్షరక్షరము లను మూడు వివర్తములే వ్యష్టిరూపముల నిరూపింపబడినవి. ఈ వచనములను బరిశీలింపుము:—

1. అవ్యయాత్మ - (అమృతాత్మ)

ఈశ్వరావ్యయః—

1. ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం
ఛందాంసియస్యపర్ణాని యస్తంవేద సవేదవిత్.

2. గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయం.

3. తపామ్యహ మహంవర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ
అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున.

జీవావ్యయః:—

4. ఉపద్రష్టాఽనుమంతాచ భర్తాభోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.

5. అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోపి కౌన్తేయ నకరోతి నలిప్యతే.

6. నాహంప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్.

2. అక్షరాత్మా:-

1. యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువమ్.

2. అక్షరంబ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః.

3. యదక్షరంవేదవిదోవదన్తి విశన్తియ ద్యతయో వీతరాగాః
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యంచరన్తి తత్తేపదంసంగ్రహేణ ప్రవక్ష్యే.

4. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యఃప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిం.

5. అవ్యక్తోఽక్షర ఇత్యాహుః తమాహుః పరమాంగతిం.

6. అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

3. క్షరాత్మా:-

1. అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవాఽవ్యక్త సంజ్ఞకే.

2. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కాపరిదేవనా.

4. షోడాశీపురుషాత్మా—:

1. ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షరఉచ్యతే.

2. ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయఈశ్వరః.

2. బ్రహ్మాత్మా:-

1. మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహం
సంభవః సర్వభూతానాం తతోభవతి భారత.

2, సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవన్తియాః
తాసాంబ్రహ్మ మహద్యోని రహం బీజప్రదఃపితా.

1. మహానాత్మా:-

1. ఇంద్రియాణిపరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరంమనః
మనసస్తుపరాబుద్ధిః యోబుద్ధేః పరతస్తుసః.

అవ్యక్తమహత్తులు రెండును చిదాత్మ (పురుష) కోటి యందంతర్భూతములు. మహత్తన్నది అవ్యక్తముయొక్క వ్యక్తీభావమగు రూపాంతరము. - ఈ యవ్యక్తగర్భిత మహత్తే చిదాత్మకు యోని; కనుకనే భగవంతుడు బుద్ధికి పరముగా దానినే యంగీకరించెను. మరియు:— భగవంతుని ముఖ్యోద్దేశ్యము బుద్ధియోగము; బుద్ధిద్వారానే ఆత్మసాక్షాత్కారమని ఆయన యంగీకారము. కనుకనే, "యోబుద్ధేఃపరతస్తుసః" అనుచు మహదవ్యక్తములను పురుషాంతర్భావములుగ నెంచియున్నాడు.

ఈవిధమున నన్ని యాత్మవివర్తములను వివరింపుచు నవ్యయాత్మను ముఖ్యలక్ష్యముగ గొని - బుద్ధియోగము ద్వారా తత్ప్రాప్త్యుపాయముం జెప్పుచు, దర్శనశాస్త్రమందలి య

కృత్స్నతను బూరించు గీత కృత్స్నశాస్త్రమైయున్నది. సమ్యగ్దర్శనము దర్శనపువని - దానితో సమ్యగ్జ్ఞాన - చారిత్ర్యములను గూడ జూపుగీత బంధవిముక్తి కొరక యపూర్వమును ప్రతిపాదించు శాస్త్రముగదా!

దార్శనికముగ, వైజ్ఞానికముగ నాత్మస్వరూప మెరుంగనిచో గీతార్థమును సమన్వయించుట కఠినమేకాదు, అసంభవమే. కనుకనే యీావిప్రతిపత్తినిరాకరణార్థ మీా ఆత్మవిజ్ఞానము వెలసినది. గీతోక్త ఆత్మశబ్దమువలె, గీతోక్త బ్రహ్మ - కర్మలను పదార్థములును జటిలసమస్యలే. కనుక వాని వివరణమునకై మరొక ప్రకరణమారంభింతుము:-

ఇతి శ్రీమత్కౌండిన్యస గోత్ర పవిత్ర శ్రీ చల్లా సుబ్బాంబా
సుబ్బారాయ తనూభవస్య కృష్ణమూర్తి శర్మణః
కృతిషు అనుశ్రుత్యుపనామక విజ్ఞాన
లక్ష్మి నారాయణీయే శ్రీమ
ద్భగవద్గీతావిజ్ఞాన పరిచ
యాంతర్గతాంతరంగ
పరీక్షాయాం
ఆత్మవిజ్ఞానం
సమాప్తమ్
ఓం
తత్సత్

ఓం నమః పురుషోత్తమాయ

# బ్రహ్మ - కర్మ - విజ్ఞానమ్

## ఉ ప క్ర మ ము

ఆత్మకల్యాణార్థము వెలసిన గీతాశాస్త్రము ముఖ్యముగా, ఆత్మయొక్క బ్రహ్మ - కర్మ లను రెండు దివ్యరూపములను లక్ష్యముగాకొన్నది. ఈరెంటి సమష్టియు నాత్మ. తద్విజ్ఞానానంతరముననే, బ్రహ్మ - కర్మ - పరీక్ష యావశ్యకము.

జ్ఞానకర్మలన్నవి యొకే యాత్మతత్త్వమునకు రెండువివర్తములు. జ్ఞానకర్మమయమగు నాత్మకు ఈభౌతికవిశ్వమందు, దివ్యము-లౌకికము నను రెండురూపములున్నవి. (i) ఆత్మసంబంధి దివ్యజ్ఞానము బ్రహ్మ యనియు, (ii) దివ్యకర్మ కర్మయనియు నాబడెను.- ఇక తదీయలౌకికరూపములు జ్ఞానము - క్రియ యని వ్యవహరింపబడెను. క్రియాతత్త్వము కర్మయొక్క రూపాంతరమే. కనుకనే ఆత్మదగు నీయలౌకిక రూపముంగ్రియ యనక కర్మయంటిమి. వస్తుతః బ్రహ్మ - కర్మపరీక్షకు జెందిన కర్మశబ్దమును కర్మపరక మనుకొనదగును. కర్మయోగవిజ్ఞానమందలి కర్మశబ్దమును క్రియాపరక మనుకొనవలయును. చివరకు ఆత్మయొక్క దివ్యరూపములు బ్రహ్మకర్మలనియు, లౌకికరూపములు జ్ఞానక్రియలనియు, నిష్కర్ష.

బ్రహ్మ - జ్ఞానము; కర్మ - క్రియ; ఇవి పర్యాయములను కొనుట యొక తాత్త్వికదృష్టితో సరియేయైనను వ్యవహారమార్గమం దీనాల్గును వేరువేరర్థములనే వచించును. ఎట్లన:- నిరస్త సమస్తోపాధిలక్షణము, ప్రత్యస్తాశేష భేదలక్షణము (సామాన్య) సత్తామాత్రము, వ్యాపకము, నిర్వికల్పకము. నగుటచే నవాఙ్మనసగోచరము నగు విశుద్ధజ్ఞానమే బ్రహ్మ యనబడును.

'ప్రత్యస్తాశేష భేదంయత్ సత్తామాత్రమగోచరమ్
వచసా; మాత్మ సంవేంద్యం, తద్ జ్ఞానంబ్రహ్మసంజ్ఞితం'

ఈ బ్రహ్మలక్షణజ్ఞానము లేదా, జ్ఞానలక్షణబ్రహ్మ ఆత్మ యొక్క దివ్యమగు జ్ఞానపర్వము. విశ్వమంతయు నీ దివ్య జ్ఞానోపబృంహణమే; కనుక దీనిం బ్రహ్మ యనదగును. ఈబ్రహ్మ జ్ఞాన మాపామరవిద్వజ్జనము, ఆబాలవృద్ధముగ జడచేతనములగు సర్వపదార్థములందును సమానరూపమున వ్యాప్తమైయున్నది. ఇయ్యది లేనిచో టించుకంతయు లేదు. అయినను, ఇయ్యది లోకదోషములచే సర్వథా అసంస్పృష్టము కనుకనే గీత, నిర్దోషమగు దీనిని 'సమంబ్రహ్మ' యన్నది.

"ఇహైవ తైర్జితః సర్గః యేషాం సామ్యే స్థితంమనః
నిర్దోషంహి 'సమంబ్రహ్మ' తస్మాద్బ్రహ్మణి తేస్థితాః"

రసాత్మకమగు నీసమబ్రహ్మ నాధారముగాగొని నిత్యప్రతిష్ఠితమైయున్న బలాత్మక స్వాభావిక కర్మ యున్నది. అదే దివ్యకర్మ. అది బ్రహ్మకు స్వాభావికధర్మమగుటచే, కామనా

రహితము. అబంధనము. నిత్యమును తద్రతమయ్యు బ్రహ్మ పుష్కరపలాశవ న్నిర్లేపమే. స్వస్వరూపముచే క్షణికము; కను కనే అశాంతము, అయినను ఈ దివ్యకర్మ రసాత్మకబ్రహ్మ యొక్క నిత్యశాంతినాలంబనముగాగొని శాంతముగనే యుండు చున్నది. ఆత్మోపకారకమగు నీకర్మను 'నిశ్శ్రేయస' (ముక్తి) అందురు. బలాత్మకమగు నీదివ్యకర్మ కాధారము స్వయం రసాత్మక బ్రహ్మ కనుక నీ కర్మను, 'బ్రహ్మోద్భవము' (బ్రహ్మ నుండి ప్రకటమగునది) అనిచెప్పబడినది. 'కర్మ బ్రహ్మోద్భవం విద్ధి' ఇంతకును బ్రహ్మశబ్దము లోకాతీతనిత్యజ్ఞానవాచకము. కర్మశబ్దము లోకాతీత నిత్యకర్మవాచకము అని తాత్పర్యము. ఈరెంటిసమన్వయముచే నెల్లలోకసృష్టులు వికసిల్లెనని ఆయా ప్రకరణములందు స్పష్టపడును.

రసాత్మకబ్రహ్మ, బలాత్మకకర్మల సమన్వయముచే బుట్టిన పాంచభౌతిక విశ్వమందు బ్రహ్మకర్మలే గాక నింకొక తత్త్వ మేదియు లేకున్నను, విశ్వోపాధి సంసర్గముచే ఆవిశ్వాత్మకబ్రహ్మ కర్మల స్వరూపములందు భేదమేర్పడు చున్నది. ఆ వ్యాపక జ్ఞానమే లోకసృష్టియందు గూడి పరిచ్ఛిన్నమగుచున్నది. ఆ శాంతకర్మయే ఇట నశాంతిరూప ధారణగావించుకొను చున్నది. ఈ వైషమ్య కారణము? బ్రహ్మయొక్క యాధార మున నగు కర్మల చితిసంబంధము. గ్రంధిబంధనమునే చితి యందురు. దీనివలన కాయ (మర్త్య) భావము వికసిల్లును. అందువలన జ్ఞానక్రియలయందు నానాత్వ ముదయించును. అది

(నానాత్వము) లౌకికరూపముల కాధారము. విశ్వసీమయందలి ప్రతిపదార్థమందును బ్రహ్మకర్మలున్నవి. ప్రతిదియు బ్రహ్మ కర్మ సమష్టియే. అయినను, ఈవ్యష్టిరూప బ్రహ్మకర్మలందు బ్రహ్మగౌణము. కర్మప్రధానము. కనుక వ్యష్టిబ్రహ్మ పదార్థమును బ్రహ్మయనక జ్ఞానమనియు, కర్మపదార్థమును కర్మయనక క్రియయనియు నందురు. ప్రత్యేక వ్యష్టిజ్ఞాన క్రియలును సర్వథా వేరువేరుగ నున్నవి. ఒకదానిపోలిక యింకొకదానికి లేదు. ఇట్లు ఆ సమష్టిరూప బ్రహ్మకర్మయుగ్మము వ్యష్టిరూపమున ననేకభావములం బడినదై జ్ఞానక్రియ లను పేరుల కధికారి యగుచున్నది.

ఈవిధముగ నిరుపాధిక భాగములకు బ్రహ్మ కర్మ శబ్దములు నియతములు, సోపాధికరూపములకు జ్ఞానక్రియా శబ్దములు నియతములు. నిరుపాధికావస్థయందు బ్రహ్మకర్మలకు సామ్యావస్థ. ఇదే సాంఖ్యుల త్రిగుణప్రకృతి సామ్యావస్థ. సోపాధికావస్థ యందు బ్రహ్మకర్మలకు జ్ఞానక్రియా రూపములచే విషమావస్థ. ఇదే ప్రకృతి విషమావస్థ. ప్రకృతి సామ్యము ముక్తికి వైషమ్యము సృష్టికి మూలములు. చివరకు :— ఒకే తత్త్వమునకు 1. బ్రహ్మకర్మ 2. జ్ఞానము 3. క్రియ అను మూడు వివర్తము లేర్పడుచున్నవి. మొదటి వివర్తము. సమష్టి రూపము. తక్కినవి వ్యష్టిరూపములు. ఒకే యాత్మకు మూడు స్థానములందువ్యాప్తి 1. బ్రహ్మకర్మ 2. జ్ఞానభావము 3. క్రియాభావము కనుక నీ మూడువ్యాప్తులను వివరింపనై

(i) బ్రహ్మకర్మ పరీక్ష (ii) జ్ఞానయోగపరీక్ష (iii) కర్మయోగ పరీక్ష అను మూడు ప్రకరణముల నాశ్రయింప వలయును. బ్రహ్మకర్మనామక దివ్యభావములకు వ్యాపక భావముతో సంబంధము. దానికి వియోగ సంయోగ సంబంధముండదు. యోగభావము పరిచ్ఛిన్నతకు జెందును. కనుక వ్యష్టిరూపజ్ఞాన కర్మపరీక్షలకు యోగశబ్దము జేర్చ వలసిన బడినది. ప్రస్తుతము? బ్రహ్మకర్మపరీక్ష:—

ఇత్యుపక్రమః

దశవాదరహస్యము:—

వివిధభావములతోడి యసంఖ్యప్రాణ్యప్రాణి సంకులితమగు నీ విశ్వమూలమేమి? ఈ సాధారణ ప్రశ్నంగూర్చి పలుతెగల విద్వాంసులం దనేక విమర్శలు వెలసినవి. నేటి మతవాదములు తాత్త్వికజ్ఞానశిథిలతా ఫలము లనుకొన్నను, పురాతన సభ్యతేతిహాసముల జూచినను, ధారావాహికములగు నీ వాదములు చిరకాలికములే యని తోచును. మానవబుద్ధి తాత్త్విక దర్శన చరమసీమంజేరిన ఆదియుగమందు నిందునుగూర్చినవి ప్రధానముగ పదివాదములగపడుచున్నవి. దృష్టి. మతవాద మూలక దర్శనభావమునైనున్నంతవరకు ఈవిషయమున, నసమత తప్పనిసరి యగుచుండును.

మతవాదము కేవలము దర్శనదృష్టికి జెందుననియు అందెన్నడును సమత సిద్ధింపదనియు వెనుక (దార్శనికాత్మ ప్రకరణ

మున) వివరముగ చెప్పియుంటిమి. ప్రస్తుతము పూర్వపు తత్త్వ వాదములకు జెందిన దార్శనికమతవాదములం గూర్చి యించుక పరిచయము గలుగజేయుదుము. ఈవిషయములు నేటి భారతీయ విద్వాంసుల స్మృతియందు లుప్తప్రాయములై పోయినవి. ఏమన:-ఇవి దేవయుగమునకు బూర్వము పుష్పితము,పల్లవితముగ నున్న సాధ్య లేక మణిజాయుగమునకు జెందిన వాదములు.

గీతావిజ్ఞానమందు యుగచర్చ యించుక గావింపబడినది. మనసభ్యతకు మూలస్రోతోరూపమగు ఋగ్వేదమునం దుల్లేఖితములగు నా సాధ్యయుగమునాటి తత్త్వవాదముల గూర్చియే కొలదిగ బ్రస్తావించెదము. – ఆనాడు 'పూర్వేదేవా' యని ప్రసిద్ధినొందిన సాధ్యజాతి విద్వాంసులందు వెలసిన యీ వాదములన్నియు సాకల్యముగ దెలియవలయునన్న స్వతంత్ర గ్రంథాధ్యయనము గావలయును. కనుక నిట నామమాత్రముగ సూచింతుము.

లౌకికసంస్కృత భాషయందలి స్థానశబ్దమునకు వైదిక వాఙ్మయమునందు, 'ధామ' శబ్దమువలె, మతశబ్దమునకు వాదశబ్దము ప్రయుక్తమైనది. పిదప నీశబ్దము లోకభాషయందుగూడ గ్రహింపబడినది. ఆనాటి సాధ్యవిద్వాంసులందు సృష్టిమూలకములు ప్రధానముగా బదివాదములు సాగినవి. సృష్టికి మూలమేమి? ఎవడుసృజించెను? ఎట్లు సృజించెను? ఇత్యాదిప్రశ్నలకు సమాధానములుగ వారిలోగలిగిన పరస్పర విరుద్ధములగు వాదములకు పేరులు –

1. విజ్ఞానేతివృత్తవాదము:
2. సదసద్వాదము
3. రజోవాదము
4. వ్యోమవాదము
5. అపరవాదము
6. ఆవరణవాదము
7. అంభోవాదము
8. అమృతమృత్యువాదము
9. అహోరాత్రవాదము
10. దైవవాదము

# 1. విజ్ఞానేతి వృత్తవాదము

ఈ సాధ్యవాదముల నెరుంగుటకుమున్న గ, ఈ సాధ్య విద్వాంసులు ఏకేశ్వరవాదము నించుకంతయు నమ్మరని తెలియ వలయును. ఈశ్వరసత్తంగూర్చి వారు "ప్రాకృతికతత్త్వముల (ఆకాశవాయుజలతేజోపృథివ్యాదుల) కంటె వేరుగ సర్వ వ్యాపక సర్వాధార సర్వమూలభూత బ్రహ్మనామక నిత్యతత్త్వ మేదియులేదు. ప్రాకృతికతత్త్వ సమన్వయ పరిణామమేవిశ్వము. తత్తత్త్వపరిజ్ఞానమున, వానిసమన్వయప్రక్రియయందు సమర్థుల మగుచో మనమును సృష్టినిర్మాణము గావింపగలము" అందురు.

ఈ యనీశ్వరభావనయే పిమ్మట, వారిపదివాదములను భిన్న భిన్నములుగ జేసెను. అందువలననే పదునొకండవదగు సంశయ వాదము జనించెను. చివరకాసంశయవాదమును నిరాకరించి మ హార్షులేకేశ్వరమూలక బ్రహ్మవాదమును స్థాపించిరి. ఆయాస్తిక వాదమునే 'సిద్ధాంతవాద'మందురు. ఇందువలననేటి, ఈశ్వరా నీశ్వర వాదమూలకములగు దర్శనవాదములు క్రొత్తవి కా

వనియు, శాశ్వత దేవాసుర సంగ్రామములట్లు శాశ్వతములే యనియు, దర్శనదృష్టియున్నంతవరకివి తప్పవివనియు దేలును. ఈ సంఘర్షమునుండి విశ్వముం దప్పింపవలయు నన్నచో 'నిత్యజ్ఞానగర్భిత నిత్యవిజ్ఞానమే' కావలయును. నేడు దానికి జెందిన గురుపరంపర లుప్తమయిపోయినది. కానిండు:- ప్రకృత మనుసరింతము.

విజ్ఞానేతివృత్తవాదము:-సూర్యుడున్నాడు, చంద్రుడున్నాడు, పృథివియున్నది. అను మొదలుగ దోచు సత్తాభావసమష్టియే విశ్వము. 'ఇదమస్తి' యను పరిజ్ఞానముకంటె నిక విశ్వమన్న దేమి? 'అస్తి - జానామి' అన్నదే విశ్వపర్యవసానము.

నరియే, ఇందు:- జ్ఞానము సత్తాపూర్వకమా? సత్త జ్ఞానపూర్వికయా? అన్న దొకజటిలసమస్య. కానిండు, గోడకావల నున్న వస్తువు మనకగపడదుగదా! సత్తయే జ్ఞానమునకు గారణమగుచో నట్లుండరాదు; కనుక మనజ్ఞానమే వస్తుసత్తకు గారణమనవలయును. వస్తుసత్త జ్ఞానము నాశ్రయముగ గొన్నప్పుడే 'ఇదమస్తి' యనుభావము గోచరించును. అటుగానిచో ఆవస్తువు లేనట్లే. కనుక:- మన జ్ఞానసీమకు వెలియైన పదార్థసత్త నంగీకరించుట యసంగతము. చివరకు ఆస్తికుల యీశ్వరసత్తయు మన జ్ఞానకల్పనావిశేషమే. మనజ్ఞాన మీశ్వరభావముంగల్పించి యీశ్వరుని సత్తాసిద్ధపదార్థముం జేసివైచినది. మనజ్ఞానముకంటె వేరుగ సత్తయనదగు స్వతంత్రపదార్థమేదియు లేదు. మన జ్ఞానకాల్పనికావస్థయే సత్త.

ఇక రెండవదృష్టితో జూతము:- సత్తకు ప్రధానతనిచ్చు దార్శనికులవాద మిది:- సత్తాసిద్ధ పదార్థము నాశ్రయింప కున్నచో జ్ఞానోదయ మసంభవము. మనజ్ఞానము సత్తాకారా కారితమయియే, తదభినయము గావింపజాలును. సత్తాత్మక ఘటాతిరిక్తముగ (ఘటమహంజానామి) ఘటజ్ఞానమునకు స్వరూపమేది? 'ఘటోఽస్తి' అన్నదే కదా మనజ్ఞానము? అస్తి (సత్త)యే ఉపలబ్ధి (జ్ఞానము) గదా! ఘటనామక సత్తాసిద్ధ పదార్థములేనిదే ఘటజ్ఞానమెట్లు? కనుక సత్తయేజ్ఞానకారణము. గోడ యడ్డున్నంతనే వస్తుసత్తకేమినష్టము? మనజ్ఞానమే సత్తాభావములను గల్పించుచో వలసినచో వలసినదెల్ల కల్పించుకో వచ్చునే. అట్టిచో దేశకాలములందు సత్తాసిద్ధ పదార్థములనే శరణొందనేల? మనకల్పనవలన, శీతకాలపు రాత్రులందు, సూర్యుంగల్పించుకొని చలబాధ పోగొట్టుకోరాదా? కనుక, జ్ఞానోదయ మూలకారణము సత్త. సత్తాపూర్వకముగనే జ్ఞానోదయమగును. సత్త్వోపలబ్ధియే జ్ఞానము. సత్తయొక్క యొక విశేషావస్థపేరే జ్ఞానము. ఈ శ్రౌతివచనము నరయుడు:—

"నైవవాచా నమనసా ప్రాప్తుంశక్యో నచక్షుషా,
అస్తీతిబ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే.
అస్తీత్యేవోపలబ్ధవ్యః తత్త్వభావేన చోభయోః
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి" [కఠ]

ఈరెండుమతములం దేసిద్ధాంతము మాన్యము? మొదటి మతమే విజ్ఞానేతివృత్తవాదులమత మనుటకంటె ప్రకృతమేమియు

జర్చింపదలంపము. రెండవమతమువారి తర్కములకు వీరియందు విలువలేదు. వారు అంతయు అన్నియు జ్ఞానముయొక్క విజృంభణలేయందురు. పోనిండు: జ్ఞానముకంటె వేరుగ సత్తాసిద్ధపదార్థము లున్నవని యించుకసేపు అంగీకరించినను, మనకు కల్గు విషయ లేక పదార్థజ్ఞానము మనజ్ఞానకల్పనయే యందురు. ఎట్లన:- సత్తాసిద్ధ పదార్థముల జ్ఞానమును, మనకెన్నడును కలుగజాలదు సూర్యచంద్ర పృథివ్యాదుల జ్ఞానము మనకు కల్గుననుట కరినమే కాదు అసంభవము. సూర్యపిండము భూపిండముకంటె నెన్నోరెట్లు పెద్దదిగదా! అది యెవ్వడైన ప్రత్యక్షముగ జూచెనా? అసంభవము. ఇక:- మనకగపడు నాలేడంగుళముల వ్యాసముగల సూర్యబింబము మనజ్ఞానకల్పన యన వచ్చునుగదా!

విశ్వమంతయు నీశ్వరనామక కల్పితతత్త్వముయొక్క శరీర మనునట్టి యాస్తికులు మాయావాదమునే సమర్థించుచున్నారు. ఎట్లన: సత్తాసిద్ధములగు సూర్యచంద్రాదులు, ఈశ్వరీయాంతర్జగత్తునకు జెందిన పదార్థములు. ఒకమనుజుని యంతర్జగత్పదార్థములను భావములనే యెరుంగనేరని మనము వానినెట్లెరుంగ గలము? కనుక మనకు నగపడు వినబడునవెల్ల మన జ్ఞానవిజృంభణ ఫలములే.

వస్తుతః:- సత్తాసిద్ధ పదార్థ భావనయు నొకవిధముగ జ్ఞానకల్పనయే. ఈశ్వరుడు, తదంతర్జగత్తుగూడ మనయూహా విషయములే యగునపుడవి జ్ఞానముకంటె వేరనుటెట్లు?

1 వృక్షము అంకురించెను, పుష్పించెను, ఫలించెను, ఎండి పోయెను, స్మృతిగర్భమున లీనమయ్యెను. (ii) అన్యవస్తువును స్పృశింతుము:- బరువు, తేలిక — పొడుగు, పొట్టి — పలుచన, దళసరి అందుము. (iii) నేడుంటిమి; రేపుండము, ప్రపంచమిట్లేసాగుచుండును. (iv) నలుపు - తెలుపు - పసుపు, తీపి - పులుపు, ఇత్యాది భేదప్రతీతులు. (v) ఆవరణమున కానలనున్న పదార్థము గోచరింపదని గోచరించును. (vi) మంచి, చెడ్డ, ధర్మాధర్మములు, ఆత్మ — పరమాత్మ, దిగ్దేశ కాలములు, కాల్యయౌవనవార్ధక్యములు, పశు పక్షి మనుష్య దేవతా గంధర్వాసుర పాషాణ వృక్ష నద నదీ సముద్రాదులు ఇవన్నియు, ప్రతీతివిశేషములు - మనజ్ఞానకల్పనలు.

ప్రతీతియేభాతి, భాతియేజ్ఞానము, జ్ఞానమే అనేకరూపములను ధరించి అనేకప్రతీతులను గల్గించుచున్నది. ఉదాహరణమునకు స్వప్నావస్థంజూడుడు. 'నతత్రరథా' రథములేదు, గుఱ్ఱములులేవు, సారథిలేడు, మార్గములేదు, పయనములేదు — అయినను అంతయు నున్నట్లు జరుగునట్లు ప్రతీతి కలుగుచున్నది. 'జాగ్రదవస్థయందలి సంస్కారముల వలననే అట్లు కనబడు' నందురా? జాగ్రదవస్థయు ప్రతీతివిశేషమే యందుము. కాదన్నచో:— ఆసన శయన భోజన పాన సంచరణ హాసన రోదనాదు లున్నవి గదా, వానినుండి జ్ఞానమును వేరుసేయుచోనా వివిధభావముల ప్రతీతియెట్లు? ఇక:— తప్పనిసరిగా

జ్ఞానము లేనిచో నేమియులేదు. జ్ఞానమే అంతయు నన్నియు ననవలెను.

ఈజ్ఞానమెట్టిది? ఆస్తికకల్పిత నిత్యవిజ్ఞానమా? కాదు, క్షణక్షణము నవీనరూపధారణ సేయు (బహురూప పరిణత) క్షణిక జ్ఞానము. దీని కనంతధారలు. కనుక దీనిని జ్ఞానమనక 'విజ్ఞాన' మందుము. వివిధభావాక్రాంత విశ్వమూలము లేదా, ఇతివృత్త మేమి? యన్నచో విజ్ఞానమే యందుము. దానిదే యీ వైవిధ్యము, వైచిత్ర్యము. విశ్వ ప్రభవ ప్రతిష్ఠాపరాయణ మదే. కనుక నిది విజ్ఞానేతివృత్తవాదము.

ఇట్లు కొందరు సాధ్యవిద్వాంసులు ప్రత్యయ (జ్ఞాన) భావమును ముఖ్యముగ నెంచి విజ్ఞానమునే సృష్టికిమూలముగను, తూలముగను అంగీకరింతురు. ఈ విజ్ఞానేతివృత్తవాద సమర్థకములు కొన్ని వచనము లిట నుదహరింతుము. — ఈవచనములాస్తికులకు నిత్యవిజ్ఞానపరకము లయ్యును, తర్కవాదసిద్ధ విచారశైలిదృష్టిం బట్టి వీనిని విజ్ఞానేతివృత్తవాద సమర్థకములనియు ననవచ్చును. ఇంతకు నీవాదము సిద్ధాంతపక్షము కాదు. తర్కదార్ఢ్యము కొరకే ప్రమాణోద్ధరణము. చివరకు ఈ యన్నిటికిని నిత్యవిజ్ఞాన సిద్ధాంతమునందే పర్యవసానము ముందు చూడ గలరు. విస్తరభయముచే వీని యర్థ వివరణము మానితిమి. పాఠకులు స్వయముగా నూహించుకొన గోరెదము.

1. విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే-విజ్ఞానేన జాతాని జీవన్తి- విజ్ఞానం ప్రయం త్యభిసంవిశన్తి [తై॥ఉ]

2. విజ్ఞానేనవా ఋగ్వేదం విజానాతి యజుర్వేదం, సామవేద మాధ ర్వణంచతుర్థం. ఇతిహాసపురాణం పంచమం వేదానాం వేదం, పిత్ర్యం, రాశిం, దైవం, నిధిం, వాకోవాక్యం, ఏకాయనం దేవవిద్యాం, బ్రహ్మవిద్యాం' భూతవిద్యాం, క్షత్రవిద్యాం, నక్షత్రవిద్యాం, సూర్యదేవ యజనవిద్యాం, దివంచ పృథివీంచ వాయుం చాకాశంచ, అపశ్చ, తేజశ్చ, దేవాంశ్చ, మనుష్యాంచ, పశూంశ్చ-వయాంసిచ, తృణ-వనస్పతీన్ - శ్వాపదాని అకీట పతంగ పిపీలికం ధర్మంచాధర్మంచ - సత్యంచానృతంచ- సాధు అసాధుచ హృదయజ్ఞం చా హృదయజ్ఞంచ అన్నంచరసంచ, ఇమంచలోకం - అముంచ విజ్ఞానే నైవవిజానాతి, విజ్ఞానముపాస్స్వ - ఇతి, స - యోవిజ్ఞానం బ్రహ్మేత్యుపాస్తే - విజ్ఞానవతోవై సలోకాన్ జ్ఞానవతోఽభిసిధ్యతి, యావద్విజ్ఞానస్యగతం, తత్రాస్యయథాకామచారోభవతి (ఛాందో)

3. అహంతా విశ్వాచకరం న కిర్మాదైవ్యం సహోవర తేఅప్రతీతం
యన్మాసోమాసో మమదన్యదుక్థో భేభయేతే రజసీఅపారే॥

4. అహందాం గృణతేపూర్వ్యం వస్వహం బ్రహ్మ కృణవం మహ్యం వర్ధనమ్। అహంభువం యజమానస్యచోదితా యజ్వనః సాక్షి విశ్వస్మిన్ భరే॥

5. అహం సప్తస్రవతో ధారయం వృషాద్రవిత్ న్వః పృథివ్యాం సీరా అధి। అహమర్ణాంసి వితిరామి సుక్రతు ర్యుధావిదం మనవే గాతు మిష్టయే॥

6. అహమేతం గవ్యయమశ్వ్యం పశుం పురీషిణం సాయకే నాహిరణ్యయం
పురూసహస్రా నిశిశామిదాశుషే యన్మాసోమాస ఉక్థినో అమందిషుః॥

7. అహంకేతు రహంమూర్ధాఽహముగ్రా వివాచనీ
మమేదను క్రతుం పతిః సేహానా యా ఉపాచరేత్॥

8. అహంగర్భ మదధా మోషధీష్వహం విశ్వేషు భువనే ష్వంతః
అహంప్రజాఅజనయం పృథివ్యామహం జనిభ్యో అపరీషుపుత్రాన్॥

9. అహం భువసునః పూర్వ్యస్పతిరహం ధనాని సంజయామి శశ్వతః
మాం హవన్తేపితరం నజన్తవో౽హం దాశుషే విభజామి భోజనమ్॥

10. అహంమనురభవం సూర్యశ్చాహంకక్షీవాన్ ఋషిరస్మి విప్రః
అహం కుత్సమార్జునేయం న్యృంజే౽హం కవి రుశనా పశ్యతా మా॥
(ఋగ్వేదము)

# 2. సదసద్వాదము

కొందరు సాధ్యవిద్వాంసులు సృష్టిమూలముంగూర్చి యీ వాదమును లేవదీసిరి. పిదప దీనికి త్రిసత్యవాదము, ద్విసత్య వాదము, అసద్వాదము, సద్వాదము అను నాలుగవాంతర రూపములు వెలసినవి. వానిని దరువాతి ప్రకరణములందు జూతము. ప్రకృతము సదసద్వాదము: కేవలము దీని నాధార ముగా గొనియు, 'సద్వాదము, అసద్వాదము, సదసద్వాదము' అనుమూడు మతములు కల్పితము లయినవి. ఈమూటిని సప్రమాణముగ దెలుపుటయే ప్రకృత ప్రకరణార్థము. ఇందు:-

1. సద్వాదము:- విశ్వప్రతీతి కలుగుచున్నది. సత్తునకే ప్రతీతి. అసత్తునకు బ్రతీతి యుండదు. శశశృంగాదు లసత్తులు. అభావరూపములగుటచే వానికి బ్రతీతిలేదు. "నాసతో విద్యతే భావో నాభావోవిద్యతేసతః" అన్న యాస్తికవచన మీ పక్ష మునే సమర్థించును. ప్రతీతి (జ్ఞానము, ఉపలబ్ధి - ప్రాప్తి - భానము) అగువస్తువును సత్తు అందుము. 'కారణగుణాఃకార్య గుణా నారభన్తే' అన్నట్లు (పాదాన) కారణగుణములు కార్యా

రంభక(స్వరూప సంపాదక) ము లగును. కారణము సత్తైనచో గార్యము సత్తే యగును. విశ్వముసత్తు కనుక తత్కారణమును సత్తే కావలయును. కారణ మసత్తగుచో కార్యోత్పత్తియే ఘటిల్లదు.

ఈవిధముగ సృష్టిమూలముంగూర్చి సద్వాదము (సత్కారణతావాదము) సిద్ధమగుచున్నది. ఈవాదమే పిదప బ్రహ్మ (నిత్య) సత్తాత్మకమగు, బ్రాహ్మణవాదము లేక బ్రహ్మవాద రూపము నొందినది. ఈవిషయము ముందు దెలియగలదు. ఈ సద్వాదమును సమర్థించు నీవచనములను గమనింపుడు:—

1. యోనఃపితా జనితా యోవిధాతా, యో నః సతో అభ్యాసజ్జజాన
యో దేవానాం నామధా ఏకఏవం తంసంప్రశ్నం భువనాయంత్యన్యా
(తైత్తి)

2. నూచ పురాచ సదనంరయీణాం జాతస్యచ జాయమానస్యచ క్షాం
సతశ్చ గోపాం భవతశ్చభూరేః దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదాం॥
(ఋక్)

3. బణ్మహాఀ అసిసూర్య బలాదిత్య మహాన్ అసి
మహత్తే సతోమహిమా పనస్యత్తే ఉద్ధా దేవ మహాన్ అసి॥

4. స్వాయుధస్య తే సతో భువనస్యపతేవయం ఇంద్రో సఖిత్వముశ్మసి

5. విశ్వాధామాని విశ్వచక్షుఋభ్వసః ప్రభోస్తేసతః పరియన్తి కేతవః
వ్యానశిఃపవతే సోమధర్మభిః పతిర్విశ్వస్య భువనస్య రాజసి॥

6. సతోనూనం కవయః సంశిశీత వాశీభిర్యాభి రమృతాయతక్షథ
విద్వాంసఃపదా గుహ్యాని కర్తన యేనదేవాసో అమృతత్వ మానశుః
(ఋక్)

7. అసన్నేవ సభవతి అసద్బ్రహ్మేతి వేదచేత్
అస్తిబ్రహ్మేతిచేద్వేద సంతమేనం తతోవిదుః [ తై ]

8. తత్సదాసీత్ తత్సమభవత్ 'సదేవేదమగ్రఆసీత్ కథం త్వసతః సజ్జాయేత' సతాసోమ్య! తదాసంపన్నో భవతి 'తతోవైసదజాయత' 'సన్మూలమన్విచ్ఛ' 'సత్త్వేవసోమ్యేదమగ్రఆసీత్' 'సద్ధీదంసర్వం' (ఉపనిషత్)

అసద్వాదము:-

విశ్వమంతయు క్షణికక్రియామయము. కనుక నాస్తిసారమగుటచే నసత్తు. ఏమన:- పదార్థములన్నియు క్షణిక పరివర్తనశీలములు - పరివర్తనమనగ్రియ, అదిక్షణికము. శూన్యలక్షణము, అభావాత్మకము. 'అహంజానామి' పశ్యామీత్యాదులందలి భావప్రతీతియు గ్రియావిశేషమే. ధారావాహికసంతానమున గ్రియ సద్భావ భ్రాంతిం బుట్టించుచుండును. పరమార్థతః క్రియయు క్రియామయసంసారము, శశశృంగాదులట్లు, అసత్తులే. బలప్రధానములే. కార్యరూపములగు వీని మూలకారణముగూడ అసత్తేకావలయును.

సద్వాదము వలన బ్రాహ్మణవాద మావిర్భవించి ఆస్తికదర్శనషట్కమున కాధారమైనది. అట్లే యీ అసద్వాదము వలన శ్రమణకవాద మావిర్భవించి నాస్తికదర్శనషట్కమున కాధారమైనది. ఈవిషయము ముందు విశదమగును. ఈ యసద్వాద సమర్థకవచనము లివి:-

1. సంచోదయ చిత్రమర్వాగ్రాధ ఇంద్ర వరేణ్యమ్ అసదిత్తే విభుప్రభు.

2. విష్టంభో᳚దివో᳚ ధరుణః పృథివ్యా విశ్వాఉతక్షితయో హస్తే అస్య
అసత్త ఉత్సో గృణతేనియుత్వా న్మధ్వో᳚అంశుః పవత ఇంద్రియాయ॥

3. దేవానాంయుగే ప్రథమే ఽసతః సదజాయత
తదాశా అన్వజాయన్త తదుత్తాన పదస్పరి
[పతిమసృజత.

4. అసద్వా ఇదమగ్ర అసీత్ 5. అసతో᳚ఽధిమనో᳚సృజ్యత మనఃప్రజా

6. అసద్వా ఇదమగ్ర ఆసీత్-తతో᳚వైసదజాయత
తదాత్మానం స్వయమకురుత-తస్మాత్సుకృతముచ్యతే॥

సదసద్వాదము:-

సృష్టియన సంసృష్టి భావమునకు జెందును. సంసృష్టియన రెండు విజాతీయతత్త్వముల మిథునభావము. కనుక సృష్టి ద్విమూలము గావలయును. ప్రతిపదార్థమునందును క్షణిక పరివర్తన శీలమగు నసత్తును, అపరివర్తనీయమగు సత్తును గనబడుచున్నవి; కనుకనే 'సవేవాయమస్తి' యను వ్యవహారము ఘటిల్లుచున్నది; ఇందువలన:- విశ్వమూలము 'సదసత్తు' లనవలయును. కేవలము సత్తే యనుచో పరివర్తనమగపడ రాదు. అసత్తేయగుచో పై జెప్పిన ప్రత్యభిజ్ఞయే కలుగదు.

పిదప (దేవయుగమున) నీవాదమే సిద్ధాంతవాదముగ నయ్యెను. (ముందు తెలియగలదు) ఈమూడు వాదములందును. నిదే విలువగలది. ఇందువలన సదసత్తులను వేరుగ బ్రతి -పాదించు రెండువిధముల వచనములును, రెంటింబ్రతిపాదించు

వచనములును, సార్థకములగును, ఈవాదము నీ క్రిందివచన ములు సమర్థించును.

1. బ్రహ్మజ్ఞానం ప్రథమంపురస్తాత్ విసీమతః సురుచోవేనఆవః
సబుధ్న్యా ఉపమా అస్యవిష్ఠాః సతశ్చయోని మసతశ్చవివః యజుస్సా
మాధర్వ॥

2. నైవవా ఇదమగ్రే ఽసదాసీత్ - నైవసదాసీత్ ఆసీదివవా ఇదమగ్రే
నైవాసీత్ । తస్మాదేతద్ఋషిణా ఽభ్యనూక్తం- 'నాసదాసీ న్నోసదా
సీత్ తదానీమ్' ఇతి: [శత]

3. అసదేవేదమగ్ర ఆసీత్ తత్సదాసీత్ తత్సమభవత్ తదాండం నిరవర్తత
[ఛాందో]

ఈ వాదమునకు సత్-అసత్-సదసత్ అను మూడవాం తరభేదము లగును. మొత్తమీవాదము లనీశ్వర మూలకములని మొదటనే యంటిమిగదా! కనుక నిందు సత్తనగా భావవాచ కమేగాని, నిత్యసత్తావాచకము కాదు. అందుచే మూడు వాదములను గ్రమముగ:– 'భావవాదము - అభావవాదము - భావాభావవాదము' లందుము. ఇందు, భావవాద - భావా భావవాదము లను నీరెంటియాధారమునను ఆస్తికుల బ్రాహ్మణ వాదము, సిద్ధాంతవాదమును వెలసినవి. వారిసత్తా, సత్తాలక్షణ బ్రహ్మ లేదా, ఈశ్వరపరకము. ఈ సద్భావమును లక్ష్యముగ గొని, త్రిసత్య- ద్విసత్య- సద్వాదములు ప్రవర్తిల్లినవి. (వానిని ముందు జూచెదము) మఱి ఇట నీ యప్రాసంగికచర్చ యేల యన:– ఇట నిపుడు సాధ్యులవిగా జెప్పబడిన సద-సత్-సదస

ద్వాదముల స్వరూపమునకును, ముందు జెప్పబోవు త్రిసత్య - ద్విసత్య - సద్వాదాదుల స్వరూపములకు భేద మున్నదనియు నిరూపించుటకు అట సత్తునకును ఇటసత్తునకు పార్థక్య మీ పరిలేఖవలన దెలియును.

[సాధ్యనాస్తికులు]

1. సద్వాదము - భావవాదము
2. అసద్వాదము - అభావవాదము
3. అసద్వాదము - భావాభావవాదము

... ... ... ... ...

సత్ - ధారావాహికబలమ్ - [భావః]

అసత్ - క్షణబలం - శూన్యరూపం [అభావః] విశుద్ధబలవాదః

[బ్రాహ్మణాస్తికులు]

1. సద్వాదము - బ్రహ్మవాదము
2. త్రిసత్యవాదము - బ్రహ్మ - కర్మ - అభావ - వాదము
3. ద్విసత్యవాదము - బ్రహ్మకర్మవాదము
4. అసద్వాదము - కర్మవాదము

సత్ - సత్తాబ్రహ్మ

అసత్ - బలంబ్రహ్మ [రస - బలవాదః]

సాధ్యవిద్వాంసుల దార్శనికదృష్టికి జెందిన యీ బలప్రధానములగు మూడు మతములును, పిదప బ్రాహ్మణవాద సంసర్గముచే సప్తసంస్థలైనవి. అవి క్రమముగ:— 1. ప్రత్యయవిమర్శ

2. ప్రకృతివిమర్శ 3. తాదాత్మ్యవిమర్శ 4. అభికార్యవిమర్శ 5. గుణవిమర్శ 6. సామంజస్యవిమర్శ 7. అక్షరవిమర్శ అను పేరుల నొప్పును. వీనింబట్టి సదసద్వాదము సప్తప్రకారము లగును. ఇట్లు స్వాయముగ సదసద్వాదమునకు సత్ - అసత్ - సదసత్ అను మూడు వాదవివర్తము లున్నపుడు ఈ సప్తసంస్థలకు నొక్కొక్కదానికి నిట్లే మూడుమూడు అవాంతరభేదముల చొప్పున మొత్తము 21 భేదము లగును. వీని వివరణము లన్నియు నిట ప్రస్తుతములు కావు. కనుక కేవలము దార్శనిక పాఠక రంజనార్థము వాని నామపరిలేఖన మొనరించెదము.

1. ప్రత్యయ విమర్శత్రయి:— ఇందు 1. సద్వాదము, 2. అసద్వాదము, 3. సదసద్వాదము అని క్రమము. ఇందు మొదటిది:— బ్రాహ్మణమతమునకు జెందిన 'నిత్యవిజ్ఞానాద్వైత' సిద్ధాంతము. రెండవది:— శ్రమణక మతమునకు జెందిన 'క్షణిక విజ్ఞానాద్వైత' సిద్ధాంతము. మూడవది:— వైజ్ఞానిక మతమునకు జెందిన 'ఆనందవిజ్ఞానాద్వైత' సిద్ధాంతము. జ్ఞానమునే ప్రత్యయ మందురు. 'విశ్వమంతయు జ్ఞానవివర్తము' అను నదియాధారముగ నీ మూడువాదములు వెలసినవి.

2. ప్రకృతి విమర్శత్రయి:— ఇందు 1. అసద్వాదము 2. సద్వాదము 3. సదసద్వాదము అని క్రమము. ఇందు మొదటిది:— వైనాశికమత సంబంధముగల కర్మాద్వైతసిద్ధాంతము. రెండవది:— అవినాశీ మతమునకు జెందిన బ్రహ్మాద్వైత సిద్ధాంతము. మూడవది:— వైనాశికవ దవినాశీ మత సంబం

ధముగల ద్వైతాద్వైత సిద్ధాంతము. 'విశ్వము ప్రకృతియొక్క విజృంభణము' అనుసది యాధారముగా నీ మూడు మతవాదములు వెలసినవి.

3. తాదాత్మ్యవిమర్శత్రయి:— ఇందు:— 1. సదసద్వాదము 2. అసద్వాదము 3. సద్వాదము ఇది క్రమము: ఇందు మొదటిది:— భిన్నాభిన్నత్వ సిద్ధాంతము, ఇది బలరసాభేద (ధర్మ ధర్మి అభేదము) వాదమునకు జెందినది. రెండవది:— బలసారత్వ సిద్ధాంతము; ఇది బలప్రాధాన్య వాదమునకు జెందినది. మూడవది:— రససారత్వ సిద్ధాంతము. ఇది రసప్రాధాన్యవాదమునకు జెందినది.

4. అభికార్య విమర్శత్రయి:— ఇందు:— 1. అసద్వాదము 2. సద్వాదము 3. సదసద్వాదము అని క్రమము. ఇందు మొదటది:— అసత్కార్య వాదసిద్ధాంతము. ఇది వైశేషికమతమునకు జెందినది. రెండవది:— సత్కార్యవాద సిద్ధాంతము. ఇది ప్రాధానికతంత్రమునకు జెందినది. మూడవది:— మిథ్యాకార్యవాదము. దీనికి శారీరకతంత్రముతో వ్యాఖ్యాతలు సంబంధము గలిపియున్నారు.

5. గుణవిమర్శత్రయి:— క్రమము ఇందును పైదానియందు వలెనే. మొదటిది అసన్మాత్రల సృష్టిసిద్ధాంతము. ఇది ప్రాణాత్మక సృష్టి వాదమునకు జెందినది. రెండవది సన్మాత్రలసృష్టి సిద్ధాంతము. ఇది వాఙ్మయ సృష్టివాదమునకు జెందినది.

మూడవది సదసద్వైకాత్మ్యమూల సృష్టివాదము. ఇది మనో మయ సృష్టివాదమునకు జెందినది.

6. సామంజస్య విమర్శత్రయి:— ఇందును నిదేక్రమము. 1. ప్రాగభావసముచ్చితకారణతా సిద్ధాంతము. ఇది అభావ పూర్వక భావోత్పత్తివాదమునకు జెందినది. 2. సంభూతివినాశ కారణతా వాదసిద్ధాంతము. దీని కుత్పత్తివినాశ ప్రవాహ వాదముతో సంబంధము. 3. విద్యావిద్యాకారణతావాదము. దీనికి సర్వజగదభావాత్మక భావమూలక సృష్టివాదముతో సంబంధము.

7. అక్షరవిమర్శత్రయి:— క్రమ మిందును పైవిధముననే. 1. సాంఖ్యసిద్ధాంతము. దీనికి సృష్టిబీజరూపాక్షరా వ్యక్తాత్మక బలమయభావముతో సంబంధము. 2. కాపిలసిద్ధాంతము. ఇది సృష్టిబీజరూపాక్షరాత్మక జడభావమునకు చెందినది. 3. బాదరాయణ సిద్ధాంతము: ఇది సృష్టిబీజరూపాక్షరాత్మక చేతన భావమునకు జెందినది.

# 3. రజోవాదము

కొందరు సాధ్యవిద్వాంసులు సృష్టిమూలము రజస్సందురు. విశ్వసృష్టి యొకవ్యాపారము. అది క్రియ - తన్మాత్రప్రకృతికి నదే గుణముండగలదు. - సత్వమున్నను, జ్ఞానమయ మగుటచే క్రియాసాపేక్ష సృష్టిమర్యాదకు వెలియైనది. తమస్సన్ననో అర్థప్రధానము. జడభావము గలది యగుటచే సృష్టియం

దసమర్థము. సృష్టియన సంసృష్టి - అనేక తత్త్వముల రాసా యనిక సమ్మిశ్రణము. మిశ్రణమన్నదియు క్రియయే. ఇక త్రిగుణప్రకృతి యందలి రజస్సొకటే క్రియామయము; కనుక దానిని సృష్టిమూల మందుము.

ఇందు ప్రకృతియొక్క రజోభావము ప్రధానలక్ష్యము. అందువలననే లోకములకు రజః - రజాంసి - యను పేరువచ్చెను. ఈమూలకారణత వలననే గాంపత్య బీజమును రజ స్సనిరి. ఆస్తిక (గీత) సిద్ధాంతము గూడ పరంపరగ సృష్టిమూలము రజ స్సనియే. ఎట్లన:— ఏసృష్టికైనను మూలోత్థానము కామము (ఇచ్ఛ - కామునిగదా!) శ్రుతియు "కామ స్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్" అన్నది. గీతయో "కామఏషక్రోధఏష రజోగుణసముద్భవః" అనుచు సృష్టిమూలక కామము రజోగుణసంభూత మనుచున్నది గదా! ఈరజోవాదమున కీ వచనములు ప్రమాణములు.

1. యస్యప్రయాణ మన్వన్య ఇద్యయు ర్దేవాదేవస్య మహిమాన మోజసా
యః పార్థివాని విమమే సఏతశో రజాంసి దేవః సవితా మహిత్వనా॥

2. అచికిత్వాన్ చికితుష శ్చిదత్ర కవీన్ పృచ్ఛామి విద్మనే నవిద్వాన్
వియస్తస్తంభ షడిమారజాంసి అజస్యరూపే కిమపిస్విదేకమ్॥

3. ఆకృష్ణేనరజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ
హిరణ్యయేన సవితారథేన దేవోయాతి భువనానిపశ్యన్॥

4. హిరణ్యపాణిః సవితావిచర్షణి రుభేద్యావాపృథివీ అంతరీయతే
అపామీవాం బాధతేవేతి సూర్య మభికృష్ణేన రజసా ద్యామృణోతి॥

5. సనేమిచంద్రమజరవం వివావృతఉత్తానాయానాం దశయుక్తావహన్తి
సూర్యచక్షూ రజసా ఏత్యావృతం తస్మిన్నర్పితా భువనానివిశ్వా॥

6. వీంద్రయాసి దివ్యానిరోచనా విపార్థివాని రజసా పురుష్టుత
యేత్వావహన్తి ముహురధ్వరాం ఉపతే సువన్వన్తువగ్వానాం అరాధసః॥

7. ఇమే వైలోకారజాంసి, 8. ద్యావైత్యతృతీయంరజః 9. ఏషరజః ఉప ర్యుపరితపతి 10. మధుమత్పార్థివంరజః 11. రజోభూమిస్త్వ మాంరోద యస్వ 12. ప్రథమారేఖారజః॥

# 4. వ్యోమవాదము

సాధ్యులందు గొందరు వాఙ్మయరహస్యవేత్తలు "దృశ్య మానమగు నీ భూతభౌతికప్రపంచ మాకాశగుణక శబ్దతన్మాత్ర యొక్క రాశియే" యందురు. స్థూల - సూక్ష్మములు, నామ రూపకర్మాత్మకములు నగు పదార్థములన్నిటికి మూలోపాదా నము ఆకాశాత్మక శబ్దతన్మాత్రయే. నియతకాలమున, నియత కాలమువరకు, చిరకాలసర్వ్యాతము మన మొక శబ్దమును భావనా మయముగ నుచ్చరించుచో కాలాంతరమున నాశబ్దధారా సంపుటమునుండి యాశబ్దధారాపరంపరయే యొకచో రాశీ భూతమై భూతపిండరూపమున బరిణమిల్లును. కనుకనే అన్ని భూత ములయందును శబ్దోపలబ్ధి కల్గుచున్నది. ప్రకృతినాదము లేని చోటులేదు. కనుకనే "సహ్యాశబ్దమివాస్తి, 'సర్వంశబ్దేనభాసతే' వేదశబ్దేభ్యఏవాదౌ పృథక్సంస్థాశ్చనిర్మమే" ఇత్యాద్యాస్తిక సిద్ధాంతములును వెలసినవి.

నామరూపములే భౌతికపదార్థముల ముఖ్యరూపములు. ఈ రెండును ఆకాశాత్మకములు. సర్వభూతావవన మాకాశమే. ఆకాశమే మొదట తన శబ్దతన్మాత్రద్వారా, వాయురూపమునను, వాయువగ్నిరూపమునను, అగ్నిజలరూపమునను, జలము పృధివిగను, పృధివీమృద్భాగము ఓషధి (అన్నము) వనస్పతి (ఫలము) రూపములగను, అవిశుక్రముగను కాగా, శుక్రాహుతి ప్రజాసృష్టి కాధార మగుచున్నది. ఇట్లు పరంపరగ మూల మాకాశమగుచున్నది ఇదే వ్యోమవాదము.

1. ద్వితావివవ్రే సనజాసనీళే అయాస్యః స్తవమానేభిరర్కైః
భగోనమేనే 'పరమేవ్యోమన్' అధారయ ద్రోదసీసుదంసాః॥

2. సజాయమానః 'పరమేవ్యోమని' ఆవిరగ్నిరభవత్ మాతరిశ్వనే
అస్యక్రత్వాసమిధానస్యమజ్మనా, ప్రద్యావాశోచిః పృథివీఅరోచయత్॥

3. ఋచోఅక్షరే 'పరమేవ్యోమన్' యస్మిన్ దేవా అధివిశ్వేనిషేదుః
యస్తన్నవేద కిమృచాకరిష్యతి యఇత్తద్విదు స్తఇమే సమాసతే॥

4. గౌరీర్మిమాయ సలిలాని తక్ష త్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ,
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా 'పరమేవ్యోమన్'॥

5. సజాయమానః 'పరమేవ్యోమని' వ్రతాన్యగ్ని ర్వ్రతపాఅరక్షత,
వ్యన్తరిక్ష మమిమీత సుక్రతు ర్వైశ్వానరో మహినా నాకమస్పృశత్॥

6. ఇయంవిసృష్టి ర్యతఆబభూవ యదివాదధే యదివాన
యోఽస్యాధ్యక్షః 'పరమేవ్యోమన్' సో అంగ వేద యదివానవేద॥

7. ఆకాశాదేవజాయన్తే ఆకాశాదేవజాతానిజీవన్తి, ఆకాశంప్రయన్త్యభిసంవిశన్తి, 8. ఆకాశోవై నామరూపయో ర్నిర్వహితా 9. ఆకాశాద్యోనేః

సంభూతః, 10. ఇమానిభూతాని ఆకాశాదేవసముత్పద్యన్తే ఆకాశం ప్రత్యస్తంయంతి 11. ఆకాశః పరాయణం, 12. సర్వమిత్యాకాశే, 13. ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథివీ, 14. మనోమయోఽయంపురుషః భాః సత్యమాకాశాత్మా.

## 5. అపరవాదము

ఈవాద మాస్తికుల పర (అవ్యయ — పురుష - ఆత్మ) వాదమునకు వ్యతిరేకమగు, అపర (క్షర - ప్రకృతి - అనాత్మ) వాదమును సమర్థించును. ఎట్లన:— పర — అపరశబ్దములు అది - ఇది యనుటను దెలుపును. విశ్వమందు ఇది యనదగి నదేకాని అది యనదగిన పరోక్షమగున దేమియులేదు. కనుక అపరమందే అంతయు నిమిడియున్నది. పురోఽవస్థిత భూత ప్రపంచమే తత్త్వవాదమునకు విశ్రామభూమి. దీనికి మూల మిదే. దీనికి బైనేదో యున్నదనుకొనుట వ్యర్థము. సృష్టికి సృష్టియే మూలము.

విభిన్నగుణకర్మాత్మక పదార్థ పారస్పరిక సంయోగ విశేషమే సృష్టికి కారణము. పంచభూతములును తమవిభిన్న సంయోగములచే తమతమ స్వరూపసత్తం బ్రతిష్ఠించుకొన జాలి యున్నవి. ఒకప్పుడు జలసంయోగములచే మట్టి యోషధిగనై అదే కాలాంతరమున శుష్కము - నీరసము నగు వాయు సంయోగముచే మరల మట్టి యగుచున్నది. ఇట్లు అన్నిటను పారస్పరిక సంయోగ వియోగమూలక కార్యకారణభావముల

నూహింపవలెను. ఇట్టి ప్రత్యక్షకారణ వాదముండగ, నేదో పరకారణకల్పన గావించుకొని తద్రక్షణ కేవోసిద్ధాంతములను కల్పించుట యాస్తికవర్గముయొక్క దంభలీలామాత్రము.

పరమన్నదిలేదు. అంతయునపరమే, అదేకార్యము, కారణమును. తండ్రిపుత్రునకు గారణమగుచో నాతండ్రితండ్రి కీతండ్రి కార్యమునగునుగాదా! "ఉభయంహైతద్భవతి పితాచపుత్రశ్చ ప్రజాపతిశ్చాగ్నిశ్చ, అగ్నిశ్చప్రజాపతిశ్చ, ప్రజాపతిశ్చదేవాశ్చ దేవాశ్చప్రజాపతిశ్చ" అనుచు శ్రుతియు నీకార్యకారణ విపర్యయాత్మకాపరవాదమునే సమర్థించుచున్నది.

సాధ్యులదగు నీ మతమును క్షరదృష్టితో గూడసమర్థింపవచ్చును. 'క్షరఃసర్వాణిభూతాని' అన్నట్లు క్షరమన్నను భూతమన్న నొకటే. అవ్యయాత్మ పరశబ్దవాచ్యము, క్షరమపరమనబడును. కనుకనే 'భూమిరాపోనలో...''అపరేయం'' అనిచెప్పబడినది. ఇదే విశ్వమూలము, పరతత్త్వమగు నవ్యయుడు సృష్టికారణతా సంబంధబాహ్యుడే 'నకరోతినలిప్యతే' అనిచెప్పబడినదిగదా! కనుక సృష్టికారణతంగూర్చి యతనినన్వేషింపనేల? ఈవిధముగ గీతయు నీవాదమును సమర్థించుచున్నది.

పరభావముం దేనినేని యపేక్షింపని విశ్వమే అపరము. దీనికి మూల మిదే. మరొకమూలముతో బనిలేదు. లేదా, కార్యవిశ్వము, కారణరూపాపరభావమునకు రెండవ రూపమనుడు. అది మొదటిరూపము; ఏమన్నను తాత్పర్యమొకటే. 'తన సజాతీయ తత్త్వములనే గాని యన్యమగు

నేవిజాతీయకారణము నపేక్షింపని మర్త్యక్షురప్రధాన కారణ వాదమే 'అపరవాదము' అని నిష్కర్ష. దీనిని సమర్థించు వచనము లివి.

1. కఈంస్తవత్ కః ప్రాణాత్ కోయజాతే యదుద్రమి న్మఘవావిశ్వహావేత్
పాదావిశ ప్రహరన్నన్య మన్యంకృణోతి పూర్వ 'మపరం' శచీభిః॥

2. యథాహాన్యనుపూర్వంభవన్తి యథాఋతవ ఋతుభి ర్యన్తి సాధు
యథానపూర్వ 'మపరో' జహాత్యేవా ధాతురాయూంషి కల్పయైషాం॥

3. దేవాసోహిష్మామనవే సమన్యవో విశ్వేసాకం సరాతయః
తేనోఅద్యతే 'అపరం' తు చేతునో భవన్తు వరివోవిదః॥

4. స్థూలాని సూక్ష్మాని బహూనిచైవ రూపాణి దేహీ స్వగుణైర్వృణోతి
క్రియాగుణై రాత్మగుణైశ్చ తేషాం సంయోగహేతురపరో౽పిదృష్టః॥

## 6. ఆవరణవాదః

అర్థదృష్టిం ప్రధానముగనెంచు సాధ్యులు ఆవరణమునే సృష్టికి మూలముగ నెంచిరి. కార్యముయొక్క బాహ్యరూపమే తదీయకారణ పరిచాయకమగును. "వాతోదేవేభ్య ఆచష్టే యథాపురుష తేమనః" అన్నట్లు బాహ్యావాతావరణ మంత ర్భావ పరిచాయక మగు నని శ్రుతియు జెప్పెను. కనుక నాంతరమునకు బోవనవసరము లేకుండ బాహ్యదృష్టివలననే కారణాన్వేషణ చేయవలయును. వస్తువు బాహ్యరూపమే తదీయ మూలకారణము దెలుపును. విశ్వమందలి ప్రతిపదార్థము

యొక్క బాహ్యరూపమును, తమోగుణ ప్రధానము కనుకనే యదిపదార్థము నాబడును. పద=వస్తునామము, అర్థము=వస్తువు. వస్తుబాహ్యరూప మర్థము. ఇది ఒకవిధమగు నావరణము. మహామహిమ యాకాశ మొక యావరణము _ ఏతదాయతన ప్రతిష్ఠిత పదార్థములెల్లను జిన్న జిన్న యావరణములు. వీని సమష్టియే విశ్వరూపము.

ఈయావరణమునే యాస్తికులు తమోగుణమనిరి. ఇది భౌతికసృష్టిమూలము. అర్థమావరణము గనుక సజాతీయ సంబంధ సిద్ధాంతానుసారము దీనికి మూలకారణమును ఆవర ణమే కావలయును. వైదికులు దీనిని వయునమందురు. వ్యాఖ్యా తలు వయున శబ్దము గర్మవాచకమన్నను, కర్మమయము కర్మా ధార మర్థమే కనుక నీశబ్దము తద్వాచకమే. మన ప్రజ్ఞానమునకు విషయములగు ప్రజ్ఞాతభావముల పేరే వయునము. కనుకనే 'యుంజతేమన ఉతయుంజతేధియః' అనుమంత్రమందలి 'వయునా విత్' శబ్దవ్యాఖ్యానమం దువ్వటులు 'వయునాని=ప్రజ్ఞానాని, వేత్తీతి వయునావిత్' అనిరి.

సవితృప్రజాపతి సర్వవయునవేత్త. అగ్నియు వయునవేత్త యని 'వయునానివిద్వాన్' అనియొకచో నున్నది. అర్థప్రధా నములగు నెల్లపదార్థములును వయునములు. తన్నిష్పత్తియగ్ని వలన. కనుక నతనిని వయునపరిజ్ఞాత యనిచెప్పిరి. సవిషయిక జ్ఞానమే వయునము. పదార్థము వయునమయినను, అది జ్ఞాన మండల ప్రవిష్టమయినపుడే 'అయంపదార్థః' అనుప్రతీతి కల్గును.

కనుక, ప్రజ్ఞానమును, జ్ఞానాశ్రితపదార్థమును, లేదా జ్ఞానాభినీయమాన పదార్థమును వయునమందురు. వీయతే గమ్యతే ప్రాప్యతే విషయా అనేన - తద్ - వయునమ్ - అజగతౌ, 'అజియమిశీఙ్భ్యశ్చ (ఉణాది 3-61) ఇతిఉనణ్ సచకిత్, అజేర్వీభావః.

'సర్వమిదంవయునమ్' అన్నట్లు విశ్వమంతయు నొక మహావయునము; ఇందు చిన్నపెద్దలెన్నో వయునము లున్నవి. ప్రతియొక వయునమందు తత్ స్వరూపరక్షకములు వయ - వయోనాధములు సమన్వితములై యున్నవి. వస్తువునాకారమును, దానిచే నాకారితమగు వస్తువును క్రమముగ వయోనాధ, వయస్సులు. వస్తుతత్త్వమును సురక్షితము గావించునది బాహ్యాకారమే (సీమ - ఆయతనము). అందు గర్భితముగ నున్నంతవరకు నేవస్తువునకును అనిష్టముండదు; బాహ్యాక్రమణమున నగు నాఘాతము, మొదట నాకారమునకే దగులును. దానితో నదిచెడును.

ఆయువును వయస్సనుట కలదుగదా! సమానాయువుగలవారు సమానవయస్కులు. ఇందును వయశ్శబ్దమునకు దాత్పర్యమదే. ప్రాణయుక్తమగు నర్థము పేరే వయస్సు. అర్థము (శరీరము) నందు ప్రాణమున్నంతవరకునే దాని సత్త. కనుకనే శ్రుతియు 'ప్రాణోవైవయః' అన్నది. ప్రాణము క్రియాశక్తి ప్రధానము. గతిశీలము. కనుకనే గత్యర్థకములగు 'వయ - వీ - అజ' ధాతుత్రయముచే వయశ్శబ్ద మేర్పడును. ఈగతి

భావముంబట్టియే పక్షిని 'వయస్' అందుము. వయశ్శబ్దము నకు వ్యాఖ్యాతలు అన్నమని యర్థముచెప్పిరి. ఈ యర్థమ్ముం గూడ గొన్ని విధములచే సమన్వయింపవచ్చును.

1. గతిశీలమగు ప్రాణము వయస్సుగదా! తదీయగతిభావ మన్నాహుతిపై నాధారపడి యున్నది.

"అన్నం బ్రహ్మేత్యేకఆహుః, తన్నతథా పూయతివా అన్న మృతే ప్రాణాత్ ప్రాణోబ్రహ్మే త్యేకఆహుః, తన్నతథా శుష్యతివైప్రాణః ఋతేఽన్నాత్ ఏతేహ త్వేవదేవతే ఏకథా భూయంభూత్వా పరమ తాంగచ్ఛతః"

తాత్పర్యము:— ప్రాణాగ్నిబల ముండునంతవరకు నిందు హుతమగు నన్నము రసాదిరూప పరిణతి నందుచుండును. అటు గానిచో నది నీరసమై దోషయుక్తమగును. ఇట్లు అన్నాహుతి యుండునంతవరకు ప్రాణాగ్ని ప్రబలముగ నుండును. లేనిచో నది మూర్ఛితమగును. కనుక నిట్టిచో నీ రెంటికి నన్యోఽన్యా శ్రయ సంబంధ మున్నదనవలయును. రెండు నేకమై స్వరూప రక్ష గావించుకొనును. కనుక ప్రాణవిశిష్టార్థము (అన్నము) నే వయస్సందుము. ఇక:— అన్నముద్వారా ప్రాణరక్షయగుం గావున వ్యాఖ్యాతలు వయశ్శబ్దమునకు అన్నమని యర్థము చేసిరి.

2. మరియు:— ఉదరభుక్తములగు భోజ్యపదార్థముల నన్న మనునట్లే, వస్తుతత్త్వము స్వకీయమగు వయోనాధరూప

సీమాభావముయొక్క యుదరమందు భుక్తముగ నుండు నను దృష్టితో (భుక్తిభావదృష్టితోగూడ) వయస్సు నన్న మన దగును.

3. ఇంకను:— 'అహమన్నమన్నమదంతమద్మి' 'అన్నా దశ్చవా ఇదం సర్వమన్నంచ' ఇత్యాదులంబట్టి విశ్వపదార్థము లెల్ల పరస్పరము అన్నము, అన్నాదము నగును. పారస్పరికాదాన విసర్గములవలననే యన్నిటి పాలన పోషణములు నగుచున్నవి. ఆదానదశయం దన్నియు నన్నాదములే (భోక్తలే) విసర్గదశయం దన్నియు నన్నము (భోగ్యము) లే. ఈదృష్టితో గూడ వయోరూప వస్తుతత్త్వము నన్నమనవచ్చును.

వస్తువు బాహ్యాకారము (సీమాభావము) వయోనాధ మనుకొంటిమిగదా! అది వయస్సును నలువైపులను బంధించి యుంచును. కనుక దానిని వయోనాధమనుట తగును. అదే ఛందస్సనబడియెను. ప్రతివస్తువును ఛందోఛందితము. కనుక ఛందస్సును వయోనాధ మనవచ్చును.

సరే:— ఛందోఛందిత వస్తుతత్త్వము ప్రాణయుక్తమగు నర్థముగదా! ఇక నీ ఛందోరూప సీమాభావ స్వరూపమేమి? అన్నచో సమాధానమును ప్రాణతత్త్వమే. ప్రాణతత్త్వమసంఖ్యము. వేర్వేరు ప్రాణములవలన వేర్వేరు కార్యముల సంచాలనము జరుగుచున్నది. ఏ ప్రాణవిశేష మంతర్యామ సంబంధముచే వస్తుతత్త్వమునకు ప్రతిష్ఠ యగుచున్నదో అది ఛందస్సనబడును. ఈ ప్రాణభేదమును లక్ష్యముగా గొనియే

శ్రుతి ప్రాణమును వయస్సనియు, వయోనాధమనియు గూడ జెప్పెను. కాని, యర్థముజేసికొనునప్పుడు వయఃప్రాణమూాభ్యం తర మనియు, వయోనాధప్రాణము బాహ్యప్రాణ మనియు జ్ఞప్తి యుంచుకోవలయును. లేనిచో నామసామ్యముచే నర్థ మనర్థమగుచుండును. ఇంతేను బాహ్యప్రాణరూపఛందస్సు పేరే వయోనాధము. కనుకనే శ్రుతి యిట్లు చెప్పెను.

1. ప్రాణావావయోనాధాః ప్రాణైర్హీదంసర్వం వయునం బద్ధమ్
2. అథఛందాంసివైదేవా వయోనాధాః ఛందోభి ర్హీదం సర్వం వయునం నద్ధమ్ [శత]

ఇందువలన బ్రతిపదార్థమును వయునము. ఇందు వయ, వయోనాధము లను రెండు పర్వము లున్నవనియు, దీనికి మూలము అర్థప్రధాన తమోగుణ మనియు, అదే సృష్టి మూలము ననియు, అది యొకవిధముగ నావరణము గనుక తమోవాదము లేదా వయునవాదము అగు నిది సాధ్యుల ఆవరణవాద మనియు దెల్లమగును. ఈ వచనములం గను నింపుడు:—

1. తమఆసీ త్తమసాగూఢ మగ్రే ఽప్రకేతం సలిలం సర్వమాఇదం
తుచ్ఛే నాభ్వపిహితం యదాసీ త్తప స్తన్మహినా జాయతైకమ్॥
2, కవిర్నో అగ్ని రుచతస్య వీరసద్వసుష్కృవిత్ వసుభిః కామమావరత్
చోదఃకవిత్తు తుజ్యాత్ సాతయేధియః శుచిప్రతీకం తమయాధియాగృణే॥
3. అప్రక్షితం వసుబిభర్షి హస్తయోరషాళహం సహస్తన్విశ్రుతోదధే
అవృతాసోఽవతాసో నకర్తృభిస్తనూషుతే క్రతవః ఇంద్రభూరయః॥

4. సహస్రసృత్ పృషదశ్వోయువా గణో యా ఈశాన స్తరిషీభిరావృతః
అసిసత్యబుణయావాఽనేద్యో అస్యాధియః ప్రావితాథా వృషాగణః॥

5. దివోయః స్కంభోధరుణః స్వాతత ఆపూర్ణో అంశుః పర్యేతివిశ్వతః
సమేమహీరోదసీ యక్షదావృతా, సమీచీనే తాధార సమిషః కవి॥

[ఋక్]

6. ఆసీదిదంతమోభూత మప్రజ్ఞాతిమలక్షణం
అప్రతర్క్యమనిర్దేశ్యం, ప్రసుప్తమివసర్వతః॥

# 7. అంభోవాదము

సృష్టింగూర్చి విచారించినచో దాని మూలకారణమును ఎఱుకబడును. ఇందు లోకము - లోకి - యని రెండుపర్వములు, లోక మాయతనము, అందలి వస్తుతత్త్వములోకి. ప్రతిదానియందు నీరెండు నుండును. లోకము లోకి కాయతనము, ప్రతిష్ఠ. అయినను అది తన ప్రతిష్ఠకై లోకిసత్త నపేక్షించును. ఇది యాశ్చర్యము! ఉదాహరణము:— మానవుడొక చేతన సృష్టి. ఇందు పాంచభౌతిక శరీరము, శుక్రశోణిత సంపన్న భూతాత్మ యను రెండుపర్వము లున్నవి. శరీరములోకము, భూతాత్మలోకి. దీనికది ఆయతనమయ్యు దీనిసత్త యున్నంత వరకే దాని స్వరూపసత్తయు నుండును. అటుగానిచో లోకము శిథిలమై పోవును గదా! కనుకనే లోకి, తనకు ప్రతిష్ఠయగు లోకమునకు గూడ ప్రతిష్ఠయని తాత్త్వికులందురు:— ఇట్లే ఒక పాషాణముం గొనుడు. దాని పిండమే లోకము. అందలి పాషాణ

పరమాణువులను ఒకసూత్రమున బంధించి నిబిడావయవముం గావించి తత్స్వరూపమును నిలుపు విధర్త్రాప్రాణములోకి. అదిలేనిచో పాషాణ మిసుకగ నైపోవును.

ఈలోక - లోకి సమన్వితావస్థ పేరే సృష్టి - ఇట్లు కార్య స్వరూపము దెలియగ నిక కారణాన్వేషణకై మొదట లోక ముం జూతము. దీనికి సృష్ట్యుపాదానము జలము. దీని రూపాం తరము పృథివి. జలమే వాయుప్రవేశముచే క్రమముగ ఘనీ భూతమై కాలాంతరమున బృథివిగ నగును. అంతరిక్షమందును ప్రాణాత్మక జలసామ్రాజ్యమున్నది. చంద్రుడును జలము యొక్క విశేషావస్థారూప (విరాళావస్థారూప) సోమరూపాంత రము జలపిండము. నక్షత్రలోక (పిండ) ము లన్నియు జలపిండ ములే (ఉడు). సూర్యలోకమును, తేజోమయ మరీచ్యుదక సంఘాతమే. పరమేష్ఠియొక్క యాబ్రూపత జెప్పబనియే లేదు. ప్రాణమయ స్వాయంభువుకూడ ఋతమును మూలముగా గొను టచే నాపఃకారణతకు వెలియైనవా డనజాలము.

ఈ ప్రాకృతిక మహాలోకములే గాక వీని యుదరములం దుండు చిన్న పెద్దలోకము లెన్నియో! అన్నియు అమ్మూల ములే- ఓషధివనస్పతులు జలసేచనము వలననే స్వరూపధారణ నేయును. మనశరీర మాపోమయము. శుక్రశోణితములను రెండుధాతువులు నప్ప్రధానములు గదా! - ఇంతకు లోకము లన్నిటికి మూలోపాదాన మప్తత్త్వమని తేలుచున్నది. ఇదిః అంభః - మరీచిః - మరః - ఆపః - శ్రద్ధా - మొదలుగ ననేక

భేదములు గలది. ఈ యబ్జాతిభేదమే లోకస్వరూప భేదకారణము. ఇక:—

లోకింజాతము. భూతాత్మ చేతనాపురుషుడు. 'ఖాదయశ్చేతనా షష్ఠా ధాతవఃపురుషఃస్మృతః' (చరక) అన్నట్లు చేతనాలక్షణ భూతాత్మయు ధాతువని చెప్పబడినది. ఈ ధాతుపురుష మూలోపాదానము ఆపస్తత్త్వమని పంచాగ్నివిద్య చెప్పను. "ఇతితు పంచమ్యామాహుతా వాపః పురుషవచసో భవన్తి" (ఛాందో) భూతాత్మ అన్నరసమయము. "అన్నాత్పురుషః సవాఏషపురుషోఽన్నరసమయః' (తైత్తి) 'యతోఽభిహితం పంచమహాభూత శరీరిసమవాయ పురుషఇతి, సఏషకర్మపురుషః చికిత్సాధికృతః" (సుశ్రుత) "షడ్ధాతవః సముదితాః పురుష ఇతి శబ్దం లభన్తే" (చరక) అన్నముజలరూపాంతరము. ఇట్లు వరింపగ జేతనాసృష్టిప్రతిష్ఠా మూలకారణమగు లోకియు (భూతాత్మయు) నాపఃకారణముతో సంబంధముగలదే యగుచున్నది. ఇట్లే జడసృష్టిప్రతిష్ఠామూలకారణమగు లోకియు, (ప్రాణమును) 'ఆపోమయః ప్రాణః' అన్నట్లు ఆపోమయమే. ఈవిధముగ సృష్టియనబడు లోక - లోకీసమష్టియందలి రెంటికిని మూలకారణ మప్తత్త్వమే యగుచో సృష్టికారణవిచారణయందంభోవాదమునే యెదుట నుంచుకోవలయును. ఈవచనములను గమనింపుడు:—

1. ఓమానవమాపో మానుషీరమృక్తం ధాతతోకాయ తనయాయ శంయోః
యూయంహిష్ఠా భిషజో మాతృతమా విశ్వస్య స్థాతుః జగతోజనిత్రీః॥

2. ప్రసువ ఆపో మహిమానముత్తమం, కారుర్వో చాతి సదనే వివస్వతః ప్రసప్తసప్త త్రేధాహి చక్రముః ప్రస్వ త్వరీణా మతిసింధురోజసా॥

3. తతంమే అపస్తదుతాయతే పునః స్వాదిష్టాధీతి రుచథాయ శస్యతే అయంసముద్ర ఇహవిశ్వదేవ్యః స్వాహాకృతస్య సముతృప్ణుత ఋభవః

[ఋక్]

4. ఆపోవాఇదమగ్రే సలిలమేవాస తా అకామయంత కథన్ను ప్రజాయే మహీతి తా॰॰ ॰॰॰॰॰స్తా తపో ఉతప్యన్త తాసుతప్యమానాసు హిరణ్మయాం॰॰ సం॰ భూవ॥

5 అద్భి॰॰॰॰॰॰ సర్వంధారయిష్యామి జనయిష్యామి ఆప్స్యామి యదిదం కించ తద్యదబ్రవీత్ అభిర్వా-తస్మాద్ధారా జాయా, ఆపః అభవత్॥

6. అద్భిర్వాఇదం సర్వమాప్తం 7. నేదం సర్వమాప్నోత్ యదిదంకించ యదాప్నోత్ తస్మాదాపః యదవృణోత్ తస్మాద్వాః (వారిః) 8. ఆపో వైసర్వ కామాః॥

9. ఆపో వైసర్వాదేవతాః 10. అపోవాఅస్య సర్వస్యప్రతిష్ఠా

11. అప్సుతంముంచిభద్రంతే లోకాహ్యప్సు ప్రతిష్ఠితాః ఆపోమయాఃసర్వరసాః సర్వమాపోమయంజగత్॥ (భారతే)

# 8. అమృతమృత్యువాదః

సదసద్వాద సమథరాతలమునసే యుండు నిత్యానిత్య భావద్వయమునకి జెందియుండువాదమే 'అమృతమృత్యువాదము. సదసద్వాదమునందలి సదసత్తులు, రెంటును ఒకొక్కప్పుడు

సంకరత కలుగుచుండును. ఆవాదమున మున్ను సత్తన భావ మనియు, అసత్తస సభావమనియు జెప్పబడినది. కాని, యీాయమృత – మృత్యువాదమునందలి అమృతమృత్యువులు రెండును భావాత్మకములే. ఈభేదమును గుర్తించుకొని ప్రకృత వాద విచారణ సేయవలయును.

ఏ పదార్థతత్త్వము సరయబోయినను రెండు విరుద్ధభావము లగపడును. 1. ఉత్పత్తి మొదలు క్షయమగువరకు ననుక్షణము నెన్నో పరివర్తనములు. సూక్ష్మముగ జూచినచో పూర్వక్షణా వచ్ఛిన్నపదార్థ ముత్తరక్షణమున 'లేదే' అనవలయును.

కాని, యీా క్షణభావముతోబాటుగ నొక యక్షణభావము కూడ నగపడుచున్నది. పరివర్తనమన్నది యొక అపరివర్త నీయ ధరాతలము నపేక్షించును. కనుకనే పూర్వక్షణస్థ వస్తు వుత్తరక్షణమున లేదన దగియున్నను తదుపలబ్ధి కల్గుచున్నది. ఎంతకాలమునకైన నదేయిది యను ప్రతీతి కీ యక్షణభావమే కారణము. తమఃప్రకాశములట్లు ఈరెండును విరుద్ధధర్మము లయ్యునొకచో సమన్వితములై యున్నవి. ఇందు క్షణభావము మృత్యువు. అక్షణభావ మమృతము. విశ్వమం దీరెండు నగపడు చుండుటవలన నివియే విశ్వమూలముగ నెంచవలయును. ఇందు రెండును నిత్యములనము. అమృతము ధారావాహిక నిత్యము. మృత్యువు క్షణికానిత్యము. గదా! ఇక నీయపేక్షాకృత నిత్య తంగొని యమృతమును నిత్యమని చెప్పవచ్చును. ఈరెంటికి అంత రాంతరీభావ సంబంధము. (ఈవిషయము నిందే ద్విసత్యవాద

ప్రకరణము నందు జూడగలరు) ఈవచనము లీ యమృత మృత్యువాద సమర్థకము లగును.

1. ఆకృష్ణేనరజసా వర్తమానో నివేశయ న్నమృతంమర్త్యంచ
హిరణ్మయేన సవితా రథేన దేవో యాతి భువనాని పశ్యన్.

2. యజ్ఞైరథర్వా ప్రథమః పథస్తతే తతఃసూర్యో వ్రతపా వేన ఆజని
ఆగాఆజదుశనా కావ్యః సచాయమస్య జాతమమృతం యజామహే.

3. బృహస్త ఇద్భానవో భాఋజీక మగ్నిం సచంత విద్యుతో నశుక్రాః
గృహేవవృద్ధం సదసిస్వే అంతరపార ఊర్వే అమృతందుహానాః.

4. అంతరంమృత్యోరమృతం మృత్యావమృతమాహితం
మృత్యుర్వివస్వంతం వస్తేమృత్యోరాత్మా వివస్వతి.

5. 1. "ద్వేవావబ్రహ్మణో రూపే మర్త్యంచామృతంచ" 2. 'శాంతి సమృద్ధ మమృతం' 3. అశనాయాహి మృత్యుః 4. క్షరంత్వవిద్యా హ్యమృతంతువిద్యా 5. అచలమమృతమచ్యుతమ్ 6. మృత్యుర్వై వేదమా వృత మాసీదశనాయా 7. అకలోఽమృతోభవతి 8. మర్త్యతా మమృతంవ్రజేత అమృతంచైవ మృత్యుశ్చ 10. అర్థంహవై ప్రజాపతే రాత్మనో మర్త్యమాసీదర్థమమృతం 11. ఉభయం హైతదగ్రే ప్రజాపతిరాస మర్త్యంచైవామృతంచ తస్యప్రాణాఏవామృతా అసుః శరీరం మర్త్యం। సఏతేన కర్మణా, ఏతయాఆవృతా, ఏకధా జరమమృత మాత్మాన మకురుత.

12. "ఏతద్వైమనుష్యస్యామృతత్త్వం యత్సర్వమాయురేతి" అను వచనమాయువు నమృతముగా జెప్పుచు అమృతత్త్వముయొక్క- ధారా వాహిక నిత్యతను సమర్థించుచున్నది.

*

# 9. అహోరాత్రవాదము

తేజః స్నేహవాదములు కొందరు సాధ్యవిద్వాంసు లిట్లందురు. "సృష్టిమూలము నెరుంగ నింతదూరము బోనేల? ప్రత్యక్షముగ నది యెరుకపడుచునేయున్నది. అందుకు మూలకారణములు (రాత్రింబగిళ్ళు) అహోరాత్రములు. ప్రతిపదార్థమును తేజఃస్నేహ సమ్మిశ్రణమే. శుష్కతత్త్వము తేజము. ఆర్ద్రతత్త్వము స్నేహము. ఒకటి యన్నాదము, రెండవది యన్నము. ఒకటియగ్ని, రెండవది సోమము. అగ్ని యోని, సోమము రేతస్సు. రెంటిసమష్టి యజ్ఞము. ఈ యజ్ఞమే విశ్వమూలకారణము "సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా".

పదార్థతత్త్వము ఘన - తరళ - విరళ భేదముచే మూడు జాతులు గలది. మూలసంహితయందు వీనికి వరుసగ ధ్రువ - ధర్త్ర - ధరుణ శబ్దములు వాడబడినవి. ఇవి వరుసగ పార్థి - వాంతరీక్ష్య - ద్యులోకములకు జెందును. పార్థివ పాషాణాది ఘనపదార్థములు ధ్రువములు. ఆంతరీక్ష్య ఆపోవాయ్వాది తరళపదార్థములు ధర్త్రలు. దివ్యములగు ప్రాణాది విరళ పదార్థములు ధరుణములు. ఈ యన్నిటికి స్వరూపసంపాదకములగు తేజస్నేహ తత్త్వములు మూడు మూడు విధములుగానున్నవి. తేజమగ్ని. దీనికి మూడవస్థలు. 1. ధ్రువాగ్ని అగ్ని. 2. ధర్త్రాగ్ని యముడు. 3. ధరుణాగ్ని ఆదిత్యుడు అందురు. ఇట్లే స్నేహము సోమము. దీని మూడవస్థలు. 1. ధ్రువసోమ

మాపస్సు. 2. ధర్త్రసోమము వాయువు. 3. ధరుణసోమము సోమము అందురు. 1. అగ్ని యమాదిత్య సమష్టి తేజము. 2. ఆపోవాయు సోమసమష్టి స్నేహము. తేజమంగిరస్సు. స్నేహము భృగువు 'భృగూణా మంగిరసాం తపసాతప్యధ్వం' అనునట్లు ఈరెంటితేజస్సు (కర్మ- వ్యాపారము)చే యజ్ఞస్వరూప నిష్పత్తియగును. పిదప నీ భృగ్వంగిరోమయయజ్ఞమేవిశ్వసృష్టికి, (సంవత్సరరూప త్రైలోక్యసృష్టికి) అందలి ప్రజాసృష్టికి గారణ మగుచున్నది.

ఇట్లు కారణరూప తేజ స్నేహసూచన అహోరాత్రముల వలన లభించుచున్నది. అహస్సు తేజఃప్రధానము, రాత్రి స్నేహప్రధానము. ఒకదానియం దగ్నిసామ్రాజ్యము, రెండవ దానియందు సోమవ్యాప్తి. కనుకనే అహస్సాగ్నేయము, రాత్రి సౌమ్యము. సూర్యచంద్రాత్మకాహోరాత్రములే సృష్టి కారణములు. ఈ రెంటి యోగసంబంధము విడిపోవుటే వస్తుస్వరూపోత్క్రాంతి. జగత్తంతయు నహోరాత్రిరూపాగ్నిషోమ విజృంభణమే. 'అగ్నిషోమాత్మకం జగత్' ఈ వచనము లిట నవధేయములు.

1. అపాన్యదేత్యభ్యన్యదేతి విషురూపే అహనీసంచరేతే
పరిక్షితోస్తమో అన్యాగుహాకరద్యౌదుషాః శోశుచతారథేన.

2. కతరాపూర్వా కతరాపరాయోః కథాజాతే కవయఃకోవివేద
విశ్వంత్మనాబిభృతో యద్ధనామ వివర్తేతేఅహనీచక్రియేవ.

3. ఏతేహ వై సంవత్సరస్య చక్రే– యదహోరాత్రే 4. అహోరాత్రాణి ష్టకాః (సంవత్సరస్య) 5. సంవత్సరో వై ప్రజాపతిః 6. ప్రజాపతిస్త్వే వేదం సర్వ మసృజత యదిదంకించ 7. ద్వయంవాఇదం నతృతీయమస్తి శుష్కం చైవార్ద్రంచ, యచ్ఛుష్కం తదాగ్నేయం యదార్ద్రం తత్సౌమ్యమ్. 8. అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే॥

# 10. దైవవాదము

వెనుకటి 9 వాదములందును కారణములు రెంటికి మించి లేవు. కొన్నిట నొకటే. కాని, ఈ వాద మనేక కారణములకు జెందినది. విశ్వము - విశ్వప్రజ వీనియం దనేక విచిత్ర విషమ భావము లగపడుచుండ కారణములు రెండో యొకటో యన దగదు గదా! సూర్య చంద్ర పృథి వ్యాకాశ వాయు జల గ్రహోపగ్రహ నక్షత్రాదుల భిన్నతలను విచారించుచో నేమనుటకును నోరాడదు. ఎందు నొండొంటికి బోలికయే లేదు. ఇక విశ్వప్రజయందు మనుష్య, పశు, పక్షి, కృమి, కీట, యక్ష రాక్షస పిశాచ గంధర్వాది నానాత్వభేదము లటుంచినను, కేవలము మనుజులందు బ్రాహ్మణ క్షత్రియాది భేదములు, పశువులందు:— గవాశ్వాది భేదములు. పక్షులందు:— కాక గృధ్ర చటకాది భేదములు, ఇట్లన్నిట నెన్నో, యేమి చెప్ప గలము?

ఈ యన్నిటికి ఒకటి రెండు కారణము లనుట యప్రామాణి

కము. అట్లగుచో సృష్టియు నొకటిరెండు విధములుగనే యుండ వలయును. కనుక ఈ యసంఖ్య కార్యరూప సృష్టివిచిత్రతలం బట్టి కారణము లసంఖ్యములే యనవలయును. ఈ యసంఖ్య కారణసమష్టిని దేవత యందురు. ఈ దేవతలే సృష్టి మూల కారణములు.

పదార్థమునందుండి దాని స్వరూపమును సురక్షితముగా నుంచు శక్తిని ప్రాణ మందురు. ఇది శబ్దాదితన్మాత్ర మర్యాదా రహితము. అథానుచ్ఛదము (చోఁది నాక్రమింపనిది). ఇదే దేవత యనబడును. (ఇట నొక విషయము గమనింపదగినది) (విశేషములు అష్టవిధ దేవతానిరూపణమున జూడనగును. అది యన్యత్రవిస్పృష్టము) ఏమనః:– దేవ దేవతా శబ్దములు పర్యా యములు గావు. సురాసుర దైత్యదనుజ పితృ గంధర్వ పిశాచ పశ్వాదిజాతులం దేజాతి ప్రాణమైనను దేవతావాచక మగును. అనగా నది సంపూర్ణప్రాణ సంగ్రాహకము. దేవశబ్ద మన్ననో, ఆగ్నేయదేవత లగు 8 వసువులు, 11 రుద్రులు, 12 ఆది త్యులు, ప్రజాపతి వషట్కారములు అనువానికే వాచకము. (దేవతాశబ్ద మన్నిటికి బనికివచ్చును గాని, దేవశబ్దము మాత్ర మట్లుగాక స్వస్వభావ నియత సంబంధముగలది యనుకొన వలయును).

ఈ దేవతల సామాన్యజాతులు ఋషి- పితృ -దేవ - అసుర - గంధర్వ - పశు భేదములచే విభక్తములై యున్నవి. వీని కవాంతరములు క్రమముగ 7, 8, 33, 99, 27, 5 భేదములు

కలవు. ఇక ప్రత్యవాంతరభేదము లన్ననో అసంఖ్యములు. ఉదాహరణము:— దేవ నామ కాగ్నేయప్రాణము యొక్క 33 భేదములం దొకటి యగు రుద్రనామక ప్రాణమునకు సామాన్యముగ 11 భేదములు. ఇవియు పృథి వ్యంతరిక్ష ద్యులోక భేదముచే వేలకొలది భేదము లగును. 'అసంఖ్యాతా సహస్రాణి యే రుద్రా అధిభూమ్యాం' ఇట్లే అగ్ని వాయ్వింద్రా దీతర దేవతలును తమ మహిమాభావమున నసంఖ్యు లగుదురు.

ప్రాణముల యీయానంత్యము నెరింగియే యాజ్ఞవల్క్యుడు ఆధ్యాత్మిక ప్రాణగణనయందు ఒకచో 'కోహితద్వేద యావంత ఇమేఽన్తరాత్మన్ ప్రాణాః' అనెను. 'విరూపాస ఇదృషయస్త ఇద్గంభీరవేపసః' అను మంత్రము ఋషి ప్రాణ గంభీరతను సూచించుచున్నది. కనుక సృష్టి మూలకారణ మసంఖ్య ప్రాణ తత్త్వములే. కనుకనే విశ్వపదార్థానంత్యము సంగత మగు చున్నది. సృష్టి యనంతకార్యరూపము. తత్కారణములు ననంతములే. ఇట్లు విభిన్న ప్రాణాత్మకములగు నాయనంతకారణ ముల సముచ్చయమే 'దేవత' యందురు.

మన యింద్రియ మనోబుద్ధుల కేకార్యమునకైనను కారణ-కార్యభావ మెరుకపడకున్నపుడును, ఆకస్మిక సంఘటనలకును దైవముం బేర్కొనుచు, 'దైవాధీనము, దైవవశము' అను చుందుముగదా! అనగా దానియర్థము కారణములేని కార్య ముండుననియా? కాదు. కారణములేని కార్య ముండదుగదా! కాని ఆకారణమేమో మనకు దెలియలేదు. అపుడు 'దైవాత్'

అనుచుందుము. అనగా, ప్రకృతియందలి ప్రాణాత్మక దేవతా విశేషములవలననే యీపని జరిగినదని దాని తాత్పర్యము. ఈ దైవవాదమున నీ వచనము లనుసంధేయములు.

1. దేవానామిదం వోమహత్తదా వృణీమహేవయం, వృష్ణామ స్మభ్య మూతయే,
2. ఆనోభద్రాక్రతవో యంతువిశ్వతోఽ దబ్ధాసో అపరీతాసఉద్భిదః, దేవానోయథా సదమిద్వృధే అసన్నప్రాయువో రక్షితారోదివేదివే,
3. జాయమానో వై జాయతే సర్వాభ్యోఏతాభ్యో ఏవదేవతాభ్యః,
4. దేవేభ్యశ్చజగత్సర్వమ్॥

# 11. సంశయవాదము

(దశవాదమూలకము)

ఈ దశవాదములపై కొందరు తటస్థులగు సాధ్యవిద్వాంసుల నుండి యీ వాదము వెలసినది. వెనుకటి వాదములన్నియు తర్కయుక్తి ప్రమాణయుక్తములే. అన్నియు బాగుగనే యున్నవి. కాని, సత్యమెప్పుడు నొకటే యగునుగాని ఇన్ని సత్యములుండునా? ఈ వాదములవలన సత్యము (సృష్టిమూలము) సంశయగ్రస్తమైనది. "ఏకస్మిన్ధర్మిణి విరుద్ధ నానాకోట్యవగాహి జ్ఞానమ్ సంశయః"

"సృష్టియన్నది లక్ష్యము, దీనికారణము దీని పూర్వభావమునకు జెందినది. ఇందువలన నెవరెట్లు భావించినను, సరే

యనుటకంటె జేయదగిన దేమున్నది. ఔగాము లెల్లు నిర్ణీత ములగును? అంతటను సంశయమే సామ్రాజ్యము సేయుచున్న దనవలయును. స్వర్గనరక, అధ్యాత్మాధి భూతాధిదైవిక, శుభాశుభ, పుణ్యపాప, బంధముక్త్యాది సృష్టిపర్వములెల్లను సంశయాస్పదములే. బుద్ధివాదగర్వమున బడి, విశ్వకారణ మిద మిత్థమనుట యనధికారచేష్ట" అని యీవాద సారాంశము.

దీనినుండియే దర్శనసంప్రదాయమున, 'సప్తభంగీనయ' మను స్యాద్వాదము జన్మించియుండవచ్చును. ఈ వాదములవగు సప్త భంగులందు 3 వాదములు నిర్వచనభావమునకును 4 భంగులు (వాదములు) అనిర్వచనీయ భావమునకును జెందును. సులువుగ దెలియుటకై యీ యేడువాదముల నిట్లు వ్యవహరింప వచ్చును.

1. స్యాదస్తి - ఇతివక్తవ్యః=అనగా: మనకగపడు నీసృష్టికి మూలముండును. అది సద్రూపము, సత్యముగావచ్చును.

2. స్యాన్నాస్తి - ఇతివక్తవ్యః=దీనికి (సృష్టికి) మూలము లేదు. అసద్రూపము, మిథ్య, కల్పితము.

3. స్యాదస్తినాస్తి - ఇతివక్తవః=అసగా: ఇదియంతయు ఉండవచ్చును, లేకుండనువచ్చును. సద్రూపము గావచ్చును అస ద్రూపమును గావచ్చును, రెంటిమిళిత రూపమును గావచ్చును.

ఈ మూడు పర్వములందును సంశయపూర్వకముగ గారణ నిర్వచనము జరిగినది. ఇక జెప్పబోవు నాల్గువాదములకు ననిర్వచ నీయ భావ సంబంధముండును.

4. స్యాదవక్తవ్యః=దీనిని సత్ - అసత్ - సదసత్ - అనువానియం దేమనియు నిర్వచింపజాలము. అనిర్వచనీయము, అవక్తవ్యము అనిమాత్రమందుము.

5. స్యాదస్తిచావక్తవ్యః:- ఇదితప్పక సద్రూపమే అయినను, ఈ సద్భావ మనిర్వచనీయ మనదగును.

6. స్యాన్నాస్తిచావక్తవ్యః:- ఇది అసత్తే, కాని, ఆ యసద్భావ మనిర్వచనీయమే యగును.

7. స్యాదస్తినాస్తిచావక్తవ్యః - ఇది సదసద్రూపము, అయినను తద్భావ మనిర్వచనీయము.

ఈ వాదము లేడిటికి స్యాత్ సంబంధముండుటచే నివి మొత్తముగ స్యాద్వాదమందుము. దీనిని (సంశయమును) రెండు భాగములుగ నెంచవచ్చును. (1) నిశ్చయాత్మక సంశయవాదము (2) అనిశ్చయాత్మక సంశయవాదము. పై జెప్పినసప్తభంగీ నయలక్షణ సంశయవాదము నిశ్చయాత్మకము, కనుక నీ సంశయవాదము సంశయమర్యాదా బహిర్భూతమై "ఇటు సంభవము, అట్లు సంభవము - ఇటుగావచ్చును, అటుగా వచ్చును." అనుచు, నొకవిధముగ సంభావనాత్మక నిశ్చయ జ్ఞానమే అయియున్నది. ఆవాక్యముల తాత్పర్యమేమి? విశ్వమునకు మూలమున్నదినిజమే; 'కాని' యని మనయల్పజ్ఞత వలన నెరుకపడకున్నది. అనియేగదా! అట్టిచో సంభావనా రూప నిశ్చయముగల యీజ్ఞానము సంశయమనుటెట్లు? మూలమున్నది నిజము. దానిని మన మెరుంగజాలకున్నా" మను

టయే సంశయమర్యాదం గొట్టివేయు చున్నది. సంభావనాత్మక నిశ్చయముగూడ లేకున్నగదా! నిర్బాధము, నిర్బాధితము నగు సంశయవాదము? "అట్టి అనిశ్చయాత్మక సంశయవాదమే వాస్తవిక సంశయవాద మనబడును." అనికొందరు విద్వాంసుల మతము-వారిట్లందురు. "విశ్వమూలము నేవిధముగను విచారింపజాలము. సంభావింపనైన సమర్థులముగాము; ఆ విషయమున మనుజబుద్ధి కేమియు సంబంధము లేదు. విశ్వబీజము పరమాణువులనియు, ప్రత్యయమనియు, పరమేశ్వరుడనియు, నను నిత్యాదులెల్లను సందిగ్ధవిషయములు" ఈయనిశ్చయాత్మక సంశయవాదమును ఈవచనములు సమర్థించును.

1. నసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమాపరో యత్ । కిమావరీవః కుహ కస్య శర్మన్నంభః కిమాసీద్గహనం గభీరమ్ ॥

1. నతంవిదాథ యఇమాజజాన అన్యద్యుష్మాకమంతరంబభూవ
నీహారేణప్రావృతా జల్ప్యాచాసుతృప ఉక్థశాసశ్చరన్తి.

2. కోఅద్ధావేద కఇహప్రవోచత్ కుతఆజాతా కుతఇయంవిసృష్టిః
అర్వాగ్దేవావిసర్జనేఽనాథాః కోవేద యత ఆబభూవ.

3. ఇయంవిసృష్టి ర్యత్ఆబభూవ యదివాదధేయదివాన
యోఽస్యాధ్యక్షః పరమేవ్యోమన్ సోఽంగ వేదయదివా నవేద॥

4. నవిజానామి యదివేదమస్మి నిణ్యః.సన్నద్ధో మనసాచరామి,
యదామాఽగన్ ప్రథమజాఋతస్యా దిద్వాచోఅశ్నువే భాగమస్యాః॥

ఇంతటితో విశ్వమూల ఘటనమైనది. ఇక విశ్వతూల దశయు నింతే. దీనింగూర్చియు నిదమిత్థమని నిర్ణయించుట యసంభవము. పరోక్ష - ప్రత్యక్ష - మానస - ఆత్మ - సత్య

జ్ఞాన - జీవ - ఈశ్వర - ఉపాస్యదేవతాదులను సమర్థింపనై దార్శనికులు చెప్పు నట్టి ప్రమాణసాధనము లన్నియు నీ సంశయమర్యాదాగ్రస్తములే. దేనియందును తథ్యములేదు. ఇట్లన్నిటను విద్వాంసుల గతియే యిట్లుండ నిక సామాన్యుల మాట దడవబనియే లేదు. *సంశయవాదా శ్రయమే మేలు, కాదందురా? విచారణయే వదలుకొనుట మంచిది. నేటి కొందరు హేతువాదులు శాస్త్రసిద్ధాంతములను హేళన సేయుచు నాస్తిమూలసంశయవాదముం గాని శాస్త్రము - పరలోకము - ఆత్మ - పరమాత్మాదికము లన్నియు బూటకములు, ఇవి యన్నియు నట్టికల్పనలు, విద్వాంసులనువారి వ్యర్థకాలక్షేపములు - అనుట వినబడుచున్నది గదా!

ఇట్లు సంశయవాదము సాధ్యయుగమందు జనించినది. దేవయుగమునందు దీనిముఖమర్దనమయినది. దానిని రక్షించు కలిదేవుని సహాయోగమున నేడది మరల దలయెత్తి యాక్రమింప జూచుచున్నది. అది యేరంగస్థలమున సిద్ధాంతవాదము నెదుర్కొనునో జయలక్ష్మి దేనినివరించునో చూడవలసి యున్నది.

*జ్ఞానాల్పతవలన సంశయము జనించును. "సంశయాత్మా వినశ్యతి" అన్నట్లు సంశయమన్నది మృత్యువు నాహ్వానించుటయే. వైదికసాహిత్య ప్రచారము విరళమగుటచే నేటియాస్తికవర్గము గూడ తన స్వాభావికములగు, ఎందుకు; ఎట్లు; ఎప్పుడు; ఏమి; అను సంశయములకు సముచిత సమాధానముల నన్వేషించియు బడయజాలక సంశయానుగమనమే కావించుచున్నది.

# వాదచతుష్టయి

సృష్టికిజెందిన సాధ్యవాదములు పదునొకండింటికి బిమ్మట సిద్ధాంతవాదముజెప్పి బ్రహ్మకర్మములను విమర్శింప వలసి యున్నను, ఈప్రకరణమును ముందుబెట్టవలసివచ్చెను. ఏమన:— వెనుక సాధ్యుల సదసద్వాదమునందు, సదసచ్ఛబ్దములు భావా భావవాచకములనియు, దేవయుగమందలి యాస్తికుల సదస చ్ఛబ్దములు బ్రహ్మకర్మపరకములనియు జెప్పియుంటిమి. ఆస్తిక దృష్టింబట్టిన సదసద్వాదము నాధారముగగొని క్రమముగ 1. త్రిసత్యవాదము 2. ద్విసత్యవాదము 3. అసద్వాదము 4. సద్వాదము సను నాల్గువాదములు వెలసినవి. వీనికి క్రమ ముగ 1. బ్రహ్మకర్మఅభ్వవాదము 2. బ్రహ్మకర్మవాదము 3. కర్మవాదము 4. బ్రహ్మవాదము అను నాల్గువాదములతో సంబంధములుగలవు.

పరస్పరమత్యంత విరుద్ధములయ్యును, శ్రౌత ప్రమాణసంసి ద్ధములగు నీనాల్గువాదములును జివరకు సంశయవాదజనకము లే యగును. ఇందేది సిద్ధాంతము? అనుసంశయము గల్గించునుగాని, సిద్ధాంతపక్ష జిజ్ఞాసామూలస్తంభము లీనాల్గువాదములే; కనుక క్రమవిపర్యయముం బాటింపక ముందుగ వీని నుదహరింపవలసి వచ్చెను. ఒకేవిషయమును విభిన్నదార్శనిక దృష్టికోణము లచే విచారించుచో యోగ్యతానుసారముగ మనబుద్ధి తథ్యముం జేరగలదు. అందువలసనే యీబ్రహ్మకర్మపరీక్షా ప్రకరణమునం

దొకేవస్తుతత్త్వ మనేకదృష్టులచే విచారింపబడినది. ఈ విమర్శ విస్తరదోషపాత్రమయ్యు దార్శనికవిచారశైలింబట్టి ప్రామాణికము - మాన్యము - నుపాదేయము నగును.

ఇత్యుపక్రమః

# 1. త్రిసత్యవాదము

లేక

## బ్రహ్మ — కర్మ — అభ్వవాదము

సృష్టితత్త్వవాదవిషయమున గొందరు దార్శనికుల మతానుసారము బ్రహ్మ - కర్మ - అభ్వనామకములు మూడుతత్త్వములు. ఇందు, 1. బ్రహ్మ=జ్ఞానతత్త్వము, 2. కర్మ=క్రియాతత్త్వము, 3. అభ్వ=భాతితత్త్వము. జ్ఞానకర్మలు సత్తాసిద్ధపదార్థములు. అభ్వభాతిసిద్ధము, అపదార్థరూప పదార్థము. ఇటనొక గొప్ప విచిత్రమేమన:- సత్తాసిద్ధములు, వస్తుతత్త్వములు నను జ్ఞానకర్మలు మనకు ప్రత్యయములైననుగావు. ఈరెండును మనచర్మచక్షుర్గోచరములుకావు. కాని, అపదార్థరూపము, అభావరూపము నగు అభ్వయన్నది మనకనులకు గోచరించుచున్నది. ప్రత్యక్షమునకు విషయమగుచుండియు వాస్తవమున నేమియులేకుండు తత్త్వమే అభ్వయనబడును. 'అభూత్వాభాతి' 'నభవన్ భాతి' అని నిర్వచనములు. ఇది భూతము, దయ్యము, బూచివంటి తత్త్వము, కల్పితము.

కల్పితమగుబూచియన్న పిల్లలు బెదురునట్లు — ప్రత్యక్ష దృష్టము. కాని, నాస్తిరూప నామరూపాత్మక విశ్వరూపమగు నభ్వకు బాలబుద్ధులగు సంసారులు బెదరుదురు. విశ్వమంతయు బ్రహ్మయొక్క యీ నామరూపాత్మ కాభ్వపదార్థ భయసంత్రస్తమే. నామరూపములు రెండును బ్రహ్మయొక్క మహాయక్షులు, మహాభ్వలు, అని "తే హ్యై తే బ్రహ్మణో మహతీ అభ్వే మహతీయక్షే" (కేన) ఇత్యాదివాక్యము స్పష్టపరచును.

జనసామాన్యమునం దభ్వకు వాడుకసేయు పోలికశబ్దములను పైనుదహరించితిమి. యక్షశబ్దమున కించుమించుగ పోలు శబ్దములు ఆపద, గండము, దైవజ్ఞనిర్దిష్ట దురదృష్టము, అనిష్టము, దుశ్శకునము, ఇత్యాదు లూహింపవలయును. ఇది యొక యాకస్మికభావమును, అచింత్య భావమును సూచించును. దానిస్వరూపజ్ఞానమేమో యెరుకపడదు. కాని తదాగమనమున, లేదా ఆగమనాశంకచే భీతిల్లుదుము. అసావధానత వలన గాలుజారగనే యాత్మ హృత్ప్రతిష్ఠాచ్యుతమై భయత్రస్తమగునట్లు సత్తయు బ్రతిష్ఠయు లేని యీయభ్వతత్త్వాక్రమణముచే మనము నాత్మప్రతిష్ఠనుమరచి కంపితులమగుదుము.

శకునశాస్త్రజ్ఞులు మార్జాలమును అభ్వాక్రమణ సూచకముగ నెంచిరి. మనము పయనమై యరుగుచో బిల్లియెదురు వచ్చెనా? అటుబోవద్దని జగన్నియంత సూచించుచున్నాడని యెంచవలయును. భయభావ ప్రవర్తకము కేవలమభ్వయే.

సరియే:— ఇంతకు జెప్పదలచినది:- విశ్వతత్త్వానుగత వాద

విషయమున మనము సత్తాసిద్ధ బ్రహ్మకర్మలు, భాతిసిద్ధమగు అభ్వ, యను మూడుపదార్థముల నంగీకరింపవలయు ననియే. త్రితత్త్వవాదము సంగీకరింపక యిక నేవిధమునను, బ్రహ్మకర్మమయ సృష్టిసమన్వయము గావింపజాలము. బ్రహ్మయన్నది శుద్ధజ్ఞాన స్వరూపము. కర్మయన్నది విశుద్ధక్రియాస్వరూపము. జ్ఞానకర్మ సమన్వితరూపము విశ్వము. విశ్వస్వరూపము కర్మ ప్రధానము. కర్మరూపము క్రియాత్మకము. అయినను, 'తత్తు సమన్వయాత్' అన్నట్లు కర్మతో బ్రహ్మ కూడకున్నచో కేవల కర్తృత్వము సృష్టివ్యాపారమునకు జాలదు. సంసృష్టియే సృష్టి - బ్రహ్మయొక విధమగు శాంతధరాతలము. ఇందు గర్మప్రవేశింపగనే క్షోభయుదయించును. ఈ కర్మజనిత క్షోభనుండియే సృష్టిధారావికాసము కల్గును.

సరియే: జ్ఞానమూర్తిబ్రహ్మ చేతనమయ్యు నసంగము, నిష్క్రియము. క్రియామూర్తికర్మ జడము. తసంతిదానన్యముతో గలియజాలదు. ఇక వీని సమన్వయమెట్లు? ఎవరు కల్గింతురు? కనుక మూడవపదార్థ ముండవలయును. రెండుశాగితముల నంటింపవలయుచో విజాతీయమగు జిగురువలె ఈబ్రహ్మకర్మల కంటె విజాతీయము, విలక్షణము, అంచిత్యము, ప్రత్యేకసత్త లేనిది మరొక పదార్థమేది? అదే అభ్వనామాలంకృతము. ఇదే బ్రహ్మకర్మల సమన్వయించి సమన్వయమూల సృష్టికి మూలప్రవర్తకమగును. ఇట్లు సృష్టితత్త్వవాదము బ్రహ్మ - కర్మ - అభ్వ యను మూడుభాగము లగును.

బ్రహ్మకర్మలను సత్తాసిద్ధము లంటిమి. విశ్వమందలి ప్రతి పదార్థమును జ్ఞానగర్భిత క్రియారూపము, క్రియాసమష్టి గుణము. గుణసమూహము ద్రవ్యము 'గుణకూటో ద్రవ్యమ్'. పృథివీ జల వాయు సూర్యచంద్రగ్రహ నక్షత్రౌషధి వనస్పతి మనుష్య పశు పక్షి క్రిమి కీటాదులెల్ల జ్ఞానగర్భిత కర్మమయములు. వేలు, లక్షలు అసంఖ్యగుణము లా పదార్థముల నారంభకములు. ఒక మాత్రమున్నంగొనుడు. అది యసంఖ్యగుణముల గుట్ట. ప్రతిగుణమునందు ననంతక్రియలు. సర్వానుభూత క్రియాతత్త్వమే కర్మ. ఆగాలవృద్ధులందరు, అన్నియు పదార్థ రూపమున ననేకకర్మల జేయుటరూపమున కర్మతత్త్వము నెరుంగుదురు.

బ్రహ్మరూపజ్ఞానమునకు నిదేదశ. పిల్లవాడుగూడ ఇది నాకు నచ్చదు, వలదు, అదికావలయును. వాడు తండ్రి, వీడు మామ, ఇది గుఱ్ఱము కుక్క అను మొదలుగ జ్ఞానాభినయము గావించుచుండును. ఇట్లు జ్ఞానక్రియారూప బ్రహ్మకర్మల రెంటి స్వరూపములును అనుభవ దృష్టిచే స్ఫుటముగనే యున్నవి. ఇక మూడవదగు నభ్వ. ఇది యీ రెంటికంటె సర్వథావిలక్షణముగ కన్పట్టును గాని, యుపన్నముగాదు. సత్తగలది కానందున దీనికి గార్య కారణభావము లేదు. కనుకనే అపదార్థము. కాని పదార్థరూపమున భాసిల్లును. ఇందు కైంద్రజాలికుని పనులను జ్ఞప్తికి దెచ్చుకోవలయును. రాతిముక్కను పావు

రముగ - ఆముదమును సుగంధతైలముగ - ఊకను పంచదారగ జూపున దీయభ్వయే.

అహోరాత్రములను జూడుడు. అహస్సు సత్తాసిద్ధము. తదభావము రాత్రి. సూర్యప్రకాశము లేనిది. అది సత్తాసిద్ధము కాదు. ఇందుకు ప్రమాణ మేమున దాని కేకార్యకారణ భావమును లేదు. వెలుగురుసక్తి లేపాదు లావశ్యకములు. చీకటి కేకారణాపేక్షయు లేదు. సూర్యాభావము కారణ మున్నచో, ఆయభావము నాస్తిరూపము. అభావము మరొకదానికి కారణము కాగలదా? కనుక రాత్రి యున్నది సత్తాసిద్ధము కాదని తేలినది. అది యపదార్థము. అయినను తత్ప్రతీతి కల్గుచున్నది. అహస్సుతో దానిం దుల్యముగ జేసి యేకవాక్యప్రయోగము గావింపబడుచున్నది. ఇట్లు సర్వథా నాస్తిరూపమగు రాత్రికి అస్తిలక్షణముగల యహస్సుతో సమన్వయించి ప్రతీతికి విషయముగ జేయు తత్త్వ మేదియో అదే విలక్షణము, అచింత్యమునగు అభ్వ.

ఇంకను: దూరము - దగ్గర; క్రింది - మీదు; ఎక్కువ - తక్కువ; మొదలగు వ్యవహారములు - ఒకటి రెండు మూడు అను సంఖ్యలు - తులము, పలము మొదలగు తూకములు - తూర్పు, పడమర మొదలగు దిక్కులు - ఇత్యాదులెల్ల భాతిసిద్ధ పదార్థములు. అపదార్థములు. ఇవి యన్నియు నభ్వకృపాఫలములు. ఇంతకును వాస్తవ మేమనగా:—

బ్రహ్మ - కర్మ - అభ్వ లను వానివలన పదార్థవాదము

1. సత్తాసిద్ధము 2. ఉభయసిద్ధము 3. భాతిసిద్ధము అను మూడు భాగము లగుచున్నది. విశుద్ధబ్రహ్మ ఆత్మ. బ్రహ్మ గర్భిత కర్మ విశ్వము. పైనజెప్పిన దిగ్దేశకాలాదులు అభ్వ. జీవాత్మ - పరమాత్మ - ఆత్మసంబంధులగు స్వర్గాదిలోకము లన్నియు కేవలము సత్తాసిద్ధములు. అయినను చర్మచక్షుర్గోచరములు కావు. సూర్యచంద్ర పృథివ్యాది సమష్టిరూప విశ్వముభయసిద్ధము. దీనికి సత్త యున్నది. ప్రతీతియు నున్నది. దిగ్దేశకాలాదులు కేవలము భాతిసిద్ధములు. వీనికి సత్త లేదు. ప్రతీతిమాత్రమే. ఇదే మూడవదగు అభ్వతత్త్వము. దీని స్వరూపము నామరూపములపై నాధారపడి యున్నది. లేదా, నామరూప సమష్టియే అభ్వ.

నామరూపాత్మకమగు నీ యభ్వవలననే బ్రహ్మకర్మయందు, లేదా కర్మ బ్రహ్మయందు సమన్వితమైనది. జ్ఞానమూర్తియగు బ్రహ్మను కర్మమయ విశ్వబద్ధము గావించినవి నామరూపములే. వీనికి మించి విశ్వమం దగపడున దేమున్నది? బ్రహ్మ - కర్మ రూపమగు నాభూబ్రహ్మ యీ తుచ్ఛమగు నభ్వచే నావృతమై తన ఆభూ (ఆ - సమంతాత్ - భవతి - భాతి - వా - సర్వ వ్యాపక) భావముం బోగొట్టుకొనుచున్నది. 'తుచ్ఛేనాభ్వపిహితంయదాసీత్' నాస్తిరూపమున, అభావరూపమున నుండుటయే యీ నామరూపాత్మకాభ్వ తుచ్ఛత. వాస్తవముగ బదార్థతత్త్వము బ్రహ్మకర్మమయమగు ఆభూ. కాని సామ్రాజ్యమో, తుచ్ఛమగు నభ్వది. ఇట నీశ్రౌతవచన మవధేయము:-

"అథ బ్రహ్మైవ పరార్ధ్యమగచ్ఛత్ తత్పరార్ధ్యంగత్వా-ఐక్షత కథంను ఇమాన్ లోకాన్ ప్రత్యవేయం ఇతి, తద్ద్వాభ్యామేవ ప్రత్యవైత్ - రూపేణచైవ-నామ్నాచ సయస్యకస్యచ నామాస్తి తన్నామ యస్య 'ఉ' అపి నామనాస్తి-యద్వేద రూపేణ ఇదంరూప మితి-తద్రూపం ఏతావద్వా ఇదం యావద్రూపశ్చ నామచ తే హైతే బ్రహ్మణో మహతీ అభ్వే మహతీయక్షే ఇతి"-(శత)

ఇతి త్రిసత్యవాదః

## 2. ద్విసత్యవాదః

కొందరు తత్త్వములు బ్రహ్మ-కర్మలు రెండే యనియు, వానిసముచ్చయముననైన అభ్వయను వేరొకతత్త్వ మావశ్యకము కాదనియు నందురు. ఎట్లన:— అభ్వయన్న దొకవిధముగ మాయాబలమే. ఇక కర్మయన్న దాని స్వరూపమును బలమే గదా! బలతత్త్వమున కనేక (16) జాతులున్నవి. కర్మయొక బలము, అభ్వయొకబలము. నామరూపములు నొకవిధముగ కర్మయే. ఇట్టిచో కర్మవిశేషాత్మక, నామరూపమయ, మాయా రూపమగు నభ్వను స్వతంత్రతత్త్వముగా నెన్నక, యది కర్మ తత్త్వాంతర్భూత మనుటయే సరి.

కర్మను క్రియయందురు. ఈక్రియారూపతత్త్వమునకు 1 ప్రవృత్తి 2. నివృత్తి 3. స్తంభనము అను మూడవస్థలు, క్రియయొక్క అగ్రవ్యాపారము ప్రవృత్తి ఇదే గతి — గమనము. పృష్ఠవ్యాపారము నివృత్తి. ఇదే ఆగతి. (ఆగమనము) ఈరెంటిసమన్విత

రూపము స్తంభనము. ముందుకుసాగుట ప్రవృత్తి, వెనుకకు దొలగుట నివృత్తి. రెండు నొక (హృదయ) బిందు సమన్వితములగుట స్తంభనము. గతి ప్రవృత్తి, ఆగతి నివృత్తి, రెంటి సమిష్టి స్తంభనము ఇదే స్థితి. ఇట్లు గతిలక్షణముగల యొకే క్రియకు లేదా కర్మకు, గతి (పరాఙ్గతి) ఆగతి (అర్వాఙ్గతి) స్థితి (గతి+ఆగతిసముచ్చయ) భేదములచే మూడు రూపములు. ఒకటి యుపక్రమము(గతి), ఒకటి (ఆగతి) యుపసంహారము మధ్యావస్థ స్తంభనము ఏవస్తువునందైన ప్రవేశించుట, అందుండి వెడలి పోవుట, అందే స్తంభించియుండుట యను మూడును క్రియా రూపకర్మకు స్వాభావికధర్మములు— ఇందువలన సృష్ట్యుత్పత్తి కాలమందు కర్మతత్త్వము బ్రహ్మయందు ప్రవిష్టమగును. స్థితి కాలమునందు అందే స్థమముగనుండును. ప్రళయదశయందు అందుండి వెడలిపోవును. ఇట్లు బ్రహ్మకు కర్మతో లేదా కర్మకు బ్రహ్మతో సమన్వయముగూర్చుట— వేరగుట, స్థమముగాపించుట యను మూడు వ్యాపారములను కర్మ తన యుదరమందుంచుకొన్నది. ఇట్టిచో సమన్వయమునకై మూడవతత్త్వము నంగీకరింపనేల? అది కర్మప్రాతిస్విక ధర్మములలోనిదే.

బ్రహ్మవలె కర్మ యసంగముకాదు. రెండును పట్టి కాగితములు కావు. ఒకటి యసంగమగుటసరియే. రెండవది స్వయముగ జిగురే. అసంగముతో సంశ్లిష్టమగుటయే దానిధర్మము. బ్రహ్మయసంగము, కర్మసర్వాభాససంగము, సిసృక్షచే గర్మ పవృత్తిరూపమును ధరించి సృష్టిప్రవృత్తి కారణమగును. ముము

క్షుచే నాకర్మయే నివృత్తిరూపధారణగావించి సృష్టినివృత్తి కారణమగును. స్తంభవృత్తినాశ్రయించి యదే స్థితికారణము నగును. ఇట్లు కర్మయే ఉత్పత్తి స్థితి నాశకారణము. కనుక, బ్రహ్మ–కర్మల యథార్థ స్వరూపము నెరుంగనివారు మూడవ తత్త్వమభ్యుపగమనుదాని సంగీకరించుట కేమియు విలువలేదు.

బ్రహ్మతత్త్వము రసప్రధానము. సంఖ్యచే నొకటి. దిగ్దేశకాలానవచ్ఛిన్నము, అసీమము, అఖండము, నిరవయవము. బలప్రధాన కర్మతత్త్వ మింతకన్న పక్షముల విపరీతము. నిత్యశుద్ధము క్షోభగమే కర్మ బ్రహ్మ సమన్వయము గావించును. ఒకే యాత్మకు రసబలములు రెండుపర్వములు. రసము బ్రహ్మ, బలముకర్మ. బలగర్భితరసము జ్ఞానము. ఇదే బ్రహ్మ. రసగర్భితబలము క్రియ. ఇదేకర్మ.

విశ్వమందలి జడచేతనములగు నెల్లపదార్థములందు నీ రసబలము లను నాత్మరూపములున్నవి. ప్రధానతా ప్రధానతల వలన భేదములుండుగాక, ఏపదార్థమునందు ఆత్మయొక్క రసపర్వము ప్రధానమో, అది చేతనమనియు, నేపదార్థమునందు, బలపర్వముప్రధానమో అది అచేతనమనియు వ్యవహారము. రసజాగ్రత బలసుప్తి యున్నచో చేతనము. బలజాగ్రత రససుప్తి యున్నచో నచేతనము.

కొన్ని కారణములవలన రసప్రబోధనకాగా, జడపదార్థము చేతనమగును. ఇట్లే కారణవిశేషములచే బలవృద్ధివలన చేతనము జడము నగును. ఒకపుల్లముక్కను నీటియందు వైచినచో

కాలాంతరముననది చైతన్యరూప కీటాణుపరిణతి నందును. ఇదే చేతన బ్రహ్మ సాక్షాత్కారము. ఇదే బ్రహ్మ. ఇట్లే యున్మాదాది కారణములచే మనుజుడు జడమగును. ఇదే బలబ్రహ్మ సాక్షాత్కారము. ఇదేకర్మ.

అంతేనరకేల? మనుజుని జాగ్రదవస్థ బ్రహ్మభావము (చేతన). సుషుప్త్యవస్థ కర్మభావము (జడత). నిద్రయందు బలసామ్రాజ్యము చేతనాభిభూతి. జాగృతియందు చేతనా (రస) సామ్రాజ్యము బలాభిభూతి. ఈ రస – బలవైషమ్యమేల? సమాధాన మా యవస్థాత్రయయుక్త కర్మభావమే.

విశ్వమందంతటను సమష్టి – వ్యష్టిరూపమున – బ్రహ్మ – కర్మ లను నీరెండుతత్త్వములే వ్యాప్తములగుచున్నవి. ఎప్పుడు బ్రహ్మతత్త్వ మాత్మసంస్థయందు బ్రవేశించునో అపుడు, ఆత్మ యొక్క రసభాగము వికసితమగును; ఇట్లే కర్మప్రవేశముచే బల భాగము ప్రధానమగును. ప్రాతఃకాలమందు ప్రకృతిమండల మందు బ్రహ్మతత్త్వసామ్రాజ్య ముండును. గనుక నక్కాల మును బ్రాహ్మముహూర్త మందురు. ఇంతకును:- బ్రహ్మ - కర్మ లను రెండుతత్త్వములే ప్రధానములు. మాయాబలాత్మకము కనుకనే పరిచ్ఛిన్నలక్షణము, మృత్యుభావాత్మకము నగు నభ్వబలమునకు గర్మయందే యంతర్భావము. ఇదే ద్విసత్య, వాదము.

ఇతి ద్విసత్యవాదః

*

# 3. అసద్వాదము

(కర్మ వాదము)

శుద్ధతర్కవాదులగు దార్శనికులం దొకవర్గము కేవల మేకత్వ వాదపక్షపాతి. తదీయాభిప్రాయ మేమన:- "విశ్వమంతయును కర్మస్వరూపమగు నసత్తత్త్వ సామ్రాజ్యమే. సత్తనబడు బ్రహ్మతత్త్వము నిందే యంతర్భూతము; (ద్వసత్యవాద అభ్వ, కర్మాంతర్భూత మన్నట్లే యిచటను, బ్రహ్మయు కర్మాంతర్భూత మనవలయును.) జ్ఞానమో (బ్రహ్మ) క్రియయో (కర్మ) నామరూపములో (అభ్వయో) 'ఉన్న' దని చెప్పదగినదెల్ల కర్మయే. దానికిగల ప్రవృత్తి - నివృత్తి - స్తంభనముల వలననే యది బ్రహ్మ - కర్మ - అభ్వ లను మూడు భావములం బరిణత మగుచున్నది. అదే ప్రవృత్తిదశయందు సమన్వయకారణమై అభ్వయు, నివృత్తిదశయందు సమన్వయ విచ్యుతికారణమై కర్మయు, స్తంభనదశయందు స్థితిభావపరిణతి నొందిన బ్రహ్మయు నాబడును. ఇక దానికంటె వేరుగ బ్రహ్మయు లేదు. అభ్వయు లేదు."

కర్మయే బల మనబడును. బలతత్త్వమే శ్రమ (పరిశ్రమ) కధిష్ఠాత. దానికి బల-ప్రాణ-క్రియ లను మూడు రూపములు. సుప్తావస్థయం దయ్యది బలము. కుర్వద్రూపావస్థయం దాబలమే ప్రాణము. నిర్గచ్ఛదవస్థయం దాప్రాణమే క్రియ. కదలుపకున్న

చేతియందలి శక్తి బలము. కదలుట కర్మ. ఇదే ప్రాణావస్థ. పనిచేసి అలయును. అనగా, ప్రాణాత్మకబలము చేతినుండి వెడలి పోవుట. ఇదే క్రియ. సుప్తావస్థరూప కర్మ (బల) మే, బ్రహ్మ. జాగ్రదవస్థారూపకర్మ (ప్రాణ) మే అభ్వ. నిర్గచ్ఛదవస్థారూప కర్మ (క్రియ) యే కర్మ.

బలము శ్రమకుజెందిన దంటిమి. శ్రమానుయాయు లీ దార్శ నికులు; కనుక శ్రమణకు లనబడుదురు. వీరు బ్రాహ్మణ ప్రతి ద్వంద్వులని బ్రాహ్మణవాదమూలక సద్వాదమందు దెలియ గలదు. మనకు ప్రస్తుతము శ్రమణకమతవిచారణ గదా! వారిమత మిది.

అనిత్యము, అసత్తు నగు కర్మకంటె వేరుగ బ్రహ్మ యను (జ్ఞానమను) నిత్యపదార్థ మేదియు లేదు. అసల్లక్షణ కర్మతత్త్వ జనితము జగత్తు. "కారణగుణాః కార్యగుణా నారభన్తే." కనుక కార్యరూప జగత్తు అసత్తే - ఇదియంతయు కర్మమయమే. ఎటుజూచినను కర్మప్రసారమే. చూచుట, వినుట, చదువుట, కదలుట, తిరుగుట ఇట్లెన్నియని? వృక్షములెదుగును, కద లును, పశువులుమేయును, అరచును, పక్షులెగురును, కూయును, సూర్యుడు వెలుగును, చంద్రుడు సోమము వర్షించును, నక్షత్ర ములు ప్రకాశించును, సముద్రము కల్లోలము సేయును, జలము ప్రవహించును, న్యాయమూర్తి నిర్ణయించును - అనేక కర్మా గారములు, వివిధకర్మలు, ఓ! అంతటను ప్రత్యక్షము కర్మ సామ్రాజ్యము. జ్ఞానమనుదాని నెవడైనచూచెనా? అదియు

నొక కర్మవిశేషమే. 'గచ్ఛతి' 'పశ్యతి' కర్మమైనట్లే 'జానామి' యు కర్మయే. అట్టిచో జ్ఞానమును దానిని వేరుగ గల్పించుట యేటి తెలివి?

వెనుక జెప్పిన సాధ్యుల యసద్వాదముంబట్టి ప్రత్యక్షదృష్ట పరివర్తనమును, మా యీ యసద్వాద సమర్థకమే. ప్రతి పదార్థమును క్షణక్షణము నపూర్వ పరివర్తన మొందుచున్నది గదా, అట్టి యీ సంసరణశీల జగన్మూలము నసత్తే యనవల యును. నష్టస్వభావముగల మృత్తునుండి గలిగినఘటము వినాశి గదా? అట్లే వినాశి యగు జగన్మూలమును వినాశియగు నసత్తే. సామాన్యులు స్థూలపరివర్తనములను గుర్తింతురుగాని సూక్ష్మాతి సూక్ష్మ పరివర్తనములను గుర్తింపజాలరు. అందువలన నవి సత్పదార్థము లనుకొనరాదు. వేయేల? నిబిడావయవము, అశ్మ సోమమయము నగు పర్వతముగూడ ప్రతిక్షణము పరివర్తన మొందుచున్నది. మన యాయువు దాని యాయువుకంటె పరిమితమగుటచే దానిపరివర్తనము గుర్తింపజాలము. కనుక స్థిరమనుకొందుము. కాని, అసత్కారణతావాదమే దృఢతమ ప్రమాణము.

పూర్వపక్షము:— అన్నియు క్షణికములు, అసత్తులు, పరి వర్తనశీలములు, వినాశులు నగుచో విశ్వ-విశ్వాంతర్గత పదా ర్థములందు దేని ప్రతీతియు మనకు గలుగరాదు. పూర్వక్షణస్థిత తత్త్వమును కుత్తరక్షణమున నభావమగుచో అదే ప్రపంచము ఆ దేవదత్తుడే యను అస్తిమూల కాపరివర్తనీయ వ్యవహార

మెట్లు? కనుక క్షణికక్రియకైన నేకో యాధార ముండవల
యును. అది సత్తు, నిత్యము, అవినాశి, అపరివర్తనశీలము
ననవలయును. అదే బ్రాహ్మణుల బ్రహ్మతత్త్వము సద్బ్ర
హ్మయే అసత్కార్యప్రతిష్ఠ. ప్రతివస్తువునకు జెందియుండు అస్తి
భానము నపలపింపజాలము. క్షణికక్రియ నాస్తిసారయు అస్తి
మర్యాదకు వెలియైనదియు నైనను, 'ఉన్నది' యను ప్రతీతి
యాపామర విద్వజ్జనము, ఆబాలవృద్ధము సమానము. కనుక
నసత్తుకంటె నింకొక సద్బ్రహ్మతత్త్వము నంగీకరింపక తప్పదు.
అసత్కార్య పరిపంథిత్వమైనను సత్తత్త్వము అస్తిరూప ప్రత్య
యమునుం గల్గించుచున్నది.

సమాధానము:- ఇంతమాత్రమునకీ గోడవయేల? కర్మ
యన్నది బలమనియు నది దిగ్దేశకాలములచే నాదియు సాం
తము నయ్యు సంఖ్యయం దనంతమనియు జెప్పియుంటిమి.
పదార్థముల వైవిధ్య వైచిత్ర్యములే బలానంత్యానుమాప
కములు. అది యొకటేయగుచో విశ్వపదార్థములందిన్ని వైచి
త్ర్యము లెక్కడ? ప్రతిపదార్థమునకు ననేకజాతులు. ప్రతిజాతి
యందు ననేకవ్యక్తులు, ప్రతివ్యక్తియందు ననేకావయవములు,
ప్రతి యవయవమునందు ననేకపరమాణువులు. దేని సంఘట
నము దానిదే. కనుక నీసర్వకారణబలము ననేకమనవలయును.
సత్కార్యవాది (బ్రహ్మవాది) యు నీ బలసంఖ్యానంత్యము
నంగీకరించెను. ఎట్లనః-

ఈ కారణరూపములగు నసంఖ్యబలముల జాతులు పదు

నారనియు, వీనిని బలకోశములందుమనియు వైజ్ఞానికులు వచింతురు. ఈకోశములందొకటి ధారాబలము, ప్రతిక్షణపరివర్తిత క్షణబల సమష్టి ప్రతీతిం గల్గించుటయే దీనిపని. క్షణబలనామక బలవిశేషము ప్రతిక్షణమును మారుచున్నను, విలీనమగుచున్నను దీని కాధారముగ ధారాబల నామకమగు నన్యబల మట్లేయుండును; ఇదే సంతానబలము. దీనివలననే (బలరూపమగుట నిదియుక్షణికమే) అస్తిప్రతీతి కల్గుచున్నది. "ఇదియేమి? స్వయముగ నసత్తు నాస్తిరూపము నగునది, తన సజాతీయ నాస్తిరూప క్షణబలమును అస్తిరూపముగ దోప జేయునా?" అన్నచో సందుగొందులపాడి తానుస్వయముగా మలినమయ్యు నీటియందలి మలినతం దొలగించి తానును తొలగుచున్నది. విషమునకు విషమువిరుగు డగుచున్నది గదా! ఇట్లే ధారాబలము స్వయం క్షణికమయ్యు క్షణబలము నస్తిరూపమున జూపజాలును. ఇట్టియెడ అసత్కర్మకు వేరుగా నొక సద్బ్రహ్మాత్మ కల్పన యనావశ్యకము.

పూర్వపక్షము:— 'తినుచున్నాను, నిద్రింతును' అను క్రియాపదములతో నేను అన్న అహంభావమొకటి యనువర్తించుచు అసద్రూప కర్మకంటె వేరుగా నుండుచున్నది. ఇది సత్తు:— అహం అనుదాని కర్మలు మారును గాని అయ్యాదిమాత్రము స్థిరముగ దర్పణమువలె మార్పులేక అట్లే యుండుచున్నది గదా! ఇట్లు లోకసిద్ధ వ్యవహారాధారముననే సత్తు సిద్ధించుచున్నది.

సమాధానము:- వాస్తవమే. అహం, కర్మ, ఇవి భిన్న వస్తువులే. ఘటశరావములు అభిన్నములని యెవడనును? కాని వీనిభిన్నత విజాతీయముకాదు. సజాతీయము. రెండును మృణ్మయములు. కాని దేని స్వరూపము దానిదే. ఇక: కర్మ-అహం భావములకు నిదేస్థితి. ఈరెండును కర్మలే. కాని వాని స్వరూపములు భిన్నములు. బలానంత్యము సర్వ పూర్వపక్షములను నిరర్థకములను గావింపజాలును. ఒక బలమును కర్మ యందురు. మరొక విశేషబలసృష్టిని జ్ఞానము, లేక 'అహం' అందురు. అదియు నొకవిధమగు కర్మయే. ధారాబలము వలన నది స్థిరముగ దోచుచున్నది. ప్రపంచమంతయు జలధర పటలమట్లు దృష్టనష్టము. మఱియు, మీరు కర్మకంటె వేరను కొను జ్ఞానమును కర్మయే యనుటకు 'జానామి' అను క్రియాపదమే సాక్షి. కనుక జ్ఞానమును క్రియావిశేషమే యందుము.

ఈ క్రియాతత్త్వమునకు 1. కృతి 2. వ్యాపారము 3. భావము 4. కర్మ యను నాలుగవస్థలు. (i) యత్నము - చేష్ట యన బడుచు శరీరములోపల నగు ప్రాణ వ్యాపారము కృతి. ఇది చర్మచక్షుర్గోచరము కాదు. (ii) దీని కవ్యవహితోత్తరకాలమందె బహిర్వ్యాపారము కల్గును. ఇదే వ్యాపారావస్థ. (iii) ఇయ్యది క్షణబలాక్రాంత మగుటచే క్షణికము. గుణమయి, ధారాబలముచే సముచ్చయరూప పరిణతినొందించి భావరూప మొందును. వ్యాపారము క్షణికక్రియ, తత్కూటము భావము. గమనమ్, పఠనమ్, శయనమ్ ఇత్యాదులు

భావాత్మక క్రియలు. ఈ వాక్యపదీయ వచన మిట నను సంధేయము.

"గుణభూతైరవయవైః సమూహః క్రమజన్మనామ్
బుద్ధ్యా ప్రకల్పితాభేదః క్రియేతి వ్యపదిశ్యతే"

భావాత్మక క్రియానంతరము (iv) కర్మవిశేషాత్మకము, ఆత్మ శబ్దవాచ్యము నగు అహంధరాతలమున నొకవిధమగు సంస్కార ముత్పన్నమగును. ప్రతియొక భావాత్మకక్రియయు, ఆత్మయందు దప్పక యొక సంస్కారము నుత్పన్నము గావించి వైచును. ఆ సంస్కారమే కర్మ. దీని బలముననే కృతి యుదయించును. దానినుండి వ్యాపారము, దానినుండి భావము, దానినుండి మరల కర్మ యుదయించును. ఇది చక్రభ్రమణము వంటిది. ఇట నింకొక విషయము జ్ఞప్తియందుంచదగినది. ఏమన:— ధారా బలాత్మక జ్ఞానరూప కర్మనుండి భావనాత్మక జ్ఞానసంస్కారము, క్షణబలాత్మక కర్మరూప కర్మనుండి వాసనాత్మక కర్మసంస్కార మును ఉదయించును. మొదటిది అనుభవాహితము. రెండవది చరణాహితము. రెండును కర్మజన్యములే. కనుక సంచితము లగు నీరెండును కర్మలే యందుము. ఇట్లు ఒకే క్రియాతత్త్వము బలతత్త్వ తారతమ్యముచే కృతి - వ్యాపార - భావ - కర్మరూప ధారణ గావించుకొనుచున్నది.

ఇందు మూడవదగు భావావస్థయే జ్ఞానరూప కర్మవిశేషము నకు స్థిరతం గూర్చునది. క్రియాసమష్టియే 'అహం' అను

నిప్రతిష్ఠితభావమును, లేదా స్థిరభావమును కలిగించును. క్రియ యొక్క ఈ క్రమజన్య సంబంధి ధారావాహిక ప్రవాహము వలననే స్థిరతాప్రతీతి కలుగగా, క్షణబలముకంటె వేరగు నీ కల్పితస్థిరతం జెప్పుటకే మన 'మహం' అనుపేరు వాడుచున్నాము. వచ్చితిని, చూచితిని అను మొదలగు ప్రావాహిక గతియందున్నను విచ్ఛేదప్రతీతి లేకున్నది. ఇదే స్థిరతాప్రతీతి మూలహేతువు. దీపజ్వాలం జూడుము. ప్రతిక్షణమును తైలము ప్రకాశరూప పరిణామ మగుచు వత్తినుండి వెలువడుచున్నది. క్రిందినుండి ప్రతిక్షణమును తైలము వచ్చుచున్నది. ఈ తైలాగమన నిర్గమ సంతాన ధారాప్రవాహమే జ్వాల. కాని, చిత్రము! క్షణభావసంబంధము కలదయ్యు నీజ్వాల యేకరూపముగనే యగపడుచున్నది. ఈ స్థిరతాప్రతీతి కేకమాత్ర కారణము క్రియాసంతానమే.

తైలగమనాగమన రూప క్రియా సంతానోచ్ఛిత్తిచే దీప నిర్వాణ మేర్పడునట్లు కర్మ సంతానాత్యంతికోచ్ఛేదముచే నా కర్మరూప జ్ఞానాత్మకు ముక్తి కల్గును. కర్మపుద్గలోచ్ఛేదమే ముక్తి. కదళీస్తంభము, పలాండువు ఇత్యాదులను ఒలిచిన గొలదియు జివరకు నేమియు మిగులనట్లు దీపజ్వాల నెటు బరీక్షించినను, జ్వాలయేగాని మఱేమియు లభింపదు. ప్రకాశ ధారామాత్రమున దీపము దీపమను పేరొందినది. త్వక్సమూహ మరటి, యుల్లి యనబడునట్లే యిచటను ఎరుంగవలయును. కనుక కర్మసమష్టియే అహం లేదా ఆత్మయని ప్రసిద్ధినొందినది.

పాంచభౌతిక శరీరమందలి అస్థిమాంసాది భిన్న భిన్న కర్మ పుద్గలములట్లు 'అహం' కూడ నొక కర్మ విశేషపుద్గలమే. శరీరాంతర్భూతమే. అంతకంటె వేరుగ నిత్యము, అవినాశి, జీవాత్మ యనబడు సత్పదార్థ మేదియు లేదు.

ఈ యసత్కార్య తనంత తానే జనిత్వగనై -నిలచియుండి - చివరకు లీనమైపోవును. (వ్రేలు తనంత తాను కదలును; రెప్ప విడిపడగనే కన్నుదానంతనది చూచును; చెవి తనంత తాను వినును; అట్లే అసత్కార్యమియు దనంత తాను, ఆకస్మికముగ సృష్టి రూపమునొంది తనంతదానే ప్రతిష్ఠితముగనుండి, తనంతదానే లీనమగును. ఇవే సృష్టిస్థితిలయములు; వాస్తవముగ:— ప్రతి క్షణవిలక్షణమగు నీకర్మ క్షణికము: కనుక శూన్యము; కనుక స్వలక్షణము; కనుక దుఃఖరూపము. అందువలన నిది దుఃఖ సాగరమనియే యెంచబడును.

అసత్కార్యయొక్క ఆద్యంత క్షణము లసత్తులై మధ్య క్షణము సత్తువలెదోచినను తన్మధ్యన్యాయముచే నదియునసత్తే. ఉపక్రమోపసంహారముల యవ్యక్తతే యాధారముగ నున్న మధ్యవ్యక్తతయు, నవ్యక్తమే కనుక శూన్యం శూన్యం అనుట కంటె వేరేమందుము? విషయాభావమున, రిక్తముగ నుండు నపూర్ణ 'ఖమ్' దుష్టఖమ్: (ఖమ్ - ఆకాశము - ఇంద్రియము) దుఃఖము. క్షణికభావమునకు బూర్తియు శాంతియు నెక్కడ? అక్షోభ గదా శాంతిమూలము? క్షణికత్వమందు క్షోభ - కంపనము, భయము, దుఃఖము, 'అశాంతస్యకుతస్సుఖమ్'

కనుక 'దుఃఖమ్ దుఃఖమ్'. అనవరత కర్మచక్రాక్రమిత కర్మ మయాహంభావమునకు (ఆత్మకు) శాంతియు సుఖము నెక్కడ? నోటియం దనవరతజలధార పడుచున్నచో నూపిరాడునుగదా!

విశ్వమంతయు స్వలక్షణము; దానివంటి దదే గాని యిట్టి దట్టిదని పోలికజూప ననువుగానిది. కారణము? క్షణికమగు క్రియ యన్యక్రియతో బోల్పనగునా యేమి? మరియు క్రియాంశమ్మయు బరస్పర భిన్నములు, ఉత్తరక్రియతో బూర్వక్రియం బోల్పబోవు నంతలో నది విలీనమైపోవును. ఇక పోలిక యెట్లు? క్రియాలక్షణము క్రియయే; కనుక 'స్వలక్షణమ్, స్వలక్షణమ్'- ఇట్టిచో, న[illegible]ంటె నిక నీశ్వరుడు లేడు, జీవుడు లేడు, జ్ఞానమును లేదు. అంతట నసద్వాద సామ్రాజ్యమే. 'అసదేవేదమగ్ర ఆసీత్' 'తమ ఆసీత్తమసా గూఢమగ్రే' 'నైవేహకించ నాగ్రఆసీత్' అనువచనము లీ వాదమును సమర్థించును.

వైదికపూర్వ సాధ్యయుగమందలి యసద్వాదము నాధారముగగొనియే పిమ్మట మహాభారతోత్తర కాలీనమగు, ప్రాచీన యుగమున లేదా సంప్రదాయయుగమున నాస్తికమతము వికసిల్లెను. ఈమతప్రచార శ్రేయము విశేషించి శాక్యసింహునకు దక్కెను. ఈయన కపిలవస్తునివాసి, తండ్రి శుద్ధోదనుడు, తల్లి మాయ, ఈయనపుత్రుడు రాహులుడు. శాక్యసింహుడు స్వభావముచే పరమదయాళువు; ఈతని జీవిత పూర్వావస్థ యందు చిత్తప్రచలనముగావించు కరుణాపూర్ణ ఘటనల నెన్నిటినో యీయన యెదుర్కొనవలసివచ్చెను; అందువలన రాజ్య

వైభవాది మోహములను, పత్నీపుత్రాదులను త్యజించి వైరాగ్యముం గొని శాస్త్రాధ్యయనముగావించినను, అతని స్వాంతాత్మ శాంతినొందదయ్యె. అప్పుడతడా యధ్యయనమునెడ గూడ విరక్తుడై శాంతికై తపము సేయ నెంచి (యానాడు) గిరివ్రజమను పర్వతమున కరిగి, మును లాదేశించినవిధమున తపోనుష్ఠానము నారంభించెను. నాటినుండి యతడు శాక్యముని యయ్యెను.

జ్ఞానము మూలముగా గొనక కేవల వైరాగ్యానుయాయియగు నాయునకు కాయకష్టానుష్ఠానమునను శాంతి లభింపక పోగా, చివరకు నిర్మనియోగ విడచి సూక్ష్మేత్రమున నొక వృక్షచ్ఛాయంజేరి ధ్యానమగ్నుడై కూర్చుండెను. అం దతనికి "ప్రపంచము మిథ్య. సత్త్వనదగిన దందేమియు లేదు. వేదపురాణ ధర్మశాస్త్రాదులందు ప్రతిపాదింపబడిన ఆత్మ - పరమాత్మ - స్వర్గ - నరకాదు లన్నియు కేవల కల్పితములు" అని తట్టినది. అంతటితో నతనికి సంతుష్టి కల్గెను. వెంటనే యతని నోటినుండి 'బుద్ధమ్ - బుద్ధమ్' (తెలిసినది - తెలిసినది) అను వచనము వెలువడెను. నాటినుండియు శాక్యముని 'బుద్ధు' డయ్యెను. ఏ చెట్టుక్రింద కూర్చుండి యతడీ యసద్వాదోద్గారములను వెలువర్చెనో ఆ వృక్షమే 'బోధివృక్షము' అనబరగెను. ఈ బుద్ధ మతమునకే పిదప మాధ్యమిక - యోగాచార - సౌత్రాంతిక - వైభాషికము లను నాల్గు శాఖలు వెలసెను. కానిండు. మన ప్రస్తుతము బుద్ధమత మీమాంస కాదు.

ఇంతకును జెప్పదలచినది:— సాధ్యకాలీ నాసద్వాదాధారము ననే పిదప నాస్తిసారమగు నీ యసద్వాదము వెలసెననియే. ఈ వాదులు కర్మవాదముం బ్రధానముగ నెంచి బ్రహ్మసత్త్వం దిరస్కరించిరి. నేడుగూడ నార్యప్రజల నిదే యుత్పథగాముల గావించుచున్నది.

ఇతి యసద్వాదః.

# 4. సద్వాదః - బ్రహ్మవాదము

ఇది పై వాదమును సహింపని బ్రాహ్మణుల మతము వీ రిట్లందురు:— కర్మ యను నసత్తత్త్వమేదియు లేదు. అంత టను గేవల జ్ఞానమూర్తి బ్రహ్మసామ్రాజ్యమే, ఆబ్రహ్మతత్త్వము సత్తు - అపరిణామి. లేదా అవికృతపరిణామి, అవినాశి, అను చ్ఛిత్తి ధర్మము గలది. అదే విశ్వమూలము. తద్వివర్తమే విశ్వము. బ్రహ్మ - విశ్వము రెండు అన నావశ్యకము లేదు. బ్రహ్మకే నామాంతరము విశ్వము. జగత్తసత్తనుచో ప్రత్యక్షమే కాదు. ప్రత్యక్షము నపలపించుటెట్లు?

నాస్తికు లీవిప్రతిపత్తిం దొలగించుకొనుటకు ధారాబలము నాశ్రయించి, కతక రజోదృష్టాంతము నెదుట బెట్టిరి. ఇట నీ రెండును వ్యర్థములు. ప్రశ్న సత్తాప్రతీతికి జెందినది గాని, మాలిన్యము దొలగించుటకు జెందినదికాదు. కతకరజము మలిన మయ్యు మాలిన్యముం దొలగింపగలదు. ధారాబలము మాలి

న్యముం బో గొట్టజాలదన్నచో నీదృష్టాంతము పనికివచ్చెడిది. ధారాబలము క్షణికము. అది యస్తి ప్రత్యయసాధకము గాజాలదు. గ్రుడ్డివాడు గ్రుడ్డివానికి దారి జూపజాలునా? ఇంతకును:— క్షణిక బలముతో ధారాశబ్దముం దగిలించుటెట్లు? పూర్వక్షణస్థిత బల ముత్తరక్షణమున నభావ మగుచో నిక ధార యన్న వస్తువేది? ఎడ - తెంపులు లేకున్నగదా ధారా సంబంధము? కేవలము ధారాబల మన్నంతనే పని జరుగునా? కనుక ప్రత్యక్షసిద్ధ సత్తా ప్రతీతింబట్టి తప్పక యసత్తుకంటె వేరుగ సత్తత్త్వము సంగీకరించి తీరవలయును. ఇక:— సత్తు సంగీకరించిన పిదప నసత్తు సంగీకరింప బనియు లేదు. కారణము? సద్వాదమే అన్నివిరోధములను పరిహరించును.

కర్మకుగూడ నీ జ్ఞానలక్షణ సద్బ్రహ్మయందె యంతర్భావము; సత్పురి జ్ఞానమున్నది; నడచుజ్ఞానమున్నది. జ్ఞానముకంటె వేరేమున్నది? అంతట నున్నది కర్మకాదు. జ్ఞానము; 'అయం ఘటః,' 'అయంపటః' అనుటయు జ్ఞానమే, అహంకరోమీత్యాదికమును జ్ఞానమే. ఉన్నదంతయు నా జ్ఞానమే; లేనిదియు నా జ్ఞానమే: సూర్యచంద్రాదులు, క్రిమికీటాదులు, జ్ఞేయ పదార్థములెల్ల జ్ఞానమూర్తులే. దృశ్యమాన ప్రపంచమంతయు జ్ఞాన చిత్రము, అనగా, బ్రహ్మ - ఆత్మ - అహం, అన్నదే. ఇది యంతయు అహంభావాత్మక జ్ఞానమే జ్ఞేయ రూపమున ప్రతీత మగుచున్నది.

కొంతతడవు సర్వప్రపంచము 'జ్ఞాత - జ్ఞానము - జ్ఞేయము'

అను మూడుభాగము లనుకొందము, ఉదాహరణముగ - ఘట ప్రత్యయముంగొనుడు, దాని స్వరూపము 'ఘటమహంజానామి'. ఇందు అహం=జ్ఞాత; ఘటమ్=జ్ఞేయము; జానామి=జ్ఞానము - మొత్తము ఘటజ్ఞానము. ప్రతియొక జ్ఞానమునందు నీ మూడుభాగములు నిత్యముగ నుండవలయును; దార్శనికు లీ మూటిని ప్రమాత (జ్ఞాత) ప్రమేయము; (జ్ఞేయము) ప్రమితి (జ్ఞానము) అందురు. ఇందు మూలతత్త్వము ప్రమాత. అహంభావమే సల్లక్షణబ్రహ్మ; ఆత్మ, ప్రమాత, జ్ఞాత. విశ్వము ప్రమేయము. విశ్వజ్ఞానము ప్రమితి. సూక్ష్మముగ జూచినచో ప్రమాతయే ప్రమితియు, ప్రమితియే ప్రమేయము నగును. జ్ఞాతయొక్క జ్ఞాతృత్వము సిద్ధమేగదా! ఇక దక్కిన రెండును బరమార్థముగ జ్ఞాతయే. ఈ యభేదస్థాపనయే మా యీ వాదరక్షణ.

మొదట ప్రమాతంగొనుడు; ప్రమితియన జ్ఞానముగదా, అది వికాసస్వరూపము, కన్నుదెఱువగనే ఆత్మజ్యోతియందు జగమంతయు భాసితమగును; ఆత్మజ్యోతియేజ్ఞానము; హృదయమందలి జ్ఞానకందళమే జ్ఞాత, బింబము. దానినుండి నలుగడల వెడలు రశ్మితతే జ్ఞానము, కలికయే వికాసమున బుష్పమగు గదా! జ్ఞానప్రకాశమండల ప్రతిష్ఠితము జ్ఞేయ ప్రపంచము. విజ్ఞాన సిద్ధాంతముంబట్టి తేజోమండలమునకు - రశ్మిమండలమునకు ఏదో యొక కేంద్రముండితీరును - అందుండియే రశ్ములు నెడలి మండలరూపము నొందును; ఉక్థములేని యర్కయుండదు; ఉక్థవికాసమే అర్క. జ్ఞాన మర్కయన్నచో జ్ఞాత

యుక్తము. నాభిగత జ్యోతిఃపుంజ మాత్మ, జ్ఞాత. పరిధిగత జ్యోతిఃపుంజము జ్ఞానము.

జ్యోతి యాగ్నేయ పదార్థము; అగ్నిస్వభావముగ నంతర్బహిర్భేదముచే రెండు పృష్ఠములుగ నగును; హృదయస్థోక్త మంతఃపృష్ఠము; సంస్థానమండలము బహిః పృష్ఠము, అగ్నిశబ్ద మిట జ్యోతిర్మాత్రోపలక్షణము, సూర్యపిండ మంతఃపృష్ఠ మగు కొన్నచో రశ్మిమండలము బహిఃపృష్ఠము. అది యాత్మ; యిది జ్ఞానము. నామమాత్రమున రెండు: వాస్తవముగ నొకటే. ఇట్లు జ్ఞాత - జ్ఞానము లొకటే.

ఇక మిగిలినది జ్ఞేయజగత్తు. నాస్తిక వివాదము దీనిపైనే. జ్ఞానఫలకము నందు భాసిల్లు ఘటపటాది పదార్థములు, జ్ఞానము వలన నైనవా? లేక విజాతీయములా? ఈ ప్రశ్న నెదుట బెట్టుకొని జ్ఞేయజగద్విచారణ చేయవలయును.

జ్ఞానమాధారము, జ్ఞేయమాధేయము, ఉదాహరణము:— (i) బల్లపై పుస్తకము, బల్ల యాధారము పుస్తకమాధేయము; ఈ రెంటికి, దేని సత్త దానిదే. ఒకదానికి నష్టికలిగిన రెండవ దానికే నష్టియులేదు: ఇదే యొకవిధమగు భిన్నసత్తాత్మక కార్యకారణభావము. జ్ఞానజ్ఞేయముల యాధారాధేయ సంబంధ మిట్లే యనదగునా?

తగదు!— ఏలయన:— జ్ఞానజ్ఞేయముల కుపాదాన లక్షణ కార్యకారణభావ మున్నది. పుస్తకము—బల్ల — యనుటలో నిమిత్తలక్షణ కార్యకారణభావ మున్నది. (ii) పితాపుత్రులు;

ఇట పితృతంశభూత శుక్రమే పుత్రుని కుపాదాన కారణము. ఇందును, ఎవరి సత్త వారిదే; ఒకనికి హానియగుచో రెండవ వాని కేహానియులేదు:—ప్రస్తుత జ్ఞానజ్ఞేయముల సంబంధము నందు నిదేస్థితి యనవచ్చునా?

కాదు:— తండ్రివలె జ్ఞాన ముపాదానము; కొడుకువలె జ్ఞేయము కార్యము. అనుట సరియే కాని, ఈ రెంటను భిన్న సత్తాత్మక కార్యకారణభావము అంగీకారముకాదు. మఱి యెట్లన్నచో:— ఒకటిహానినొందిన రెండవదికూడ హానినొంద వలయు, సట్టి యుపాదాన కార్యకారణ భావము వెదుకవల యును; తంతువులు-వస్త్రము - మట్టి - కుండ; సువర్ణము కటక కుండలాదులు; ఇందుకు బనికివచ్చును. ఇవి యభిన్న సత్తాత్మక ములు; ఇవియే యిట ననుసంధేయములు.

జగత్తత్త్వ మంత- ర్బాహ్య భేదమున రెండుభాగము లన వచ్చును. ఈశ్వరీయాధి దైవికజగత్తు బహిర్జగత్తు. మన యాధ్యాత్మికజగ త్తంతర్జగత్. అది యీశ్వరునిజ్ఞేయము. ఇది మనజ్ఞేయము. అతడు వ్యాపకజ్ఞానమూర్తి. మనమతని యంశలము. అతడు దానికిని మనముదీనికి నుపాదానములు. మనకగపడునది మన జ్ఞాననిర్మితము. మన జ్ఞానధరాతలమున దదాకారాకారిత ప్రతీతమగు జ్ఞేయము మన జ్ఞానజనితము. మనదృశ్య (జ్ఞేయ) కర్తలము మనము (మనజ్ఞానము) ఈశ్వరీయ జగత్తును మనమెన్నడు జూడజాలము. మనజ్ఞానజనిత సూర్య చంద్రాదులను మనము చూడగలము. అన్యుని యంతర్జగత్తునే

మనమరయలేము; ఇక నీశ్వరీ యాంతర్జగత్తు మాట చెప్ప వలయునా?

మన జ్ఞేయము మనజ్ఞానముయొక్క యాకార విశేష మాత్రము. ప్రతీతవిషయము జ్ఞానాకారమే, జ్ఞానరూపమే, జ్ఞానమే. ఇట్టిచో జ్ఞేయము జ్ఞానభిన్న మనుటెట్లు? మృద్ఘటము మృద్భిన్నముగ దోచునట్లు జ్ఞాననిర్మిత జ్ఞేయజగత్తుజ్ఞానభిన్న ముగ దోచును. కాని మృత్తునకు ఘటనమునకువలెనే జ్ఞానజ్ఞేయ ములకును భేదములేదు. జ్ఞానాతిరక్తముగ జ్ఞేయఘటమున కిక యాకారమేమి?

ప్రత్యయము (జ్ఞానము) 1. అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము 2. అంతఃకరణవృత్త్యవచ్ఛిన్న చైతన్యము, 3. విషయావచ్ఛిన్న చైతన్యము నను త్రిపుటితో సంబంధము గలది. ఈ వ్యావ హారిక త్రిపుటీ భానకారణముచే జ్ఞానజ్ఞేయములకు బార్థక్య మున్నట్లు గోచరించును. విజ్ఞానదృష్టి కివియన్నియు జ్ఞానము నందే యంతర్భావము లగును. 'జ్ఞానము - జ్ఞేయము కంటె వేరుగ దోచుచున్నది' అనుటలో ప్రతీతియు జ్ఞానమే. ఇది కర్మ, ఇదియసత్తు అన్నది ప్రతీతి, అదిజ్ఞానము. ఇక జ్ఞాన లక్షణ బ్రహ్మయొక్క అద్వితీయత నపలపించుటెట్లు? అది పూర్ణము కనుక శూన్యంశూన్యం అనరాదు. పూర్ణం పూర్ణం అనవలయును. అంతటను జ్ఞానమూర్తి బ్రహ్మవాద సామ్రాజ్యమే.

"ప్రపంచము, జ్ఞానమపరివర్తనీయము, శాశ్వతము, ఏక

రసము నగుచో ప్రత్యక్షానుభూత ప్రతిక్షణ పరివర్తనముల నే మనవలయు" ననుచో కా దనము. ఈ యుపలబ్ధియంతయు జ్ఞానమే యందుము. ఉదాహరణముగ స్వప్నముం జూడుడు. అందు మీ జ్ఞానమే జ్ఞాన - జ్ఞేయ జ్ఞాతలుగ కర్తృకరణ కర్మలుగ నై యున్నదిగదా! ఇట్టిచో నీభేదవాదము మిథ్య, కాల్పనికము నన్నట్లే - జాగ్రజ్జగత్తునందు నెంచదగును. వివర్తము లెల్ల జ్ఞానకల్పనా మాత్రములే. జ్ఞానఘన బ్రహ్మకంటె వేరొ మియు లేదు.

పోనిండు వాదముకొరకు కొంతసేపు నాస్తికవాద మొప్పి కొన్నను, క్రియ క్షణిక పరివర్తనశీల మన్నను, ఈపరివర్తనము నకొకయపరివర్తనీ యాధారము లేదన్నచో సర్వథా యనుపపన్నము. శరీరమున్నగదా! పర్వపరివర్తనము! వస్త్రమున్నగదా! రంగుమారుట? పృథివి యున్నగదా! గతి? ముఖమున్నగదా! మ్రింగుట? ఇట్లు క్షణికక్రియతో నొక యక్షణరూపాస్తిభావము (ప్రతిష్ఠాభావము) గూడియుండును.

"కర్మ యసత్తు - జడము. తనంతదాను పుట్టి లీనమగు" ననుచో:— రాత్రనిద్రింతుము. ఉదయమున మేల్కాందుము గదా! జాగృతిక్రియ సుప్తియందు లీనముకాగా ప్రాతర్నియత సమయమున మేల్కాల్పిన దెవరు? 'తనంత తానె కర్గా' నందురా? కారణము లేనికర్మ యేదియు నుండదు. ఉన్న దన్నను, ఉండున దట్లే యుండవలయును. పోవున దట్లే పోవలయును. అందు నియతి యెట్లు?

నిరాధారముగ గర్మయుత్పన్నమగు ననుటకు దృష్టాంతము కలదా? అకర్మ నాధారముగాగొనియే కర్మ యుపపన్నము కాగలదు. ధారాబలనిస్సారత మొదటనే ప్రత్యుత్తరించితిమి. ఇట్లు యుక్తి, తర్క, నుభవ, విజ్ఞాన - శాస్త్ర విరుద్ధమగు నసద్వాదము నిలువజాలదు.

మరియు, అసద్వాదము నాశ్రయించువారుగూడ సద్వాద మునే యాశ్రయించినట్లు తోచును. ఎట్లనః- అసత్తుకంటె వేరేమియులేదనుటలో నసత్సత్త సంగీకరించినట్లు లేదా? 'అస దస్తి' అనుటలో అస్తియన సద్వాదముకాదా? 'ఏమియులేదు' అనుచో, ఈసిద్ధాంతము 'నేమియులేదు' కాదా? అప్పుడుదాని యర్థము సద్వాదముకాదా? అంతేయు నసత్తు అగుచో మీ అసత్తమాత్ర మసత్తుకాకుండునా? అప్పుడది సద్రూపమే కనుక ఎట్లయినను సద్బ్రహ్మను శరణముగా గొననిచో విముక్తిలేదు. 'బ్రహ్మైవేదంసర్వం' 'సర్వంఖల్విదంబ్రహ్మ'.

ఇతి సద్వాదః

# 12. సిద్ధాంతవాదము

ఇంతవరకుజెప్పబడిన నాల్గువాదములునువస్తుతః ఒకదృష్టితో దైవయుగ పూర్వములనిచెప్పి, అర్వాచీనములందుము. దైవ యుగమందలి వైదికసిద్ధాంతవాద వాస్తవిక తాత్పర్యము నెరుంగమిచే నర్వాచీనవ్యాఖ్యాతలు వేదవచనముల కస్తవ్య

స్వార్థ ములంజేసి ద్విసత్యాది వాదములను సృష్టించి వైచిరి. వీని కంతవిలువ నీయము. సిద్ధాంతవాదము వీనినిస్సారత నెరుక పరచును.

వెనుకటి నాల్గువాదములందు ద్విసత్యవాదము బ్రహ్మకర్మ వాదమంటిమి. మాసిద్ధాంతవాదమును బ్రహ్మ - కర్మ రూపమే. ఈనామసామ్యముచే నీరెంటి సిద్ధాంతములందును సందేహము దయింప వచ్చును; అందుకొరకు, ముందుగ నీరెంటిభేదములను దెలియవలయును. ఈరెండును సర్వథా పృథగ్భావములు కలవి. బ్రహ్మ - కర్మ - యను రెండుసత్యము లంగీకరించుట ద్విసత్యవాదమని తన్నామమే తెలుపును. ఇక సిద్ధాంతవాద మన్ననో, బ్రహ్మ - కర్మలు రెండును భాతులుగ నెంచియు, సత్తైక్యముచే నేకసత్యానుగామియై సర్వశ్రేష్ఠమైయున్నది. ఈ భేదముం గుర్తించి సిద్ధాంతవాదమును విచారణ సేయ వలయును.

వాదచతుష్టయియందలి సదసల్లక్షణ బ్రహ్మకర్మ పదార్థ ములుసాధ్యసమ్మతములగు సదసత్తత్త్వములకంటె వేరుస్వరూప ములు కలవయ్యును సంశయవాదమునకే కారణములగుటచే వీనింగూడ ఖండనీయవాదకోటిం జేర్చినచో మొత్త మీనాల్గు వాదములును సాధ్యసమ్మత 'సదసద్వాద' మందే యంత ర్భావము లనవచ్చును. చివరకు (10) సాధ్యవాదములు, (1) సం శయవాదము (1) సిద్ధాంతవాదము, మొత్తము 12 వాదము లగును.

నిశితతర్కయుక్తి ప్రతిభాశాలురగు సాధ్య విద్వాంసులు స్థాపించిన దశవాదములకు సమాధానము లీయలేక యానాటి వారు, ఈనాటి బుద్ధివాదుల యూపాతరమణీయ తర్కజాలము నుత్తరింపజాలక (సంశయాత్మా వినశ్యతి) సంశయమ్మృత్యువు వంక కగ్రేసరులగుచున్న నేటి యాస్తికప్రజలట్లే తత్ప్రవాహమున బడి కొట్టుకొనిపో మొదలిడిరి. కాని శాస్త్రీయ సత్య సిద్ధాంతఖండనములందు స్వేచ్ఛావాదులగు నేటిబాలబుద్ధుల తర్కముల కానాటితర్కములయెదుట నిసుమంతయు విలువ లేదని, జ్ఞప్తియందుంచుకొనవలయును. ఏమన:- ఆస్తికప్రజా సౌభాగ్యముచే నేటివారికి జాలవరకు సంస్కృతభాషాపరిచయములేనందునను, వైదికవాఙ్మయ పరిచయములేనందునను, ఆపటిమ యిందులేదు. సాధ్యులతర్కజాలము యుక్తిసంగతము, భౌతికసృష్టియందు ప్రత్యక్షానుభూతము. నేటివారి తర్కాభాసములన్ననో, 'సర్వజ్ఞానవిమూఢాన్ స్తాన్ విద్ధినష్టా నచేతసః' అనునుపాధికి యోగ్యములన్న జాలును.

సాధ్యులు చెప్పినంత చేసిచూప శక్తిగలవారు. అనీశ్వర వాదులగు వారుగావించు ప్రత్యక్ష చమత్కారముల కానాటి యాస్తికులు చకితులై వారివాదములను ఖండింపజాలరైరి. మానవబుద్ధిబలము నిర్బలముకాగా, ధర్మవృషభము సంత్రస్తమయ్యెను; ఏకేశ్వరవాదము తమసావృతమయ్యెను; విశుద్ధ భౌతికవిజ్ఞాన సామ్రాజ్యమేర్పడెను. ఈక్షోభచే ప్రకృతి యెంతయో క్షోభనొంది తన సహయోగియగు పురుషుని క్షుబ్ధుని

గావించెను. అతడు ధర్మగ్లాని నుపశమింపజేయునై తననిశ్వాస భూత, నిత్యవేదమూలక సిద్ధాంతవాదమును స్థాపింప, మానవ శరీరమున భూమిపై నవతరించెను. ఆ దివ్యావతారమే 'స్వయం భూబ్రహ్మ' అతడు, సర్వవిద్యాప్రతిష్ఠారూప - సిద్ధాంతలక్షణ బ్రహ్మవిద్యను, తనజ్యేష్ఠపుత్రుడగు 'నథర్వు'న కొసంగెను. ఈ యైతిహాసికఘటనను ధార్మికు లిట్లు వినిపించుచున్నారు.

"బ్రహ్మ దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్యకర్తా భువనస్యగోప్తా
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠాం అథర్వాయ జ్యేష్ఠపుత్రాయప్రాహ
(ముండక)

సాధ్యవిద్వాంసు లా యొకసత్తను స్వీకరించినచో వారు పది కాదు ఎన్ని వాదములు వాదించినను మాన్యములయ్యెడివి. "సృష్టిగర్భమునం దనేక కార్య - కారణభావము లున్నవి." అను నీ విజ్ఞానానుమోదిత సిద్ధాంతము నెవరు కాదందురు? నిజముగా సాధ్యులు 'వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్' అను కింవదంతిని జరితార్థముగావించిరి. వారు, సమాధానము కుదుర్చబోయినది 'సృష్టి మూలకారణమేమి?' అను ప్రశ్నకు. ఉన్నది సృష్టిసీమకులోపలనే. దానికి పైకి బోయి కారణాన్వేషణగావించుచో వారిప్రమాదమునకు లోను గారు. చివరకు సాధ్యుల, సృష్టిమూల కారణతా వాదము లన్నియు, విలువలేనివై నవి. పైగా "ఇన్ని సత్యములుండవు. మనమేమియు నిర్ణయింపజాల" మను సంశయవాదముగూడ వెలసినది. ఒకసత్తనంగీకరించుచో నీవాదములన్నియు సృష్టి

భేదమూలక దృష్టికోణభేదముచే జక్కగా సమన్వితములై పోవును.

స్వాయంభువు అట్టియేకత్వసిద్ధాంతమునే, సిద్ధాంతపక్షముగ జూపుచు, సాధ్యుల దశవాదముల నామూలచూడములుగ ఖండించి 12 వ దగు సిద్ధాంతవాదమును స్థాపించెను, మరియు:-

"సృష్టికి పూర్వము మూలకారణములనుకొన్న సదసదహో రాత్రాదులం దేదియులేదు. పరము, శాశ్వతము, రస - బల మూర్తి (విశ్వమందు బ్రహ్మకర్మమూర్తి) యగు నాయొక తత్త్వమే యుండెను. అదే మాయాబలమున, బిదప షోడశ కలమై క్రమముగ, మాయా, షోడశీ, సగుణ, యజ్ఞ, అంజన రూప పంచప్రాజాపత్యసంస్థలుగ బరిణతమగుచు, నారవదగు తన యావరణపరిగ్రహముచే విశ్వరూపమునొందెను. ఈ విశ్వ మూర్తి యం దాసాధ్యుల యా దశకార్యరూప కారణములును వికసిల్లెను. ఇదియెరుంగక వారు తమకార్యరూప కారణములనే విశ్వ మూలకారణము లనుకొని ప్రమాదమునకు లోనైరి." అని స్పష్టపరచెను.

సరియే. సృష్టిమూలముంగూర్చి సాధ్యులుచెప్పిన తత్త్వ వాదములన్నియు, యథాసంభవముగ, యథావసరముగ నా యాసృష్టివిశేషములకు గారణములే యగును. కార్యకారణ భావ మొకేవిధముగా దన్నదియు సత్యమే. కాని యీ విశృంఖలకారణవాదము పైననే విశ్రమింపనగునా? స్వాయముగ

దశసంఖ్యయే తనకు భిన్నము మహాలంబనము నగు నొక మహా కారణమును సూచించుచున్నది.

మరియు:— సాంఖ్యుల దశకారణములును సృష్టిమర్యాద లోనివే, సృష్టిరూపములే, యగు కార్యరూపములు వారు అనుమానమర్యాద యను వంకతో కార్యముల ద్వారా కారణముల ననుమానించి యీ అనుమేయభావములచే కారణము లనుకొనిరి. గాని వస్తుతః వారి యీ యనుమేయ కారణము లెల్లను, కార్యరూపసృష్టికే పర్యాయవిశేషములు. దేనికి పది భేదములు? ఇదియొక జటిలప్రశ్న. దశయన్నది సాపేక్షసంఖ్య. భాతిసిద్ధ పదార్థము. వాస్తవముగ సంఖ్యయన్నదొకటే. ఒకటే సంఖ్య తన విస్తారప్రస్తారముల జివరకు పరమపరార్థ్య సంఖ్య వరకు బోవును. ఒకటి యున్నదే లేనిచో 2, 3, 4 మొదలగు వాని కుపపత్తియేది? అది యున్న నెన్నైనగావచ్చును. లేనిచో నంతయు విడంబనామాత్రము. సాంఖ్యులు సృష్టికారణములు పదియే యనుకొనిరి. గాని, వేదశాస్త్ర మసంఖ్యకారణముల నంగీకరింపుచు 'పరాస్యశక్తి ర్వివిధైవశ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ' అని యుద్ఘోషించెను.

సృష్టికర్తను ప్రజాపతియందురు. సృష్టిగర్భమం దనంతప్రజా పతు లున్నారు. వాయు, ఇంద్ర - అగ్ని - వరుణ, రుద్రా దులందరు ప్రజాపతులుగ జెప్పబడిరి. కాని వేదశాస్త్రమునకు జెందిన యీ యనేక కారణతావాదము లేదా, అనంతకారణతా వాద మన్నది సర్వకారణమూర్ధన్యము, పరపరాణాం పరమ

లక్షణము నగు నొకానొక కారణము నాధారముగా గొనియే ప్రతిష్ఠితమై యున్నది.

ఒకటి నానాత్వము నెట్లుపొందెను? అను ప్రశ్నకుత్తరము విస్తారసాపేక్షముగు సృష్టివిద్యకు జెందినది. అయ్యది ఈశా వాస్యశిష్టానాకులందు విస్తరింపబడుటచే ప్రకృతముకాదని దానిని విడచి ఇచట ఏకత్వమూలక సిద్ధాంతవాదమును సమర్థించు కొన్నివచనము లుద్ధరించి తర్కదృష్టితో నా వాద సమాలోచనమును మాత్రము గావింతును.

1. నాసదాసీ న్నోసదాసీ త్తదానీం, నాసీద్రజో నోవ్యోమా పరోయత్
కిమావరీవః కుహకస్య శర్మన్ అంభః కిమాసీ ద్గహనం గభీరమ్.

2. నమృత్యురాసీ దమృతంనతర్హి న రాత్ర్యాఅహ్న ఆసీత్ప్రకేతః
ఆనీదవాతం స్వధయాతదేకం, తస్మాద్ధాన్య న్నపరఃకించనాస.

3. తమఆసీత్ తమసాగూఢమగ్రేఽప్రకేతం సలిలంసర్వ మా ఇదమ్
తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్ తపసస్తన్మహినా జాయతైకమ్.

4. యఇమా విశ్వాభువనాని జుహ్వత్ ఋషిర్హోతాన్యషీదత్ పితానః
సఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాం, ఆవివేశ.

5. విశ్వతశ్చక్షు రుతవిశ్వతోముఖో విశ్వతోబాహు రుతవిశ్వతస్పాత్
సంబాహుభ్యాం ధమతిసంపతత్రై ర్ద్యావాభూమీ జనయన్ దేవఏకః

6. బ్రహ్మవనం బ్రహ్మసవృక్షఆసీత్ యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః
మనీషిణో మనసా విబ్రవీమి వో బ్రహ్మాధ్యతిష్ఠ ద్భువనానిధారయన్.

7. ఇంద్రంమిత్రంవరుణమగ్నిమాహు రథో౽దివ్యః సుపర్ణో౽గరుత్మాన్
ఏకంసద్విప్రాబహుధావదన్తి అగ్నింయమంమాతరిశ్వానమాహుః.

8. ఏకఏవాగ్నిః బహుధాసమిద్ధః ఏకఃసూర్యో విశ్వమనుప్రభూతః
ఏకఏవోషాః సర్వమిదంవిభాతి, 'ఏకంవా ఇదంవిబభూవసర్వమ్'

# సిద్ధాంతవాదము - గీత

గీతాసమ్మత ద్వాదశవాదములు:—

సాధ్యుల దశవాదములను జిజ్ఞాసువుల సంశయవాదమును నిరాకరించుటకు, దేవయుగారంభమున, పరమవైజ్ఞానికుడు, జ్ఞానవిజ్ఞానాచార్యుడు, అధికారిక దివ్యావతారుడు నగు భగవంతుడు స్వయంభూ బ్రహ్మద్వారా ఆవిర్భవించిన బ్రహ్మ కర్మాత్మక సిద్ధాంతవాదము పిదప దివ్యావతారి భగవంతుడు, శ్రీకృష్ణునిచే వివస్వాన్నామకరాజర్షికి గీతరూపమున నుపదేశింప బడినసిద్ధాంతవాదము. '(సకాలేనేహమహతా యోగో నష్టః పరంతప!)' కాలక్రమమున మహాభారతకాలమునాటికి విలుప్తము కాగా, మానవసమాజము మరల నాద్విసత్యవాద సద్వాదాదుల వంకకు మరలియున్నపుడు అర్జునుని నిమిత్తముగా బెట్టుకొని '(నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్!)' మరల మానవావతారమున నాశ్రీకృష్ణుడే యాసిద్ధాంతముం బునరుద్ధరింప దయచేసెను. కొన్ని శతాబ్దులవరకాసిద్ధాంతము సురక్షితముగ నున్నది. కాని, పిదప కలహమూలక కలియుగమునకు

జెందిన సంప్రదాయయుగము మరల దాని స్వరూపముం జెడ గొట్టెను. అది మధుసూదన ప్రేరణ. నేడీ క్రొత్తవ్రాతకును మూలమదే. లేఖకశరీరము నిమిత్తమాత్రము.

ఏసిద్ధాంతవాదమును స్వాయంభువు స్థాపించెనో, మూలసంహిత సమర్థించెనో, ఉపనిషత్తులు తమసంక్షిప్తజ్ఞాన ప్రధానవాణిచే విమర్శించెనో, దానినె విశదముగా విమర్శించి గీత తన నామము సార్థకము గావించుకొన్నదని గీతాభిజ్ఞానమందు నామమీమాంసయందు జెప్పియుంటిమి.

నేడు వైదికసాహిత్యము విలుప్తప్రాయమైనది. అదృష్టమున దక్షిణమున కొంచెమున్నదైన కష్టాయత్నమగపడదు. మన కాధారమిదియని. దాని నుపేక్షించుచున్నాము. ఇందువలన నేమి పరిణామము? దీని కేమి ప్రాయశ్చిత్తము? అను చర్చ ప్రకృతము గాదు! సిద్ధాంతవాద మీమాంసయే ప్రస్తుతము!

నే డందరకు గీత సర్వమాన్యగ్రంథ మగుచున్నది. కావలసినదే. అది ప్రత్యక్షరమునను సర్వమూర్ధన్యమగు వేదశాస్త్ర సిద్ధాంతముల నే స్పష్టము సేయుచున్నది. కాని, ఇట విచార్య విషయ మేమనః— ప్రతివ్యక్తియు గీతాక్షరముల యాధారము ననే గీతాతత్త్వసమన్వయమునకై యనధికారచేష్టలం గావించుచున్నారు. గీత యన్నది వేదశాస్త్రమునకే భాషాంతరము. వేదశాస్త్రమందలి గుప్త - పరంపరాసిద్ధ - పరిభాషల నెఱుంగక గీతాసిద్ధాంతము ననుగమించుట కఠినము. కాదు అసంభవమే. ప్రకృతము గీతయందలి బ్రహ్మకర్మపరీక్ష. అది వైదికసిద్ధాంత

వాదమునకు రెండవరూపము. వైదికములగు నితరవాదముల నెరుంగనిచో నాసిద్ధాంతవాద సమన్వయ మసాధ్యము. అందువల్లనే మొదట నా దశవాదములను సంక్షేపముగ జెప్పనయ్యెను.

ఆ వాదములెల్ల గీతయందు క్రమబద్ధముగా గాకున్నను, అందందు లేకపోలేదు. అవి దాని కావశ్యకములు కాకుండు గాక! ఉన్నవి. సిద్ధాంతవాదము సంగీకరించినచో దక్కిన వాదములును సురక్షితములగును. కనుక ఈదృష్టితోడనే ఈవాదములను గీత సమన్వయించెను. ఈక్రింద నుదహరించిన వచనములం బట్టి స్థాలీపులాకన్యాయముగ నీ విషయము తెల్లమగును.

1. విజ్ఞానేతి వృత్తవాదము:—

1. జ్ఞానంతేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః,
2. జ్ఞానంవిజ్ఞానసహితం యద్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్,
3. జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం, బ్రాహ్మంకర్మ స్వభావజం,
4. పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం,
5. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థోవిజితేంద్రియః,

2. సదసద్వాదము:—

1. నాసతోవిద్యతేభావో నాభావోవిద్యతేసతః,
2. సదసచ్చాహమర్జున,
3. ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణః త్రివిధస్స్మృతః,
4. అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే,
5. కర్మచైవతదర్థీయం సదిత్యేవాభిధీయతే.
అసదిత్యుచ్యతేపార్థ! నచతత్ప్రేత్య నోఇహ.

3. రజోవాదము:—

1. రజోరాగాత్మకంవిద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
2. సత్త్వంసుఖేసంజయతి రజఃకర్మణిభారత,
3. రజస్యేతానిజాయన్తే వివృద్ధేభరతర్షభ,
4. కామఏషక్రోధఏష రజోగుణసముద్భవః.

4. వ్యోమవాదము:—

1. యథాసర్వగతంసౌక్ష్మ్యా దాకాశంనోపలిప్యతే,
2. యథాకాశస్థితోనిత్యం వాయుఃసర్వత్రగోమహాన్,
3. ప్రణవఃసర్వవేదేషు శబ్దఃఖే పౌరుషంనృషు,
4. అనంత! దేవేశ! జగన్నివాస,
5. తేజోమయం విశ్వమనాద్యనంతమ్.

5. అపరవాదము:—

1. భూమిరాపోఽనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ,
అహంకారఇతీయంమే భిన్నాప్రకృతిరష్టధా, అపరేయమ్...,
2. క్షరః సర్వాణిభూతాని,
3. నవానిగృహ్ణాతి నరోఽపరాణి.

6. ఆవరణవాదము:—

1. యథోల్బేనావృతోవహ్నిః తథాతేనేదమావృతమ్,
2. ఆవృతంజ్ఞానమేతేన జ్ఞానినోనిత్యవైరిణా,
3. అజ్ఞానేనావృతంజ్ఞానం తేనముహ్యన్తిజన్తవః,
4. జ్ఞానమావృత్యతుతమః ప్రమాదేసంజయత్యుత,
5. తమస్యేతానిజాయన్తే ప్రవృద్ధేకురునందన,
6. సర్వారంభాహిదోషేణ ధూమేనాగ్నిరివావృతాః.

7. అంభోవాదము:—

1. రసోఽహమప్సు కౌన్తేయ,
2. పర్జన్యాదన్నసంభవః.
3. అహం వర్షం, నిగృహ్ణామ్యుత్సృజామిచ.
4. తాసాం బ్రహ్మ మహద్యోనిః.

8. అమృతమృత్యువాదము:—

1. అమృతంచైవమృత్యుశ్చ, (అహం)
2. మృత్యుః సర్వహరశ్చాహం.
3. యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
4. విముక్తోఽమృతమశ్నుతే.

9. అహోరాత్రవాదము:

1. అవ్యక్తాద్వ్యక్తయఃసర్వాః ప్రభవన్త్యహరాగమే,
   రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే.
2. భూతగ్రామస్సఏవాయం భూత్వాభూత్వాప్రలీయతే,
   రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవన్త్యహరాగమే.
3. సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః,
   రాత్రింయుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదోజనాః.

10. దైవవాదము:—

1. దైవమేవాపరేయజ్ఞం,
2. దైవీహ్యేషాగుణమయీ మమమాయా దురత్యయా,
3. దైవీంప్రకృతిమాశ్రితాః,
4. యజన్తఇహదేవతాః,
5. దేవాన్భావయతానేన తేదేవా భావయన్తువః.

11. సంశయవాదము:—

1. ప్రవృత్తించ నివృత్తించజనానవిదురాసురాః,
నశౌచంనాపిచాచారో నసత్యం తేషువిద్యతే.

2. అసత్యమప్రతిష్ఠన్తే జగదాహురనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకం.

3. అనేకచిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతినరకేఽశుచౌ.

4. అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మావినశ్యతి,
నాయంలోకోఽస్తినపరో నసుఖంసంశయాత్మనః.

5. సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధినష్టానచేతసః,

12. సిద్ధాంతవాదము:— (ఇదే గీతారాద్ధాంతము)

1. బ్రహ్మార్పణంబ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌబ్రహ్మణాహుతం,
బ్రహ్మైవతేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా.

2. కర్మణ్యకర్మయఃపశ్యే దకర్మణిచకర్మయః,
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తఃకృత్స్నకర్మకృత్.

3. మయాతతమిదంసర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్స్థానిసర్వభూతాని నచాహంతేష్వవస్థితః.

4. ప్రకృతింస్వామవష్టభ్య విసృజామిపునఃపునః,
భూతగ్రామమిమంకృత్స్నం అవశంప్రకృతేర్వశాత్.

5. మయాధ్యక్షేణప్రకృతిః సూయతేసచరాచరమ్,
హేతునానేనకౌన్తేయ జగద్విపరివర్తతే.

6. యచ్చాపిసర్వభూతానాం బీజంతదహమర్జున,
నతదస్తివినాయత్స్యా న్మయాభూతంచరాచరమ్.

# గీతాసమ్మతబ్రహ్మకర్మపరీక్ష

పై వచనములచే గీతయందు నిరూపింపబడిన సిద్ధాంతోప సిద్ధాంతములు కన్నిటికి మూలము వేదశాస్త్రమనియు, ఆధ్యాత్మికసంస్థను బెరసిన యెల్లతత్త్వవాదములు వేదశాస్త్రమునందు వలె నందు ప్రదర్శింపబడినవనియు, కనుక గీత సర్వశాస్త్రమయీ యనదగుననియు తెల్లమగుటయే గాక, గీతాసంబంధ బ్రహ్మకర్మపరీక్షా ప్రకరణమునందీ గీతాసంబంధ ద్వాదశవాద నిరూపణముగూడ ప్రాసంగికము నుపాదేయము ననియు విశదము కాగలదు.

సృష్టిమూలకారణతత్త్వముగూర్చి గీతాశాస్త్రము గావించిన సిద్ధాంతమే వేదశాస్త్రసిద్ధాంతవాదము. లేదా వేదశాస్త్రము సంక్షేపముగ నుల్లేఖించిన సిద్ధాంతవాదమే గీతాసిద్ధాంత వాదము ననవచ్చును. మరియు, సాధ్య సమ్మతామృతమృత్యు సదసద్వాదములకు గీతాసిద్ధాంత ప్రతిచ్ఛాయా సంబంధము గలదా? యని 'అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున' ఇత్యాది వచనములచే స్ఫురించును; గాని సాధ్యసమ్మతములగు నా రెండు సిద్ధాంతములను సంశోధన గావింపుచు, బ్రహ్మకర్మ ద్వయియందు వాని నంతర్భావము జేయుచు, బ్రహ్మకర్మోభయ మూర్తియగు నవ్యయతత్త్వముపై నన్నిటిని బర్యవసానము గావింపుచు, భగవంతుడు స్థాపించిన బ్రహ్మవాదమే గీతా

సిద్ధాంతమని జ్ఞాపక ముంచుకోవలయును. ఈ సిద్ధాంత స్పష్టీకరణమే ప్రస్తుత ప్రకరణార్థము.

ప్రపంచమంతయు బ్రహ్మమయము, బ్రహ్మరూపము ననుట కణువంతయు సందేహములేదు. కాని యా బ్రహ్మ మెవరు? తత్స్వరూపమేమి? తద్ధర్మమేమి? ఇత్యాది ప్రశ్నలు పరీక్ష్య కోటిలోనివి. ఈ ప్రశ్నల కన్నిటికి సమాధాన మిచ్చుచు నీక్రింది గీతాసిద్ధాంత మొకటికి నిచ్చుచున్నది:—

ఆధిదైవికం బ్రహ్మ 1.

1 2 3 4 5 6 7
1. గతి ర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
8 9 10 11 12
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్.

ఆధ్యాత్మికం బ్రహ్మ 2.

1 2 3 4 5
2. ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
6
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.

ఈశ్వరుడు పూర్ణేంద్రుడు. జీవు డర్ధేంద్రుడు. పూర్ణాకాశ మండల మీశ్వరీయవివర్తము. అర్ధదృశ్యాకాశకటాహము జీవవివర్తము. ఈ పూర్ణార్థభావభేదముచే ఈశ్వరావ్యయునకు 12, జీవావ్యయునకు 6 లక్షణములు. తన యాధిదైవికరూపమున

12 లక్షణములతోడను, ఆధ్యాత్మికరూపమున 6 లక్షణముల తోడను గూడి, 'యోఽహంసోఽసౌ, యోఽసౌసోఽహం' అన్నట్లు రెండుసంస్థలందు నభిన్నరూపమున వ్యాప్తమై అజ - పర-ఉత్తమపురుషా ద్యనేకనామములచే నుపవర్ణితమగు నవ్యయ తత్త్వమే విశ్వమూలకారణము. ఏతదాధారముననే యితరములగు కారణవాదములు ప్రతిష్ఠితములై యున్నవి.

విశ్వమూలభూత - పూర్వోక్త ద్వాదశ లక్షణ - మహామాయా - అశ్వత్థేశ్వర - ఈశ్వరావ్యయబ్రహ్మకు ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కు లను పంచకళ లని ఆత్మవిజ్ఞానమున, సగుణాత్మప్రకరణమున జెప్పబడినవి. ఈయవ్యయకళా పంచకము విద్యావీర్యము లను రెండుభాగములుగ సమన్వయింపవచ్చును. (విద్యకు జ్యోతియనియు ప్రయోగమున్నది.) మనోమయ విజ్ఞానగర్భితానందము విద్య. ఇదే బ్రహ్మ. విశ్వమందు దీనికి జ్ఞానరూపముచే వికాసము. మనోమయ ప్రాణగర్భితవాక్కు వీర్యము. ఇదే కర్మ. విశ్వమందు దీనికి క్రియారూపమున వికాసము.

జ్ఞానలక్షణానంద విజ్ఞానమనోమయ బ్రహ్మభాగ మాయవ్యయబ్రహ్మ యొక్క విద్యాధాతువు; క్రియాలక్షణ మనః ప్రాణవాఙ్మయ కర్మభాగము వీర్యధాతువు; రెంటి సమన్వితరూపము వేరే అవ్యయబ్రహ్మ; విశ్వమూలకారణము. దీనిరెండు రూపములందును విద్యాధాతువు సృష్టిగ్రంథి విమోకము గావింపుచు, ముముక్షుకు (ముక్తికామనకు) జెందియుండును;

వీర్యధాతువు తన సహజసిద్ధ బలాత్మక సంసర్గధర్మ ప్రేరణచే నుత్తరోత్తర గ్రంధిప్రేరక మగుచు సిసృక్షకుజెందియుండును; సర్వథా, విరుద్ధకామనలకు జెందిన జ్ఞానక్రియలకు గ్రమికోత్తేజకము, సర్వమూలభూతము, పరస్పరావినాభూత ధాతుద్వయ సముచ్చితము నగు దానినే అవ్యయాత్మ - లేక అవ్యయబ్రహ్మ యందురు.

1. "బ్రహ్మైవేదంసర్వం 2. సర్వంఖల్విదం బ్రహ్మ 3. నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ 4. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ 5. తస్మాద్ధాన్యన్నపరః కించనాస 6. అజస్యనాభా వేకిమపి స్వి దేకం 7. బ్రహ్మణోవావిజయే మహీయధ్వం 8. పరస్తస్మాత్తు భావోఽ న్యోఽవ్యక్తోఽ వ్యక్తాత్సనాతనః 9. త్వమాది దేవః పురుషః పురాణః 10. తదేవామృత ముచ్యతే" ఇత్యాదు లీసర్వాలంబన ద్విధామూర్తి అవ్యయబ్రహ్మ యశోగానము సేయుచున్నవి.

మహాయాయకు, తద్గర్భస్థితాసంఖ్య యోగమాయలకు (సృష్టిదశయందు) జెందియుండు నీ యవ్యయబ్రహ్మకు ఈశ్వర —జీవభేదముచే రెండువివర్తములు కల్గునని యీావర కనుకొంటిమి. బ్రహ్మశబ్దము నిరుపాధికమగుచు సర్వథా నిరపేక్షమగునో; ఆత్మశబ్దము సోపాధికమగుచు నిత్యము సాపేక్షము నగును; బ్రహ్మయనగనే ఎవనిబ్రహ్మ? యను నపేక్షకలుగదు; గాని, ఆత్మ యనగనే ఎవనియాత్మ? అను నపేక్షకల్గును. సృష్టికి బూర్వ మాతత్త్వమే సర్వథా నిరుపాధికముగ నుండి నిరపేక్ష

బ్రహ్మ యనబడును, గాని సృష్టిదశయందదియే సోపాధికమై తన బ్రహ్మోపాధినివిడచి ఆత్మ - పరమాత్మ - జగదీశ్వర - విశ్వేశ్వర - మహేశ్వర - జీవాది సోపాధిక సాపేక్ష నామములతో బిలువబడును.

ఆత్మలక్షణసోపాధికాత్మయెన్నడును శరీరము లేకుండ నుండదు; కాని శరీరమందుండియు నది తన స్వాభావిక వాసంగ వృత్తివలన, శరీర పాప్మాలిప్తము గాదు.

'అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌన్తేయ! నకరోతి నలిప్యతే,'

సరియే కాని, యేదోయొక శరీరమునం దుండుటమాత్రము సంభవించును: ఆశరీరము, 'మహతో మహీయాన్' గాని 'అణో రణీయాన్' గాని యగుగాక!

నిరపేక్షబ్రహ్మను సాపేక్షాత్మ స్వరూపముగ బరిణతము గావించు నాయుపాధి 'మాయ' నాబడును; అదే పిదప మహామాయ, యోగమాయ అను రెండు రూపములగును. పాంచభౌతిక విశ్వసీమ మహామాయ; ఏతద్గర్భస్థితములగు చిన్న పెద్ద పాంచభౌతిక పిండములకు సీమ యోగమాయ. అదియొకటే; ఇది యనేకము. అపేక్షాభావ సంపాదకములగు నీరెండుపాధుల వలననే సోపాధికాత్మ యీశ్వర – జీవభేదము లొందును; మహామాయావచ్ఛిన్న మహామాయి యగు నాత్మ ఈశ్వరుడు; ఒకమహావిశ్వమున కీయన యేకైకాధిష్ఠాత. యోగమాయా

వచ్ఛిన్న యోగమాయియగు నాత్మ జీవుడు. మహావిశ్వగర్భ స్థిత యోగమాయానంత్యముచే జీవు లసంతులు; అసంఖ్యాలు.

మహామాయా యోగమాయా రూప ఉపాధిభావముల గర్భప్రవిష్టమై సోపాధికాత్మ యుండును. కనుక 'విశత్యస్మిన్ - ఆత్మా, విశతియత్రాత్మా తద్విశ్వమ్' అను నిర్వచనముచే నీ యుపాధిభావములను విశ్వమందురు. ఆత్మ రెండు విధము లగుటచే తత్ప్రతిష్ఠయగు విశ్వమును రెండు విధములు. ఈ శరీర మీయాత్మకు విశ్వము. ఎవని యాత్మ? అను నపేక్ష నీని వలన బూర్తియగును. ఆకాశాని లానల చంద్ర పృథివ్యాది రూప మహావిశ్వ మీశ్వరావ్యయునకు లేదా ఈశ్వరాత్మకు శరీరము; ఈ శరీర మీ యీశ్వరాత్మ కంతర్జగత్తు. ఇది జీవాత్మ కన్న నో బహిర్జగత్తు. సప్తధాతుమయు, పాంచభౌతిక క్షుద్ర శరీరము జీవావ్యయునకు, లేదా జీవాత్మకు విశ్వము; ఇది జీవాత్మకంతర్జగత్తు. దీని కీశ్వరావ్యయాంతర్జగత్తు ప్రతిష్ఠ. ఇచట గమనింపదగినది:—ఏమన:— ఈశ్వరాంతర్జగద్రూప మహా విశ్వశరీరగర్భమందు జీవసర్గమంతయు ప్రతిష్ఠితమై యున్నది గాని, జీవాంతర్జగద్రూప శరీరవిశ్వములం దాయీశ్వరతత్త్వము ప్రతిష్ఠితముగాజాలదు.

పరస్పరవిరోధము:- ఈవిషయ మప్రమాణికమువలె దోచు చున్నది. 'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి' అనిగీత "సర్వభూతహృదయస్థితు డీశ్వరుడు." అనుచున్నది.

ఇట్టిచో జీవుని విశ్వమగు శరీరమం దా యీశ్వరు డుండజాల డనుటెట్లు?

గీతనేయుడిగెదము:- మొదట వ్యాప్య - వ్యాపకభావముల కెట్టి సంబంధముండునో చూతము. ఉదాహరణమునకు:— ఆకాశము — ఘటమఠాదిపదార్థములు గొనుడు; ఆకాశము వ్యాపకము. అందుండు ఘటాదులు వ్యాప్యములు, గదా! సర్వవ్యాపకాకాశము తన గర్భమందున్న పదార్థములం దుండ దనునదిలేదు. అన్నిట నది లోపలను వెలుపలను ఉన్నది. కనుకనే ఘటాకాశ మఠాకాశ, శరీరాకాశాది వ్యవహారములు సంగతము లగుచున్నవి. దీనింబట్టి "వాపకాకాశమన్నిట నున్న" దనియు, "వ్యాప్యపదార్థము లన్నియు వ్యాపకాకాశ గర్భమం దున్న" వనియు జెప్పవలయును.

ఘటాద్యుపాధులబట్టి (యవియున్నంతవరకు) ఈవిషయము ప్రామాణికమే. కాని వానిని విడచిచూచుచో ఘటాదివ్యాప్యములందు వ్యాపకము, నిరుపాధికము, ఎట్లును ఇముడదని తెల్లమగును. అంతవరకేల? ఉపాధిదృష్టితోనైనను, సప్తభువన వ్యాపియైన మహాకాశ మొకచిన్నమట్టిపిడతలో నిముడు నన్నచో నమ్మదగునా? కప్ప ఈగను మ్రింగును గాని, ఈగ కప్పనుమ్రింగునా? దీనింబట్టి వ్యాపకాకాశమందు ఘటాది వ్యాప్యములున్నవి. కాని, "వ్యాప్యఘటాదులందు వ్యాపకాకాశ మెన్నడు నుండజాలదు" అనవలయును.

ఇక నీదృష్టితో ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. ఆబ్రహ్మభువ

నాల్లోకప్రతిష్ఠ. జీవుడన్ననో, ఎంతయధికముగ జూచినను, తన పాంచభౌతికశరీర వ్యాపి యనవచ్చును. సర్వజీవశరీరములును వ్యాపకేశ్వరగర్భమందున్నవే. కాని, ఆయన యీ శరీరములందిముడుననుట యసంభవము. కనుక మా, మొదటి సిద్ధాంతె మొప్పే. అనగా:- 'ఇవి యతనియందున్నను అతడు వీనియందులేడు' అనుటనిజమే. చూడుడు:-

1. ''మయాతతమిదంసర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్ స్థానిసర్వభూతాని నచాహం తేష్వవస్థితః.

2. నచమత్ స్థానిభూతాని పశ్యమేయోగమైశ్వరమ్,
భూతభృన్నచభూతస్థో మమాత్మాభూతభావనః.

3. యేచైవసాత్వికాభావాః రాజసాతామసాశ్చయే,
మత్తఏవేతితాన్ విద్ధి 'నత్వహం తేషుతేమయి'.

4. యథాకాశస్థితోనిత్యం వాయుఃసర్వత్రగోమహాన్,
తథాసర్వాణిభూతాని మత్ స్థానీత్యుప్రధారయ.

మఱి యీ క్రిందివచనముల నరయుడు.

1. ఈశ్వరఃసర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమాయయా.

2. యోమాంపశ్యతిసర్వత్ర సర్వంచమయిపశ్యతి,
తస్యాహంనప్రణశ్యామి సచమేనప్రణశ్యతి.

3. సర్వభూతస్థితంయోమాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథావర్తమానోఽపి సయోగీమయివర్తతే.

4. సమంసర్వేషుభూతేషు తిష్ఠన్తంపరమేశ్వరం,
వినశ్యత్స్వవినశ్యంతం యఃపశ్యతిసపశ్యతి.

5. సమంపశ్యన్ హిసర్వత్ర సమవస్థితమీశ్వరమ్,
నహినస్త్యాత్మనాత్మానం తతోయాతిపరాంగతిం.

ఇవి యీపై సిద్ధాంత విరుద్ధములు గావా? యన్నచో,

విరోధపరిహారము:— ఇష్టాపత్తియే, (కావలసిన యాపత్తే ఇది) ఈగీతా వచనములు అంశాంశీ భావముంగాని వెలసినవి. ఆకాశమంతయు ఘటమునం దిముడదుగాని, ఘటమున్నచోటి యాకాశము ఘటములో నుండనేగలదు గదా! ఇట్లే:— వ్యాపకేశ్వరుడు వ్యాప్యజీవసంస్థాగర్భమం దిముడనిమాట నిజమే. కాని, యీవ్యాపకేశ్వరుని యేసత్తాత్మక ప్రదేశమందు జీవసంస్థప్రతిష్ఠితమై యున్నదో ఆ యీశ్వరాంశసత్తనుండి జీవసంస్థ నెట్లు వంచితము గావింపవచ్చును? అంశరూపమున దప్పక ఆయన యిందుండెనని యంగీకరింపవచ్చును. ఈయంశ దృష్టితోడనే 'ఈశ్వరః సర్వభూతానా' మిత్యాదులు వెలసినవి. ఇక నంశీదృష్టితోనైనచో నాయన యిందుండునెన్నడు నంగీకరింపజాలము. కనుక నాదృష్టితో 'నత్వహం తేషు తేమయి' అను పూర్వవచనములును వెలసినవి.

అంశీదృష్టితో విచారించుచో 'ఇవియు నతనియందు లేవు.' (నచమత్స్థానిభూతాని) యనవలసివచ్చును. వ్యాపకుడగు నాయన దీనిగర్భమందిముడడని యట్లే ఈచిన్నచిన్న వ్యాప్య

పదార్థము లాయన నెట్లాక్రమింప (ఆవరింప) గలవు? పూర్ణ మగు నాకాశగర్భమును ఘటమావరించుననుట సంభవమా? ఇక: నీ జటిలతల నన్నిటిని దూరముచేయుట కొకటే యుపాయము. ఏమన:—

"లోపల, వెలుపల, దూరమున, దగ్గర నదే యనియు, ఎన్నియైనను నేదియుగాదనుట (అనిర్వచనీయ మనకొనుట)".

ఈ వాస్తవిక జ్ఞానమును భగవంతు డిట్లు స్పష్టీకరించెను.

1. *బహిరంతశ్చభూతానాం అచరంచర మేవచ,
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థంచాంతికేచ తత్.

2. అవిభక్తంవిభక్తేషు విభక్తమివచస్థితమ్,
భూతభర్తృచతద్ జ్ఞేయం గ్రసిష్ణుప్రభవిష్ణుచ॥

(*తదేజతి తన్నైజతి తద్దూరేతద్వంతికే,
తదంతరస్యసర్వస్య తదుసర్వస్యబాహ్యతః). (ఈశ)

ఇంతకు:— "ఈశ్వర - జీవ - భావములు రెండును భాతి భావమునకు జెందినవి. తత్త్వతః రెండు నొకటే. కనుకనే 'ఈశ్వర - జీవు లొకేబ్రహ్మకు రెండు వివర్తము' లనుట సంగతమగు చున్నది." అనియే చెప్పదలచినది. ఈపరమార్థమునకే ఈవిచారణ యింతవరకు బెంచితిమి. ఇక ప్రకృత మనుసరింతము:—

"మహామాయాయోగ మాయానాను కోపాధ్యాయ నంబంధముచే నేకసత్తాలకు గావ్యయబ్రహ్మకు ఈశ్వర - జీవ -

భేదమున రెండురూపములు కల్గును. ఈ రెండును దమతేమ యపేక్షా దూరీకరణార్థము సశరీరులగును. మహావిశ్వ మీశ్వ రాత్మకు శుక్రశరీరము జీవాత్మకు విశ్వములు" ఇదియే ప్రస్తుత ప్రసంగము. ఇందువలన నొకే తత్త్వమునకు ఈశ్వర - జీవ జగత్తు లను మూడు వివర్తములని తేలినది.

సంచరదశ (సృష్టిదశ) యందా యన్వయము. పూర్వోక్త 'మనః - ప్రాణ - వాఙ్మయ,' సిసృక్షానుగత స్వీయ వీర్యధాతు వును గాని 'ఈశ్వర - జీవ - జగత్తు' లను మూడురూపములం బరిణమించును. ఇక, ప్రతి సంచరదశయందు, 'ఆనందవిజ్ఞాన మనోమయ'ముముక్షానుగత స్వీయవిద్యా (జ్యోతి) ధాతువుం గాని తన ప్రాతిస్వికమగు నేకరూపమునకు వచ్చివేయును. "త్రయం సదేక మయమాత్మా ఆత్మా ఉ ఏకః సన్నేతత్త్రి యమ్' అని వాజసనేయ శ్రుతి యీసంచరప్రతిసంచర ద్వయీ దిగ్దర్శనము గావించుచున్నది.

సృష్టిరూపాన్వయము విశ్వరూపము. తత్పూర్వ మది విశ్వా తీతము. ఈ దృష్టితో నొకే బ్రహ్మకు విశ్వాతీత - విశ్వరూపము లను రెండు స్థూలవిభాగములు. విశ్వాతీతబ్రహ్మయే పరాత్పర నామకము. ఇదే 'ఏకమే వా ద్వితీయంబ్రహ్మ'. విశ్వరూపాత్మ ఉపాధిభేదముచే భిన్నభిన్న సంస్థావేశముచే 'ఈశ్వర - జీవ - జగత్తు'లను పేరుల నందును. ఈ త్రిమూర్తిరూప విశ్వమూర్తిం గూర్చియే శ్రుతి 'ఆత్మా ఉ ఏకః సన్ ఏతత్త్రయమ్' అనియెను. చివరకు విశ్వాతీత - విశ్వరూపము లను రెండు వివర్తములును,

పరాత్పర - ఈశ్వర - జీవ - జగత్తు లను నాల్గు రూపము లగు చున్నవి.

ఈశ్వరవాచక ప్రణవము:— శబ్దబ్రహ్మలక్షణ బ్రహ్మ విజ్ఞానానుసారముగ 'పరాత్పరు డర్ధమాత్ర; ఈశ్వరు డకారము; జీవు డుకారము; జగత్తు మకారము' అనుట యుచితము. వీని మొత్తమగు ఓమ్, అన్నది ప్రణవబ్రహ్మ. ఈ శబ్దబ్రహ్మ మన పరబ్రహ్మ యని 'తస్య వాచకః ప్రణవః' అను యోగసూత్రము స్పష్టపరచును. 'ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్'

ఈ నాల్గు రూపములకంటె వేరుగ నేమియు లేదు. కనుక నే యీ మొత్తపుబ్రహ్మ బ్రాహ్మణములందు 'సర్వబ్రహ్మ' యనియు, ఉపనిషత్తులందు చతుష్పాద్బ్రహ్మయనియు వాకొనబడినది. 'చతుష్టయం వా ఇదం సర్వమ్' అని మహర్షి శాంఖాయనుడు నీ విషయమునే సమర్థించెను.

మూలమునంటియే తూలము, కారణముబోలియే కార్యము గదా! 'పరాత్పరతత్త్వము మూలబ్రహ్మ. దానికి విద్యా - వీర్యములు రెండుధాతువులు' అనుకొన్నచో నా ధాతుద్వయ సత్త ఈశ్వర - జీవ - జగల్లక్షణ తూలబ్రహ్మలు మూటను నంగీకరింపవలయును. విద్యను బ్రహ్మ, వీర్యమును కర్మ యనుకొంటిమిగదా! చివరకు విద్యా - వీర్యరూపమున కర్థము బ్రహ్మకర్మరూపము, లేదా బ్రహ్మకర్మమయము అని తేలును. కాగా; కర్మ=క్రియ. కనుక బ్రహ్మ కర్మరూపమనగా, జ్ఞాన - క్రియారూపము. లేదా, జ్ఞానక్రియామయము అని యేర్పడును.

సృష్టిమూలమేమి? అన్నచో బ్రహ్మ-కర్మరూప ద్వైతభావము-అని నిష్కర్ష. నిజముగా సృష్టి కారణాన్వేషణఫలముగ (భాతిసిద్ధ) ద్వైతభావముపై విశ్రాంతి నొందుటయే సంభవించును. ఇది శాస్త్రీయదృష్టి.

ద్వైతపరీక్ష:— ఇక ప్రత్యక్షదృష్టితో గూడ సర్వసిద్ధమగు నీ ద్వైతభావ (బ్రహ్మకర్మ) పరీక్ష సేయుదము. అహం (నేను) అను నాత్మయొక్క గతి (గమనము, వ్యాప్తి-ప్రసారము, వ్యాపారము) జానామి; కరోమి - జ్ఞాయతే; క్రియతే అను రెండు భావములందే వ్యాప్తముగ నగుచున్నది. ఆత్మమండలమందీ రెండనుభవములే గాని మూడవ దేదియు లేదు. లౌకిక - పారలౌకిక ప్రపంచమంతయు, ఎరుంగుట, చేయుట యందే సమాప్తము. ఇంకొకటికూడ ననుభవవిషయమే. ఏమన:— ఎరుంగుట - చేయుట ఈ రెండుభావములును సర్వథా విజాతీయములు. ఈ రెంటికి నెందును పోలిక లేదు. ఎట్లన:—

## జ్ఞానపూర్వకకర్త

జ్ఞానపూర్వకముగ నాచరింపబడిన కర్మయే ఫలించుననియు జ్ఞానములేక యేకర్మయు జరుగదనియు సర్వసమ్మత విషయమే. కర్మకుమూలము కామన, కామనకు మూలప్రభవము జ్ఞానము. ఈజ్ఞాతత్త్వము ఆత్మ - మహత్తు - బుద్ధి - మనస్సు - ఇంద్రియ వర్గము మొదలగు భేదములచే నానాభాగములుగ నగుచున్నది.

పిమ్మట వీనికవాంతరము లసంఖ్య భేదోపభేదములగును. ఏకర్మ యందైన నాత్మజ్ఞాన సహాయోగ ముండుచుండును. కొన్నిట మహాత్తు, కొన్నిట బుద్ధి, కొన్నిట మనస్సు, కొన్నిట నింద్రియ వర్గము వీనివీనిజ్ఞానములు ప్రధానత వహించుగాక.

'వాడు జ్ఞానములేక పనిచేసెను: అందుచే సఫలుడుగాడయ్యె' నను 'వ్యావహారిక వాక్యమువలన సిద్ధమగు జ్ఞానములేని కర్మ' యనుమాట వైజ్ఞానికముగ విలువలేనిది. ఏమన:— జ్ఞానములేని కర్మప్రవృత్తి యసంభవము. ఇక నావాక్యమున కర్థమేమన:- 'కర్త తనకర్మయందు మానసజ్ఞానమునే ఆశ్రయించెను. మన స్సింద్రియములకు లోంగునది. ఇంద్రియము లల్పజ్ఞానము గలవి. కనుక నట్టి యింద్రియయుక్త మనస్సునందు 'ఇదమిత్థ మేవ' యను నిశ్చయజ్ఞానముండదు. విచారవిమర్శలందు మనస్సు అసమర్థము, అందువల్ల నది కర్మను నిష్ఫలమొన ర్చును. కనుక నట్టిచో నీవాక్య ముపయోగించును. నిశ్చయ జ్ఞానము, బుద్ధిధర్మము, బౌద్ధజ్ఞానము నాశ్రయముగా గొనియే మానసజ్ఞాన మైంద్రియక జ్ఞానముద్వారా కర్మవిశేషములందు ప్రవృత్తమై కాలాంతరమున గర్మసఫలతా కారణమగును.

అజ్ఞానమున బనిచేసె ననుచో నజ్ఞానమున కర్థ మజ్ఞానావృత జ్ఞానము. ఇదే మోహము. 'అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తిజంతవః' మానసజ్ఞానజని తావివేకముచే వైషయిక మగు తామససంస్కారలేపము కల్గును. మేఘావరణముచే సౌర ప్రకాశమువలె సంస్కారావరణముచే, బౌద్ధజ్ఞానముండియు

వివేకోత్తేజకము గాదు. అట్టి మోహాకలిలబుద్ధి నిశ్చయజ్ఞాన సమర్థము కాదు. అట్టి బౌద్ధజ్ఞానమే (మనశ్శ్వాసనాధీనమై సంస్కారలిప్తమై స్వాభావికప్రకాశమును బోగొట్టుకొన్న జ్ఞానము) అజ్ఞాన మనబడును.

మూర్ఖశబ్దనిరుక్తి:— అజ్ఞానిని మూర్ఖుడందురు. 'ముహ్యతి - ఇతిమూర్ఖః' అనిమూర్ఖశబ్దనిర్వచనము. వైచిత్యార్థక (ముహ్ - వైచిత్యే - దివాది) ధాతువుకంటె ఖ ప్రత్యయము చేర్చి ముహ్‌ధాతువునకు 'మూర్' ఆదేశము సేయగా మూర్ఖశబ్ద మేర్పడును. అవివేకమే వైచిత్యభావము, అవివేకియే. (పై జెప్పిన యావరణముచే బౌద్ధజ్ఞానము వివేకశూన్యము కాగా బనిసేయు వాడే) మూర్ఖుడు. ఇది వ్యాకరణసిద్ధశబ్దార్థశైలి.

వ్యాకరణశాస్త్రీకృత్స్నతను కృత్స్నముసేయు నిరుక్త శైలిచే మూర్ఖ శబ్దవిచారణ సేయుచో, ముహ్=వైచిత్యమే లేక అవివేకమే యర్థము. ఖ=ఆకాశము - ముహ్ అనుదానికి 'మూర్' అదేశము కాగా 'మూర్ఖ' శబ్దమేర్పడును. అనగా:— వైచిత్య + (పిచ్చి) ఆకాశముల వృత్తులు రెండు నేవ్యక్తియందు గూడునో, ఆవ్యక్తి మూర్ఖశబ్దమున జెప్పబడును.

ఆకాశమున శూన్యము నిస్తత్త్వము నిరర్థకము నిష్ఫలము నిస్సారము నగు కర్మంగూర్చి 'శూన్య' మనుచుందురు గదా! బౌద్ధజగత్తు ఆవృతముకాగా వైచిత్యాను గామియై - వివేక శూన్యు డగువాని కర్మ 'ఖ' రూపము అనగా శూన్యము, నిర ర్థకము. చివరకు "వివేకాభావ పూర్వకకృతకర్మ శూన్యము

నిష్ఫలము" "ఈ వైచిత్ర్యానుగామి 'ఖ' భావయుక్తుడు" అను నీ రెండుస్థితులను దెలియబరుపనే యవివేకిని మూర్ఖుడందురని ఫలితార్థము. మూర్ఖుని మనమేది యడిగినను ఆకాశమువంక జూచుటయే యిందుకు ప్రత్యక్షనిదర్శనము 'యథా నామ తథా గుణః'

## జ్ఞానకర్మల పార్థక్యము

ప్రకృతము:— జ్ఞానకర్మలు రెండును విరుద్ధములయ్యు గలిసి యుండు ననియే జెప్పదలచినది. కర్మ యొకచో శుద్ధజ్ఞానముచే ననుగృహీతమగునది సఫలమగును. ఒకచో అజ్ఞానావృతజ్ఞానము కర్మాభాసప్రయోజకమగు నది చెడును. జ్ఞాన మొక స్థిర దర్పణము. నచ్చుచు బోవుచు నుండు నవి యందు ప్రతిబింబితము లగుచుండును. గతిశీలపదార్థములు కర్మస్థానీయములు. చూచు నది జ్ఞానము. కనబడునది కర్మ. ద్రష్ట - దృశ్యపార్థక్య మందరకు సమ్మతమే గదా! జ్ఞానము ప్రవృత్తి గావించును. కర్మ ప్రవృత్తమగును. జ్ఞానము కర్మచే వికసితమగును. కర్మజ్ఞానముచే ముందుకు సాగును. జ్ఞాన మాభ్యంతరతత్త్వము. కర్మ యన్నది బాహ్యతత్త్వము. మన జ్ఞానమును, తత్కల్పనలను ఒరు లెరుంగజాలరు. కాని కర్మ నందరు జూడగలరు. బాహ్య క్రియావసానము 'జానామి'. ఆభ్యంతరవికాసాభిభవము 'కరోమి'. జ్ఞానేంద్రియములు జ్ఞానమును, కర్మేంద్రియములు కర్మను

ముఖ్యవుగా గోనును. జ్ఞానవృత్తి శారీరకశ్రమవిరోధిని. కర్మవృత్తి శారీరకశ్రమానుగామిని. జ్ఞానభావము శాంతి కనుగామి. కర్మజాలము క్షోభకుత్తేజకము. జ్ఞానగర్భితకర్మ మనల నర్థజాలమునుండి యుద్ధరించును. కర్మగర్భితజ్ఞాన మర్థలోలుపతా ప్రవర్తకనుగును. జ్ఞానము బ్రహ్మబలమూలప్రతిష్ఠ. కర్మ క్షత్రబల మూలాధారము. క్రతుదక్షాత్మక మైత్రావరుణ గ్రహరూప జ్ఞాన - కర్మ సమన్వితరూపమే ఆత్మ, అహం. ఈ యనుభూతుల వలన జ్ఞానక్రియల పార్థక్యము, విభిన్నతత్త్వత, అవినాభావము బోధపడగలదు. అహం (ఆత్మ) యందీ రెండును గలవు. కనుకనే మనము (ఆత్మ) ఎరుంగుచున్నాము. చేయుచున్నాము. తత్త్వతః భాతిసిద్ధ ద్వైతభావమే ముఖ్యమగు నాత్మసిద్ధాంతము. గీత, బ్రహ్మ - కర్మ లక్షణముగల యీ యాత్మసిద్ధాంతమునే సిద్ధాంతవాదముగ జెప్పినది. గీతాపరిభాషయం దాత్మ ప్రజాపతియొక్క జ్ఞాన ఘన బ్రహ్మభాగ మమృత మనియు, క్రియా ఘన కర్మభాగము మృత్యువనియు జెప్పబడెను. ఈ మృత్యువు ప్రథమావతార మశనాయా. 'అశనాయాహి మృత్యుః.' (శత)

'అర్థం వై ప్రజాపతేరాత్మనో మర్త్యమాసీదర్థమమృతమ్',
"అంతరంమృత్యోరమృతం మృత్యావమృతమాహితమ్".

ఇత్యాది శ్రుతివచనము లాత్మార్థమును అమృతమనియు, అర్థము మృత్యువనియు జెప్పుచున్నవి. ఇట్టిచో ప్రమాణానుభవ

సిద్ధమగు నమృతమృత్యులక్షణమగు నీద్వైతవాదము నెట్లుపల పింపవచ్చును?

# త్రిబ్రహ్మ-త్రికర్మప్రదర్శనము

గీతావిజ్ఞానమందలి నామ మీమాంసయందు నాత్మయొక్క బ్రహ్మ-కర్మలు రెంటికి నారు విభాగములు గావించి మూడమృత లక్షణ జ్ఞాన ఘన బ్రహ్మకును, మూడు మృత్యులక్షణ క్రియాఘన బ్రహ్మకును జెప్పి బ్రహ్మభాగములు మూడు నవ్యయాక్షర క్షరము లనియు, కర్మభాగములు మూడును జ్ఞానకర్మ బుద్ధియోగములనియు నిరూపించితిమి. బ్రహ్మకర్మోభయ మూర్తియగు నాత్మయొక్క యీ యారుపర్వముల నాధారముగా గొని జ్ఞాతవ్య కర్తవ్యభాగములకును ఆరు విభాగములు నిరూపించితిమి. 'జ్ఞాయతే' యనుదానికి అవ్యయాక్షర క్షర మూర్తి బ్రహ్మంతోడను, 'క్రియతే' యనుదానికి జ్ఞానకర్మ బుద్ధినిష్ఠాలక్షణ కర్మతోడను సంబంధము జెప్పబడినది.

అవ్యయాక్షర క్షర త్రయి సమష్టియే ఏకబ్రహ్మ మైనను, ఇందొక్కొక్కటియు బిడప బ్రహ్మయనబడును. ఆత్మవిజ్ఞానము నందలి దార్శనికాత్మపరీక్షా ప్రకరణమున వైశేషికము క్షర బ్రహ్మను, ప్రాధానిక మక్షరబ్రహ్మను, శారీరక మక్షరధియా అవ్యయబ్రహ్మను నిరూపించు నని చెప్పియుంటిమి. ఇక గీత యన్ననో యీ మూటి నిరూపణతో సర్వమూలభూత విశుద్ధా

వ్యయబ్రహ్మ ప్రతిపాదన గావించుచు సర్వశాస్త్రమైయున్నది. అవ్యయలక్షణ బ్రహ్మవిద్యయే గీత ముఖ్యసిద్ధాంతము. 'అజస్య రూపే కిమపిస్విదేకమ్' అనుటయే గీతా మూలమంత్రము.

జ్ఞాతవ్యబ్రహ్మ పర్వత్రయముతో కర్తవ్యకర్మపర్వత్రయమునకు క్రమిక సంబంధము:— అవ్యయ బ్రహ్మవిద్యతో ఉపాస్తిలక్షణ బుద్ధియోగనిష్ఠకు, అక్షరబ్రహ్మవిద్యతో జ్ఞానలక్షణ సాంఖ్యనిష్ఠకు, క్షరబ్రహ్మ విద్యతో కర్మలక్షణ యోగనిష్ఠకును సంబంధము: గీత, జ్ఞాతవ్య బ్రహ్మపర్వములం దవ్యయ బ్రహ్మ పర్వమును ముఖ్యలక్ష్యముగానొన్నట్లే, కర్తవ్యబ్రహ్మపర్వములందు (అవ్యయ బ్రహ్మనుయోగిక) బుద్ధియోగనిష్ఠకే ముఖ్యస్థానమిచ్చియున్నది.

కర్తవ్యకర్మత్రయి నింకొకదృష్టితో విచారింతము:— జ్ఞానయోగ, కర్మయోగ, బుద్ధియోగము లను మూటిని 'కర్మ' కే మూడు పర్వములందము. నిజముగా నివి కర్తవ్యకోటిలోజేరి కర్మలే యగును. నివృత్తిలక్షణ కర్మయే జ్ఞానయోగము; ప్రవృత్తిలక్షణ కర్మయే కర్మయోగము; ప్రవృత్తి నివృత్తి సమ్మిళితావస్థారూప (ఉభయరూప) కర్మయే బుద్ధియోగము. నివృత్తిలక్షణకర్మ, కర్మసంస్కారరూపావరణముం దొలగించి (కతకరజోవత్) జ్ఞానోదయ కారణమగును; కనుక దానిని జ్ఞాన (సాంఖ్య) యోగమంటిమి. ప్రవృత్తిలక్షణకర్మ కర్మావరణోత్తేజకమగుంగావున దానిం గర్మ (యోగనిష్ఠ) యోగమంటిమి; ఉభయలక్షణ కర్మయోగము బుద్ధిద్వారా సమబ్రహ్మ (అవ్యయ

(బ్రహ్మ) సమతేం గూర్చునదగుటచే దీనిని బుద్ధియోగ మనుట తగును. జ్ఞానయోగము జ్ఞానమును, కర్మయోగము కర్మను, ప్రధానములుగాగాని విషమయోగములగును ఇక:– సమతా లక్షణ బుద్ధియోగము శాంతిప్రతిష్ఠాకారణము, సర్వశ్రేష్ఠము నగును.

'యోగః కర్మసు కౌశలమ్' ఫలకామన (ఉత్థాప్యాకాంక్ష) నివృత్త మగుటచే నీ 'బుద్ధియోగము' త్యాగలక్షణ జ్ఞాన యోగము (సాంఖ్యనిష్ఠ) గ నగుచున్నది. నిష్కామ కర్మ (ఉత్థితాకాంక్షాయుక్త) ప్రవృత్తికి గారణమగుటవలన నిదే పరిగ్రహలక్షణ కర్మయోగము (కర్మయోగనిష్ఠ) గను అగు చున్నది. రెండునిష్ఠల సమన్వయము వలననే బుద్ధియోగ స్వరూ పము నిర్మింపబడినది." "ఏకం సాఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి"

బుద్ధితత్త్వారంభక (ఉపాదాన)ము సూర్యదేవత బ్రహ్మాండ కేంద్రమగు బృహతీఛందమునం దున్నది. 'సూర్యోబృహతీ మధ్యూఢ స్తపతి' దాని కావైపున జ్ఞానలక్షణమగు నమృతము, ఈవైపున కర్మలక్షణమగు మృత్యువు వ్యాప్తములు; కనుక నది యటు బ్రహ్మకు, ఇటు కర్మకు ననుగ్రాహక మగుచున్నది. "తద్యత్కించార్వాచీన మాదిత్యాత్ సర్వం త న్మృత్యు నాప్తం" "ఆకృష్ణేనరజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యంచ" ఇ ట్లుభయధర్మావచ్ఛిన్న సూర్యతత్త్వము నుండి వెలసిన బుద్ధియు అమృతమృత్యుమయ బ్రహ్మకర్మలక్షణ సమ

న్వితయగుట ప్రకృతిసిద్ధము; బుద్ధి కేవల చాంద్ర పార్థివాది మృత్యుప్రధాన భావములనుండి వెలసిన మనస్సు - ఇంద్రియ వర్గము నను భౌతికశరీరరూప మృత్యుభావములున్నవి. ఆవల నమృతప్రధా నాత్మదేవత యున్నది. 'యోబుద్ధేఃపరతస్తుసః'.

అమృతమృత్యురూ పాధ్యాత్మిక విశ్వకేంద్రపతిష్ఠిత బుద్ధి తత్త్వము సూర్యున ట్లుభయ ధర్మాత్మక మగును. ఈ ప్రాకృతిక స్థితింబట్టియే యీ యుభయయోగము బుద్ధియోగ మంటిమి; మృత్యుప్రధాన కర్మయోగమున కేవలము భౌతిక సంపత్తి సామ్రాజ్యమును, అమృత ప్రధాన జ్ఞానయోగమున కేవలము పారలౌకిక నిశ్శ్రేయసభావ సామ్రాజ్యమును గలవు. వేయేల, కర్మయోగ మిహలోకము, జ్ఞానయోగ మాలోకము! ఇక; గీతానమ్మ తోభయ మూర్తి బుద్ధియోగ మిదియు నదియు నై యభ్యుదయ నిశ్శ్రేయసములు రెంటికిని ప్రాప్తి కారణ మగుచున్నది.

ఇంతకుదాత్పర్యము:- జ్ఞాతవ్యలక్షణత్రిబ్రహ్మ, కర్తవ్య లక్షణత్రికర్మ యను రెండువిభాగములనుండియు, త్రిబ్రహ్మ యందలి యవ్యయబ్రహ్మను, త్రికర్మయందలి బుద్ధియోగమును, నిరూపించుగీతాశాస్త్రము బ్రహ్మ — కర్మ శాస్త్రమునియే; ఈబ్రహ్మ — కర్మ పరీక్షయే యిపుడు కావలసినది. గీతా సమ్మత బ్రహ్మయేది? కర్మయేది? అను నీరెండు ప్రశ్నలకును సమాధానము లరసి యీ ప్రకరణమును ముగింతము.

వైదికమగు గీతదృష్టిలో విశ్వమూలము - ఉత్పాదకము,

కేవలబ్రహ్మయుగాదు కేవలకర్మయుగాదు, రెంటి సమష్టి యగు నాత్మబ్రహ్మయే ప్రధానమూలము. ప్రపంచమందు మనకగపడు విరుద్ధభావములు రెంటిలో నొకటి యాత్యంతికాపరివర్తనీయము; ఒకటి సర్వథా పరివర్తనీయము - అని జ్ఞానానుగతనిత్యవిజ్ఞానోపాసకులగు వైజ్ఞానికుల యభిప్రాయము.

విశ్వపదార్థములెల్ల యసద్వాదిమతమున క్షణికములన్నచో అట్టి యశాశ్వతత్వమునకు సత్తు నిత్యబ్రహ్మకాజాలదు; బ్రహ్మతత్త్వము, నిత్యశాంతము, ఏకము, అద్వయము దిగ్దేశకాల సంఖ్యాపరిమాణ, పృథక్త్వ, గురుత్వ, లఘుత్వోత్క్షేపణాద్యాకుంచనత్వ ప్రసారణాత్వాది ధర్మాసంస్పృష్టము. అసద్వాదికర్మతత్త్వమన్ననో ఇందుకన్ని విధముల వ్యతిరేకము. ఇట్టిచో పరివర్తనశీలమగు దానిని బ్రహ్మయనుటెట్లు? కనుక నది అపరివర్తనీయభావముకంటె వేరగువస్తు వనవలయును. అసద్వాది యసత్తు వలన బనిజరుగదు.

ఇక: సద్వాదులు; కేవలము సల్లక్షణాపరివర్తనశీల బ్రహ్మాతిరిక్తమేమియు లేదనుటయు నంతవిలువైనమాటకాదు. ప్రత్యక్షదృష్టాసంఖ్యపరివర్తనములు కేవలము కల్పనలను నభినివేశము ప్రౌఢివాదమాత్రము. కల్పన యన్నది వ్యాపారము; అది క్రియ, క్షణికము. బ్రహ్మయన్ననో, నిర్వ్యాపారము, నిష్క్రియము శాంతము గదా! ఈస్థితిలో బ్రహ్మవాదము సురక్షితమెట్లు? చివరకు పరివర్తనశీలప్రపంచములను బ్రహ్మ కన్యము

లుగ నంగీకరింపకతప్పదు. కేవలబ్రహ్మవాదముపై విశ్రమింప వలనుపడదు.

అసద్వాదులు, "ప్రపంచమసత్తు. ఏమియులేదు; అనుటకు విలువలేదు;" వారిదృష్టిలో 'అసత్తు' అనగా నభావము, కాని విజ్ఞానదృష్టి కాయర్థము విరుద్ధము; 'స్వసత్తాశూన్య' మని దానియర్థము; క్రియాతత్త్వమట్టిది. కనుక నది యసత్తు. బలము రసమునాశ్రయించును గాని దానికి స్వస్వరూపమున బ్రతిష్ఠయుండదు. కనుక పరివర్తనశీలమగు బలము నసత్తందురు. వస్తుతః 'అసత్తు' 'బల' మను నొక తాత్త్వికపదార్థమున్నది. అది రససత్తనాశ్రయించి సత్తుగ నగుచు ప్రత్యక్షదృష్టి కాలంబన (విషయ) మగుచున్నది. సత్తాశ్రితబలసంఘాతమునే మనము చర్మచక్షువుతో దర్శించుచున్నాము.

అసద్వాదిమతప్రకారము అసత్తన నభావమే యర్థమగుచో మన కేదియునగపడ కూడదు. అభావము ప్రతీతికి విషయము కాజాలదుకదా! రసాలంబనమున్ననే యది యగుపడును. అది రసగర్భమున సుప్తమగుచో తత్ప్రతీతి తిరోహితమే యగును; కానిందు ఈ చర్చ మరొకచో జూచుకొందము. ప్రస్తుతము: సదసత్తులు రెంటికి సమన్వయము నంగీకరింప వలయును. ఆ సమన్వితద్వైతమే సృష్టిమూల మనుకొనవలయును. అప్పుడన్నియు వ్యవస్థితములగును. చూడుడు:—

ప్రత్యక్షానుభూత సదసన్నామక రసబలతత్త్వములందు దేనినేని కాదనజాలము; ఉచ్ఛేద మొనరింపజాలము; ఉదా

కారణమునకు:— ఒకపుస్తకమున్నదనుకొనుడు, అందలి ప్రతి పరమాణువును ప్రతిక్షణమును మారుచున్నను అది నేడు, రేపు కొన్నిసంవత్సరముల వరకు గూడ కనుపట్టుచునే యుండును. అది మొదటి స్వరూపముతో నుండకుండుగాక, జివరకు మట్టియగుగాక! ఏదో యొకరూపమున దానిసత్త తప్పదు; సత్తాశ్రిత నామరూప పరివర్తన మున్నను, సత్తారసము సర్వథా అపరివర్తనీయశీలముగ నట్లే యున్నది.

బలగ్రంథి సురక్షితమృత్స్వరూపము, తద్గ్రంథివిమోకమున జల మగును. అబనుబంధిబలగ్రంథి విమోకమున జల మగ్నియగును; ఇట్లే ఆ యగ్ని వాయువు, వాయు వాకాశము, ఆకాశ మాత్మ యగును. ఆయాత్మయే, ఆసత్తారసమే రసబలగ్రంధుల తారతమ్యమున ఆకాశవా య్వగ్నిజల పృథివీ పుస్తకాది సర్వమునగుచున్నది. పదార్థము క్రమముగ అణు, రేణు, గుణభూతపరిణతి గాంచుచు సత్తారసగర్భమున లీనమై పోవునపుడు 'ఏమియులే' దందుము. అట్టిచో గూడ అస్తిలక్షణ సత్తాసామ్రాజ్య మున్నది. 'నాస్తి' యందును అస్త్యాకారకము 'అస్తి' అట్లే యున్నది. దానినాధారముగ గొనియే బలాత్మక నామరూపకర్మప్రపంచ పరివర్తనము జరుగుచుండును.

సృష్టిదశయందు సత్తారస మాయసద్బలముల గర్భమందుండును. ముక్తిదశయందు, అసద్బలము సత్తారస గర్భమందుండును. ఈగర్భభావ రహస్యము నెరుంగక విశుద్ధసద్వాది ముక్తిదశానుగత సత్తాబ్రహ్మ నెదుటనుంచుకొని యసద్బల

వాద ఖండనమును, విశుద్ధాసద్వాది సృష్టిదశానుగ తాసద్భ లము నెదుట నుంచికొని సద్వాదఖండనమును జేయుట తప్పు. వస్తుతః రెండుదశలందును రెండునున్నవి. అస్తినాస్తిరూప మున సర్వత్ర యవ్యభిచారముగ నుండు అస్థిరసము సత్తు. అస్థిరస నిగ్రహానుగ్రహములచే నాయాసమయములం దావి ర్భావతిరోభావము లొందు బల మసత్తు. సదసత్తుల బంధనము పేరు సృష్టి. బంధనముక్తిపేరు ముక్తి. "సతోబంధు మసతి నిరవిందన్" అను వైదికసిద్ధాంతమును మూలముగాగొన్న యీ ద్వైతవాదము నెవరుకాదన జాలుదురు?

గంగాప్రవాహము ప్రతిక్షణమును మారుచున్నది. కాని, ఎప్పుడు స్నానముచేసినవారయినను 'గంగాస్నానము గావిం చితి' మనుచున్నారు. ఈవచన మాసదసత్సమన్వితరూప కృపాఫలము. ప్రత్యక్షదృష్ట అప్పగివ ర్తనముతోగూడ సభి మాని, సత్తాసిద్ధ గంగాదేవతా సత్త నంగీకరింపనిచో నట్లనుట యసంభవము. కారణము? వందలకొలది మైళ్లదూరము ప్రవహించుగంగాజలమునం దొకేమారు స్నానమెవడైన జేయ గలడా? మఱి 'గంగాస్నానముచేసితి' ననుటకు బదులు "గంగలో నొకప్రదేశమున స్నానముచేసితి" ననవలయును. కానియట్లులేదు; ఇదితప్పా? అభిమానిదేవతానుగ్రహమున నిది పూర్తిగా సత్యము; దేవతయన్నది సత్తారూపము; తదీయ ఆపోమయ శరీర మసద్బలరూపము, సత్తపూర్ణము ఏకరసము. అందు ప్రదేశభావముండదు, వ్యాపకమగు నాసత్తాసంస్పర్శచే

స్నానకర్తకు గంగాస్నానాభిమాన ముదయించినది. అది మాన్యమే; గుడ్డయొకచో దగులబడినను గుడ్డదగులబడె నం దురుగదా; ఇదే 'పటోదగ్ధః' అను న్యాయము.

ఇంతకు నిష్కర్ష:— కార్యరూపవిశ్వమందు మనకగబడు రెండు విరుద్ధభావములం బట్టి కారణతత్త్వముం గూడ రెండు భాగము లనుకొనవలయును. 1. పరివర్తనశీల కార్యరూపా సత్తత్త్వ మూలకారణము ఆత్మప్రజాపతియొక్క యామృత్యు లక్షణ కర్మభాగము. 2. అపరివర్తనీయ కార్యరూప సద్భావ మూలకారణ సూయాత్మ ప్రజాపతియొక్క యమృతలక్షణ బ్రహ్మభాగము. బ్రహ్మ కర్మలక్షణైక ప్రజాపతికే యివి దివ్య, లౌకికములు రెండురూపములు. వీనినే ప్రకరణారంభమందే బ్రహ్మ - కర్మ; జ్ఞానక్రియల తాత్త్వికస్వరూప మను ప్రకరణ మున నిరూపించితిమి.

అహం (ఆత్మ) ప్రజాపతియొక్క లోకాతీతములు దివ్యములు నగు యీ రెండుపర్వములును వైదికపరిభాషానుసారము బ్రహ్మ కర్మలు, గీతంబట్టి అమృతమృత్యువులు అనియు కార్యరూప మున బరిణతమగు నాయహంయొక్క లోకాత్మకములు లౌకిక ములు నగు రెండుపర్వములును వైదికదృష్టిచే 'జ్ఞానక్రియలు; గీతాదృష్టిచే సదసత్తులు' అనియు అనబడెను. సృష్టిసీమకు లోపలియాత్మ లౌకికము. బాహ్యాఘటాత్మ దివ్యము, దివ్యము మూలము, లౌకికముతూలము. మూలాత్మ అమృతమృత్యు లక్షణముగల 'అహం'. తూలాత్మ సదసల్లక్షణ 'అహం'. అది

బ్రహ్మకర్మరూపము. ఇది జ్ఞానక్రియామయము. అహంభావముయొక్క యీదివ్య - లౌకిక వివర్తములను రెంటిని 'అమృతం చైవమృత్యుశ్చ సదసచ్చాహమర్జున' అని స్పష్టపరచెను.




క్రియాలక్షణము లేదా, (గీతాదృష్టితో) అసల్లక్షణమగువిశ్వము ప్రతిక్షణ విలక్షణము కాదని యెవరంగీకరింపరు? అన్నిపదార్థములును క్రియాదృష్టితో తప్పక క్షణికములే, అశాశ్వతములే, అనిత్యములే. ఇట్లే:– జ్ఞానలక్షణ లేదా, సల్లక్షణవిశ్వసత్తయు సర్వథా అపరివర్తనశీలయే. ఆ దృష్టితో సర్వపదార్థములు అక్షణములే, నిత్యములే, శాశ్వతములే. వివాదము? విశ్వమూలము కేవలము సత్తా? అసత్తా? రెంటిసముచ్చయమా? అనుటయందే. ఇది యీ ఆత్మ పర్వవివేచన ముచే సర్వథా నిర్ణీతమైయున్నది. 'సముచ్చయమే విశ్వమూల' మని కార్య ప్రపంచమునకు జెందిన రెండు విభిన్నదృష్టులే సిద్ధము గావింపజాలు ప్రమాణములు. విశ్వ మేకనియతి

యెన్నడును గాజాలదు. ద్వినియతియే యనవలయును. రెండు నియతులను (జ్ఞాన - క్రియా నియతులను) మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. ఇట్లు అన్ని విధములను ద్వైత కారణతావాదము సురక్షితమై యున్నది.

ఇక నద్వైతవాదము. ఇది యుపనిషత్తుల యొక్కయు తదనుగత గీత యొక్కయు ముఖ్యవాదము. ఇట్టిచో శ్రుతి స్మృతివిరుద్ధమగు ద్వైతమెట్లు ప్రామాణికము? ఇంచుక తాళినచో నిట్టి ప్రశ్నలకు సమాధానము బడయుదుము. ప్రస్తుతమింకను కొంచెము ద్వైతసమర్థనమునందే విచారణ సేయవలసి యున్నది.

వేదశాస్త్రమునందు సత్ - అసత్ - సదసద్వాదములను మూటిని సమర్థించు వచనములున్నవని వెనుకనే యెరింగితిమి. మఱి వానియందలి నిష్కర్షయేమో యందం దుదహరించిన వచనార్థములను బట్టి యిట దెల్సుకొనుట యావశ్యకము.

## 1. సద్వాద సమర్థక వచనములు

1. అసన్నేవసభవతి అసద్బ్రహ్మేతి వేదచేత్.
అస్తిబ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతోవిదుః.

అసద్వాదియగు నాస్తికుడెవడైన బ్రహ్మ 'యసత్' అనుకొనుచో, లేదా 'అసత్తే బ్రహ్మ' యనుకొనుచో వాడు స్వయముగా గూడ నసత్తే యగుచున్నాడు. అనగా వాడును వాని

యసద్వాదము గూడ 'నేమియు లేదు'. ఇక:— సద్వాదియగు ఆస్తికుడు బ్రహ్మ 'అస్తి' (సత్) అనుకొనుచో, లేదా అస్తియే బ్రహ్మ యనుకొనుచో (బ్రహ్మ=మూలకారణము) విద్వాంసు లట్టివానిని 'సంత' యనగా ఉన్నవానిగా నెంతురు. 'అస్తియే బ్రహ్మ - సద్రూపము'

2. యో నఃపితా జనితా యోవిధాతా యోనః సతో అభ్యాసజ్జజాన,

ఏ సద్బ్రహ్మ తన యక్షరరూపముచే అస్మదాదచరాచరముల కన్నిటికి స్థితికారణమై పాలకమై పితయై యున్నదో! ఏది తన క్షరరూపముచే మన యందర కుపాదానకారణమై జనితయై యున్నదో, ఏది తన యవ్యయరూపముచే మన కాలంబనము (ప్రతిష్ఠ - ఆధారము) నై విధాతగ నున్నదో అదియే తన సద్భాగముం గాని (సద్భాగమునుండియే) యీ సద్విశ్వముం బుట్టించెను. 'సద్బ్రహ్మయే సద్విశ్వమూలకారణము'

3. సదేవేదమగ్ర సౌమ్య ఆసీత్ కథంత్వసతః సజ్జాయేత!

ఈ దృశ్య ప్రపంచ మూలకారణము మొదట సత్తుగనే యుండెను. అసత్తునుండి సత్తెట్లు పుట్టును. 'ఇదమస్తి' యను రూపమున నీ విశ్వము సద్రూపముగ నగపడుచున్నదిగదా! మరియు, కారణగుణములే కార్యారంభకములు నగుట ప్రసిద్ధము. కనుక అసన్మూలమునుండి సత్తుదయింపదు. 'సత్కార్యమూలము సత్తే'

## 2. అసద్వాద సమర్థక వచనములు

1. దేవానాం పూర్వ్యేయుగే అసతః సదజాయత.

దేవతల పూర్వయుగమున (సృష్టికి పూర్వము - ఉపక్రమమున) అసత్ (కారణము) నుండి సత్తు (వలె నగపడుచు వస్తుతః అసత్తు అగు విశ్వము) జనించెను. ధారావాహి కాసద్బలము కృపచే మనము సత్తనుకొనున దెల్ల సృష్టిపూర్వ మసద్రూపముగ నుండెను. ఏమియు లేకుండెను. అంతవరకేల, వెనుకటి ప్రపంచ మిప్పుడున్నదా? అప్పటి దిప్పుడున్నదా? పూర్వోత్తరాసత్ క్షణ మధ్యగత సత్ క్షణము కూడ నసత్తే. విశ్వమసత్తు, అసత్తే క్రియ - అది క్షణికము. ఇక సద్భావ మెక్కడ?

కుమ్మరి కుండకువలె ప్రాగభావము కారణమగును. ఘటాభావమే ఘటకారణ మగును. లేనిదే పుట్టును. ఉన్నదానికి బుట్టుకయేమి? కనుక జగత్కారణ మసత్తే 'అసత్కారణము నుండియే సత్కార్యోత్పత్తి'.

2. అసదేవేదమగ్రఆసీత్ అసతో వై సదజాయత,

కార్యరూపముచే సద్రూపముగ నగపడు నీవిశ్వము మొదట నసత్తుగనే యుండెను.

3. ఇదం వా అగ్రే నైవ కించ నాసీత్ న ద్యౌ రాసీన్న పృథివీ,
నాంతరిక్షమ్ తదసదేవ సన్మనో[illegible] స్యామ్' ఇతి.

ఈ జగత్తు మొదట (కారణావస్థయందు) ఏమియు లేకుండెను. (అసత్తుగ నుండెను.) అప్పుడు ద్యులోకము, పృథివి - అంతరిక్షము లేవు. (మనోరూపముగ నున్న) ఆ యసత్తే విశ్వమయ్యెద ననుకొనెను.

3. సదసద్వాద సమర్థక వచనములు

1. నైవవా ఇదమగ్రేఽసదాసీత్ నైవసదాసీత్,
అసీదివవా ఇదమగ్రే నైవాసీత్.

మనకు సద్రూపమున నగపడు నీవిశ్వము పూర్వము (కారణావస్థయందు) అసత్తుగ సత్తును గాకుండెను. ఉన్నట్టున్నను లేనట్లు యుండెను. అనగా, విశ్వకారణము సదసద్రూపము. కనుక దాని నెవ్వరొకరేట కారణముగలదిగ చెప్పవీలులే దని భావము.

2. అసదేవేదమగ్ర ఆసీత్, తత్సదాసీత్,
తత్సమభవత్, తదాండం నిరవర్తత.

మొదట (కారణావస్థయందు) నిదియంతయు అసత్తుగనే యుండెను. అది (కారణము) సత్తుగకూడ నుండెను. సదసద్రూపములగు నా రెండు తత్త్వములును పరస్పరము గలిసినవి. ఈ సమన్వయమువలననే అండం (బ్రహ్మాండ) స్వరూపము సంపన్న మయ్యెను.

3. సతోబంధు మసతినిరవిందన్,

సత్తున కసత్తునందు బంధుత్వము (బంధనలక్షణామైత్రి) అగ పడినది. అనగా సత్తు అసత్తునందు గలసిపోయినది. ఈ సమన్వయమువలననే (సదసద్రూప కారణబ్రహ్మ తనయందలి సృష్టికామన సఫలము గావింపజాలినది. ఈసిద్ధాంతమునే 'సతశ్చ యోని మసతశ్చవివః' అను శ్రుత్యంతరము వ్యక్తపరచెను.

శ్రుతి సమన్వయము

మూడు వాదములకు మూడేసి ప్రామాణికవచనము లుదహరింపబడినవి. శ్రుతియందలి ప్రత్యక్షరమును ఆస్తికునకు ప్రమాణము, స్వతః ప్రమాణము. తద్వచనము లిట్లు విరుద్ధములుగ నున్నవి. ఈచిక్కువదల్చుకొనుటకు బ్రహ్మ - కర్మలక్షణాద్వైతవాదమే యుపాయము. దానింబట్టినచో ఈరెండు వాదములను సమర్థించువచనములును సమన్వితములగును. ఇట నిట్లనుకొనవచ్చును.

రంగులసిద్ధాంతముం బ్రతిపాదింప నెంచువాడు:-

1. తెలుపు నలుపు గలిసినచో నితరవర్ణములు కల్గును: – సదసద్వాదము.

2. తెలుపునుండి యితరవర్ణవికాసము కల్గును:– సద్వాదము.

3. నలుపునుండి యితరవర్ణవికాసము కల్గును:– అసద్వాదము.

4. ప్రత్యేకము తెలుపు నలుపులవలన వర్ణవికాసము కలుగదు:– కేవల మేదియు గాదు.

వరుసగ వీనికి:—

1. సతోబంధు మసతినిరవిందన్ = సదసత్తులచేవిశ్వము,

2. యో నః సతో అభ్యాసజ్జజాన = సత్తునుండివిశ్వము,

3. దేవానాం పూర్వ్యేయుగే అసతః సదజాయత = అసత్తునుండి విశ్వము

4. నైవవా ఇదమగ్రే ఽసదాసీత్, నైవసదాసీత్ = విశ్వము సత్తునుండియు గాదు, అసత్తునుండియు గాదు.

ఇందువలన నేను మేనోఁయొకటి కారణ మనుకొనుట తప్పనియు, సదసద్వాదము నంగీకరించిననే శ్రుతివచనము లన్నియు సమన్వితము లగుననియు దేలును. కాని పైని చూపిన సమన్వయము కేవలము 'తుష్యతుదుర్జనః' న్యాయము నకు జెందినది. వస్తుతః, పైనుదహరించిన వాక్యములన్నియు సదసద్వాదమునే సమర్థించుచున్నది. విరోధమే లేదు. అట్టిచో సమన్వయించు పనియే లేదు. ఎట్లన:-

'ఆసన్నేవ' అను శ్రుతి, శ్రమణ కాభిమత అసద్వాదమును ఖండించుచున్నది; వారియసత్తు 'శూన్యంశూన్యం' అగు అభావా త్మకమని యీవరకే చెప్పియుంటిమి. శ్రుతి 'అసత్తు' అభావరూపము కాదు; భావాత్మకమే! సత్తాసిద్ధమే! కనుకనే సత్తు, ఈ సబ్రహ్మకే రస-బలములు రెండుపర్వములు; ఇందు రసమే 'అస్తి' అయ్యును, అసద్బలతత్త్వవిశేషము [illegible] గర్భిత [illegible] న్యాయమునే 'అస్తి' [illegible]

క్రాంతమై తద్రూప (సద్రూప) మే యగును; ఈసత్తాశ్రయము ననే నామరూపాత్మ కానద్విశ్వము 'నామరూపే సత్యమ్' అను శ్రుత్యంత రానుసారము, సత్య మనఁ దుమున్నది. ఇక శ్రుతి యభిప్రాయ మనర్థండన మగుచో విశ్వమును సత్యమనదు; అందుచేఁ గేతనిషేధపే సద్వాదముగాని యసద్వాదము నే సమర్థించుచున్నది. శ్రుతివిరోధ మసద్వాదమునకు మాత్రమే. ఆ యసద్వాదము నాస్తికుల యభిప్రాయము. సత్తునాశ్రయ ముగఁ గొన్న అసద్బులమున్ననో శ్రుతిస్పష్టించుటకై సద్రూపమునకు అస్తిబ్రహ్మయందే అంతర్భూతము.

ఇక నసద్వాద వచనములకు నిర్దేశిత. 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' అను శ్రుతియందలి యసచ్ఛబ్దము అసద్వాదానుగాము యగు నసత్త్వ వాచకము కాదు. అది విశ్వాభావ సూచనా మాత్రము 'ఈవిశ్వము కారణదశయందిట్టు లే' దనుటయే దాని భావము. సత్తు=విద్యమాన భౌతికపదార్థము, అసత్తు=అభావము అని విశ్వమర్యాదలోని సాధారణమనుజుల సదసచ్ఛబ్దార్థములు.

మఱి:—విశ్వసీమకావలివియు, విశ్వసీమయందే యుండు నవియునగు సదసద్ద్వంద్వ స్వరూపము సాధారణు లెఱుగజాలరు; విశ్వపదార్థ స్వరూపనిర్మాణము గావించునవియు; నిర్మాణము గావించి తద్రూపముననే యుండునవియు నగు సోపాధిక సదసద్ద్వంద్వమునైనను వారెఱుంగజాలరు. కనుక, ఈయవిజ్ఞేయతను స్పష్టీకరింపనే శ్రుతి 'అసత్' అనవలసివచ్చెను. ఏమన:—

లౌకికమనుష్యుల దృష్టి కేవలము - ఉండుట (విద్యమానము)- లేకుండుట (అభావము) అనుకొనుటతోడనే సదసచ్ఛబ్దార్థము లుగ నెంచియున్నది. అప్పుడుశ్రుతి "తప్పు. మీరనుకొన్న సత్తు సత్తుకాదు. అస త్తసత్తు కాదు." అవి మీ రనుకొను భావాభావరూప సదసత్తులకంటె విలక్షణములు అనుచు, మరే మన్నచో 'అసత్' అనగా 'మీరనుకొన్నది కాదు' అన్నది. ఇదే. సాధారణమనుష్యులకు జెందిన యసత్తునకు దాత్పర్యము.

ఇట్లుచెప్పి శ్రుతి తత్త్వరూపములును, లౌకికములగు జ్ఞాన - క్రియాత్మకములునుఅగు, సదసద్భావములవంకకు గొంపోవు చున్నది. ఇంకను, ఆ జ్ఞాన -క్రియారూప సదసత్తులతో విశ్ర మించువారిని అచింత్యములు విశ్వాతీతములు నగు బ్రహ్మ కర్మలు, లేక రస - బలములు, రూపములుగ గల సదసత్తుల వంకకు గొంపోనెంచి 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' అనియెను. ఈ పక్షమునందు —

అసత్ అనగా:- "విశ్వ పదార్థములంజూచి సదసత్తులకు మీ రనుకొన్న స్వరూపములు విశ్వాతీతములు, కారణరూపములు నగు నా సదసద్భావ స్వరూపముకంటె బొత్తిగా విలక్షణములు. మీరు స త్తనుకొనుజ్ఞానము, అస త్తనుకొన్నక్రియ, ఈరెండును సోపాధికములు, నానాభావయుక్తములు, కార్యరూపములు. విశ్వమునకు బూర్వ మీసోపాధికభావములేదు. అప్పుడున్న నిరుపాధికభావ మసత్తు = అనిర్వచనీయము, అచింత్యము. విశ్వమునకు బూర్వమేకాదు, కారణదృష్టితోనైనచో నేడైనను

అయ్యది మీ కచింత్యమే యగుచున్నది. అది కేవలము ఈ కార్యరూప (జ్ఞానక్రియారూప) సదసత్తులకంటె నొకానొక విలక్షణ సదసత్తుగావచ్చును. కాని, వ్యవహారమునందు దానిని 'అసత్' అనియే అందుము" అని తాత్పర్యము - కనుకనే శ్రుతి మరల "-నైవవా ఇదమగ్రేఽ సదాసీత్ - నైవసదాసీత్ - ఆసీదివవా ఇదమగ్రే నైవాసీత్" అనియెను. ఇందు అవిజ్ఞేయత స్పష్టముగనే ప్రతిపాదింపబడినది! అసత్తన అచింత్యభావమనుకొన్ననే శ్రుతి సమన్వయము కుదురును.

సామాన్యులు 'అసత్' అనగా నభావమనియో, కేవలము కర్మయనియో అనుకొందురను నాశంకను దూరము సేయనే శ్రుతి, ఆ రెండర్థములను గాదని యాశబ్దము, విశ్వాతీతము అచింత్యము, బ్రహ్మకర్మాత్మకమునగు నొకానొక సత్తత్త్వమనియే అనుమానము ద్వారా స్పష్టీకరించుచు-

'అసదేవేదమగ్రఆసీత్, తత్సదాసీత్, కథంత్వసతః సజ్జాయేత? అనవలసివచ్చెను. "సృష్టికిముందసత్తుండెను; కాని యది యభావలక్షణాసత్తుకాదు; సద్రూపము; మనకు బోధపడనందున అసత్తందుము; (అవిజ్ఞేయము) అసత్తన నభావమే యగుచో నభావమునుండి సృష్టి యసంభవము; అభావమునుండి భావమెట్లు? ఈవిధముగ సద్వాదాసద్వాదశ్రుతులు సదసద్వాదమునే సమర్థించునని తెలుచుండగ, విరోధమునులేదు. తత్పరిహారణావశ్యకమును లేదు.

ఇట్లు విచారించినకొలదియు, సదసద్వాదలక్షణ బ్రహ్మ

కర్మవాదమే స్థిరపడుచున్నది. విశ్వాతీత (పరాత్పర) విశ్వేశ్వర (ఈశ్వర) శరీరేశ్వర (జీవ) విశ్వ (జగత్) అను నీనాల్గును సదసద్రూపము లగుటేకాక, వ్యష్టిదృష్టింజూచినను, ఈ ద్విసత్యవాదమే సాక్షాత్కరించును. రెండులేని పదార్థమే లేదు. సదసత్సమన్వితావస్థయే పదార్థమున కవచ్ఛేదకము; జ్ఞానలక్షణ బ్రహ్మ, క్రియాలక్షణకర్మ సమష్టిరూప పదమే, తన యర్థముంగలిగి పదార్థమనిపించుకొనుటయే పదార్థత్వము; కారణాత్మకములగు నీబ్రహ్మకర్మలం గూర్చి గీతంబట్టి అమృతమృత్యుశబ్దములు నిరూఢములు; ఈనిరూఢి శ్రుతిచేగూడ ప్రమాణితము.

## బ్రహ్మ - కర్మల విలక్షణ సంబంధము

అమృత మభయము, ఇదే బ్రహ్మ; మృత్యువేకర్మ' లేదా, కర్మపేరేమృత్యువు. ఇదిక్షణికము; సదాకుర్వద్రూపము; ఆవిర్భావతిరోభావములే దీనిస్వరూపలక్షణము; క్షణమైనను దీనికి స్వాతంత్ర్యసత్త లేదు. ఎల్లపుడును వినశ్యదవస్థా క్రాంతమై యుండును: చచ్చియుండునదగుట మృత్యువనదగును: బ్రహ్మతత్త్వమో శాశ్వతము. మారనిది; కనుక అమృత మనదగును. గీతయందమృతమృత్యుశబ్దములు గలచోటులందెల్ల నీకారణాత్మక బ్రహ్మ - కర్మవాచకములనియే యెరుంగనగును. అత్యంత విరుద్ధములయ్యు నియ్యవి యేకబిందుసమన్వితములు. ఎంతవింత!

ఆశ్చర్యవత్పశ్యతికశ్చిదేనమ్,
ఆశ్చర్యవద్వదతితథైవచాన్యః,
ఆశ్చర్యవచ్చైనమన్యఃశృణోతి,
శ్రుత్వాప్యేనంవేదనచైవకశ్చిత్.

అమృతమెంతో మృత్యువునంతే; రెండును సమానవ్యాప్తి గలవి. శాంతమగు నంగుళి యం దమృతము. అందలి 'కదలుట' యనుక్రియ మృత్యువు, అమృతమందలి మృత్యు సుప్తావస్థ బలము, కర్మ్యదూరావస్థ ప్రాణము; అది యాధారమును విడచు నవస్థ క్రియ; ఇట్లొకేమృత్యువునకు సుప్తి - జాగృతి - వినిర్గతి - భేదముచే గ్రమముగ బల - ప్రాణ - క్రియ లను మూడవస్థలు.

అంగుళియందలి కదలుటయను క్రియకు అంగుళియం దే ప్రదేశమాధారము? అన్నచో, అంగుళియెంతో క్రియయునంతే, అంగుళియందుక్రియ, క్రియయందంగుళి, రెంటనురెండు నున్నవి. రెండును ఆధారములు, ఆధేయములును. ఒకటి యాధారము నొకటియాధేయమును గాదు. ఎంతయాశ్చర్యము ! ఎంత విలక్షణసంబంధము! ! అమృతమృత్యువుల విషయమునని౦తే. దీనినే అంతరాంతరీభావ సంబంధమందురు, ఈవచనములిట నవధేయములు.

1. అంతరంమృత్యో రమృతం, మృత్యా వమృత మాహితమ్,
మృత్యుర్వివస్వంతంవస్తే మృత్యోరాత్మావివస్వతి.

2. తదేజతి – తన్నైజతి, తద్దూరే తద్వన్తికే,
తదంతరస్యసర్వస్య తదుసర్వస్య బాహ్యతః.

నేటి పదార్థతత్త్వవాదు లీ సంబంధము విజ్ఞానవిరుద్ధము అప్రామాణికము నందురు. కాని భారతీయ వైదికమర్యాదకు జెందిన లక్షణ దృష్టిచే నీ విషయమున జెప్పవలసినది లేదు. (ఇదియొక స్వతంత్రవిషయము) పదార్థలక్షణము 'ధామచ్ఛద' మగుచో నాసంబంధము వాస్తవముగ కల్పనయగును. అమృత మొక పదార్థము. మృత్యు వొక పదార్థము. ధామచ్ఛద పదార్థ మొకటి యున్నచోట అట్టిదే రెండవది యిముడ జాలదు. అట్టియెడ నాసంబంధ మాధునికవిజ్ఞానదృష్టికి సరిపడక పోవచ్చును. కాని:—

ధామచ్ఛదమును పదార్థలక్షణముగా నంగీకరింపని భారతీయమహర్షుల దృష్టియందు అమృతమృత్యువుల యంతరాంతరీభావసంబంధము ఘటిల్లును. మన విజ్ఞానకాండయందు పదార్థవర్గము జ్ఞాన - క్రియార్థమయ భేదములచే మూడుభాగములు. ఇందు జ్ఞానక్రియలు ధామచ్ఛదములు కాజాలవు. ఇక నర్థవర్గము:— భూత భౌతిక ప్రపంచమే అర్థము. దీని కవాంతర జాతులు ఆకాశ, వాయు, తేజో, జల, పృథువులు అయిదు. ఇందును, ఆకాశ తేజము లధామచ్ఛదములు. ఇక మిగిలిన వాయు జల పృథువులను వివర్తములే ధామచ్ఛదములు. ఇపుడు మన జ్ఞానమయామృత తత్త్వము, క్రియామయ మృత్యుతత్త్వము, ధామచ్ఛదమర్యాదాబాహ్యములు. కనుక వీని

సంబంధమునం దాపత్తి కలుగజాలదు. (ఇందుకు విస్తరము మరొకచో జూచుకొందము)

ఇప్పుడు విరుద్ధభావద్వయమూర్తియగు కార్యరూప సృష్టి మూలకారణములు రెండని సిద్ధమైనది. గీతంబట్టి యవి అమృత మృత్యువులు, బ్రహ్మకర్మలు. ఇందు— కారణమగు బ్రహ్మకు విశ్వాతీత (పరాత్పర) - విశ్వనియంత ఈశ్వర - శరీరసంచాలక జీవ - ఈశ్వరాయతనరూప విశ్వము లను నాల్గుసంస్థలనియు, అందు విభక్తమగు బ్రహ్మ విభిన్ననామరూప పరిణతి నొందు ననియు వెనుక జెప్పియుంటిమి. ఇవుడు, ఆ విభిన్న - నియత నామములను గూడ దెలిసికొందము.

విశ్వాతీతబ్రహ్మ; పరాత్పర నామము నొందినట్లు గీతా పరిభాషానుసార మీశ్వర - జీవ - జగత్తులు క్రమముగ అవ్యయ- అక్షర - క్షర నామములచే వ్యవహరింపబడునని 'బిభర్త్యవ్యయ ఈశ్వరః' 'ప్రకృతిం విద్ధిమేపరాం జీవభూతాం' 'క్షరః సర్వాణి భూతాని' ఇత్యాదులచే స్పష్టమగును. ఈ మూడుసంస్థలందును ప్రత్యేకముగ అవ్యయ (జ్ఞాన) అక్షర (క్రియా) క్షర (అర్థ) మూర్తి త్రిబ్రహ్మ - త్రికర్మ లక్షణాత్మప్రజాపతి సత్తయున్నను ప్రధానతాప్రధానతల తారతమ్యముంబట్టియే, 1. అక్షర క్షర గర్భితావ్యయ ప్రధానేశ్వరు నవ్యయనామమునను, 2. అవ్యయ- క్షరగర్భితాక్షర ప్రధాన జీవు నక్షరనామమునను, 3. అవ్య యాక్షర గర్భిత క్షర ప్రధానవిశ్వమును క్షర నామమునను వ్యవహరించిరని ఈ పరిలేఖయందు దెలియనగును.

బ్రహ్మకర్మ నియతభావములు.

| | | |
|---|---|---|
| 1<br>విశ్వాతీత<br>పరాత్పరునందు, | నియతములు<br>1 రసః—<br>2 బలమ్— | అనియతములు.<br>1 అభ్వాజ్యోతిః, అనిరుక్తం,<br>విద్యా - బ్రహ్మ - సత్ |
| 2<br>ఈశ్వరావ్యయునందు, | అమృతం—<br>మృత్యుః— | 2 అభ్వం—తమః—నిరుక్తం—<br>వీర్యం—కర్మ—అసత్ |
| 3<br>జీవాత్మునందు, | విద్యా—<br>అవిద్యా— | |
| 4<br>జగత్క్షరమందు, | సంభూతిః—<br>వినాశః— | |

ఇట్లే పై 2, 3, 4లకును నెరుంగవలయును. ఇవి యన్నియు నా యా దశానుకూలముగ నన్నిటికిని కల్గుచుండును.

# వేదప్రతిపాదితత్రిబ్రహ్మసంస్థ

ఈనాల్గు బ్రహ్మకర్మ సంస్థలందును పరాత్పరనామక ప్రథమ సంస్థ అనిర్వచనీయము. దీనిం గూర్చి అనిర్వచనీయ, అచింత్య, అవిజ్ఞేయాది శబ్దము లుపయోగించును. ఇక నిరూపణీయ కోటికి జెందినది ఈశ్వరజీవజగల్లక్షణావ్యయాక్షరక్షర నామక సంస్థాత్రయము. ఈమూటి నిరూపణతో బ్రహ్మకర్మ పదార్థ నిరూపణ చరితార్థమగును. వేదమునందు, తదనుగామియగు గీతయందు నీమూడు సోపాధికబ్రహ్మకర్మసంస్థల నిరూపణయే

జరిగినది. భేదమేమన:— వేదమునందు - ఉపనిషద్భాగమునందు సంక్షిప్తభాషలో నున్నదానిని గీతవిస్తరించుటయే. మొదట వేదప్రతిపాదిత సంస్థలను విచారింతము. ఇంతవరకు బూర్వము "అంతరంమృత్యోరమృతం మృత్యావమృతమాహితం" ఇత్యాదిగ కేవలమవ్యయ సంస్థాదిగ్దర్శనమే కావించితిమి. కాని యిప్పుడు క్రమబద్ధముగ మూటిని నిరూపింతుము. మొదటి దవ్యయసంస్థ:—

1. అమృత – మృత్యులక్షణావ్యయ,

(బ్రహ్మసమర్థక వచనములు.)

1. యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ,
మృత్యోః స మృత్యుమాప్నోతి యఇహ నానేవపశ్యతి.

మన మీప్రపంచమునం దేకత్వ నిబంధనానేకత్వముం జూచుచున్నాము. దీనినే దార్శనికులు సామాన్యవిశేషభావ మందురు. సామాన్యదృష్టి యేకత్వమూల 'జాతికిని' విశేష భావము అనేకత్వనిబంధన 'వ్యక్తికిని' జెందినవి, అది యమృత నిబంధన, యిది మృత్యునిబంధన. ఇట్లు అవ్యయబ్రహ్మయొక్క అమృతమృత్యులక్షణ బ్రహ్మకర్మ పర్వములను రెంటిని దర్శించు చున్నాము.

పదార్థములయందు సామాన్యముగనుండు పదార్థత్వ మన్నిటను సమానము. అభిన్నము. దానిచే నన్నిపదార్థములు నేక రూపములు. ఈసామాన్యధర్మమందు నానాత్వ ప్రవేశము

లేదు. ఇది యమృతదృష్టి - ఇదే అవ్యయుని యమృత భాగము. పదార్థములను జడచేతన విభాగము చేసినపుడు దీనికి నా రెండుభేదములు గల్గును. అప్పుడది నానాభావలక్షణ మృత్యురూప పరిణతి మగుచున్నది. పిదప, యావజ్జడపదార్థమునకు నమృతలక్షణ సామాన్యధర్మము జడత్వము. పాషాణత్వ, ఘటత్వ, మఠత్వ, పటత్వాది మృత్యులక్షణము విశేషధర్మమగును. ఇట్లే: చేతనత్వము యావచ్చేతన పదార్థములకు నమృతలక్షణ సామాన్యధర్మము - మనుష్యత్వ పశుత్వ క్రిమిత్వాదులు మృత్యులక్షణ విశేషధర్మములు - పాషాణత్వ - ఘటత్వాదులున్నియు పాషాణఘటాదులకు సామాన్యములు. పర్వతత్వ - లోష్టత్వ - శరావత్వాదులు విశేష ధర్మములు. మనుష్యత్వ పశుత్వాదులు మనుష్య - పశు మాత్రాది సామాన్యధర్మములు. బ్రాహ్మణత్వ క్షత్రియత్వ - అశ్వత్వగోత్వాదులు విశేషధర్మములు.

మనుష్యత్వము మనుష్యమాత్ర సామాన్యధర్మము. దేవదత్తత్వ, యజ్ఞదత్తత్వాదులు విశేషధర్మములు. దేవదత్తత్వము సామాన్యధర్మము. కర్ణత్వ - శ్రోత్రత్వ - చక్షుత్వాదులు విశేషధర్మములు. ఇట్లుండుటంబట్టి విశ్వపదార్థములెల్ల సామాన్యవిశేషభావ నిత్యయుక్తములుగ నుండును. దార్శనికులు:— ఎన్నడును విశేషముగాని మహాసామాన్యమును (మహతోమహీయాన్) దీనినే పరమసామాన్యము, సత్తాసామాన్యము మొదలగు నామములచే వ్యవహరింతురు.

ఎన్నడును సామాన్యముగాని యొక పరమవిశేషము లేదా అంతిమసామాన్యము. (అణోరణీయాన్) సత్తావిశేషమును అంగీకరింతురు. అది యట్లే ఇదియిట్లే యుండునని వారందురు. గాని, మధ్యనున్న పదార్థములెల్ల అపేక్షానుసారముగ సామాన్యములు విశేషములు నైయున్నవి.

దార్శనికులయీసిద్ధాంతయుక్తిచే "సామాన్యవిశేషభావబోధ సులభముగానగును." అని సమర్థింపవచ్చును. కాని, పారమార్థికవైజ్ఞానికదృష్టిచే, పరమసామాన్యము. పరమవిశేషమును, పరమవిశేషము పరమసామాన్యమునుగూడ నైయున్నవి. ఒకేతత్త్వము, తనసామాన్యామృతభావముచే పరమసామాన్యమును, విశేషమృత్యుభావముచే పరమవిశేషమునై యుభయమూర్తియై యున్నది. కనుకనే "అణోరణీయాన్ మహతోమహీయాన్ ఆత్మాస్యజంతోర్నిహితోగుహాయామ్" అనువాక్యము చరితార్థమగుచున్నది. ఇంతకు:- జెప్పదలచినది. చరాచరపదార్థములందు సాపేక్షాభావముననున్న సామాన్యభావ మేకత్వప్రయోజకమగుచు అమృతలక్షణ బ్రహ్మగను విశేషభావ మనేకత్వప్రయోజకమగుచు మృత్యులక్షణకర్మగను నున్నవనియే. ఈరెండు భావములు ప్రత్యక్షానుభూతములు. ఈవిధముగ అమృతమృత్యులక్షణావ్యయేశ్వరుని దర్శించుచున్నాము.

2. ప్రతిబోధవిదితం మతమమృతత్త్వం హి విందతే
ఆత్మనా విందతే వీర్యం, విద్యయా విందతేఽమృతమ్.

పూర్వోక్త సామాన్యవిశేష నిబంధామృతమృత్యుభావములద్వారా ప్రతియొకబోధయందు-ప్రతియొకజ్ఞానమందును, ఆయవ్యయబ్రహ్మ ప్రతిష్ఠితమై యున్నదను దృష్టితోజూచిన నమృతత్వముప్రాప్తించును; అమృతాత్మద్వారా, అనగా, అమృతమృత్యురూపమగు నాత్మయొక్క అమృతభాగము ద్వారా, వీర్యరూపమృత్యుభావము, (మృత్యుతత్త్వసమ్యగ్బోధ) కలుగును. విద్యద్వారా అమృతత్వప్రాప్తి యగును.

విద్యావిద్యాలక్షణాక్షరబ్రహ్మ సమర్థకవచనములు.

1. అంధంతమఃప్రవిశన్తి యే ఽవిద్యాముపాసతే,
తతోభూయఇవతే తమోయఉవిద్యాయాంరతాః.

2. అన్యదేవాహుర్విద్యయా అన్యదేవాహురవిద్యయా,
ఇతిశుశ్రుమధీరాణాం యేనస్తద్వ్యాచచక్షిరే.

3. విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయంసహ,
అవిద్యయామృత్యుంతీర్త్వా విద్యయామృతమశ్నుతే.

1 విద్యావిద్యా సమన్వయ మాత్మపూర్ణభావ వికాసకారణము. అక్షరబ్రహ్మయే అవ్యయబ్రహ్మప్రాప్తికి ప్రధాన సాధనము. కనుక, నాయక్షరావిద్యావిద్యా రూపోపాసన యున్నగాని యవ్యయుని పూర్ణవికాస ముండదు. 2 అక్షరతత్త్వము, విద్యామాత్రముగాదు; అవిద్యామాత్రమునుగాదు. ఆరెంటికంటె వేరైనదియు, ఉభయరూపమునని పెద్దలుచెప్పిరి. 3 ఈశ్వరున కవ్యయసంస్థతోడను, జీవున కక్షరసంస్థతోడను

ప్రధానసంబంధము కనుక, అక్షరబ్రహ్మాత్మ (జీవాత్మ) వాస్తవముగ విద్యావిద్యాత్మకమే. తన యీ భాగములచే (జ్ఞాన - కర్మలచే) ఆ యుపాస్యనుగు, అమృతమృత్యుంకమగు నావ్యయేశ్వరునితో సమానలయభావము నొందుట జీవుని పరమపురుషార్థము. ఇంతకును:- జీవుడు తన యవిద్యా (కర్మ) భాగముచే నవ్యయుని మృత్యుభాగమును వశముగావించుకొని, విద్యా (జ్ఞాన) భాగముచే తదీయామృతత్వమునొంది కృతకృత్యుడగును. జీవాక్షరసంబంధి విద్యావిద్యాభాగములే ఈశ్వరావ్యయామృతమృత్యుభావప్రాప్తి కారణములని నిష్కర్ష.

అవ్యయాత్మప్రాప్తికొరకే దశయందైనను, విద్యావిద్యా సముచ్చయానుగమనము గావలసినదే. అవిద్య కర్మను సూచించును. కర్మలేక యెన్నడును నైష్కర్మ్యసంపత్తి లభింపజాలదు. కర్మానుగమనము లేక కేవలవిద్యా (జ్ఞాన) పారాయణముచే నేమియుగాదు. ఈశ్వరుని, కర్మరూపార్థభాగనిందకులు 'అది అనుపయుక్తము, మిథ్య' యనువారు ఆత్మబోధవంచితులు; జ్ఞానరూపార్థభాగము నుపేక్షసేయు, విశుద్ధకర్మవాదులు, నాస్తికులును సదా, "శూన్యం, శూన్యమ్, దుఃఖం, దుఃఖమ్" పురస్కారమునకు పాత్రులునగుదురు. ఈశ్రౌతోపనిషద్వచనము ననుగమించు నీస్మార్తోపనిషద్వచనమిట ననగేమి:

'నకర్మణామనారంభా న్నైష్కర్మ్యంపురుషోఽ. శ్నుతే,
నచ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి'.

## సంభూతివినాశలక్షణ క్షరబ్రహ్మ సమర్థక వచనములు.

1. అంధంతమః ప్రవిశన్తి యేఽసంభూతిముపాసతే,
తతో భూయఇవతే యఉసంభూత్యాం రతాః.

2. అన్యదేవాహుఃసంభవాత్ అన్యదాహురసంభవాత్,
ఇతిశుశ్రుమధీరాణాం యేనస్తద్వ్యాచచక్షిరే.

3. సంభూతించవినాశంచ యస్తద్వేదోభయంసహ,
వినాశేనమృత్యుంతీర్త్వా సంభూత్యామృతమశ్నుతే.

ఈమంత్రములయర్థము అక్షరబ్రహ్మసమర్థకములగు పూర్వోక్త మంత్రములతో బోలియున్నది. ఇక భేదమన్ననో, విద్యావిద్యలకు బదులు, సంభూతి వినాశములను సంబంధము గావించుటయే.

క్షరప్రధాన భౌతికవిశ్వమందు సంభూతి - వినాశ రూపముల తోడనే మనము సదసల్లక్షణ క్షరబ్రహ్మను దర్శించు చున్నాము. భౌతికపదార్థముల యావిర్భావము సంభూతికి, తిరోభావము వినాశనమునకు, జెందినవి. సత్తారసము (గ్రంధి రూపమున) బలమున కాశ్రయభూమియగునప్పుడా బలసంఘాతము సంభూతిరూపమున బరిణతమగును; అది ఆగ్రంధి బంధన రూప సత్తాశ్రయసంచితమగుచు, నాసత్తతో సహచరభావ మాత్రముననే యుండుచో వినాశానుగామియగును. అనగా:- బలసంఘాతము సత్తారసముం దనగర్భమునందు గొనుటయే

దానికిసంభూతి. సత్తారసగర్భమున దానువిలీనమగుటయే దాని వినాశము. సంభూతిదశయందు సత్త్వాగర్భితబలసామ్రాజ్యము, వినాశదశయందు బలగర్భితసత్త్వావైభవము, అని తాత్పర్యము. ఇట్లు క్షరబ్రహ్మయందును సల్లక్షణబ్రహ్మరూప సంభూతిభావమును, అసల్లక్షణకర్మరూప వినాశభావమును గనుచున్నాము.

శ్రుత్యుక్తవినాశ శబ్దము శ్రమణకాభిమత శూన్యవాదము కాదు. వారు అసత్తన సభావసమనుకొన్నారని మున్నంటిమి. మనయీ యసత్తన, 'బల' నామక తత్త్వవిశేషము; కనుక వినాశమన తిరోభావమే అర్థము గాని, అభావము కాదు. అది లయావస్థాద్యోతకము. శూన్యవాదులకు వినాశశబ్దముచే స్వార్థసిద్ధిలేదు; కనుక మొదటనే శ్రుతి 'యోఽసంభూతిముపాసతే' యని చెప్పివేసినది. కనుకనే పురాణాచార్యులీయవస్థను 'ప్రళయ' మని వ్యవహరించిరి. బలసంఘాతరూప పదార్థముల కభావలక్షణ నాశముకాదు. లయలక్షణ వినాశమగును. సత్తారసమందు లీనమయిపోవుటయే ప్రకృత 'వినాశ' శబ్దముచే నభిప్రేతము.

## గీతయందలి త్రిబ్రహ్మ సంస్థలు.

గీత త్రిబ్రహ్మలం దవ్యయుని ప్రధానముగా గొనుటచే నవ్యయశాస్త్ర మనదగియున్నను, ఆ యవ్యయునితో నిత్యము గూడియుండు అక్షరబ్రహ్మ, క్షరబ్రహ్మ (జీవ - జగత్) సంస్థలనుగూడ గౌణముగా నిరూపింపకపోలేదు. కనుక, గీతను

వేదశాస్త్రమువలె త్రిబ్రహ్మప్రతిపాదిక యనవచ్చును; ప్రస్తుత ప్రకరణసంగతికై కొన్ని వచనము లుదహరించెదము.

### 1. అమృతమృత్యులక్షణాన్వయ బ్రహ్మసమర్థక వచనములు.

1. ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః.

2. గతిర్భర్తాప్రభుఃసాక్షీ నివాసఃశరణంసుహృత్,
ప్రభవఃప్రలయఃస్థానం నిధానంబీజమవ్యయమ్,

3. అజోఽపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్,
ప్రకృతింస్వామధిష్ఠాయ, సంభవామ్యాత్మమాయయా.

4. అవ్యక్తంవ్యక్తిమాపన్నం మన్యన్తేమామబుద్ధయః,
పరంభావమజానన్తో మమావ్యయమనుత్తమం.

5. అవినాశితుతద్విద్ధి యేనసర్వమిదంతతం,
వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్కర్తుమర్హతి.

### 2. విద్యావిద్యాలక్షణాక్షరబ్రహ్మ సమర్థక వచనములు.

.1 అవ్యక్తోఽక్షరఇత్యుక్తః తమాహుఃపరమాంగతిమ్.

2. అవ్యక్తాద్వ్యక్తయఃసర్వాః ప్రభవన్త్యహరాగమే.
రాత్ర్యాగమేప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే.

3. దైవీహ్యేషాగుణమయీ మమమాయాదురత్యయా,
మామేవయేప్రపద్యన్తే మాయామేతాంతరన్తి తే.

4. సర్వభూతానికౌన్తేయ ప్రకృతింయాంతిమామికామ్,
కల్పక్షయేపునస్తానికల్పాదౌవిసృజామ్యహం.

5. ప్రకృతింస్వామవష్టభ్య విసృజామిపునఃపునః,
భూతగ్రామమిమంకృత్స్నం అవశఃప్రకృతేర్వశాత్,

3. సంభూతి వినాశలక్షణాక్షరబ్రహ్మ
సమర్థక వచనములు.

1. భూమిరాపోఽనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ,
అహంకారఇతీయంమే, భిన్నాప్రకృతిరష్టధా.

2. అధిభూతంక్షరోభావః 3. క్షరఃసర్వాణిభూతాని.

4. ప్రకృత్యైవచకర్మాణి క్రియమాణాని సర్వశః,
యఃపశ్యతితథాఽత్మానం, అకర్తారం సపశ్యతి.

5. తత్ క్షేత్రంయచ్చయాదృక్చ యద్వికారియతశ్చయత్
సచయోయత్ ప్రభావశ్చ తత్ సమాసేనమేశ్రుణు.

ఇంతవరకు ద్వైతవాదసమర్థనమయినది. "ఉపనిషత్తులు, వేదాంతదర్శనము, తత్సమగీతాశాస్త్రము, సర్వప్రామాణిక శాస్త్రములు, ఏకస్వరమున నద్వైతవాదమును సమర్థించు చున్నవి. వీనికి విపరీతముగ ద్వైతవాదపక్షమున జేరుట యపరాధము. దానిని సమర్థించుట మత్తప్రలాపము. బ్రహ్మ-కర్మ లనురెండుతత్త్వముల నంగీకరించుచో నిక సద్వాద మూలకమగు నద్వైత (బ్రహ్మవాద మెక్కడ! అసంభవము.) అనుకొని భారతీయవిద్వాంసులందు పెక్కురు, కర్మమార్గోచ్ఛేద

మును సమర్థింపుచు, కేవలబ్రహ్మవాదమును, జ్ఞాన వాదమును, సద్వాదమను పేర వెనుకనుడివినదానిని స్వీకరించియున్నారు.

ఈ విషయముంగూర్చి కొంచెము విచారించెదము:— భగవద్రామానుజుల విశిష్టాద్వైతము (ఈశ్వర - జీవ - జగల్లక్షణ త్రిత్వ వాదము) వల్లభాచార్యుల శుద్ధాద్వైత వాదము, నింబార్క - మధ్వాదుల ద్వైతాద్వైత - ద్వైతవాదములు మొదలగునవన్నియు ప్రాయోవాదము లనుట ధ్రువసత్యము. విశ్వగర్భ మందలి వివిధకార్య కారణవాదముల దృష్టితో, సాధ్యుల పదివాదముల ప్రామాణికత - ఉపయోగితల యందేసందేహములేనట్లే పైవానియందును, ప్రామాణికతాదులందేసందేహము లేదనవచ్చును. విభిన్న దృష్టికోణములనుండి యన్నివాదములను సమర్థింపవచ్చును; కనుకనే ఆయావిశేషావసరములందు ధర్మగ్లాని నుపశమింపజేయనై యవతీర్ణులైన భగవదంశావతారులుభగవద్రామానుజాద్యాచార్యులు,ఆయా విశేషదృష్టికిజెందిన, ఆయాకార్యకారణ భావములను లక్ష్యమందుంచుకొని ఆయాసంప్రదాయములను వెలయించిరి. సనాతన ధర్మలు వానిని వేదమూలకములే యగుటచే ప్రామాణికములు నుపాదేయములునని యంగీకరించిరి. ఆవాదములన్నిటిని సమర్థించు వేదవచనము లున్నవి. యుద్ధరింపవచ్చును; కాని అవి యాయాదార్శనిక గ్రంథములందే అరయవచ్చును, కనుక నిట నాపని ప్రకృతము కాదు.

చెప్పదలచినదేమన:— భారతవర్షమందు సనాతన ధర్మము

నకు జెందిన సంప్రదాయములు, మతములు, పథములు, అన్నియు, అధికారియోగ్యతాను సారము, సోపానపరంపరా న్యాయమున సువ్యవస్థితములే. ప్రతివ్యక్తియు తన సంప్రదాయానుగామియై యనన్యభావమున దత్పక్షపాతిగ నుండవలసినదే. కాని యితరమతములను సంప్రదాయములను ఖండనసేయరాదు. సంప్రదాయ వాదములెల్ల దత్సామయిక దృష్టిచే నత్యంత ముపాదేయములు నాదరణీయములు నందుము. కాని, వేదశాస్త్రమందు చరమకారణతావాదమునకు జెందిన దృష్టి కూడ నొకటికలదు. విశ్వములోపల నన్నివాదములను సమన్వయింపవచ్చును. కాని, సమష్టిరూపమున విశ్వకారణతా విచారణ సేయవలయుచో 'అద్వైత వాదమునే శరణొంద వలయును. దానినే సిద్ధాంతవాదమని యంగీకరింపవలయును.

# అద్వైతవాద సమర్థనము

ప్రస్థానత్రయి యంతిమలక్ష్య మద్వైతతత్త్వము. ఈవాదమును, పూర్వప్రదర్శిత క్రమానుసారము ద్వైతవాద రూపమున సమర్థించెదము. అద్వైతవాదముంగొను ద్వైతమును, ద్వైతముంగొని యద్వైతమును, సమర్థింతుము. బ్రహ్మవాదమంగీకరింతుము! బ్రహ్మకర్మవాదము సమర్థింతుము. బ్రహ్మకర్మవాదము నంగీకరించి బ్రహ్మవాదమును సమర్థింతుము! ఇది యెట్లన అద్వైతస్వరూపమును, సంక్షిప్తముగ జూతము.

రసబలలక్షణ పరాత్పరబ్రహ్మ, అమృతమృత్యు లక్షణా వ్యయ బ్రహ్మ, విద్యావిద్యా లక్షణాక్షర బ్రహ్మ, అను నీ కొన్నివివర్తములు, పూర్వోక్త సృష్టికరణము చేతను, వాని రస - బలాదికములగు రెండు రెండుభావభేదములను జూపుట చేతను, ద్వైతవాదమే సిద్ధాంతవాదమా? యనితోచును. ఈ యూహ నిర్మూలమనుటకు ముఖ్యముగా, అస్తి - భాతి - అను నీరెండుశబ్దములు నెరుకటనుంచికొని యద్వైతపరీక్ష నారంభింతము.

మొదట:— భేదమెన్నివిధములు? అన్నది చూతము. ఏమన దాని నెరుంగనిచో అభేదమునందు కూడ భేదభ్రాంతి యుదయించుచుండును. సజాతీయ - విజాతీయ స్వగతము లని భేదము మూడుభాగములు. మట్టి, రాయి యవి ఒకటి, మరొకటిగా జెప్పరాని భేదముగలవి. దేనిజాతి దానిదే, దీనిని విజాతీయ భేదమందుము. వృక్షత్వముం బట్టి వీనికి సజాతీయ భేదమన్నను వటత్వ, పిప్పలత్వములను బట్టి విజాతీయ భేదమనబడును. మట్టికి, మట్టికిగల భేదము జాతిత్వముచే సామాన్యమైనను వ్యక్తిత్వముచే భిన్నతయున్నది. సజాతీయానుబంధియగు నీ వ్యక్తిత్వభేదమును సజాతీయభేదమందురు. ఇక మట్టియందలి పత్రపుష్ప, ఫలశాఖా ప్రశాఖాదిభేదము స్వగతభేదము.

మనుజ+పశువుల భేదము విజాతీయము, మనుజ+మనుజు లందలి వ్యక్తిభేదము సజాతీయము. మనుజశరీరగత, కర్ణనా సాక్ష్యాదిభేదము (అవయవగతము) స్వగతభేదము ఇట్లు జాతి

వ్యక్తి: అవయవములను మూడు భేదభావములంబట్టి క్రమముగ సజాతీయ, విజాతీయ, స్వగతము లను మూడుభేదములు వెలసి నవి. ఇంతకంటె మరొకభేదమేదియు లేదు.

రసబలమూర్తి - సదసల్లక్షణ - బ్రహ్మకర్మాత్మక 'బ్రహ్మ' ఈ త్రివిధభేదబాహ్యము కనుక దానిని అద్వయాభిన్నావిభ క్తాది నామములచే వ్యవహరించుట న్యాయసంగతమే. ఒక యడవియం దనేకవృక్షములు అనేకవిధములవి. వానితో రక రకముల యిండ్లుకట్టుకొందురు అట్లే బ్రహ్మరూపమగునడవి, అందలి బ్రహ్మరూప వృక్షములచే ద్యావాపృథివీరూప త్రై లోక్యనిర్మితి జరిగినది. అడవి వేరు, వృక్షములు వేరు, వాని జాతులు వేరు, అవయవములు వేరు, వీనిచే నిర్మితములైన ప్రాసాదస్వరూపములు వేరు. బ్రహ్మసృష్టినిర్మాణప్రక్రియ యిట్టి భేదభావమునకు జెందినదేనా? వనస్థానీయబ్రహ్మ వృక్షస్థానీయ బ్రహ్మలువేర్వేరా? ఈయాశంకకు వృక్షదృష్టాంతముతోడనే చక్కని భాషలో నుత్తరమిచ్చు నీవేదమహర్షి వచన మవ లోకింపుడు.

"బ్రహ్మవనం, బ్రహ్మసవృక్షఆసీత్, యతోద్యావాపృథివీ నిష్టతక్షుః మనీషిణో మనసావిబ్రవీమివో, బ్రహ్మాధ్యతిష్టత్ భువనానిధారయన్"

వనము, వృక్షము, కాష్టము, భవనము, మొదలగున వన్నియు నదే యని శ్రుతితాత్పర్యము. దీనిచే శ్రుతి బ్రహ్మకు త్రివిధభేదనిరాకరణము సేయుచున్నది. అన్ని యడవులందును

అన్ని రకముల చెట్లును మొలువవుగదా! కారణము? అందందలి భూమిభేదము. అందువలన పలురకముల యడవులు, అందుచే వృక్షాదులును భిన్నములు. మూలకారణమునందే భేద మున్నచో దానికి జెందిన వృక్షాది సృష్టులందు భేదముండు టయు స్వభావసిద్ధము. ఇక 'బ్రహ్మవనమ్' అనుచు శ్రుతి మూలకారణరూపమగు నటవీస్థానీయ బ్రహ్మయందే సజాతీయ భేదాభావము సిద్ధముగావించుచు ఆ వనవృక్షాదులన్నియు బ్రహ్మయేయనియు వానికే ద్యావాపృథివ్యా ద్యనేకరూపము లనియు జెప్పుచున్నది.

1. ఆతత్త్వమే తన రసబలాత్మక పరాత్పరావస్థయందు బ్రహ్మవనము. 2. అదే, మాయోపాధియుక్తమై అమృత మృత్యుమయావ్యయబ్రహ్మ నాబడుచు. 'బ్రహ్మనవృక్షఆసీత్' అయ్యెను. 3. అదే తన హృద్యబలముచే విద్యావిద్యామ యాక్షరబ్రహ్మ యనబడుచు, 'తక్ష' యయ్యెను. అదే తన బలోపాధిక పరిణామిభావమున, సంభూతి వినాశ మయ 'క్షర బ్రహ్మ' యనబరగుచు ద్యావాపృథివీ (విశ్వ) రూప పరిణతి నందెను. దీనికి సరియగు మరొకబ్రహ్మ యున్నచో సజాతీయ భేదాశంక వచ్చి యుండెడిది. కాని యట్లులేదు. అది యొకటే కనుక నా యేకాకిబ్రహ్మను తప్పక సజాతీయభేదశూన్య మందుము.

ఈ బ్రహ్మవంటి బ్రహ్మ లేనట్లే, దీనికంటె భిన్నస్వరూపము గల రెండవబ్రహ్మయు లేదు. మట్టి రావికంటె భిన్నము. కనుక

నా రెంటికి విజాతీయభేదము. ఇటనో మరొక బ్రహ్మసత్తయే లేదు. ఇక విజాతీయభేదము మాట యెక్కడ? ఇదే దీని విజాతీయభేద శూన్యత. ఇక:—

ఈ బ్రహ్మ దేనితో చూచును? దేనితో వినును? దేనితో నడచును? దేనితో పని సేయును? అన్నచో నట్టి యవయవ భేదమును దీనియందు లేదు. అది యంతటను సమరసము, అఖండము, పరిపూర్ణము. దేనివలె? నన్నచో సమాధాన విూయజాలము. అట్టి యఖండము మరొకటి లేదు; 'సర్వతః పాణిపాదంతత్ సర్వతో౽క్షి శిరోముఖమ్' అన్నట్లు అది సర్వేంద్రియమయ్యు నింద్రియాతీతము. సర్వగుణమయ్యును నిర్గుణము; నిరవయవము; అఖండము; అవ్యయము; వృక్ష మనుష్యాదులకువలె దానియం దవయవభేదము లేదు. కనుక స్వగతభేద శూన్యము.

ఇట్లది త్రివిధభేదశూన్యమై శూన్యతాలక్షణ నానాభావాసంస్పృష్టమై సర్వథా 'పూర్ణం పూర్ణం' అయియున్నది. ఈ త్రివిధభేదనిరాకరణము గావింప శ్రుతి యిట్లు చెప్పినది.

1. సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ 'ఏకమేవాద్వితీయంబ్రహ్మ' (ఛాందో)

2. 'మనసైవానుద్రష్టవ్యం,' నేహ నానాస్తి కించన (బృహ)

మొదటి శ్రుతియం దేకమిత్యాదిగా త్రివిధభేద శూన్యత వరుసగ మూడుపదములచేతను చెప్పబడినది. ఇట్లు అహం - అసౌ అను మొదలగు నామములచే శ్రుతులం దభిశ్రుతమును,

సదసద్రూపమున గీతాదులం దుపవర్ణితము నగు 'బ్రహ్మ' యవశ్య మద్వయ మందుము. కనుక దాని సదసత్తులను రెండు భాతులచే నోటితో ద్వైతవాద ముచ్చరించుచున్నను అద్వైత మునే సమర్థింతుము.

శుద్ధసత్త్వాది పూర్వపక్షము:— 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' ఇందు బ్రహ్మశబ్దము కేవలము బ్రహ్మసమర్థకము. శ్రుతియందు కర్మశబ్దోల్లేఖము లేదు. కనుక నిచటి బ్రహ్మ, 'సల్లక్షణ విశుద్ధ బ్రహ్మయే' యందు నను.

సమాధానము:— 'అంతరంమృత్యో ర్యమృతమ్' 'సతో బంధు మసతినిరవిందన్' ఇత్యాద్యన్యవచన మీమాంస సేయుచో నీ పూర్వపక్షమునకు విలువ యుండదు. 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాదులు 'అహం' ను బ్రహ్మ యనుచున్నవి. 'సదసచ్చాహ మర్జున!' ఇత్యాదులు అహంలక్షణ బ్రహ్మను సదసన్మూర్తిగ జెప్పుచున్నవి. యావచ్ఛ్రుతి సమన్వయము వలయుచో బ్రహ్మ శబ్దము సదసత్సంగ్రాహకమని యంగీకరింపక తప్పదు.

పూర్వపక్షము:— బ్రహ్మ యమృతము. కర్మ మృత్యువు. 'మృత్యోః సమృత్యుమాప్నోతి యఇహనానేవపశ్యతి' అన్నట్లు మృత్యువు నానాలక్షణము. మీబ్రహ్మయో బ్రహ్మ - కర్మ మయము. కనుక నందు కర్మలక్షణ మృత్యునిబంధన నానా భావ సమావేశ మంగీకరింపవలయును. అట్టిచో తక్కిన భేద ముల మాట యెట్లున్నను స్వగతభేదమైన నంగీకరించి తీరవల యును. అనగా:— మీబ్రహ్మస్వరూపమందు కర్మకంతర్భావము.

బ్రహ్మకర్మ సమ్మిళితావస్థగదా మీ బ్రహ్మ? కర్మ యన్నది మృత్యుస్వరూపము ఖండఖండము. ఖండభావ మవయవము గదా! అవయవభేదమే స్వగతభేదము. ఇది కర్మకృతఫలము. ఇక బ్రహ్మ సరసమున మెట్లు? స్వగతభేద శూన్య మెట్లు?

సమాధానము: స్వాగతమ్! సద్వాదమునే సిద్ధాంతపక్షముగ నెంచుటలో గలిగిన ప్రమాదమిది. దీనిని పరిహరించుకొనునుపాయముగ: "అస్తి - భాతితత్త్వపరిజ్ఞానమువలన, సన్నివిప్రతిపత్తులు దొలగు" నని మొదటనే చెప్పితిమి. బ్రహ్మయొక్క ఏకరసలక్షణసత్తునకు అస్తితో సంబంధము. బహులక్షణముగు అసత్తునకు భాతితో సంబంధము. అస్తిత్వము స్థి. ప్రతీతియే భాతి. ఒకవస్తుప్రతీతి (భాతి) అనేకము లైనను వస్తువొకటియే కాదా? భాతివైవిధ్యమున వస్తువైవిధ్యము సంభవించునా? ద్వైత్వాదివ్యవహార మూలప్రతిష్ఠ సత్తాభేదము. అదే ద్వైతాభాసకారణము. భాతిలక్షణ ప్రతీతివిషయిక జ్ఞానభేదము ద్వైతవాద సమర్థక మెన్నడు గాజాలదు.

ఉదాహరణముగ ఒకఘటముంజూడుడు: ఉపాదానకారణము తన కార్యమునకభిన్నము; కార్యప్రతిష్ఠితముగదా! కనుక, ఘటోపాదానకారణద్రవ్యము (మట్టి) సత్త ఘటమందుండుట యంగీకృతమే. మట్టికుపాదానము జలము. కనుక, ఘటమందు జలముంగూడ నంగీకరింపవలయును. జలోపాదానముఅగ్ని, దానికి వాయువు, దానికాకాశము ([illegible] మర్త్యాకాశము - ఆత్మన ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః;

వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథివీ.) దానికి ప్రాణము (సౌమ్యప్రాణము). దానివికాసభూమి మనస్సు. (శ్వోవస్యస నామక ప్రసిద్ధమగు నవ్యయమనస్సు. 'తస్మాదిదంమనస్యేవ పరమంప్రతిష్ఠితమ్; తదేతచ్ఛ్వోవస్యసం నామబ్రహ్మ'. మనస్సునకాలంబనము విజ్ఞానము; సర్వాలంబన మానందము. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతానిజాయంతే, ఆనందేనజాతాని జీవన్తి, ఆనందంప్రయ న్త్యభిసంవిశన్తి" ఇట్లు కార్య రూపమగు నాఘటము, 1 ఆనంద 2 విజ్ఞాన 3 మనః 4 ప్రాణ 5 ఆకాశ (వాక్) 6 వాయు 7 తేజ (అగ్ని) 8 జల 9 మృత్తులను నీతొమ్మిది భాతులతోగూడియేమనదృష్టివిషయ మగుచున్నది. పదియవది స్వయముగాఘటము. తత్త్వవిమర్శకుడగు వైజ్ఞానికుడు దీనియందు 10 ప్రతీతులంగనును, వీనివలన ఘటపదార్థము పదిగ నగుచున్నదా? లేదు. కారణము? సత్తయొక్క అభేదము; ఏకరూపత.

ఆనందరూప మూలసత్తయే, విజ్ఞానముగను, అది మనోరూపముగను, అదిప్రాణముగ, అదియాకాశముగ నదివాయువుగ, నదితేజస్సుగ, నదిజలముగ, అదిమృత్తుగ, నదిఘటముగ బరిణతమగును. ఒకటేయగు నాయానందసత్త యాధారమున, భాతిలక్షణవివిధబలములు, నృత్యముగావించుచున్నవని, 'ఆనందమయోఽభ్యాసాత్' అను దార్శనికసిద్ధాంతముచే గూడ ప్రమాణీకృతమైనది. భాతులు పదిగావచ్చును. ఇంక నధికమును గావచ్చును. కాని సత్త యొక్కటే. కనుక వస్తుతత్త్వ

మొకటే, అద్వితీయమే. ఈరహస్యమునే తెలుపునట్టి కోశ శ్రుతి ఆత్మయొక్క ఆనందవిజ్ఞానమనః ప్రాణాన్నము (వాక్) లను పంచకోశ నిరూపణసేయుచు నైదిటినే విశ్వమూలముగా జెప్పినది. ఈమైదిటిలో "సఏవ - సఏవ-" యనుచు ఏకసత్తా వాదమును సమర్థించినది. చూడుడు. తైత్తిరీయము బ్రహ్మా నందవల్లి 2, 3, 4, 5, అనువాకములు.

'వాచారంభణం వికారోనామధేయం, మృత్తికే త్యేవ సత్యం' (ఛాం॥) అను శ్రుత్యంతరముగూడ కారణసత్తనే సమర్థించుచున్నది. ఈలక్షణమును, (అనగా 'మృత్తికే త్యేవ సత్యం' అన్నది.) జలమేవసత్యం; అగ్ని రేవసత్యం,...ఇత్యాది పూర్వపూర్వ సత్తాభావసూచకవాక్యములకును ఉపలక్షణముగ నెరుంగవలయును.

## వా గా రం భ ణ

శ్రుతి తాత్పర్యము:—నామరూపాత్మక కార్యరూప ఘటము నందు ప్రతీతమగునది వాస్తవముగ మట్టి సత్తయే. ఆ సత్తా రసమే ఘటరూపానుబంధి బలరూప వాక్కు నారంభక (ఉపా దాన) ముగా గొని ఘటాస్తిత్వ కారణ మగుచున్నది. ఘధి; సత్యత, లేదా నామరూపసత్యత, మృత్తికాసత్యతపై నాధార పడి యున్నది. అదే సత్యఘటమువరకు వ్యాప్తమగుచున్నది. ఆ సత్య మృత్తికయే. జలాగ్ని వాయ్వాకాశములందు వ్యాప్త

మగుచున్నది. సత్య, జ్ఞాన ఘనానంతబ్రహ్మమే సత్యము. ఈ సత్యకారణమునుండి యుత్పన్న (వివర్తరూపమున రూపాంతరముగ ప్రకట) మయిన కార్యరూప విశ్వము సత్యమగుచున్నది.

సద్వాది బలతత్త్వ సత్యత సహింపక, నామరూపాత్మక విశ్వముమిథ్యయను నభినివేశమున, బడి 'వాచారంభణ'శ్రుతికి "నానాభావములుగ దోచు, నామరూపాత్మకవిశ్వము సర్వథా మిథ్య. మృత్ (కారణ) స్థానీయమగు సద్బ్రహ్మ మొకటే సత్యము. ఘట (కార్య) స్థానీయాసద్విశ్వము కేవలము మిథ్య." అని తాత్పర్యము చెప్పెను. ఈ జగన్మిథ్యాత్వవాదముతో మేము విరోధింపము. కారణము? మా దృష్టిలో, అసద్వాది (నాస్తికుని) యాసద్వాదమున కెంత విలువ యున్నదో, దీనికి నంతే. పై శ్రుతికి వాది తన తాత్పర్యమును నిల్పుకొన నెన్ని పాట్లు పడినను, మా కేవిధమునను, అందు జగన్మిథ్యాత్వ గంధముకూడ పొడకట్టకున్నది.

పోనిండు, అభ్యుపగమవాదముంబట్టి కొంతతడవు జగన్మిథ్యాత్వవాదమే యా శ్రుతి తాత్పర్య మనుకొన్నచో, అన్య శ్రుతి సమన్వయ మెట్లు? చూడుడు.

'తదేత దమృతం సత్యేనచ్ఛన్నమ్, ప్రాణో వా౽మృతం, నామరూపే సత్యమ్ తాభ్యా మయంప్రాణ శ్ఛన్నః' (బృహ) ఇత్యాదులు నామరూపాత్మక ప్రపంచమును సత్యమనుచున్నవి.

నామరూపముల కుపక్రమరూపమగు ప్రాణము నమృతతత్త్వ మనుచున్నవి.

సృష్టిసాక్షియగు నాత్మకు మనః - ప్రాణ - వాక్కు లను మూడు వివర్తములుగదా! ఈ మూటను మనః ప్రాణము లోక విభాగము, వాక్కొక విభాగము, ఆనంద విజ్ఞాన మయమగు మనస్సుయొక్క కామనచే ప్రాణవ్యాపారము కలుగును. ప్రాణ క్షోభచే వాక్కు క్షుబ్ధమగును. ఆ క్షుబ్ధవాక్కు క్రమముగ నాకాశాది పంచభూతరూపముల బరిణత మగును. నామ రూపాత్మక ప్రపంచములు పాంచభౌతికములు, వాఙ్మయములు. వీనికి ప్రథమసంబంధి ఆత్మయొక్క ప్రాణభాగము. కనుక శ్రుతి ప్రాణము నమృతము (ఆత్మ) అన్నది. జగత్తు మిథ్య యనువారి దృష్టిలో ప్రాణముయొక్క యమృతత్త్వమున కర్థ మేమో వారే చెప్పవలయును.

ఈశ్రుతి నే మరొకవిధముగ సమన్వయింతము. 'ఘట' మను నైకారిక నామమునకు వాగ్రూపారంభకము తోడనే సంబంధము. వాక్కే ఘటమున కారంభకము; ఉపాదానము. ఆ వాక్తత్త్వమే బలగ్రంథుల తారతమ్యమున ఆకాశాది పంచభూత పరిణతి గాంచును. పృథివి దాని చరమరూపము. కనుక దీనింబూడ వాక్కేయందురు. 1. ఇయంవై (పృథివీ) వాక్. 2. వాగితి ప్రథివీ. 3. వాగేవాయంలోకః 4. యన్మృత్ ఇయంతత్ (పృథివీ) మనిరసె ప్రథివీరూప వాక్కు ప్రకృతి, ఘటరూప వాక్కు వికృతి. కారణమే కార్యమునకు ప్రకృతి, కారణముం

బట్టి కార్యమువికృతి. ఘ-ట-యను నీరెండక్షరముల సమష్టి రూప 'ఘట' నామకము కంబుగ్రీవాదియుక్త పదార్థము. తదారంభము (ఉత్పత్తి - ఉద్భవము) వాక్కురూప మృత్తునుండియే యగును. ప్రజాపతి (కుమ్మరి) మృద్రూప వాక్కునందు జల రూపవాక్కునుంచి తనచేతులతో క్రియాత్మక వాఙ్మయబలము నాధానము గావించుచు పోగా, నిట్లు మట్టి - జలము - క్రియ, దండము, చక్రము, చీవరము, సూత్రము మొదలగు వివిధ వాఙ్మయబలముల సమష్టియే కాలాంతరమున 'ఘట' మను వైకారికనామమును ధరించుచున్నది. ఇంక ఘటనిర్మాత యగు వాడు పార్థివుడు. తక్కిన సహయోగులెల్ల పార్థివములు. ఇట్లు కార్యరూపఘటము పార్థివము. కనుకనే శ్రుతి యారంభ మున 'వాచారంభణం వికారో' యని చివర 'మృత్తికేత్యేవ సత్యమ్' అని యుపసంహారము చేసినది. అనగా "మొదటి వాక్యమునందు శ్రుతి సామాన్యముగ బదార్థమాత్రమునకు వాక్కుతో సంబంధమును జెప్పి రెండవవాక్యముచే ఘటమునకు జెందిన మృత్తికామయవాక్కును స్పష్టీకరించెను." అని తాత్పర్యము. ఇట్లు పరంపరగ మట్టిలోనికివచ్చి ఘటప్రతిష్ఠకు గారణ మగుచుండు ఆసత్తయొక్క అభేదమునే శ్రుతి సూచించినది.

ఈస్థితినే యింకొకవిధముగ సమన్వయింతము; ఘటారంభకము మృత్తికయగుచో శ్రుతి 'మృత్తికయారంభణంవికారో నామధేయం' అనవలయును. కాని, యట్లనలేదు. కారణము? ఏదో విశేషప్రయోజనము నర్థించియే మృత్తికతో వాక్కును

ప్రయోగించు టావశ్యకమని యెంచెను. అందలి యాథార్థ్య మేమి? కారణత్రయమన్నది మూడు భాగములు. ఆలంబన-నిమిత్త ఉపాదాన కారణత్రయ సమన్వయము వలననే కార్యస్వరూప నిష్పత్తియగును. కనుకనే దర్శనసాంప్రదాయమునందు 'కారణ సముదాయమే కార్యమునకు కారణ'మని యంగీకరింపబడినది. ఆనందవిజ్ఞానగర్భిత, మనఃప్రాణవాఙ్మయ, సత్తాలక్షణ, సృష్టి సాక్షి యగు నాత్మయొక్క మనోభాగమునుండి కామము, ప్రాణభాగమునుండి తపస్సు, వాగ్భాగమునుండి శ్రమ, ఉదయించును. మనః ప్రాణవాక్కుల మూటియున్యూనావస్థయే సత్తా. అట్టి సత్తారూప మనస్సునుండి పదార్థముయొక్క రూపము, సత్తారూప ప్రాణమునుండి పదార్థముయొక్క కర్మ, సత్తారూప వాక్కునుండి పదార్థముయొక్క నామము వికసిల్లును. ఇట్లు ఆనందవిజ్ఞానగర్భిత సృష్టిసాక్షి ఆత్మయొక్క మనఃప్రాణవాక్సర్వత్రయమే క్రమముగ రూపకర్మనామముల కారంభకమగును. అందు వాక్తత్త్వము నామప్రపంచమున కారంభకము కనుకనే శ్రుతి 'నామధేయమ్' విషయమున 'వాచారంభణం' అని చెప్పవలసి వచ్చెను.

ఈవాక్తత్త్వమే ఆకాశ (మర్త్యాకాశ) నామక ప్రథమ భూతము. ఉత్తరోత్తర బలగ్రంథుల తారతమ్యమున నీ యాకాశాత్మకవాక్కే లేదా వాఙ్మయాకాశమే, శబ్దతన్మాత్రంగాని పంచమహాభూతరూప పరిణతిగాంచెను. ఆకాశాత్మక శబ్దతన్మాత్రమే సర్వభూత జనని. కనుకనే సర్వభూతములందును

శబ్దతత్త్వము వ్యాప్తమై యున్నది. శబ్దశూన్యమగు ప్రత్యయ మేదియులేదు. "నహ్యాశబ్దమివాస్తి" (నృసింహఉత్తర) 'నసోఽస్తి ప్రత్యయోలోకే యఃశబ్దానుగమాదృతే' (వాక్యపది) 'వాచీమావిశ్వాభువనా న్యర్పితా' (తై॥బ్రా) 'అథో వాగే వేదంసర్వం' ఇత్యాదులే వాగ్వ్యాపకతను స్పష్టీకరించుచున్నవి.

ఆనందవిజ్ఞానఘన మనోమయ మగు నాయాత్మయే అవ్యయ బ్రహ్మరూపమున సృష్టి కాలంబనకారణము. ఆనందవిజ్ఞానఘన మనోగర్భిత ప్రాణమయమగు నాయాత్మయే అక్షరబ్రహ్మ రూపమున, సృష్టికి నిమిత్తకారణమును, ఆనందవిజ్ఞానఘన మనః ప్రాణగర్భితవాఙ్మయమగు నాయాత్మయే, క్షరబ్రహ్మ రూపమున, సృష్టికుపాదానకారణము నగుచున్నది. ఇందు ఉపాదానత వాక్తత్త్వమునకు జెందినదే యగుటచే, వాక్తత్త్వమే సంపూర్ణభూతజనకము; కనుక శ్రుతి 'వాచారంభణం వికారోనామధేయం'' అనిచెప్పుటకూ యన్వర్థమనుకొన్నది. ఘటారంభకము మృత్తికామయీ వాక్కు. కనుక పిదప 'మృత్తికేత్యేవసత్యమ్' అనుట చరితార్థ మగుచున్నది. ఇట్లు:— వాగారంభణద్వారా భిన్నసత్తావాద మామూల చూడము ఖండించుచు, అద్వైతసత్తావాదమునే శ్రుతి స్థాపించెను. నామభేదముచే నసద్వాద యసద్వాదము ప్రామాణిక మనుకొనునేమో యనియు, సదసద్వాదాధారముచే సద్వాది ద్వైతవాదభ్రమకు లోనగునేమో యనియు, శ్రుతికి 'వాచారంభణ' మిత్యాదిగా జెప్పనయ్యెను.

శ్రుతియందు వాక్యబద్ధతాత్పర్యార్థమేమో! పాఠకుల కీవరకే బోధకట్టియుండును. అయినను ఇంచుక:— వాక్యత్వమాత్మకొక యంతినుకళ; దానినుండియే సంపూర్ణభూతవికాసము. దానింబూర్చియే భగవంతుడు మనువు 'వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే' అని సిద్ధాంతముగానించెను. వ్యాఖ్యాతలు ఈశబ్దమునకు మిథ్యార్థకల్పన గావించిరి. 'ఘటమున్నది కేవలము వాణీవికారము, మట్టియేఘటమగుచుము. వస్తుతః ఘటమునది మిథ్య, మృత్తికయేసత్యము అని వారియర్థము, "అది మన వాగ్విలాసము, పెట్టుకొన్న పేరు" అని వారి యభిప్రాయము. అహహో! నామకరణమువలననే ఘటము మిథ్యయగుచో, మృత్తికమాత్రము సత్యమెట్లు? అది మనయుంచిన పేరుకాదా? పోనిండీ నిరర్థకవివాదములో నేల? ఇంతకు:— "మనకు విశ్వమందగపడు నానాభావ, నామరూపకర్మలన్నిటికి మూల మనద్బలము, అది భాతిసిద్ధపదార్థము, సత్తాసిద్ధతత్త్వము కేవలసల్లక్షణరసమే. ఈరసమే బలసమన్వయమున ననేకభాతులుగ బ్రతీతమగుచున్నది. కనుక ద్వైతప్రతీతియున్నను, సత్తానుబంధియగు నద్వైతమున కేమియు బాధలేదు.

వాస్తవమున, భాతివాదమెన్నడును ద్వైతవాదపోషకము గాజాలదు. చూడుడు:— దర్శనశాస్త్రమందలి సుప్రసిద్ధ పంచీకరణ ప్రక్రియనలసను, వేదశాస్త్రమందలి త్రివృత్కరణ ప్రక్రియనలనను, ప్రతియొకమహాభూతమును పంచావయవము. కనుక పంచభూతములు 25 భూతములగును. ఇక అణు పరమాణు

వాదముంబట్టి చూచినచో నీ యవయవములు అసంఖ్యములు ననంతములునగును. అట్టి యసంఖ్య పరమాణువులవలన తమ స్వరూప సంపాదనగావించుకొన్న యవాంతర పంచవింశతి (25) భూతములచే కృతమూర్తులగు పంచమహాభూతములవలన నిర్మితమైనది మానవశరీరము. భాతిమూలములగు నీ సంఖ్యలనంతములు. అయిననుశరీర మొకటేగదా! ఏమి? ఉత్తర మా సత్తైక్యమే, ఆ సత్తాద్వైతమే. కానిండు. (ఈవిషయము మరొకచో జూతము).

అభ్యుపగమ వాదము నాశ్రయించి మావాదము ద్వైతమే యనుభ్రమకు లోనగు సద్వాదుల నొకప్రశ్న యడిగెదము:- 'బ్రహ్మైవేదం సచ్చిదానందరూపమ్' 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ' 'సత్యంవిజ్ఞానమానందంబ్రహ్మ' ఇత్యాదిగా శ్రుతి, బ్రహ్మను, సచ్చిదానంద ఘనమనుచు, అందు మూడుకళల నంగీకరించి నదిగదా! ఇందలి మూడవయవముల భిన్నత ప్రతీతమగుచుండ నీ స్వగతభేదమును మీరెట్లు నివారించుకొందురు? భాతి ద్వారా యందురా? ఇక మా యపరాధమేమి? మేమును ఆ భాతినే యాశ్రయించితిమిగదా! ఇంతవరకు మన ముభయులము సమస్థానముననే యుంటిమి. కాని, మేము:- 'అంతరం మృత్యోరమృతమ్' 'విద్యాంచావిద్యాంచ' 'సంభూతించ వినాశంచ' ఇత్యాది ద్వంద్వప్రతిపాదక శ్రుతులను సమన్వయించుచు, భాతిభావముద్వారా, స్వగతభేదమును నిరాకరించి, 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' యను నాత్యంతికాద్వైతాను

గాముల మధ్యేదము. మీరన్ననో, కేవల సత్తునంగీకరించిన యభినివేశముతో ఎదేపదే అనేకవైషమ్యముల ననుగమింప వలసియుండును. ద్వంద్వ ప్రతిపాదకములు, అద్వైతమును ముఖ్యలక్ష్యముగ గొన్నవియు నగు విరుద్ధవచనములను సమన్వ యింప వలయుచో:— అస్తియొక్క సమానతతో, అస్తియొక్క పరమ సామాన్యమును స్వీకరించుచు నానాభావమును భాతిసిద్ధ మని యంగీకరించి తీరవలయును. అస్తిద్వారా సామాన్యమును, భాతిద్వారా విశేషభావములను ఒకచో సమన్వయపరచుచు, సిద్ధాంతతః అద్వైత జయఘోష గావింపవచ్చును. దీనితో భాతిద్వారా ద్వైతవాదమును సమర్థింపవచ్చును; ఇదే త దనిర్వచనీయత.

# సనాతనతత్త్వములు - సనాతనయోగము

సదసల్లక్షణామృతమృత్యువులు రెండే సనాతనములు; శాశ్వతములు. వాని సమ్యగ్దర్శన జ్ఞానానుష్ఠానముల వలననే పరమశాంతిలక్షణ సనాతనయోగ ముదయించును. ఇదే గీత యందలి సమత్వయోగము. ఏకము, శాంతము, నిర్వికారము నగు సల్లక్షణామృత తత్త్వమును దానికి ప్రతి ద్వంద్వియు, నన్యము నగు తత్త్వమున్నగాను చూడజాలము. ఉదాహరణ ముగ భావాభావ ద్వంద్వముంగొనుడు. భావస్వరూప సంపాదక మభావమే యగుచుండును. పుస్తకాభావమే పుస్తక

సత్తాకారణమగును. ఈ యభావము మూడు తెఱగులుగ పుస్తకసత్తకు ప్రతిష్ఠయగును; ఒకప్పుడు పుస్తకములేదు. అప్పుడొకనాడు పుస్తకము సత్తారూపము ధరించెను. ఇట్లు ప్రతి సత్తాయుక్త పదార్థమును తన ప్రాగభావమును కారణముగా గొని యస్తిరూపమున వెలువడును. నేడుపుస్తకమున్నది. ఈ యస్తిత్వమును, నాస్తిత్వగర్భమందుండియే సురక్షిత మగుచున్నది. పుస్తకసీమకు నలుగడలను పుస్తకాభావము లేకున్నచో 'ఇదంపుస్తకః' మను నంగుళీనిర్దేశ మసంభవము. తన నలుగడలను పుస్తకాభావమైనపుడే పుస్తకము పుస్తకమగును. పుస్తకధరాతలమున నభావాత్మక సీమ లేనిచో పుస్తకాస్తిత్వమే తోచదు. ఇతర పదార్థముకాకుండుట పుస్తకాస్తిత్వమునకు కారణము. (అనగా, ఇది ఘటమును పటమునుకాదుగనుక పుస్తకమనుట) ఇట్లు 1. సత్తోదయ ప్రాగభావమువలన 2. పిమ్మటి సీమాభావ రూపాభావమువలన, 3. ఇతరవస్తువు కానియట్టి యభావమువలన, అను నీమూడు విధములుగ నభావము భావ కారణ మగుచున్నది. రిక్తభావమే పూర్ణభావప్రతిష్ఠ. అనృత భావము లేనిచో సత్యమునకు మూల్యమే యుండదు; రోగ శబ్దమేస్వాస్థ్యశబ్దప్రతిష్ఠ. పాపమేపుణ్యశబ్దరక్షకము; హింసయే అహింసకు జనని; ఏకమే అనేకత్వ ప్రతిష్ఠ. రాత్రియే అహశ్శబ్దోత్పత్తి; ప్రజాశబ్దమే రాజశబ్దమూలాధారము; ఇట్లే:— ఇచటను అసత్తే సాపేక్షసత్తునకు మూలప్రతిష్ఠ. సత్తే సాపేక్షాసత్తున

కాధారము, ఈ సాపేక్షాభావముచే నీరెండే సనాతనములు, శాశ్వతములు.

భేదప్రతీతిమాట యటుంచుము. అది ప్రతీతి, జ్ఞానము భానము. భానమే భాతి. భాతిభేద మద్వైతమునకు విరోధింప జాలదంటిమి. భంగు అను నొక మాదకద్రవ్య మున్నది. అది యెన్నో పదార్థముల సమ్మిశ్రణము. అందలి యన్ని పదార్థములు సంతతము నున్నవి. వాని వాని రుచులు, గుణములు, వేర్వేర నెరుంగుదుము, గుర్తింతుము. దేనిభాతి దానిదే. కాని యన్నిటిసత్తయు నొకటే. కనుకనే యన్నిపదార్థముల నుదర మందుంచుకొనియు, నా ఏయపదార్థము భంగను నేకనామము ననే వ్యవహరింపబడుచున్నదిగదా! గుణబలము, ధారాబలము, మాయాబలము అని యిట్లు బలములు, అసంఖ్యములు, అనంతములు. వీని నన్నిటిని గర్భమందిముడ్చికొను సత్తారస మేకము. తదాధారమున నీ యసద్బలములు పరస్పరసంబంధ తారతమ్యముచే వివిధభావ, భాతి, జనకము లగుచున్నవి. సత్తునం దసత్తు యొక్క బంధనమువలననే సదసద్బ్రహ్మ స్వరూపము నిష్పన్నమయినది. సత్తునం దుండు నసద్బల ప్రతీతి భిన్నము గాని, సత్తయొకటే. ఇదే బ్రహ్మయొక్క త్రివిధభేద శూన్యత. ఏక కాలావచ్ఛేదముచే భాన మనంతమయ్యు, సత్త యొకటి. నిఃశ్రేయ సాధిగమార్గము సత్తు నసత్తునందు జూడవలయును. అసత్తును సత్తునం దన్వేషింపవలయును. నిత్యశాంతము (కనుకనే) అకర్మ నాబడు సత్తును అశాంతము, కర్మ యనబడు అసత్తునం

దన్వేషింపవలయును. సత్తును అసత్తునం దున్నవానిగా గన వలయును. ఏలయన:— అకర్మ (సద్రసము) కర్మ (అస)ద్బలము నందు వ్యాప్తమై యున్నది. కర్మయొక్క ప్రతి పర్వ పర్వ మందు నకర్మ ప్రతిష్ఠితమై యున్నది. ఈ భగవద్వచనముల నవలోకింపుడు:—

"కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మయః,
సబుద్ధిమాన్ మనుష్యేషు, సయుక్తః కృత్స్నకర్మకృత్.
బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతియః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా"

## 'సమత్వం యోగ ఉచ్యతే'

బ్రహ్మ - కర్మల రెంటి యనుష్ఠాన మీం సమతా యోగ ప్రాప్తి కారణము. ఒకదాని నాశ్రయించుటవలన వైషమ్యత వచ్చును. సమభార తులనారూప సమత్వము రెంటియోగము పైననే యాధారపడి యుండును. సద్వాది "అసల్లక్షణకర్మ సంస్కారలేపజనకము. అది యాత్మ స్వాభావిక జ్ఞానజ్యోతి కావరకము." అని భయమందును. తద్దూరీకరణార్థము భగ వంతుడు "నాయనా! నీయూహ నిజమే. కర్మ, సంస్కారలేప జనకమే. కాని, కర్మసహయోగియగు బ్రహ్మపదార్థము (జ్ఞాన తత్త్వము) సర్వథా అసంగము. దాని నాధారముగా గొని కర్మ యొనరించుచో తదసంగవృత్తి ప్రభావమున కర్మ జనిత సంస్కారలేప ప్రభావ మంటదు. కర్మ విభూతి వంచితులమా

కాదు. సమత్వలక్షణ బుద్ధియోగవిలక్షణత, విశేషతయు నిదే. "బ్రహ్మార్పణభావనతో జేయు కర్మబంధనకారణ మెన్నడును గాజాలదు" దనుచున్నాడు. 'బ్రహ్మార్పణం బ్రహ్మహవి' అనుచో గూడ భగవంతు డీ సిద్ధాంతమునే స్పష్టీకరించెను.

రెండు కర్ణచ్ఛిద్రములు, రెండు నాసాచ్ఛిద్రములు, రెండు చక్షుర్గోళకములు, ఒక ముఖవివరము, ఒక యుపస్థవివరము, ఒక మూలద్వారము. ఇవి పాంచభౌతిక శరీరపుర నవద్వారములు. ఈ పురమందు వైశ్వానర - తైజస - ప్రాజ్ఞలక్షణ కర్మాత్మ యున్నాడు. ఈదేహిని కర్మబంధమునుండి గాపాడి, కర్మవైభవభోక్తగ జేయుటకై 'నాయిచ్ఛ (ఉత్థాప్యాకాంక్ష)తో నే నేమియు జేయుట లేదు. కర్మ జరుగుట యన్న దాత్మ యొక్క స్వాభావికేచ్ఛ (ఉత్థితాకాంక్ష) కు జెందినది' యను భావనతో కర్మప్రవృత్తుడు గావలయును. ఇట్లయినచో బంధన మన్నది యుండదు. ఇట నీ వచనము లరయదగినవి:—

నవద్వారేపురేదేహీ హంసో లేలాయతేబహిః.
వశీసర్వస్యలోకస్య స్థావరస్యచరస్యచ. (శ్వేతా)
సర్వకర్మాణిమనసా సన్న్యస్యాస్తేసుఖంవశీ
నవద్వారేపురేదేహీ నైవకుర్వ న్న కారయన్.
నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంతఇతిధారయన్ (గీత)

కర్మాధ్యక్షుడు, సాక్షియు నగు నీశ్వరు నెడ సాయుజ్య భావము నుంచి, తద్రూపియై, సాక్షిరూపమున గర్మప్రవృత్తు డగుచో గర్మాత్మ యెన్నఁబను లిప్తుడుగాడు. ఇట్లు బ్రహ్మ - కర్మల రెంటిని, సనాతనము లనుకొనువ్యక్తి ద్వైమూలక సనాతనయోగ (బుద్ధియోగ) ము ననుగమించి 'కర్మబంధం ప్రహాస్యతి.' "ప్రహాస్యతి"—

ఇంతవరకు:- జ్ఞానక్రియాభేదమున, ద్వైతత్వవాదము నే సమర్థించితిమి గాని మూడవదగు నర్థతత్త్వముమాట యెత్తమైతిమి; ఇది జ్ఞానక్రియలకాలంబనము, త్రితత్వవాదసమర్థకము; వెనుకటి త్రిసత్యవాదప్రకరణమున దానిని సమర్థించితిమి; సామాన్య దృష్టితో నదియు నంగీకరింపవలసినదే. కాని, తాత్త్విక దృష్టి కది కర్మయం దంతర్భూత మగును; ఎట్లన:- కర్మయే క్రియ; క్రియాకూటముగుణము; గుణకూటమేద్రవ్యము; అదే అర్థము; పదార్థము; ఇట్లుత్రితత్త్వవాదము ద్వైతత్త్వవాదముగ నగును; సదసద్వాదలక్షణ బ్రహ్మకర్మవాదమే వైజ్ఞానికుల చరమసిద్ధాంతపక్షము; శ్రుతిస్మృతి ప్రమాణితము, అనుభవ యుక్తి తర్క దృష్టాంతాది పరీక్షితము నగు నీవాదమును మా గురుపాదు లిట్లు సంగ్రహించిరి.

1. యదిదందృశ్యతేదృశ్యం తద్విద్యాద్బ్రహ్మకర్మచ,
కర్మక్షుబ్ధం, బ్రహ్మశాంతం, విశ్వం త దుభయాన్వయః.

శాంతబ్రహ్మ, క్షుబ్ధకర్మ కాధారముగ నుండి 'తదేవాయం

ఘటః' ఇత్యాకార శాస్త్రిజ్ఞానమునకు మూలమగుచున్నది. దృశ్యపదార్థమందలి శుద్ధాంశమే అసత్కార్యమ్; అశుద్ధాంశమే సద్బ్రహ్మ. ఈ రెంటి సమన్వితరూపమే విశ్వము. 'తత్తుసమన్వయాత్' అను పదియు నీసమన్వితరూప సమర్థకమే.

2. ''అన్యోన్య మవినాభూతం, ప్రతిద్వం ద్వ్యభిభావకమ్,
సహకారిచ సాపేక్షం, సధర్మిచ విధర్మిచ.

అవి పరస్పరాత్యంతవిరుద్ధము లయ్యు నొండొంటిని విడచి యుండక పగుట యత్యంతమాశ్చర్యము! ఈరెండు నేకబిందు ప్రతిష్ఠితము లనుసమన్వయమెరుగక త్రితత్వవాదులు, 'అభ్వ' యను మూడవతత్త్వమును గల్పించిరి. అది బలవిశేషము; కర్మాంతర్గతమే, 'యస్మిన్ ధ్వాంతమింద్ర జ్ఞయత్రప్రకాశః, ప్రకాశోనతాద్ర జ్ఞయత్రాంధకారః' విరోధిభావ సమన్వయమే, సహయోగమే, సమ్మేళనమే, సద్భావనమే, సౌజన్యమే శాంతిమూలము. ఈ శివభావమే, ''శివుడు.'' తద్వాహనము వృషభము, తద్భూషణము సర్పము, తత్ఫాలస్థితమమృతము, తత్కంఠస్థితముగరళము, తత్పత్ని మహాకాళి, తద్వాహనము సింహము, తత్పుత్రులు కార్తికేయుడు, గణపతి. వారి వాహనములు మయూరమూషకములు.'' అనునీ మొదలగు విరోధభావముల సమష్టిరూప శివపరివార దృష్టాంతముచే స్పష్టము. అది శివస్వరూప మెందువలన? ఘోరి ఘోరతము — శాంత శాంతతము విరోధభావ సమన్వయమువలననే. సమన్వయభావము లేనిచో, నశాంతితాండవము సార్వజనీనానుభవమే.

బ్రహ్మకర్మలు రెండును ప్రతిద్వంద్విభావములు; పరస్పరమభిభావకములు. ఇది మొదటి యాశ్చర్యము, బ్రహ్మ కర్మను వహించి యున్నది; కర్మ బ్రహ్మవికాసమును గావించియున్నది. రెండునువిరోధులు. రెంటికి సమన్వయము మొదటియాశ్చర్యము. రెండు నభిభావకములు రెండవయాశ్చర్యము. రెండుంగూడి వస్తుస్వరూప సంపాదన సేయును; పరస్పర సహకారులు; ఇది మూడవయాశ్చర్యము, పరస్పరాపేక్షము-ఇదినాలవయాశ్చర్యము; తనప్రతిష్ఠకొరకు-స్వరూపపరిచయార్థము, కర్మ బ్రహ్మనపేక్షించును; తదాధారము గొనకున్న కర్మ ప్రవర్తింపనేచాలదు. సరియే, కర్మనుస్వీకరింపక బ్రహ్మదేవుడును, సృష్టిప్రక్రియయందు సఫలుడు గాజాలడు; జ్ఞానసిద్ధపదార్థము కర్మ. కర్మసిద్ధ పదార్థము జ్ఞానము. పదార్థముకర్మమయము, కనుక దానిని మన మెరుంగుదుము; పదార్థమును మనమెరుంగుదుము కనుక నే అది యున్నది. రెండును ఉపకార్యోపకారక భావములు. చక్షురింద్రియము శైత్యగుణము ననుగమించునది. శీతలోపచారము గోరునది. కాని, తనస్వరూపసత్తకు, అత్యంతవిశుద్ధ సూర్యతత్త్వమునుగూడ నపేక్షించును. అది దానికుపకారకము. ఎంత వింత!

పాత్రయందు బియ్యముంచి నీరుపోసి పొయ్యిపై కెక్కింతుము; అగ్ని - జలములు తమతమ కార్యములు నారంభించును. ఈ రెండువిరోధవస్తువుల సమన్వయమున నన్నమను

సర్వపూర్వపదార్థము సంపన్నమగును; అగ్నిసర్వథా తాప ధర్మము; జలము శీతగుణకము. రెండును ఘోరవిరోధులు, మహాప్రతిద్వంద్వులు, కాని అన్ననిర్మాణమున కీరెంటి సమ న్వయము గావలయును. విశ్వనిర్మాణమున బ్రహ్మ - కర్మలకు నిట్లే. అన్ననిర్మాణధర్మమున, జలాగ్నులు పరస్పర సధర్మ లయ్యు ప్రాతిస్వికముగ విధర్ములే. ఇది మొదటియాశ్చర్యము. ఇట్టి యాశ్చర్యమయ బ్రహ్మకర్మ నిరూపణగావించుటయు నాశ్చర్యమే (ఆశ్చర్యవత్పశ్యతికశ్చిదేనం......)

3. తారతమ్యేన కర్మయోగాత్, బ్రహ్మద్విధావిదుః,
పరంబ్రహ్మా-ఽపరంబ్రహ్మ పరం త్వాత్మైవ స ద్విధా.

పైజెప్పిన యట్టి బ్రహ్మకర్మయుగ్మము పిదప, కర్మయోగ తారతమ్యముచే రెండురూపములను ధరించును; 1. పర బ్రహ్మ 2. అపరబ్రహ్మ, ఇందు మొదటిదాత్మ, రెండవది దానిశరీరము, అదే ఒకరూపముతో నాత్మ, ఒకరూపముతో శరీరము నైపోయినది. (బ్రహ్మకర్మరూపమగు - నేకమేవాద్వితీ యంబ్రహ్మ)

ఇంతటితో నాగదు. కర్మతారతమ్యమున బలసంబంధ నైచిత్రిచే బ్రహ్మయొక్క, ఆత్మలక్షణ పరబ్రహ్మనామక మగు మొదటి రూపము ముందుకుబోయి, పరాత్పరబ్రహ్మ షోడశీబ్రహ్మ యనురెండు వివర్తము లగును. ఇందు మొద టిది విశ్వాతీతము; రెండవది విశ్వాత్మ - పరబ్రహ్మ - ఆత్మ -

విశ్వాత్మ - ఇత్యాదిరూపముల ననేక నామములచే వ్యవహృత మగు బ్రహ్మపదార్థము విశుద్ధ బ్రహ్మకాదు. అవశ్యకరూపమున నిది కర్మను తన గర్భమం దుంచుకొను చున్నది. కర్మగర్భిత బ్రహ్మయే బ్రహ్మ. ఇందు బ్రహ్మ - కర్మలు రెండు నున్నను బ్రహ్మప్రధానతంబట్టి 'తద్వాద' న్యాయమున బ్రహ్మ యందురు. ఇక: అవరబ్రహ్మలక్షణ విశ్వమునకు నిదే స్థితిగా నెరుంగవలయును. ఇందు బహ్మతత్త్వము గర్భమం దున్నది. కర్మప్రధానము. కనుక నిదియు నుభయాత్మకమయ్యు నిందు ప్రధానత కర్మకే. చివరకు:- బహ్మకర్మాత్మక బ్రహ్మ యొక్క యాత్మరూప బ్రహ్మయు, శరీర (విశ్వ) రూప కర్మయు నుభయాత్మకములే. ప్రధానతా ప్రధానతలం బట్టి రెండును వేర్వేరనుకొను చున్నంతవరకు ని యాత్మ - శరీర సంస్థలందు విషమత యుండుచుండును. ఈ రెంటికి సమన్వయము గుదుర్చుచో ఆత్మయొక్క గౌణకర్మ శరీరముయొక్క ముఖ్యకర్మతో కలసి ప్రధానమగును. శరీరముయొక్క గౌణబ్రహ్మ, ఆత్మయొక్క ముఖ్యబ్రహ్మతో సంశ్లిష్టమై ప్రధానమగును. అనగా నీసమన్వయముచే బ్రహ్మకర్మలు రెండునే ముఖ్యములు, గౌణములు నగుచు, సమభావపరిణతి నొంది సమత్వయోగానుయాయు లగును.

కర్మగర్భిత బ్రహ్మతత్త్వము, బ్రహ్మగర్భితకర్మ (విశ్వ) మందు ఏకరూపముచే వ్యాప్తమై సర్వత్ర అప్రతిహతగతి కలదై యున్నది. కనుక నే 'అవతి, (సర్వత్ర సాతత్యేన గచ్ఛతి వ్యాప్తో

భవతి ఇతి) అను నిర్వచనముచే ఆత్మ యనబడుచున్నది. ఈ యాత్మ బ్రహ్మ - పై జెప్పినట్లు పరాత్పర - షోడశి - యను రెండు రూపములు ధరించినదని ముందు స్పష్టము కాగలదు.

4. అశేషకర్మవద్బ్రహ్మ 'పరాత్పర' మితి శ్రుతమ్,
మహామాయాకర్మభేదావచ్ఛిన్నః 'షోడశీ' పరః.

సర్వకర్మ (అశేషబల) విశిష్ట బ్రహ్మయే, శ్రుతులందు 'పరాత్పర' నామమున్న బ్రహ్మాశము; అదే 'సర్వధర్మోపపన్న' బ్రహ్మ. 'సర్వధర్మోపపత్తేశ్చ' అని శారీరకసూత్రము. శుక్లకృష్ణాది వర్ణము లన్నిటికి సింధుసమన్వయము. కర్మ (బల) ప్రపంచ మంతయు నిండియున్నది. ఇది అణోరణీయాన్, మహతోమహీయాన్-కనుక అసీమము, అత్యంతపినద్ధము, వ్యాపకము, అవాఙ్మానసగోచరము 'నేతినేతి' రూపమున గీర్తింపబడునది; శాస్త్రానధికృతము.

దీనియందలి యొక (మాయాకల్పిత) ప్రదేశము, మాయాబల సీమితమై - యా మాయాపుర సుప్తమై 'సోఽస్యాం పురి శేతే తస్మాత్ పురుషః' 'సవాఅయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః' (పురిశయ ఏవ పురుషః పరోఽక్షేణ, పరోక్షప్రియాఇవహి దేవా, ప్రత్యక్షద్విషః) ఇత్యాదులంబట్టి 'పురుషు' డనబడును. మహామాయా సీమా కారణమున పురుషుడు (మహామాయాతీత - అమాయా పరాత్పరుని మాయా ప్రదేశము ససీముడయ్యు అసంగుడే. కర్మచితి (బలగ్రంథి బంధన) ఉద

యము కేవలము మహామాయాబలముపై నాధారపడియుండ లేదు. యోగమాయా సమన్వయము వలననే మహామాయ సంగశ్చావజననియు, బ్రహ్మనైవిధ్యకారణము నగును.

విశుద్ధ మహామాయావచ్ఛిన్న ససీమ బ్రహ్మచితి ధర్మ బాహ్యమై చితిలక్షణ వైవిధ్యమునకు వేరై యుండును. కనుక నీ (మహామయీ) బ్రహ్మను, 'నవైవిధ్యమేతి, వివిధతాం గచ్ఛతి' యను నిర్వచనముచే 'అవ్యయ' మే యందురు. పిదప హృదయబలమునకు జెందిన యనంతయోగమాయల వలన నీ యవ్యయము చితిధర్మయుక్తమై 'చిదాత్మ' యగును. మహామాయావచ్ఛిన్న మగు నీ పరబ్రహ్మ హృదయబలానుగామిను లగు పరా - అపరా యను తన యంతరంగ ప్రకృతులతో నిత్య యుక్తముగ నుండును. పరాప్రకృతి యక్షరము. అపరాప్రకృతి క్షరము. మొత్తముపై నవ్యయాక్షరక్షరములు మూడును అయిదేసి అయిదేసి అవాంతరకళలు గలవి. ఇవి యోగ మాయాజనితములు. కాగా:— ఈ మొత్తము 15 కళలతో నిత్యానుస్యూతమగు సర్వబలవిశిష్టరసమూర్తి మాయాతీత పరాత్పరు డొకడు గలియగా, నా యవ్యయపురుషుడు షోడశ కళలుగలవాడై 'షోడశీ' అగును. ఇట్లు కర్మయోగ తారతమ్య మున నొకే పరబ్రహ్మకు పరాత్పరబ్రహ్మ - షోడశీబ్రహ్మ అను రెండు వివర్తములు. సర్వబల విశిష్టరసము పరాత్పరము. మహామాయాత్మక కర్మావచ్ఛిన్న నియత బల విశిష్టరసము షోడశి.

౬. "పరమేశ్వరఇత్యుక్తో విశ్వాతీతః పరాత్పరః,
తత్రేశ్వరాః పరాత్మానః సన్తిషోడశినో ఽ మితాః"

పరాత్పర - షోడశులు పరాత్మలే. కాని, పరాత్పర నామకము షోడశికంటె బరమగుటచే (పరాదపిపరః) 'పరాత్పర' మనబడును. విశ్వము సీమాభావముగలది. పరాత్పరము విశ్వాతీతము, అసీమము. 'పరమేశ్వర' నామప్రసిద్ధము. ఇందలి యనంత మాయా బలములం దొక్కొకదానినుండి యొక్కొక షోడశి (స్వతంత్రేశ్వరుడు) జనించును కావున అనంతషోడశులు (ఈశ్వరులు). పరమేశ్వరు డొకడు. ఈశ్వరు లసంఖ్యులు. పరమేశ్వరుడు అజరుడు. అమరుడు. మాయావచ్ఛేదమున నుదితుడగు నీశ్వరుడు 'సంయోగాః విప్రయోగాంతాః' అను నియమానుసారము మరణధర్మముగలవాడు.

మహామాయావచ్ఛిన్నుడగు నీశ్వరుడే అమృత - బ్రహ్మ - శుక్రాత్మ కాశ్వత్థము. దీనికి వేయిశాఖలు. ఒక్కొకదానికి, స్వయంభూ - పరమేష్ఠి - సూర్య - చంద్ర - పృథువు లను పంచ పంచపర్వము లుండును. ఇదే పంచిపుండీర ప్రాజాపత్యబల్శా. ఈదృష్టితో ఒక్కొకమహామాయా అశ్వత్థేశ్వరునందు వేలకు వేల బ్రహ్మాండములనత్త సిద్ధమగుచున్నది. పంచపుండీరాత్మక బ్రహ్మాండమందు, ఋషి పితృ దేవ గంధర్వ అసుర పిశాచ మనుష్య కృమి కీట పతంగ పశు పక్ష్యాదు లనంతప్రాణులున్నవి. ఇట్టి బల్శాచే తన స్వరూపమును సంపాదించు నశ్వత్థేశ్వరుని, వేయవశాఖయగు నీ తత్త్వ ముపేశ్వరనామముచే నుపవర్ణిత

మైనది. ఇట్టి బల్సాత్మకమగు నొక బ్రహ్మాండమందలి ఋష్యాది జీవులకు ప్రభవప్రతిష్ఠాపరాయణ మీ యుపేశ్వరుడు. లేదా బల్సేశ్వరుడు. తక్కిన బ్రహ్మాండములతోడను, తదధిష్ఠాతలగు నుపేశ్వరులతోడను మన కేమియు సంబంధము లేదు. మనకు మన పంచఖండీరాధిష్ఠాతయగు నుపేశ్వరుడే మన యీశ్వరుడు (అశ్వత్థము). పరమేశ్వరుడు (పరాత్పరుడు) అన్నియును. మన కతనితోడనే సంబంధము.

పరాత్పరునం దనంతమాయాబలములు. ఒక్కొకదానియం దొక్కొక యీశ్వరుడు. ఒకయీశ్వరోదరమునం దనంతో పేశ్వరులు. అందొక్కొక్కని యుదరమం దసఖ్యాసంఖ్య ప్రాణులు ఉత్పన్నవినష్టములగుచుండును. మనమందర మట్టి యుపేశ్వర శరీర కీటాణువులము. మనశరీరమందును, అసంఖ్య కీటాణువులు. ఇట్లు:- అసంతకీటాణుగర్భిత ప్రాణిశరీరగూ పా నంతకీటాణువులను తనగర్భమందుంచుకొను నుపేశ్వరు డాయశ్వ త్థేశ్వరభ్రూణము; ఇట్టి వేలకొలది భ్రూణముల నాయశ్వత్థేశ్వ రుడు తనయం దిముడ్చుకొనియున్నాడు - అట్టివాడు, మాయా తీత పరాత్పరున కొకభ్రూణము; మాయాబలము లనంతములు. కనుక నిట్టిభ్రూణము లాతనియం దెన్నో! ఇట్లు 'అథ' నుండి 'ఇతి' వరకు ననంతబ్రహ్మ యానంత్యము విస్తరిల్లుచున్నది. ఇంతకు జెప్పదలచినది:- విశ్వాతీత పరాత్పరుడు పరమేశ్వరుడు; ఈయనసీను పరాత్పరునందలి మాయామిత, - సంఖ్యాఽమిత -

పరాత్మనామకేశ్వరులు (షోడశులు) ప్రతిష్ఠితులై యున్నారనియే.

6. మహామాయాకర్మభేదా వచ్ఛిన్నస్తు పరోఽవ్యయః.
పరావరోఽక్షరస్తత్ర, క్షరస్తత్రాపరఃపరః (అన్యః).

7. త్రయోఽమీ పురుషా ఉక్తా అవ్యయ శ్చాక్షరః క్షరః
త్రయస్తే పురుషా యుక్తాః షోడశీపురుషః పరః.

సుగమములు.

8. ఆత్మైవేదం పరంబ్రహ్మ సర్వత్రాప్త మకర్మతత్.
అథకర్మావరంబ్రహ్మ తదాత్మాచ పురంచ తత్.

అంతట నవిభక్తముగ న్వ్యాప్తమై విభక్తమట్లున్న యాత్మలక్షణ పరబ్రహ్మ. లేదా పరాత్మ (షోడశి) విశ్వమున కాత్మ. ఈ విశ్వాత్మ, బ్రహ్మభాగ ప్రధానతచే స్వయముగ నకర్మరూపము. (సత్త్వప్రధానము - జ్ఞానప్రధానము.) ఈ యకర్మ యొక్క అపరాప్రకృతిలక్షణ క్షరభాగము పరిణామి. దీనినుండి క్షణక్షణము క్రొంగ్రొత్త వికారములు జనించుచుండును. ఇదే విశ్వరూపపురప్రతిష్ఠ. కాని ఇది స్వస్వరూపమున నవికృతముగ నుండుననియు, వైకారిక క్షర విశ్వమున కాత్మ అనియు, దీని నాత్మక్షర మందురు. ఈ దృష్టితో షోడశి పరబ్రహ్మకోటి యందును, తదీయావరలక్షణ క్షరభాగోత్పన్న వికార సంఘమవరకోటియందును జేరును.

పరబ్రహ్మ అకర్మ. అనగా కర్మయున్నను అసంస్పృష్టమని యర్థము. ఇట్లే దానికి పరమగు మాయాతీత పరాత్పరమును అకర్మయే. దీనికి సృష్టియందు షోడశి కున్నంత సంపర్కమును లేదు. ఇది నిత్య శుద్ధ - బుద్ధ - ముక్తము. ఇందు కర్మలేశము గూడ లేదు. అనగా నిందు సర్వథా కర్మనుస్తమని యర్థము. ఈ కర్మనే బలమందురు. కనుక నది సర్వబల విశిష్టరసమందురు. ఇక షోడశియో, మాయావచ్ఛేదకముచే కర్మప్రపంచ సహాకారి యనక తప్పదు. కాని స్వస్వరూపమున నిదియు కర్మ లేప బాహ్యము. అందువలన నసంగము, నకర్మ నాబడును. ప్రపంచమంతయు మాయాగర్భమందున్నది. మాయాపరిధి వరకు షోడశీపురుష వ్యాప్తి యున్నది. కాగా, ఈయకర్మయగు షోడశీబ్రహ్మ సర్వవ్యాప్తి సిద్ధమగుచున్నది. చూడుడు:—

"మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ!
మయి సర్వమిదం ప్రోతం, సూత్రే మణిగణా ఇవ"

ఇట్లు పరాత్పరబ్రహ్మగర్భిత (పరాత్పరప్రదేశగర్భిత) అకర్మ లక్షణ పరాత్మ (షోడశి) కంతటను ఆత్మరూపమున వ్యాప్తి యని భావము. (పూర్వార్థము.)

షోడశీపురుషుని పరిణామ్యాత్మాక్షరమునుండి నిరంతరము వికారములు వెడలుచుండును గదా! ఇనుమునుండి త్రుప్పు, పాలనుండి మీగడవలె జనించు నా వికారసంఘము మాయాత్మా క్షరము నందే యుండును. అందువలన తదీయాత్మత్వము

(ఆత్మవికాసము - ఆత్మజ్యోతి) అణిగిపోవును. కేవలము వైకారిక కర్మసామ్రాజ్యమే యుండును. కాని, వెనుకజెప్పినట్లు:— పరబ్రహ్మయందు కేవలము బ్రహ్మలేనట్లే ఇందును కేవలము కర్మయేలేదు. మీగడక్రింద పాలవలె, త్రుప్పులోపల నినుమువలె, నురువులోని నీటివలె వికారసంఘగర్భమున నాయాత్మక్షర (అవ్యయాక్షర విశిష్టాత్మక్షర) మున్నది. ఇట్లు అవ్యయాక్షరావినాభూతాత్మక్షరముం దన గర్భమందుంచికొన్న వికారసంఘమే కర్మప్రధానముగు రెండవయపరబ్రహ్మ.

కర్మరూపమగు నిదియు, పరబ్రహ్మవలె రెండుభాగములుగ బరిణతమగును. పరబ్రహ్మ రెండురూపములు. పరాత్పర — షోడశులు. అపరబ్రహ్మ రెండురూపములును ఆత్మ - పురములు వికారసంఘమాత్మక్షరున కాయతనము (నివాసభూమి); కనుక దీని నాత్మపురము లేదా బ్రహ్మపురము అనవచ్చును. ఇదే పిదప విశ్వరూపధారణ మొనర్చును. లోహమందలి కించిత్ప్రదేశము త్రుప్పుగనై తక్కినభాగము అవికృతముగ నట్లే యుండునట్లు, ఆత్మక్షరుని కొలది ప్రదేశమే (అవికృతపరిణామరూపమున) వికారముగ బరిణతమగును. తక్కిన దెప్పటియట్లే యుండును. వాస్తవమున:—

"ఏషనిత్యోమహిమా బ్రాహ్మణస్య (బ్రహ్మణో) నకర్మణా వర్ధతే నో కనీయాన్" అన్నట్లు అనంతవికారము లుత్పన్నమయినను నిత్యమగు నాత్మక్షరప్రదేశమున కించుకయు హాని

లేదు. అది యెప్పుడు నెప్పటట్లే యుండును. దీనినే దార్శనికు 'లవికృతపరిణామవాద' మందురు.

ఇంతకును:— ఆత్మాక్షరోత్పన్న వికారసంఘము క్షరము లేక విశ్వము. ఆత్మాక్షరము స్వయముగ నీక్షరమున నాత్మ. పరాత్పర షోడశీసమష్టి పరబ్రహ్మ యనబడును ఆత్మ - (ఆత్మాక్షర) క్షర (వికారసంఘాత్మ - విశ్వ) సమష్టి యవరబ్రహ్మ, బ్రహ్మ కర్మ లక్షణ పర - అవర - బ్రహ్మసమష్టియే 'తదిదంసర్వమ్' (ఇది యుత్తరార్థభావము)

9. కర్మానుబంధసాపేక్షం బ్రహ్మేదంత్రివిధంపునః,
సృష్టం ప్రవిష్ట మున్ముక్తం, సృష్ట్వా నుప్రావిశ ద్ధి తత్ (బ్రహ్మ).

10. బ్రహ్మ, సృష్టంకర్మ, కర్మచితివ్యష్ట్యవలంబనమ్,
ప్రవిష్టంబ్రహ్మతద్విద్యాత్ సమష్ట్యవలంబనమ్.

11. కర్మాతీతంతుతత్ కర్మోపహితం బ్రహ్మభిన్నవత్,
తదున్ముక్తమిదంనిత్య శుద్ధబుద్ధంనిరంజనమ్.

పూర్వోక్త, సదసల్లక్షణ బ్రహ్మతత్వమే కర్మానుబంధమున, (i) సృష్టబ్రహ్మ (ii) ప్రవిష్టబ్రహ్మ (iii) ఉన్ముక్తబ్రహ్మ (ప్రవివిక్త బ్రహ్మ) యను మూడుసంస్థలగును. వీనినే వరుసగ విశ్వ - విశ్వ చర - విశ్వాతీతములు, అపర - పర - పరాత్పర బ్రహ్మలనియు, నందురు. పరాత్పరావ్యయా క్షరక్షరరూపమున జతుష్పాత్తగు నీ షోడశీబ్రహ్మ-

"పాదోఽస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి,
త్రిపాదూర్ధ్వఉదైత్పురుషః పాదోఽస్యేహాభవత్పునః"
"విష్టభ్యాహమిదంకృత్స్నం ఏకాంశేనస్థితోజగత్"

ఇత్యాదులంబట్టి:— చతుర్థపాదస్థానీయ - లేదా - ఏకాంశ స్థానీయ క్షరభాగముచే వికారముల నుత్పన్నముల గావించి వానిచే విశ్వము నిర్మించి 'తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్' అన్నట్లు తన షోడశీరూపమున స్వైకానేకవిశ్వ గర్భమందు విశ్వాభిమానియగు నాత్మరూపమున ప్రవేశించును.

విశ్వోపాదానము షోడశియొక్క ఆత్మక్షరభాగ మంటిమి గదా! అదే తన వికారములం గొనికొని మాయావికార సంఘముచే 'సృష్ట' రూపమొంది శేషరూపమున నం దాధారముగ ప్రవేశించి ప్రవిష్టమనబడును. ఇక, సృష్టము, ప్రవిష్టము గాక యున్న మాయాతీత, కార్యకారణాతీత మగు నాపరాత్పర భాగ మున్ముక్తము లేక ప్రవివిక్తమునాబడును; అనగా:— 1. సర్వబలవిశిష్టరసమూర్తి, మహామాయాతీత పరాత్పరనామక పరబ్రహ్మ విశ్వాతీతమై ఉన్ముక్తబ్రహ్మయనియు, 2. నియత బల విశిష్టరసమూర్తి, మహామాయా, షోడశీనామక పర బ్రహ్మ, విశ్వచరమై ప్రవిష్టబ్రహ్మయనియు, 3. ఆత్మక్షర రూపముచే నాత్మయు, వికారసంఘరూపముచే నాత్మపురమును, అను రెండురూపములచే విభక్తమైయున్న యోగమాయ అపరబ్రహ్మయే సృష్టబ్రహ్మయనియు ఇట్లు మహామాయా

యోగమాయా, రూప బలాత్మక, కర్మానుబంధ తారతమ్య మున నొకటే మూడువివర్తము లొందుననియు నిష్కర్ష.

ప్రకారాంతరముగ:— సృష్టరూపము నుత్పన్నముగావించి యందు ప్రవిష్టమగు బ్రహ్మ (బ్రహ్మభాగప్రధానతచే) బ్రహ్మ యనబడును. ఇక దీని సృష్టరూపము (కర్మయోగప్రధానతచే) కర్మయనబడును. కర్మలక్షణ బలచితివలననే విశ్వము సంపన్న మయినది. ఒక్కొకపదార్థమును వ్యష్టిరూపచితి కర్మప్రధాన మును, కనుకనే, కర్మనామమున వ్యవహృతమగు సృష్టబ్రహ్మ యీసృష్టరూపచితుల కాలంబనమగును; ఇక:— బ్రహ్మప్రధా నమును కనుకనే, బ్రహ్మనామకప్రసిద్ధ ప్రవిష్టబ్రహ్మ సమష్టి రూప మహాచితి కాలంబనమగును.

మరొకవిధముగ:— విశ్వపదార్థము లన్నిటికిగల ప్రతిష్ఠా తత్త్వము క్షరరూపసృష్టబ్రహ్మ. వానివాని ప్రాతిస్వికక్రియలకిది యాధారము. అట్టి అనంతవ్యష్టులసమష్టియేవిశ్వము. దీని కేక కాలావచ్ఛేదముచే ప్రతిష్ఠయై, దీని మహా కర్మస్వరూపప్రతి ష్ఠయై యున్న మహాలంబనము ప్రవిష్టబ్రహ్మ - ఇది బ్రహ్మ కర్మోభయమూర్తి అయ్యును, బ్రహ్మప్రధానమగుటచే 'బ్రహ్మ' 'అకర్మ' - ఇత్యాది నామములచే వ్యవహరింపబడు సమష్ట్యా లంబనరూప షోడశీలక్షణ పరబ్రహ్మయే. ఇక: కర్మబ్రహ్మో భయమూర్తియు, కర్మప్రధానమును, కనుక నే కర్మ యనబడు నదియు, వ్యష్టులకాలంబనరూపమును, ఆత్మ - క్షరలక్షణమును నగు నపరబ్రహ్మయే సృష్టబ్రహ్మ యని నిష్కర్ష.

సరియే ఇంతటితో స్పృష్టప్రవిష్టమీమాంస యైనది. ఇక మిగిలినది మూడవదగు నున్ముక్తబ్రహ్మ! స్పృష్టబ్రహ్మ కర్మ ప్రధానము 'కర్మరూపము'. ప్రవిష్టబ్రహ్మ బ్రహ్మప్రధానము, అకర్మరూపము, గదా! ఇకనియున్ముక్తబ్రహ్మ మాయాసీమకు వెలియై కర్మాతీతమై యున్నది. కానిబ్రహ్మ (రస) తత్త్వము, కర్మ (బల) తత్త్వము లేక యెన్నడునుండదు. కనుక నీ బ్రహ్మయు కేవలము కర్మశూన్య మనజాలము. ఇక:– ఘటత్వ శాబ్దబోధ విశేష ప్రకారము నాధారముగాగొని 'భాతి' ద్వారా నీయున్ముక్తబ్రహ్మ కర్మాతీతత్వము నెట్లో నురక్షితము గావింపవచ్చును.

'ఘటే ఘటత్వమ్' అను వాక్యార్థ సమన్వయము పట్టున, దార్శనికులు, 'ఈవాక్యముతప్పు, ఏమన ఘటమందు కంబు గ్రీవాది లక్షణ ఘటత్వమున్నది కనుక నది ఘటమనబడును. అదిలేనినాడు దాని యస్తిత్వమే యుండదు, ఘటత్వగర్భిత ఘటశబ్దమే మనయుచ్చారణకు విషయముకాగలదు. ఘటత్వము లేనిచో ఘటోచ్చారణ దేనింగూర్చి? ఇంక:- ఒక ఘటమందొకే ఘటత్వముండును గావున 'ఘటత్వేఘటత్వ' మ్మనుట యసంగతము. ఘటత్వము ఘటమందుండును. ఘటత్వమందు ఘటత్వమేమి! ఇట్లుండగా:- 'ఘటేఘటత్వం' అనుచో 'ఘటత్వ మించను లేకుండనే ఘటేయనుటయెట్లు! దానిని స్థాపింపనేగదా ఘటత్వమనుట? ఘటమందు ఘటత్వము లేకుండుచో 'ఘటే' యనవచ్చును, కాని, యది యసంభవము, ఘటమునందు

ఘటత్వ ముండనే యున్నదిగదా? అయినచో 'ఘటే ఘటత్వమ్' అను వాక్యార్థము 'ఘటత్వవిశిష్టే ఘటేఘటత్వ' మనవల యును, కాని, ఒక 'త్వ' యందు ఇంకొక 'త్వ' ఉండదు కనుక నావాక్యార్థమును తప్పి - ఇక నీ 'ఘటేఘటత్వ' మ్మను వాక్య సమన్వయమెట్లు? అన్నచో:—

నిజమే. ఘటత్వములేని ఘటముండదు, కాని, ఘట - ఘట త్వములు భిన్నములనియు, అవినాభూతములనియు, నెరుంగు దుము. ఈజ్ఞానదృష్టింగాని, సత్తాదృష్టితో నివి యభిన్నము లైనను, వాక్యసమన్వయార్థము కొంతసేపు ఘటత్వావివక్షు సేయుచుచున్నది. ఈజ్ఞానసార్థక్యము నాధారముగాగొని మా వాక్యమునకు 'ఘటత్వోపహితే ఘటత్వమ్' అని అర్థము చేయబడును.

సరిగా, నీశాబ్దబోధ ప్రక్రియానుసార మిచటను చూడ వలయును. కర్మ (బలము) ను విడచి బ్రహ్మ యెన్నడును విశుద్ధ రూపమున బరిణతి నొందదు. అయినను 'బ్రహ్మణి బ్రహ్మత్వమ్' అనుచో బ్రహ్మయందుండు కర్మను (భాతిద్వారా) అవివక్షుచేసి 'కర్మోపహితే బ్రహ్మణి బ్రహ్మత్వమ్' అని వాక్యార్థము కావింపబడును. బ్రహ్మయొక్క బ్రహ్మత్వము కర్మయే. ఘట త్వము లేని ఘటమునకు విలువలేనట్లే కర్మత్వము లేని బ్రహ్మ కును విలువ లేదు. అట్టిదనుపపన్నము. ఇట్లు 'త్వ' ను అవి వక్షుచేసి బౌద్ధ జగదాధారమున నున్నకర్మబ్రహ్మను కర్మాతీత మనవచ్చును.

ఈ కర్మాతీతమగు నున్ముక్త బ్రహ్మ నిత్యశుద్ధము. దీనికి పాపసంబంధము లేదు. ఇది నిత్యబుద్ధము. దీని జ్యోతిర్భాగ మెన్నఁడును కర్మావృతము గాదు. నిరంజనము. తమోగుణరూప విశ్వాంజన సంపర్కము దీనికి లేదు. ఇట్లు సదసల్లక్షణ మగు నొకే బ్రహ్మ మాయా, లౌకిక కర్మయోగ తారతమ్యమున నున్ముక్త ప్రవిష్ట సృష్టము లను మూఁడు వివర్తముల నందుచున్నది. సృష్టాత్మక విశ్వమును బ్రహ్మయే, విశ్వప్రవిష్ట విశ్వాత్మయు బ్రహ్మయే, విశ్వాతీతోన్ముక్తమును బ్రహ్మయే. కనుకనే 'సర్వం ఖల్విదం బ్రహ్మ, ఏకమేవాద్వితీయం బ్రహ్మ, నేహ నానాస్తి కించన' అను శ్రౌతవచనములు చరితార్థము లగుచున్నవి.

ఇంతవఱకునైన బ్రహ్మ - కర్మేతివృత్తమువలన, జీవాత్మలు, జీవాత్మలపాంచభౌతికశరీరములు, పాంచభౌతికవిశ్వము, విశ్వచరషోడశీబ్రహ్మ, విశ్వాతీత పరాత్పరబ్రహ్మ ఇవియన్నియు బ్రహ్మకర్మమయములు, బ్రహ్మాత్మకములు అని తేలినది. ఇక నీవిషయమున జెప్పతగిన దేమియులేదు. కాని యీ బ్రహ్మకర్మల వివిధరూప పరిజ్ఞానము దృఢమై గీతోక్త బ్రహ్మ - కర్మ తాత్త్వికస్వరూపము చేయుట కుపకరించు గొన్ని యుదాహరణముల నిచ్చి యీ ప్రకరణము ముగించెదము.

## బ్రహ్మకర్మల వివిధరూపములు

పరాత్పర - ఈశ్వర - జీవ - విశ్వభావములు నాల్గును బ్రహ్మకర్మాత్మకము లయినను ఇందు పరాత్పరుని మాయాతీతత్వము

వాక్కు నవరోధించుటయే తత్సంబంధమున నేమియు జెప్ప జాలక తక్కిన మూటినే విచారించెదము. బ్రహ్మ యమృతము; కర్మ మృత్యువు; అని వెనుక జెప్పియుంటిమి. ఇపుడీ రెంటిం గూర్చి నూతన దృష్టితో చూతము.

మాయామయ మర్త్యవిశ్వముంబట్టి బ్రహ్మలక్షణామృత భాగమునకు :— సాక్షీ - భోక్తా - ప్రాణ - విత్తము - లను నాల్గు విభాగములు. ఈ యుక్తియునే 'చతుష్పాద్బ్రహ్మ' 'బ్రహ్మ చతుష్పదీ' 'బ్రహ్మ చతుష్టయీ' ఇత్యాదిగా వ్యవహరింప వచ్చును. ఇక:— కర్మ లక్షణ మృత్యుభాగమునకు:— మొదట రెండు, పిదప ననంతములు, విభాగములు ముందుస్పష్టము కాగలవు. మొదట బ్రహ్మచతుష్టయిం జూతము.

మొదటిది సాక్షీ. మర్త్య విశ్వముంబట్టి యీబ్రహ్మభాగము సర్వథా అఖండము, నిరవయువము. అమూర్తము, అత్యంత నిగూఢము. కనుక నిది 'గూఢోత్మా' నాబడును. "ఏషసర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే దృశ్యతే త్వగ్ర్యాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః," 'నాహంప్రకాశః సర్వస్య యోగ మాయా సమావృతః' శబ్దబ్రహ్మవేత్తలు దీనిని 'స్ఫోట' మందురు. దీనినే మనము. అకర్మలక్షణాసంగ షోడశీపురుషు డందుము. ఇదే విశ్వమునకు సర్వజ్యేష్ఠము శ్రేష్ఠమునగు నాలంబనము.

"ఏతదాలంబనంశ్రేష్ఠ మేతదాలంబనంపరం
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకేమహీయతే" (కఠ)

దీని నాధారముగాగొనియే తక్కిన బ్రహ్మవివర్తములు కర్మ

వివర్తములున్నవి. కనుక నిది సర్వాలంబనము. దీని నాలవ భాగ మాత్మక్షరమంటిమి. పరాత్పరావ్యయాక్ష రాత్మక్షర సమష్టి షోడశికదా! కనుక ఆత్మాక్షరము దీనినాలవభాగము. ఈ యాత్మాక్షరమునుండి వికారక్షరోత్పత్తి జెప్పితిమి. ఈ వికార సంఘమే విశ్వసృడ్బ్రహ్మ. ఇదే 'శుక్ర' యను రెండవ వివర్తము. దీనినే, అక్షరబ్రహ్మయొక్క ఆత్మ - పురము లను రెండు విభాగములను జెప్పెదరు. వైకారికవిశ్వమును కాత్మయనియు వ్యష్టి చితులు నాలంబనములుగను అంటిమి. దీనినే (శుక్రబ్రహ్మనే) ప్రథమజబ్రహ్మ, ప్రతిష్ఠాబ్రహ్మ, త్రయీబ్రహ్మ - సప్తపురుష పురుషాత్మక ప్రజాపతి - ఇత్యాదిగా బ్రాహ్మణములు వ్యవహరించెను. ఆత్మక్షరావచ్ఛిన్నమగుటచే నిది తద్రూపమే.

ఇక మూడవది ప్రాణబ్రహ్మ. ప్రాణతత్త్వము త్రివృద్భావము కలదగుటచే దీనికి ఆత్మబ్రహ్మ - జాయాబ్రహ్మ - ప్రజాబ్రహ్మ (ఆత్మ - జాయా - ప్రజా) యను మూడవాంతర వివర్తములగును. త్రివృత్ప్రాణమందు మనఃప్రాణవాక్కులను మూడాత్మకళల సమన్వయము గలదు. (చూడుడు: ఈశోపనిషద్విజ్ఞానమున, మనఃప్రాణవాక్కుల త్రివృద్భావ వ్యాపకత్వమను ప్రకరణము) ఇందువలన:— ఈప్రాణబ్రహ్మకు 1. ప్రాణగర్భితమనస్సు 2. ప్రాణగర్భితవాక్కు 3. ప్రాణగర్భిత ప్రాణము అను మూడురూపములగును. ఇవేవరుసగ:— ఆత్మ - జాయా-ప్రజా యనబడును. ప్రాణబ్రహ్మయొక్క యీమూడు వివర్తములతో నాలవదగు 'విత్తబ్రహ్మ' యు, ఐదవదగు

మర్త్యకర్మయు నను రెండును గూడగా వెంటనే పాంక్త (పంచావయవ) యజ్ఞస్వరూపము నిష్పన్నమగును. విశ్వయజ్ఞస్వరూపము 1. ఆత్మ (యజమానుడు) 2. జాయా (యజమానపత్ని) 3. ప్రజా- 4. విత్తము (దక్షిణాది) 5. కర్మ (అధ్వర్యవాది) అను నీయైదిటిపై నాధారపడియున్నది. ఈపంచ యజ్ఞావయవములందలి విత్తనామక చతుర్థపర్వపర్యంత మాత్మవ్యాప్తి యంగీకరింప బడినది- 'యావద్విత్తం తావదాత్మ'

ఇక మిగిలిన నాలవదగు 'విత్తబ్రహ్మ' - భోగ్య (అన్న) మే విత్తము, భోక్తయే ప్రాణము; అన్నాదము. అన్నాదగర్భ ప్రవిష్టాన్న మన్నాదుడే యగును. కనుక విత్తపర్యంత మాత్మవ్యాప్తి యంగీకరింప బడినది. 'యావద్విత్తంతావదాత్మా; ఏతావాన్ ఖలు వై పురుషః యావదస్యవిత్తం' ఆత్మ యమృతప్రధానము, అమృతమే బ్రహ్మ. దాని వ్యాప్తి విత్తపర్యంతము. కనుక విత్తముగూడ బ్రహ్మకోక (నాల్గవ) వివర్తముగ నెంచబడినది. ఈనాల్గు బ్రహ్మవివర్తములందును 1. సాక్షిరూప షోడశి తన యసంగతచే (మర్త్యవిశ్వముంబట్టి) ఉన్ముక్తబ్రహ్మ (విశ్వాతీతము). 2. ప్రథమజలక్షణ విశ్వసృడ్బ్రహ్మ ప్రవిష్టబ్రహ్మ (విశ్వచరము). 3. ప్రాణలక్షణ ఆత్మ - జాయా - ప్రజా - విత్త - కర్మ యను నీయజ్ఞపర్వసమష్టి సృష్టబ్రహ్మ యనబడును.

ఇక: మృత్యులక్షణ కర్మ భాగము:— చేతనసృష్టి - జడసృష్టి యను రెండుభాగములు. విశ్వమందలి పదార్థములు ఈ రెండు

తెరగులవే. ఈ రెంటను కర్మలక్షణ క్రియాతత్త్వ మగపడు చున్నది. ఇందు చేతనములందలి క్రియంగూర్చి ప్రమాణము లక్కరలేదు. ఇక జడపదార్థ క్రియా విషయముంగూర్చి కొంచెము చూతము.

వృక్షము, ఆకులు కదలుచున్నవి. కదలుట క్రియ. జ్ఞానాధారము లేక క్రియ యుండదు. మన యాధ్యాత్మిక కర్మకలాప మూలము? ఆధ్యాత్మిక జ్ఞానమూర్తి చిదాభాసుడు జీవాత్మ. మన కర్మలు మన యిచ్ఛాధీనములు. ఇచ్ఛాశక్త్యాలంబనము జ్ఞానశక్తి. సుషుప్తియందిది పురీతతీ నాడిం జేరి యభిభూత మగుచో, కర్మేంద్రియములు నిశ్చేష్టము లగుచున్నవి. కనుక 'జ్ఞాన శక్త్యాధారమున నుత్థితమగు కామనయే కర్మప్రవృత్తి కేక మాత్ర కరణము' అనకతప్పదు.

ఇట్లే జడకర్మలకును, జ్ఞాన సహాకృత కామనాధీనతనే యొప్పికోవలయును. వృక్ష కంపనము, వాయు సంచరణము, సముద్రగర్జన, మేఘఘర్షణ, వజ్రనిర్ఘోషము, విద్యుచ్చాక చక్యము మొదలగు జడకర్మలన్నియు నీతరగతిలోనివే. వానికి మన జ్ఞాన కామనలతో బనిలేదుగదా!

ఈ జడకర్మల యుపపత్తింగూర్చి విధిలేక, 'దేని, నిత్య - నిర్బాధ, కామనయొక్క యాధారమున సంపూర్ణ కర్మ కలాపము బ్రతిష్ఠితమై యున్నదో అట్టి మహాజ్ఞాన మొకటి యుండవలయును. అని యంగీకరింపవలయును. అయ్యది తన జ్ఞానమయ, కామనారశ్ములచే తత్తత్సమయ విశేషములం దాయా

కర్మల యుత్థానపతనములను గావించుచున్నది. చేతనా లక్షణము, చిదాత్మ లక్షణము, సర్వాధిష్ఠాతయు నగు నీ మహా జ్ఞాన నిధియే, ఆస్తికజగత్తునందు 'పరమాత్మ - ఈశ్వరుడు, అంతర్యామి, జగన్నియంత' ఇత్యాది నామములచే స్తుతింప బడుచున్నది.

వృక్షము కదలుటకుమూలము వాయువందురా! జ్యోతిశ్శాస్త్ర ప్రకారము శనిబుధులందురా? అవియు జడపిండములే తత్సంయోజకము? చివరకు బైజెప్పిన ఈశ్వరేచ్ఛ యనవల యును. కర్మగర్భిత జ్ఞానమే యీశ్వరుని యీశ్వరత్వము; తదిచ్ఛయే, సర్వకర్మప్రవర్తిక. అనగా, వాయు కంపనమూలము! చేతన కర్మలకు తత్తత్సంస్థాగత చేతనప్రాణియు, జడకర్మలకు ఈశ్వరతత్త్వమును బ్రవర్తకములనిభావము. యేకర్మ మైనను జ్ఞానాధీనము, జ్ఞానపర్యవసానము. "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే."

చేతనకర్మ లాధ్యాత్మికములు; ఇవి జీవాత్మకు జెందినవి. జడకర్మ లాధిదైవికములు; ఇవిపరమాత్మకుజెందినవి. పిదప నీ కర్మద్వయి, కర్మత్రయియగును. కొన్నికర్మలు కేవలము ప్రభువు పరమాత్మకు జెందినవి. సూర్యచంద్రగ్రహనక్షత్ర పృధివీజలతేజో వా య్వాకా శౌషధివనస్పతి సముద్రపర్వ తాది జడపదార్థ కర్మలన్నియు, ప్రాకృతికములు. ఇవి ఈశ్వర ప్రాతిస్వికములు; ఆపదార్థ నిర్మాణముతో వాని యుచ్ఛా వచజ్ఞానముతో, మనకు నేమియు సంబంధము లేదు; వాని

సృష్టిప్రవృత్తిసంహారము లన్నియు నాపరమాత్మయే చేయును; అట్టికర్మలసమష్టి నీశ్వరకర్మయందురు.

గ్రంథ రచన, వాయుయాన, నౌకా, ప్రాసాదాది నవీన నిర్మాణములు, సంఖ్యా, తూలనాదులు, వస్త్రాద్యలంకార విన్యాసములు, మొదలగునవి జీవకర్మలు. ఇందుకు మనమే మూలము; కనుక ఈకర్మసమష్టి జీవకర్మయనబడును.

ఇక, ఈశ్వరసృష్టిలోని పదార్థములంగొని, మనయిచ్ఛ వచ్చిన మార్పులు కూర్పులును గావించి, క్రొత్త మొక్కలను నెలకొంచి క్రొత్తపూవులం బూయజేయుట మొదలగుపనుల సమష్టి ఉభయకర్మయందుము. ఇందు జీవేశ్వర జ్ఞానములు రెండుంగూడియున్నవి.

ఇంక సూక్ష్మదృష్టిం జూచినచో చేతనమందలి జీవకర్మ, జడమందలి ఈశ్వరకర్మ రెండురెండు భాగములగును; కర్మ తత్త్వము ప్రధానముగ ఆదాన - విసర్గము లను రెండుభాగ ములు గలది. ఇది: మనశరీరమందు రెండు భిన్నాధికారభేద ములచే రెండుభాగములుగ నగును. ఇట్లు జడపదార్థకర్మలందు నెరుంగవలయును. మొదట చేతనకర్మద్వయిం జూతము:

శరీరము గర్భావస్థనొందుట, పుట్టుట, శరీరము జీవాత్మకు జెందినదగుట మొదలగునవి అనేకకర్మలు హృదయస్థతంత్రాయి యీశ్వరుని యధీనములు. ఉత్పత్తి ప్రళయ స్థిత్యాదులెన్నో యీ మహాజ్ఞానాధీనములు; ఆజ్ఞానమూర్తి సర్వత్ర వ్యాప్తము, సర్వసాక్షి. ఇక: తినుట త్రావుట నవ్వుట ఏడ్చుట తిరుగుట

మొదలగు కర్మలు జీవేచ్ఛకు జెందినవి. ఆకలికల్గుట యీశ్వర కర్మ. తినుటజీవకర్మ. భుక్తాన్నము రసాసృగాది పరిణతిగాంచుట యీశ్వరకర్మ. ఇట్లు ఆధ్యాత్మిక కర్మలం దుత్థితాకాంక్షా ప్రవృత్తము లీశ్వరకర్మలనియు, ఉత్థాప్యాకాంక్షా ప్రవృత్తములు జైవకర్మలనియు నెన్నదగును.

ఈవిధముగనే వృక్షాది జడపదార్థములందలి పార్థివ రసాదాన విసర్గరూప కర్మలు, వైశ్వానరతైజసంజ్ఞక వృక్షాత్మల యొక్క ప్రాతిస్వికములు. కంపితములగుట, కూలుట, విరుగుట ఇత్యాదు లైశ్వరములు. ఈదృష్టితో కర్మద్వయి కర్మచతుష్ట యిగా మారును. ఇంతయేల పోనుపోను కర్మసంఖ్యావిస్తర మనంతముగ నగును; వానివివరణ కొంతవరకుగర్మయోగ పరీక్షా ప్రకరణమున నరయుదము; కానిందు:— జీవకర్మయో, యీశ్వర కర్మయో, చేతనకర్మయో, అచేతనకర్మయో, ఏదైనను జ్ఞానాధీనము కొన్నికర్మలుక్షుద్రచేతనస్థములు, (జైవములు) కొన్నిమహాచేతనస్థములు (ఐశ్వరములు) కొన్ని యుభయచేతన స్థములు "సర్వథ్థాకర్మమాత్రము జ్ఞానమందు పరిసమాప్తము; విశ్రాంతము" అనుటనిర్వివాదము.

ఈజ్ఞానమన్నది సుపరిచిత బ్రహ్మయే; 'తద్ జ్ఞానం బ్రహ్మ సంజ్ఞితమ్' అని దార్శనికులుననిరి. 'తదంతరస్యసర్వస్య తదుసర్వ స్యాస్యబాహ్యతః' అన్నట్లు తనకు బ్రతిద్వంద్వియగు నసల్లక్షణ బలతత్త్వమునకు వెలుపల లోపల నంతటను, అనుస్యూతమును, బలోపరి ప్రతిష్ఠితమునగు బ్రహ్మతత్త్వము నుండియే కర్మలెల్ల

నుదయించినవి, అనగా:—బ్రహ్మయే, కర్మల కుక్తబ్రహ్మ సామ లక్షణమగు నాత్మయనిభావము, కర్మాస్తిత్వము బ్రహ్మసత్తపై నిల్చియున్నది. స్వస్వరూపమున నసత్తయ్యు కర్మ, బ్రహ్మసత్త నాశ్రయించి సత్తై సత్యరూప ధారణసేయును. కర్మ యొక్క కర్మత్వము బ్రహ్మ నవలంబనముగ గొనియున్నది. బ్రహ్మ యొక్క బ్రహ్మత్వమును కర్మపైనే యాధారపడియున్నది. ఈ తాదాత్మ్యముంగొని బ్రహ్మకర్మలు రెండన్నను, ఈ రెంటి మొత్తమును కేవలము బ్రహ్మయనియే యందును.

బ్రహ్మతత్త్వము నాశ్రయముగాగొని యుత్పన్న - స్థిత - వినష్ట మగు కర్మను బ్రహ్మమర్యాదా పృథగ్భూతముం జేయ జాలము;- కనుకనే కర్మ - జ్ఞాన - బుద్ధియోగ నామములం బ్రసిద్ధములగు మూడుకర్తవ్యభాగములకు జెందిన యోగవిద్య (కర్మవిద్య) బ్రహ్మవిద్య యనబడును; 'బ్రహ్మవిద్యయా హ వై సర్వం భవిష్యన్తో మన్యన్తేమనుష్యాః' అనుచో కర్తవ్యరూప యజ్ఞకర్మంగూర్చియే, 'బ్రహ్మవిద్యా' శబ్దము ప్రయుక్తమైనది. ఈ యజ్ఞకర్మాతిశయమునే భగవద్గీత 'ఏషవోఽస్త్విష్ట కామ ధుక్' అనిసూచించినది. బ్రహ్మకర్మములు, వాస్తవముగ నభి న్నములు కర్మవిద్య - బ్రహ్మవిద్య యని మాటవరుసకు రెండు గాని, ఒకేబ్రహ్మవిద్యకే రెండుపర్వములు; కనుకనే 'బ్రహ్మ విద్యాయాం - యోగశాస్త్రే' యనుట యన్వర్థమగుచున్నది. (బుద్ధి) యోగ (కర్మ) గర్భితమగు నీబ్రహ్మవిద్యనే (అవ్యయ

విద్యనే) గీత నిరూపించినది. గీతయందలి బ్రహ్మపదార్థము సదసల్లక్షణము, బ్రహ్మకర్మమయము, అమృతమృత్యుమయము.

## ఉపసంహారము

ఇంతటితో బ్రహ్మకర్మనిరూపణ మయినది. ఇంకొక్క విషయము నిరూపించి యీప్రకరణ ముపసంహరించెదము. యోగమాయానుగ్రహమున నీ బ్రహ్మలక్షణజ్ఞానశాస్త్రము, సమ్యగ్జ్ఞానము, మిథ్యాజ్ఞానము, అజ్ఞానము అను మూడు భాగము లగును; కర్మశాస్త్రమును, సత్కర్మ - వికర్మ-అకర్మ - యను మూడువివర్తములందును; ఈకర్మల జ్ఞానములు వరుసగ ప్రవర్తకములు; జనకములు. ఇట్లీయారింటను అను గ్రాహ్యానుగ్రాహక - (ఉపకార్యోపకారక) సంబంధముండును; ఇందు గీత యుద్దేశ్యము "మిథ్యాజ్ఞాన వికర్మల నుండియు, అజ్ఞానాకర్మలనుండియు దప్పించి జీవుని, బుద్ధియోగముద్వారా సమ్యగ్జ్ఞాన - సత్కర్మలక్షణ బ్రహ్మ - కర్మానుగామిం గావించి జీవన్ముక్తుంజేయుటయే" ఇదే ఈగీతాశాస్త్రము యొక్క సర్వశాస్త్రత - పూర్ణత - విలక్షణత - అపూర్వత. ఈ బ్రహ్మకర్మ రహస్యోద్ఘాటనము కొరకే గీత ప్రవర్తిల్లినది

ఇతిశమ్

*

ఇతి శ్రీమత్కౌండిన్యస గోత్రపవిత్రశ్రీ చల్లా సుబ్బాంబా
సుబ్బారాయ తనూభవస్య కృష్ణమూర్తి శర్మణః
కృతిషు అనుశ్రు త్యుపనామక విజ్ఞాన
లక్ష్మీ నారాయణీయే శ్రీమ
ద్భగవద్గీతావిజ్ఞాన పరిచ
యాంతార్గ తాంతరంగ
పరీక్షాయాం
బ్రహ్మ - కర్మ - విజ్ఞానమ్
సమాప్తమ్
ఓం
తత్సత్

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి. 5069/1949